మొదటి సంపుటము

# ఆంధ్ర విజ్ఞానసర్వస్వము

## (రెండవ ముద్రణము)

సంపుటము వెల రూ. ౧౦-౦-౦.  ప్రవేశరుసుము రూ. ౧-౦-౦.  మొ. రూ. ౧౧-౦-౦.

ప్రతి సంపుటమున ౬౦౦ పుటలుండును.  సంపుటము వెల పదిరూపాయలు.

విజ్ఞాన విజిగీషాయత్తమైన వర్తమానసమయమునందు సకలజాతులును విజ్ఞానోపార్జనవ్యాపనమునందహమహమికను జూపుచు పురోవృద్ధిని బడయుచున్నవి. ప్రపంచమునందలి ప్రధానభాషలందు విశ్వకోశములు, జ్ఞానకోశములు, విజ్ఞానసర్వస్వములు వెలువడి జాతీయాభ్యుదయమునకును, విశ్వవికాసమునకును సకలవిధములను వినియోగపడుచున్నవి.

భగవదనుగ్రహమువలనను, ఆంధ్రలోకాదరణ సాహాయ్యములవలనను ఆంధ్రవిజ్ఞానసర్వస్వము యొక్క మొదటిసంపుటము ప్రచురింపబడినది. ఆంధ్రవిజ్ఞానసర్వస్వమును నీమహాకార్యనిర్వహణమునకుం దోడ్పడుటకు ఆంధ్రాభ్యుదయాభిలాషులును, విజ్ఞానసంపన్నులును, విజ్ఞానప్రియులును, విజ్ఞానపోషకులునునైన తమసాహాయ్యాదరణములను సకలవిధములను నపేక్షించుచున్నది. తాము శాశ్వతచందాదారులుగను చేరియును, ఇతరులను చేర్పియును నితరవిధములను పోషణసాహాయ్యములం జేసియును మా యీ యుద్యమమును సఫలముచేయుటకు నిర్వాహకులపక్షమునను విన్నవించుచున్నాను.

విధేయుడు:

కా. నాగేశ్వరరావు.

డెమ్మి నాలుగుపుటలసైజున ౬౦౦ పుటలు, మేలైనకాగితము, బంగారురేకు చెక్కడపు అచ్చుకట్టు, పేరు మొదలయినవి కల చక్కని స్వదేశపు తోలుబైండు.

ఇందు 'అ' నుండి 'అధ్వర్యము' వఱకు గల నాలుగువందల పదములకు సంబంధించిన విషయములు చక్కగా వివరింపబడినవి. అందముగ ముద్రితములయిన రంగుల బొమ్మలు ఎనిమిది, సాదాబొమ్మలు ౧౨౫ ఉన్నవి.

తపాలు వ్యయము ఒకటిన్నర రూపాయ. రైలుద్వారా అయిన, ఖర్చు దూరమునుబట్టి ఎచ్చును, తగ్గనువచ్చును. ౧౧-౮-౦ మణిఆర్డరుద్వారా పంపినవారికి పుస్తకము రిజిస్టరు తపాలుద్వారా పంపబడును. వి. పి. గా పంపగోరువారు అయిదు రూపాయలు అడ్వాన్సు పంపవలెను. చిరునామా (అడ్రెసు) స్పష్టముగా వ్రాయవలెను. రైలుద్వారా పంపగోరువారు తమగ్రామమునకు దగ్గరనుండు స్టేషన్ పేరు తెలుపవలెను.

మేనేజరు, ఆంధ్రవిజ్ఞానసర్వస్వ కార్యాలయము,

నెంబరు 7, తంబుశెట్టివీధి, మదరాసు.

# దానిని మీకొరకే వినియోగింపుడు

ఈ కారణమైన అభిమానులకు

మీరు నిలువచేయగలిగిన స్త్రీధనము—

మీ తండ్రి—సోదరుడు—భర్త—పుత్రుడు—

వీరిలో నెవరివద్ద మీ రుంచినను సరే, దానిని మీకొరకే వినియోగింపుడు.



ఆధనముతో నగలుకొని వానిని మీరు ధరింపుడు.

పురుషు లెల్లప్పుడును......... ఈసంగతి మీకు బాగుగా తెలిసియే యున్నది. కావున మీకు హక్కుగల స్త్రీధనము బాంకిలోను నమ్మకములేని వాటాలక్రిందను నిలువబడి యుండగూడదు.

ఆధనము యెల్లప్పుడును మీకంటి యెదుటనే మీ వంటిమీదనే యుండి వీలగునట్లు, దానితో మీ కొరకు సొగసైన నగలను కొనుడు

మేము తయారుచేయించిన నగల విలువ యెన్నటికిని తగ్గిపోదు. నగలను అందముగా చేయించుటయే ప్రత్యేకాభిమతము. ఈవిషయమున మేమే అగ్రగణ్యుల మనిగూడ సవినయముగ తెలుపుచున్నాము.

మీరు మొదట మావద్ద కొనునట్టి అలంకారము మీకు మిక్కిలి సంతృప్తికరముగా నుండుటకే మేము ప్రయత్నించెదము. అటు పిమ్మట మీ రెల్లప్పుడును మావద్దనే కొనుచుందురు. మీ మిత్రులకు గూడ సిఫారుసు చేయుచుందురు.

## ఉమ్మిడి రామయ్యశెట్టి గురుస్వామిశెట్టి కంపెని,

బంగారు వెండి నగలను తయారుచేయువారు,

25, చైనా బజారు రోడ్డు — చెన్నపురి. — 62, గోవిందప్పనాయక వీథి

# జెనిత్ ద్రాక్షాసవ

ఆయుర్వేద శాస్త్రీయ పద్ధతులమీద తయారు కాబడినది

ఆరంభదశలో నున్న క్షయరోగము, ఉబ్బసము, శ్వాసనాళీదాహము, ఊపిరితిత్తులకు సంబంధించిన యితర వ్యాధులు, శీతలము, పడిసెము, మందాగ్ని, అజీర్తి, మలబద్ధకము, కడుపుపులియుట, వాంతులు వచ్చునట్లుండుట, అన్నివిధములగు గొంతువ్యాధులు మున్నగు జాడ్యములను ఇది పూర్తిగా కుదుర్చును. పిల్లలదగ్గులను పోగొట్టుటలో అద్వితీయమైనది. త్రాగుటకు మధురముగా నుండును. క్రమముగా సేవించినచో, ప్రేగులను శుభ్రముగా నుంచి, ఆకలిని వృద్ధిజేయును. జెనీత్ ద్రాక్షాసవమును రాత్రివేళ పరుండకముందు పుచ్చుకొనిన సుఖనిద్ర నిచ్చును. ఉదయమున మేల్కాంచినంతనే తమపనులయం దాసక్తులై చురుకుగా నుందురు.

"జెనిత్ ద్రాక్షాసవము" ఇప్పుడు ప్రతినగరములోను పల్లెలందును గల దుకాణములలో దొరకును. తపాల ద్వారా సీసాల నంపుటచే మిగుల వ్యయ మగును గాన మా ఖాతాదార్లు వారి గ్రామములో గల దుకాణములందే "జెనిత్" ద్రాక్షాసవమును కొనినచో వీలుగా నుండుటేకాక లాభకరముగాగూడ నుండును.

వెల $1\frac{1}{2}$ పౌను రు. 1-1-0. 1 పౌను రు. 1-4-0. $\frac{1}{2}$ పౌను రు. 0-12-0. ప్యాకింగ్ వి. పి. ఖర్చులు ప్రత్యేకము.

**ది జెనిత్ కెమికల్ వర్క్సు,**
డేకరాన్ మాన్షన్సు,
ప్రిన్సెస్‌వీధి-బొంబాయి నెం. 2.

---

## ఉపయోగించుడు!




## గుణమును చూడుడు!

మలబద్ధకమునకు నూతనపద్ధతులతో కనిపెట్టిన శ్రీదత్తాత్రేయ అజీర్ణమాత్రలు మలబద్ధకమునకే గాక అజీర్ణము, ఆమవాతము, అరుచి, నులిపురుగులు, కడుపునొప్పి, కడుపుబ్బరమున్నూ హరింపజేయును. ఈమాత్రలు పసిబిడ్డలకు 1 లేక 2 చిన్నమాత్రలు ఉదయముననే యిచ్చిన ఆముదము ప్రతిదినము యివ్వవలసిన అవుసరము లేదు.

200 మాత్రలుగల $\frac{1}{4}$ ఔన్సు సీసా వెల 4 అణాలు.

**శ్రీ దత్తాత్రేయ అజీర్ణమాత్రలఫార్మసీ,**
మంగళగిరి, దక్షిణ ఇండియా.

# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు




సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య



సంపుటము ౧౦. సంచిక ౬.

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు.

౧౯౩౩






# భారతి – దశమసంపుటము – భా. ౧.

## వ్యాసముల అకారాది సూచి

| | సం. | పుట 10 |
|---|---|---|
| కావేరి–గోపాలకృష్ణభట్టు | ౨ | ౨౯౩–౩౦౦ |
| కీ. శే. అమరవాది హనుమచ్ఛాస్త్రిగారు (మ. మా) | ౫ | ౮౫౦ |
| కీ. శే. జనమంచి వేంకటరామయ్యగారు (మ. మా) | ౨ | ౩౪౭–౩౪౮ |
| కీ. శే. జాన్ గాల్సువర్దీ (కల) | ౨ | ౩౨౮ |
| కీ. శే. దొంతంశెట్టి నాగేశ్వరరావుగారు (మ. మా) | ౬ | ౧౦౧౦ |
| కీ. శే. శ్రీ కేశవపిళ్లై (మ. మా) | ౪ | ౬౬౫ |
| కుటుంబశరంగిణి ౭.–కవికొండల వేంకటరావు (క) | ౫ | ౭౦౭–౭౧౦ |
| కుట్టుపని ౧.–కొ. నరసింహాచారి (వి. శి) | ౪ | ౫౭౯–౫౮౦ |
| ,, ౨. ,, ,, | ౫ | ౭౪౧–౭౪౨ |
| ,, ౩. ,, ,, | ౬ | ౮౯౭–౮౯౯ |
| కుమారస్వామి విగ్రహము–భావరాజు వెంకటకృష్ణరావు | ౩ | ౪౬౬–౪౬౮ |
| ,, గొబ్బూరు వెంకటానందరాఘవరావు (ప్ర. వి) | ౪ | ౬౩౮ |
| ,, శ్రీ గొ. వేం. రాఘవరావుగారి విమర్శనమునకు ప్రత్యుత్తరము—భావరాజు వేంకటకృష్ణరావు (ప్ర. వి.) | ౬ | ౯౫౭–౯౬౧ |
| కుమారి యస్. కె. కన్నమ్మాళ్ గారు (భా. మ) | ౫ | ౮౩౧ |
| కుహనాయతి–దర్భా వేంకటకృష్ణమూర్తి (ప) | ౫ | ౭౪౩–౭౪౪ |
| కృత్రిమాస్థిపంజరములు (కల) | ౫ | ౮౧౯–౮౨౦ |
| కేదారగౌళ–విశ్వనాథ సత్యనారాయణ (ప) | ౧ | ౩–౫ |
| కే. పి. సత్యనారాయణగారు (ఆంధ్రా) | ౨ | ౩౧౮ |
| కైతవోపచారము–శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి (ప) | ౨ | ౧౯౮ |
| కొక్కొర–చతుర్వేదుల లక్ష్మీనరసింహం (కల) | ౪ | ౬౪౧–౬౪౨ |
| కొద్దైకినాలు (కల) | ౬ | ౯౮౨–౯౮౩ |
| కొమ్మనెక్కెడు కోతి–కొ. నరసింహాచారి (వి. శి) | ౨ | ౨౫౬–౨౫౭ |
| కోడిపూత–కొత్తసూర్యనారాయణచౌదరి (పి. క) | ౩ | ౪౪౦–౪౪౧ |
| కోతివేషాలు (కల) | ౪ | ౬౪౭ |
| కోమటియుక్తి కోటిసేయు–శ్రీకమలానాథరాయి (పి. క) | ౧ | ౭౫–౭౬ |
| "క్రిస్మస్ వేడుకలు"–కొమర్రాజు వినాయకరావు (క) | ౨ | ౨౨౧–౨౨౫ |
| క్రొత్తపూస–కపిల వెంకటరావు | ౩ | ౪౩౧–౪౩౭ |
| క్షమ–పి. ఆర్. రామచంద్రరావు (నా) | ౪ | ౫౪౭–౫౫౩ |
| గుంటూరుమండల గ్రంథాలయములు–ఉ. వేం. శ్రేష్ఠి | ౩ | ౪౮౪–౪౮౭ |
| ,, ,, (మ. మా) | ౩ | ౫౦౭–౫౦౮ |
| ,, ,, (ప్ర. వి) | ౪ | ౬౩౯–౬౪౦ |
| గుడ్డాడిసొమ్ము–శర్మ (పి. క) | ౧ | ౭౩ |
| గుభేలువస్త్రం–కపిల కాశీపతిరావు (పి. క) | ౫ | ౭౩౮ |
| గురుజాడ అప్పారావుపంతులు–శాస్త్రి (మీ. త) | ౧ | ౧౫౭ |
| ఘటాశార్గం–కేశఖండనం–పిశిపాటి వెంకటరమణయ్య (క) | ౪ | ౫౭౧–౫౭౩ |
| ఘోషా–(తత్త్వదర్శి) (కల) | ౫ | ౮౧౯ |

# భారతి – దశమసంపుటము – భా. ౧.

## త్రివర్ణచిత్రముల అకారాది సూచి


విషయసూచిక

# చిత్రములు

త్రివర్ణచిత్రములు—యాజ్ఞవల్క్య కుటుంబము; చైత్రము; వైశాఖము.

సాధారణచిత్రములు—కొడైకెనాలు చిత్రములు; ఏరుదాటు; సంతను; కాశీవద్ద గంగానదిపై వంతెనలు; తులసీఘట్టము, కాశీ; మణికర్ణికాఘట్టము, కాశీ ౨; దుర్గాఘట్టము, కాశీ; గీతోపదేశము; సాముద్రికము; పకీరు; సారాయిదాసుడు; మఱ్ఱిచెట్టు; సాయంకాలపు వానజల్లు; బూటియాకన్య; తిరువనంతపురము కొండ; మహాత్ముని ఉపవాస చిత్రములు; తాన్ యుపాన్, ఇతరచిత్రములును.



యాజ్ఞవల్క్య కుటుంబము

చిత్రకారుడు: శ్రీ చంద్రుపట్ల బాపిరాజుగారు, ఆంధ్ర చిత్రకళాపరిషత్తు, ఏలూరు.



చెన్నపట్టణము, జూన్ ౧౯౩౩

సంపుటము ౧౦ శ్రీముఖ సంవత్సరము, జ్యేష్ఠమాసము సంఖ్య ౬

# మేడూరివారి కోడలు

శివశంకరశాస్త్రి
[మాహేశ్వరాశ్రమము]

౧

మేడూరివారి కోడలి
కీడెవ్వరు గోచరింప రేగుణమందున్
కోడూరుగ్రామమందలి
స్త్రీ తావతులందు నెంత వెదకిన సరియే.

ఎదు రాడ దత్తగారికి
తదీయచిత్తానుసారతత్పరమతియై
సదనమున మెలగు నాయమ
పదిలమ్ముగ, అత్తగారు ప్రమదం బొందెన్.

మితభాషిణి యాయమ నిజ
పతి కుపచారమ్ము చేయు భక్తిశ్రద్ధా
న్వితయై, కనుగొను లోకులు
సతీత్వమును బహువిధాల శ్లాఘింపంగన్.

వినబడియెనేని భిక్షుక
జనయాచ్ఞాకంఠరవము సత్వరగతితో
జని యాయమ బిచ్చమ్మును
కనికరమున బెట్టుచుండు కరయుగ్మమునన్.

ఆయమ షోడశవర్ష
ప్రాయమ్మున నత్తవారి భవనము జేరెన్
ఆయెను సుషమావృద్ధి త
దీయతనూవల్లియందు దివసక్రమమై.

ఆమెవిలోచనకాంతికి
వ్యోమము ధవళాంబుజంబునోజ వెలుంగున్
కోమలపాదస్పర్శను
భూమిస్థలి కోకనదముపోలిక జెలగున్.

కోడలు చనుదెంచినయా
యేడాదికె యత్తవారియింటన్ హెచ్చెన్
పాడియు పంటయు; గెలిచిన
దోడెడియభియోగ మద్భుతోత్తర మగుచున్.

శుభలక్షణలక్షిత యని
యభిమానం బతిశయిల్లె నత్తకు స్నుషపై,
అభివృద్ధి గాంచె భర్తకు
నభిరతి నిజకాంతమీద నతివేలముగన్.

యామినివేళను రెండవ
యామమ్మున దీపకాంతియందు నపూర్వ
శ్రీ మెరయు నామెకన్నులు
స్వామి విలోకించి యధికసంభ్రమ మొందున్.

మోహమునగాని యత్యు
త్సాహమ్మునగాని యామె శయనమున స్వయం
గ్రాహమ్ము లొసగుచో స
స్నేహమ్ముగ భర్తస్మయము చెందుచునుండున్.

ఋజువుగ వాసరవేళను
రజనీసమయమ్మునందు రభసముతోడన్
నిజకాంత మెలంగుట క
క్కజ మొందుచునుండు భర్త కరుణాళుండై.

వాసరములు వారమ్ములు
మాసమ్ములు గడిచె నిట్లు, మహితబలుం డా
భూసురుడు కోలుపోయె పి
పాసము వేసవిని నిమ్నగాస్రుతిపోలెన్.

సోమునకు బహుళపక్ష
క్షామమువలె వల్లభునకు ఛవి యడుగంటన్,
ఆమె మనోజ్ఞశరీరం
బామనిని తురాయి తరువునట్లు చెలంగెన్.

౨

మేడూరివారి యింటికి
బాడబు డొక్కండు పోయి ప్రాతర్వేళన్
వేడెను భిక్షము: కోడలు
తోడనె బియ్యంబు నిండుదోసిట గొనుచున్—

గడప దిగిపోయి నాల్గయి
దడుగులు ప్రాంగణమునందు నాతని పాత్రన్
విడిచెను తండులములు సం
దడి చేయగ హేమవలయతతి హస్తములన్.

ఆయువ పరికించె మహో
గ్రాయుని, రుద్రాక్షమాలికా రూపత్రై
వేయుని, విశాలలోచను
నాయుత ముఖభస్మ కుంకుమాలంకారున్.

భూసురుడు తీక్ష్ణనయన వి
భాసురుడు తదీయవదనపద్మము గాంచెన్
దూసికొని పోవు దృక్కుల:
భాసురగాత్రికి జనించె భయసంభ్రమముల్.

తడబడు పాదమ్ములతో
వడివడి లోనికిని బోయి వాకిలి మూయం
బడతుక, చింతాన్వితుడై
వెడలె దదీయాంగణమ్ము విడిచి యతండున్.

"ఇమ్మెయిని వణకె దేటికి ?
చెమ్మట గ్రమ్మినది వదనసీమను, చెపుమా

యిమ్మాడ్కి నైనకారణ
మమ్మా!"యని బుజ్జగించె నత్త లతాంగిన్.

ఫాలస్వేదకణమ్ములు
చేలాంచల మొత్తి తుడిచి చిన్న యెలుగునన్
లోలాక్షి పలికె: "భిక్షుకు
నాలోకింపంగ నాకు నతిభయ మొదవెన్!"

అని పలుకు ముద్దుకోడలి
కనునయవచనములు చెప్పి "అమ్మా, యిటుపై
జనబోకు నీవు భిక్షుక
జనముకడకు"ననియె నామె సస్నేహముగన్.

రెండవదినమున నా వి
ప్రుం డరుదేరంగ ప్రొద్దు పొడిచిన పిదపన్
నిండుగ దోసిట గొని చని
తండులములు పోసి యత్త తత్పాత్రమునన్—

"ఏమండీ, మాకోడలి
నేమో భయపెట్టినా రటే నిన్నను! మి
మ్మే మెపుడు చూడలే దీ
గ్రామమునకు మీరు క్రొత్తగా వచ్చితిరా?"

ఈరీతి బలుకరింపగ
భైరవభ ట్టనియె నిట్లు: "భయపడియెను మీ
గారాబు చిన్నికోడలు
నారూపము గాంచి. నేను నవ్వ్యడ నమ్మా.

"ఆమెను బోలిన యందరు
కామినులును నన్ను గాంచి కాంతురు భీతిన్
నాముఖకుంకుమ ఘనరే
ఖా మంజులకాంతి నయనకంటక మగుటన్."

"ఏమో వింతగ నున్నది!
కామినులకు నంతభయము కలుగునె చూడం
గా మీతిలకము! మాంత్రికు
లేమో యనిపించుచున్న, దిది నిజమేనా?"

ఆయమ యిట్లు వచింపగ
నాయవనీసురుడు పల్కె నల్లన "నిజమే
ఏయెడనున్నది మీస్నుష?
ఈయుదయము గోచరింప దేమికతంబో?"

"నిన్న మిముం గన్గొని యా
చిన్నది యత్యధికభయము పొందగ, నేనే
అన్నాను పోవ వల దని
ఉన్నది తులసెమ్మచుట్టునూడ్చియలుకుచున్."

అని యత్త చెప్పుమాటలు
విని తల పంకించి మరల విప్రుం డను: "మీ
యనుగుం గోడలి వర్తన
మున నెన్నడు వైపరీత్యమును గన లేదా?"

లే దనగ నామె, ఆయన
"కాదమ్మా, ఆవహించు గ్రహమాంతరుణిన్!
ఖేదమ్ము చెందబోకుడు
మీద శుభ మ్మగును లెండు మీపుత్రునకున్.

"నమ్మకము లేనిచో నా
కొమ్మను రాతిరికి మీరు కొమరుని కడకుం
బొమ్మనక యెట్లో మీశయ
నమ్మునసే నిల్పుకొనుడు నామాటపయిన్."

అని చెప్పి వెడలి పోయెను
తనయునకుం దెలుప కామె ధైర్యముతోడం

దనకడ కోడలి నాయా
మిని నిడుకొని కనులుమూసి మేల్కొనియుండెన్.

రెండవయామము ముగియుచు
నుండగ మేల్కాంచి కోడ లుద్రేకమునన్
రెండడచి యత్తతలపై
పండుకొనం బోయె వడిగ పతిసన్నిధికిన్.

వినయవతియై మెలంగెడి
తనకోడలి నావహించి తత్సమయమునం
బెనుభూత మిట్లు చేయిం
చిన దని గ్రహియించి యామె చింతిలజొచ్చెన్.

మరునాడు భైరవార్యుం
డరుదేరగ, బిలిచి లోని కాయసను సమా
దరమున, కోడలి గ్రహమును
పరిహారము చేయు డనుచు ప్రార్థన చేసెన్.

... ... ...

మాటలు మీరును కోమలి,
పాటలు విపరీతముగను పాడును, లేచుం-
బోటులకు, మాంత్రికుం డు
చ్చాటనమంత్రములు చెప్పుసమయములందున్.

మండలకాలము నిష్ఠ న
ఖండిత జప హోమ తంత్ర కర్మంబుల వి
ప్రుండు పిశాచిం ద్రోలెను
ఖండనిశానాథమౌళికరుణ చెలంగన్.

ఆమెయతిమానుషం బగు
ధామము క్షీణించి సహజతనురుచి నిలిచెన్
నీమముతోడ దదీయ
స్వామికి క్రమ్మరను సహజవర్చ స్సొదవెన్

మేడూరివారి కోడలి
కీడెవ్వరు గోచరింప రేగుణమందున్
కోడూరుగ్రామమందలి
ప్రీడావతులందు నెంత వెదకినను సకే.

# ఆంధ్రమున కొన్ని అన్యభాషాపదములు

కోమాండూరి శఠకోపాచార్యులుగారు, యమ్. ఏ., బి. యల్. 27

ఆంధ్రవాఙ్మయమున అన్యభాషాపదము లుపయోగింపవచ్చునా? అట్లగుచో నెంతవఱ కుపయోగింపవచ్చును? గ్రంథములందును, పత్రికావ్యాసములందును కొన్ని అన్యభాషాపదములను కొందఱు ఉపయోగించుచున్నారు. కాని యట్టి ప్రయోగములను కొందఱు పండితులు తీవ్రముగా నిరసించి అట్టి పదములను బహిష్కరించుచున్నారు. స్వభాషను అన్యభాషాపదములతో నింపివేసి క్లిష్టముచేయుట యుచితముగాదు. కాని అన్యభాషాపదములు కొన్ని కారణముల చేత ఉపయుక్తములు, అవసరములు, వాఙ్మయపోషకములు నయినచో వాటిని కేవలము అన్యభాషాపదములను కారణమున బహిష్కరించుట సవ్యము కాదనియు, అట్లు బహిష్కరించుటవలన మనభాషకును, ముఖ్యముగా జాతీయైక్యమునకును గూడ హాని కలుగుననియు తోఁచుచున్నది. బుద్ధిమంతులు తమ యభిప్రాయములను తెలియఁజేసి, అందఱిని జ్ఞానవంతులుగాఁ జేయుటయే వాఙ్మయముయొక్క ముఖ్యోద్దేశ మగుటచే వీలగునంతవఱకు భాష సులభముగాను, సామాన్యజనులకుఁ గూడ సుబోధకముగాను ఉండవలెను. లేనిచో వాఙ్మయమునకుఁ దగు ప్రచారము గాని, దానివలన జనులకు తగినంత లాభము గాని కలుగదు.

ఈసందర్భమున అన్యభాషాపదము లన నేవియో మనము నిశ్చయించుకొనవలసి యున్నది. శబ్దార్థమును బట్టి స్వభాషలోని దేశ్యములు దప్ప తక్కిన వన్నియుఁ గూడ అన్యభాషాపదము లని ప్రథమమున స్ఫురించును. కాని యీసూత్రమును బట్టి అందలి దేశ్యములు తప్ప నితరపదముల నన్నిటిని బహిష్కరించవలసి యుండును. అట్లు చేయుట సాధ్యము కానేరదు. బహిష్కరణవాదులకుఁ గూడ నట్టి ఆశయము లేదు. మఱియు అట్టి అచ్చతెనుఁగు భాషలో ఇప్పటికాలమున కుచితములగు భావములను తెలియపర్చుచు గ్రంథములను వ్రాసినను అవి యిప్పటిచదువరులలో చాలమందికి బోధపడుటయే కష్టము. మనభాష కత్యంతసన్నిహితమును, దీనికి ప్రకృతియు నగు భాషయందలి పదములను ప్రయోగింపవలెనని పండితు లందఱి యభిప్రాయము. ఈకారణమునసే సంస్కృతశబ్దములను, వాటి తద్భవములను పండితులు స్వేచ్ఛగా ఆంధ్రమున వాడుచు అట్టిప్రయోగములు నిర్దుష్టము లనియు, స్వభాషకు సంబంధించినవనియు, నిరాక్షేపణీయము లనియు సమర్థించుచున్నారు. అయితే మన ఆంధ్రభాషకు ఇతరభాషలతో వేటితో మొదటినుండియు సహజ సంబంధము గలదు? అను సంగతి స్పష్టము కావలసియున్నది. ఏ భాషలోనైనను అధికసంఖ్యాకము లగు పదములు మరియొకభాషలోనివిగా నున్నంతమాత్రమున, ఈ రెండవది ఆభాషకు ప్రకృతియని చెప్పుటకు వీలులేదు. ప్రస్తుతము ఇంగ్లీషువాఙ్మయములోని పదములలో $\frac{2}{3}$ వంతు మాటలు లాటినుభాష సంబంధమైనవి. అయినను ఆంగ్లభాష లాటినులోనుండి గాని, ఆ భాషాకుటుంబములో నుండి గాని ఉత్పన్నము కాలేదనియు, అది జర్మను మొదలగు ట్యూటానిక -అనఁగా ఆంగ్లోసాక్సనుకుటుంబములోని దనియు శాస్త్రజ్ఞులచే నిర్ణయింపఁబడినది. అందువలన ఈసందర్భమున మనదేశపు భాషల పరస్పర సంబంధమును కొంతవఱకు పరిశీలింపవలసి యున్నది.

మన భరతఖండమందు ముఖ్యమైనవి సుమారు పది దేశీయభాషలు గలవు. ఇవి ఆయాప్రాంతములయందు లక్షలకొలఁది జనులచే స్వభాషగా నుపయోగింపఁబడుచు చక్కని సారస్వతమును గూడఁ గలిగియున్నవి. ఈభాష లన్నియు ప్రథమమునుండియు సంబంధము లేని వేరువేరుభాషలుగా నుండలేదనియు, కొన్నికొన్ని భాషలకు ఒక్కొక్క మూల

భాష యుండిన దనియు, వాటిలోనుండి కాలక్రమమున ప్రాంతీయభేదము లేర్పడి, ఆభేదములు హెచ్చయినమీఁదట – కొంతకాలమున కవి వేరువేరుభాషలుగా పరిగణింపఁబడుట కల్గె ననియు భాషాశాస్త్రజ్ఞుల అభిప్రాయము. ఇప్పటిభాషల క్రియలను, ప్రత్యయములను, ముఖ్యశబ్దములను పోల్చి చూచినయెడల నేయేభాషలు ఏకుటుంబములోనివో నిర్ణయింపవచ్చును. అట్లు శాస్త్రీయపద్ధతిని పరీక్షింపఁగా మనదేశమందలి ప్రధానభాషలు రెండు ముఖ్యశాఖలుగా నేర్పడుననని శాస్త్రజ్ఞులు నిర్ణయించిరి. వీటిలో నొకటి ద్రావిడశాఖ: రెండవది ఆర్యశాఖ. అరవము, కన్నడము, మళయాళము మొదలగునవి ద్రావిడభాషలు. అనఁగా మూలద్రవిడమునుండి యుత్పన్నము లయినవి. హిందీ, బెంగాలీ, ఓఢ్రము, గుజరాతీ, మహారాష్ట్రము మొదలగునవి ఆర్యభాషలు. అనఁగా వేదకాలపు సంస్కృతమునుండి వచ్చినవి. మన యాంధ్రభాష వాటిలో నేశాఖకు చేరును అనువిషయము చాల కాలము సందిగ్ధముగా నుండినది. మన ముఖ్యవ్యాకరణగ్రంథములలో తెలుఁగుభాషకు సంస్కృత, ప్రాకృతములు ప్రకృతులుగా చెప్పఁబడినవి. ముఖ్యమగు మన ప్రాచీనాంధ్రవ్యాకరణములు సంస్కృతముననే వ్రాయఁబడినవి. ఆంధ్రమహాభారతము, రామాయణము, హరివంశము మొదలగు ఆంధ్రవాఙ్మయమునందలి ప్రధానగ్రంథములు సంస్కృతశబ్దములతో నిండియున్నవి. ఆర్యజాతీయులగు చాళుక్యాదిరాజులు చిరకాలమాంధ్రదేశపాలకులుగా నుండిరి. ఆకారణములచేతను, చిరకాలమునుండి వచ్చుచున్న సంప్రదాయమును బట్టియు ఆంధ్రము ఆర్యభాషాకుటుంబములోనిదని ఆంధ్రలాక్షణికు లభిప్రాయపడుచుండిరి. ఇప్పటికిని చాలమంది పండితుల కట్టి యభిప్రాయము గలదు. కాని భాషాసంబంధములను నిర్ణయించుటకు ముఖ్యాధారములు ఆయాభాషలందలి క్రియలు, ప్రత్యయములు, సంఖ్యానామములు, సర్వనామములును, నిత్యము ప్రతికుటుంబమందును వాడుకలో నుండు సులభ ప్రాతిపదికములును. ఇవి భాషకు మూలములు, ముఖ్యాధారములు నయి యున్నవి. వాటిని పోల్చి చూచినయెడల ఆంధ్రమును, అరవము మొదలగునవియును నత్యంత సన్నిహితము లనియు, ఏకకుటుంబములోనివే యనియు స్పష్టము కాఁగలదు. ఈ సిద్ధాంతమును బట్టి ఆంధ్రభాషలోని సర్వనామములు, సంఖ్యానామములు, క్రియలు మొదలగువానిని ఆయా హిందీ మొదలగు ఆర్యభాషల శబ్దములతోను, సంస్కృతశబ్దములతోను పోల్చి చూచినయెడల నివి వేరువేరు కుటుంబములలోని వనియు, వాటికి సన్నిహిత సంబంధము లేదనియు కనిపించును. అందువలన ఆంధ్రము ద్రావిడకుటుంబములోనిదే యనియు, ఆర్యభాషలలోనిది కాదనియు భాషాశాస్త్రజ్ఞులు నిర్ణయించియున్నారు. ద్రావిడభాషలన్నిటికి కాల్డ్వెలుగారిచేత నొకవ్యాకరణమును, భారతీయార్యభాషలన్నిటికి బీమ్సుగారిచేత నొక వ్యాకరణమును ఆంగ్లమున రచింపఁబడినవి. వాటివలన భాషాకుటుంబనిర్ణయసూత్రములు, ఆంధ్రభాష ద్రావిడకుటుంబములోనుండి వచ్చినదని నిర్ణయించుటకు కారణములు స్పష్టము కాఁగలవు.

ఈసూత్రమునుబట్టి ఆంధ్రములో నుపయోగించు సంస్కృతశబ్దములు, తద్భవశబ్దములు కూడ అన్యభాషాపదములే యని నిర్ణయము కలుగును. అయినను లాక్షణికు లెవ్వరును అట్టిశబ్దములను, సమాసములను నిషేధింపలేదు. సరికదా, మన ఆంధ్రవాఙ్మయమునకు చిరకాలము సంస్కృతవాఙ్మయమే మాతృకగా నుండి ఆంధ్రభాషను, వాఙ్మయమును సంస్కృతమే చాల వృద్ధికిఁ దెచ్చినది. ప్రస్తుత మాంధ్రవాఙ్మయమున $\frac{2}{3}$ వంతుకన్న హెచ్చుగా సంస్కృతశబ్దములు (తత్సమములు, తద్భవములు) కలవనుట అతిశయోక్తి కానేరదు. మరియు నిత్యకృత్యమునకూడ జనసామాన్యముచే సంస్కృతశబ్దములు విరివిగా వాడఁబడుచున్నవి. ప్రతి గ్రామమందును ఆంధ్రజనులు చదువు పత్రికలలోని వ్యాసము లన్నియు సంస్కృత శబ్దములతో నిండియున్నవి. అందువలన జనసామాన్యమున ముందుముందు సంస్కృతశబ్దముల యుపయోగ మింకను వృద్ధి కాఁగలదని తోఁచుచున్నది.

ఆవశ్యకములును, సులభములును అగు సంస్కృతశబ్దములను తెలుఁగున వాడుట ఆంధ్రుల కెంతయు లాభకరముగనే యుండును. ఆంధ్రము భాషాశాస్త్రజ్ఞుల సిద్ధాంతమును బట్టి ప్రథమమున ద్రావిడకుటుంబములోనుండి వచ్చినదే యయినను, చిరకాలమునుండి దానిపైఁ గలిగిన సంస్కృతవాఙ్మయ ప్రభావమువలనను, సంస్కృతసంబంధమగు శబ్దములు ఆంధ్రమున విశేషముగా కలిసియుండుటవల్లను ఆంధ్రము సంస్కృతభవమే యని పండితులకుఁ గూడ సందేహము కలిగించు స్థితిలో నున్నది. మఱియు అరవము మొదలగు మిగిలిన ద్రావిడప్రాంతములకన్న మనకు మహారాష్ట్రము, ఓఢ్రము, మధ్యరాష్ట్రము, సంయుక్తరాష్ట్రము మొదలగు ఆర్యభాషిక ప్రాంతములు ఎక్కువ సమీపముగా నున్నవి. ఆప్రాంతములతో మనకు వ్యాపారాది సంబంధ మెక్కువ గలుగుచున్నది. మహారాష్ట్రము, హిందీ, ఓఢ్రము, బంగాళీ మొదలగు ఆర్యభాష లన్నియు సంస్కృతశబ్దమయములని యందఱకును తెలిసియే యున్నది. ఆంధ్రరాష్ట్ర మేర్పడినప్పుడు మనకు అరవభాషతో సంబంధము ఇంకను తగ్గును. మనహిందూదేశమందలి మొత్తము జనసంఖ్యలో $\frac{3}{8}$ వంతుకన్న హెచ్చుమంది హిందీ, బంగాళీ మొదలగు ఆర్యభాషలు మాట్లాడువారే. ఈ భాషలవా రందఱు మామూలుసంస్కృతపదము లన్నిటిని వాడుదురు. అందువలన ఆంధ్రమున దేశ్యముల స్థానే సంస్కృతసంబంధములగు పదములు వ్యాపించుటవలన మనఆంధ్రమును ఆర్యభాషలవారును, హిందీ, బెంగాళీ మొదలగు ఆర్యభాషలను ఆంధ్రులును ఇంకను సులభముగ నేర్చుకొనఁ గలుగుదురు. ఈరెండుఫలితములును, అందు ముఖ్యముగా హిందీకిని ఆంధ్రమునకు సమీకరణము ప్రస్తుతపరిస్థితులలో మిక్కిలి వాంఛనీయములు.

మనదేశమునందు సామాన్య భాష యుండుట జాతీయదృష్టిచే చాల అవసర మనియు, అట్టిసామాన్యభాష యగుటకు హిందీభాషకే అర్హత కలిగి అందుకు ప్రజాభిప్రాయముకూడ అంగీకరించినందున హిందీని సామాన్యభాషగాఁ జేయుటకు దేశమంతటను గట్టి ప్రయత్నము జరుగుచున్నదనియు అందఱకును తెలిసియే యున్నది. హిందీకిని మనభాషకును సామీప్యము వృద్ధియగుటచే ఆంధ్రులు ఇంకను హిందీని నేర్చుకొనుట సులభమగును. హిందీ, బంగాళీ మొదలగు ఆర్యభాషలయందు చక్కని వాఙ్మయమును, వైజ్ఞానిక శబ్దములకు నిఘంటువులును ప్రత్యేకముగా నేర్పడి యున్నవి. అవి సాధారణముగా సంస్కృతభాషలోని శబ్దములు. ఆవైజ్ఞానికశబ్దములను అవసరము లయిన కొద్దిమార్పులతో ఆంధ్రభాషలోఁగూడ వాడుకొనుచుండిన మనకు ఆవైజ్ఞానికపదజాలము వృద్ధి యగును. హిందీ, బంగాళీ, మహారాష్ట్రము మొదలగు భాషల గ్రంథములందును, ఆంధ్రమునను ఒకే వైజ్ఞానికపదజాల ముండుటచే భాషాంతరీకరణాములకుఁ గూడ సౌకర్యము హెచ్చును.

ఈసందర్భమున నొకసంగతి గమనింపవలసి యున్నది. కొన్ని భాషలకు ఆంధ్రమునను, హిందీ మొదలగు ఆర్యభాషలందును సంస్కృతశబ్దములే వాడఁబడుచున్నను వాటిని హిందీ మొదలగు ఆర్యభాషలన్నిటిలో నొక అర్థమునను, ఆంధ్రమున వేరు అర్థమునను వాడఁబడుట సంభవించుచున్నది. కొన్ని ఉదాహరణములచే నాఅభిప్రాయము స్పష్టము కాఁగలదు. సంసారశబ్దమునకు తెనుఁగులో కుటుంబసంబంధమని యర్థము. హిందీలో సర్వప్రపంచ మని యర్థము. ఇట్లే—

1. ఆగ్రహ (హిందీలో అభినివేశము, తెనుగున క్రోధము అర్థములు)
2. ఉద్యోగ (హిం. పరిశ్రమ, (industry)— తె. నౌకరీ)
3. అవసర (హిం. సమయము — తె. జరూరు)
4. ఉపన్యాస (హిం. నవల — తె. వక్తృత)
5. సంగతి (హిం. కలయిక — తె. విషయము)
6. మర్యాదా (హిం. ఆదర్శ — తె. గౌరవము)
7. మందిర (హిం. దేవాలయము — తె. భవనము)

8. ఇతిహాస (హిం. చరిత్రము — తె. రామాయణ, భారత, భాగవతములు)

9. వ్యవసాయ (హిం. వ్యాపారము — తె. భూమి సాగు)

10. వ్యాఖ్యాన (హిం. ఉపన్యసించుట — తె. టీక)

11. మత (హిం. అభిప్రాయము — తె. ఆధ్యాత్మిక మగు నమ్మిక)

12. ధర్మ (హిం. మతము — తె. న్యాయము)

ఇత్యాదిసంస్కృతశబ్దములు హిందీలో నొకఅర్థమునను, ఆంధ్రమున వేరొకయర్థమునను ఉపయోగములో నున్నట్లు కనఁబడుచున్నది. సంస్కృతములో సాధారణముగా నొక్కొక్క శబ్దమునకు చాల అర్థములుండును. అట్టిశబ్దములకు దేశభాషలందు వాడుకలో రూఢియగు నర్థ మొకటి కలుగుచుండును. 'అవసర' మొదలగు కొన్ని శబ్దములకు ఇప్పటి హిందీ మొదలగు భాషలలో నున్న యర్థమే తెలుఁగునఁ గూడ కొంత కాలమువఱకు ఉండినట్లు కనఁబడుచున్నది. ఒకే సంస్కృతశబ్దమునకు దేశభాషలలో సాధ్యమైనంతవఱకు ఒకే రూఢ్యర్థ ముండునట్లు వాడుట మంచిది. ఇదివఱలో కలిగిన భేదములు తగ్గునట్లును, ఇంకనుండి యిట్టిభేదములు కలుగకుండునట్లును ఉభయభాషలలో వచ్చు పదజాలములను ఆయాభాషలలోని గ్రంథలేఖకులు నియమముతో నుపయోగించుట యుచితముగా నుండును. ఈవిషయమున ఆయాభాషలందలి గ్రంథకర్తలే గాక ముఖ్యముగా పత్రికాసంపాదకులును, విలేఖకులును కూడ చాల సహాయము చేయఁగలుగుదురు. పత్రికలలో వాడు సాంకేతికపదములు, పారిభాషికపదములు కాలక్రమమున జనసామాన్యపు వాడుకలో వ్యాపించుచున్నవి. ఈపని ప్రత్యేక మొకభాషవారు గాక యితరభాషలవారికిఁ గూడ సంబంధించినది. అందువలన ఇందుకు దేశమున కంతకు సంబంధించిన ప్రతినిధిసంస్థ యొకటి యేర్పడి అందుకు పూనుకొనవలెను. హిందీప్రాంతముల కన్నిటికి అఖిలభారత హిందీ సాహిత్యసమ్మేళనము ముఖ్యవాఙ్మయ సంస్థయై హిందీ ప్రపంచమున చాల పలుకుబడి గలిగియున్నది. ఇట్లే బంగాళాప్రాంతమున వంగీయసాహిత్యసమ్మేళనము ప్రధానసంస్థయై పనిచేయుచున్నది. ఇట్లే యితర ప్రాంతములకు సాహిత్యపరిషత్తులు గలవు. తమిళదేశమునందలి "తమిళ సంఘము" చిరకాలము సంస్కృతశబ్దములను బహిష్కరించినను ఇటీవల ఆపట్టు వదలి సంస్కృతపదములు గూడ స్వీకరించుట కనుకూలముగా నున్నట్లు చెప్పఁబడుచున్నది. ఇవి గాక కలకత్తాలో నిఖిలభారతసంస్కృత సాహిత్యపరిషత్తు గలదు. మన ఆంధ్రసాహిత్యపరిషత్తు వారును, సాహితీసమితివారును ఇవి మొదలగు సంస్థలును ఆలోచించి పైని చెప్పిన యితరభాషల సంస్థలతో ఈ సంగతి చర్చించి ఒక్కొక్క భాషవారు ఒకరిద్దఱు చొప్పున ప్రతినిధుల నెన్నుకొని అఖిలభారత దేశీయ భాషాసంస్థ నొకదానిని నెలకొల్పినచో ఆసంస్థ యీ సందర్భము లన్నియు ఆలోచించి యిదివఱ కాయాభాషలందున్న వైజ్ఞానిక నిఘంటువులు మొదలగు వాని సహాయముతో వైజ్ఞానిక పారిభాషిక సాంకేతికాది పదములన్నిటికి దేశభాష లన్నిటియందు సామాన్యవ్యవహార ముండునట్లు అర్థము దెలియఁజేయుచు ఒకనిఘంటువును ఏర్పరుపవచ్చును. అట్లు చేసినచో దేశభాష లన్నిటికి చాల నుపయోగకరముగా నుండును. యూరపుఖండమందలి ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్ మొదలగు వేరువేరు దేశముల భాషలవారు వైజ్ఞానికవిషయములందు తమతమ భాష లన్నిటియందు నొకే పదములను ఒకే యర్థమున వాడుకొనుచున్నారు. అట్టిస్థితిలో నొకే దేశమందుండు మనము మనదేశభాషలలో వీలగునంతవఱకు సామాన్యపదములను (సమానార్థముననే) వాడుచుండుట చాల లాభకరముగా నుండును.

౫. సంస్కృతపదములే గాక హిందూస్థానీ భాషలో సర్వసామాన్యముగా వాడఁబడు మఱికొన్ని పదములు గూడ ఆంధ్రభాషలో వాడుకలో నున్నవి. ఈపదములలో కొన్ని ప్రాకృతమునుండి మార్పును చెందినవియు, కొన్ని అరబ్బీ, పారశీక భాషలలోనుండి గ్రహింపఁబడినవియు నై యున్నవి. ఏరీతిగా వచ్చినను అవి హిందీభాషలోను, ఉర్దులోను, మనదేశమందలి యితరార్యభాషలలోను సంభాషణలందును, గ్రంథ

ములయందును గూడ ధారాళముగా నుపయోగింపఁ బడుచున్నవి. ఉదాహరణముగా వీటిలో కొన్నిటిని ఈక్రింద కనపర్చుచున్నాను.—

అజమాయిష్, అసల్, ఆసరా, కుండ, ఖద్దర్, ఖబర్దార్, ఖరార్, ఖరీద్, ఖర్చు, ఖాతా, ఖాలీ, ఖులాసా, గులామ్, జల్దీ, జబర్దస్తీ, జమీందార్, జనాబ్, జమా, జవాబ్, జరూర్, జాగీర్దార్, జామీన్, టోపీ, డేరా, డోలీ, తబలా, తగాదా, తయార్, తహసిల్దార్, తాబేదార్, దఖల్, దర్బార్, దాఖల్, దివాన్, నకల్, నగద్, నమూనా, నమోద్, నామర్దా, నౌకరీ, పరదా, పసంద్, పహర్, పిచికారీ, పేచీ, ఫకీర్, ఫిర్యాదు, ఫయిసల్, బంద్, బుర్జ్, బైరాగీ, బేడీ, భర్తీ, మజా, మరమ్మత్, మంజూర్, రవానా, రజాయీ, రంగ్, రోజ్, లడాయి, లడ్డు, వసూల్, షరబత్, షికార్, సబబ్, సర్కార్, సలామ్, సర్దార్, సాకిన్, సాదా, సామాన్, సాల్, సైతాన్, హుకుమ్.

ఇట్టిపదము లింకను చాలఁ గలవు. వీనిలో హలంతములకు ఆంధ్రాచారముప్రకారము చివర మాత్రము ఉకారమును చేర్చి ఉపయోగించుచున్నాము. మఱియు కదం, కవాయత్, ఖాతిర్, గంజా, చక్కర్, ఝుండా, దస్తఖత్, దాగ్, నక్కారా, పాయదా, బహదూర్, మదద్, ముద్దయి, రాస్తా, రూమాల్, సహనాయి, హైరాన్ మొదలగు పదములు గూడ నామమాత్రమగు మార్పుతో తెనుఁగులో ఆ యర్థమునందే వాడుచున్నాము. ఇట్టిశబ్దము లన్నియు మనభాషలో పరిపాటిలో నున్నవి. వాటిని వాఙ్మయములో నుపయోగించుటకు పండితులు అంగీకరించుట న్యాయ్యము. ఇట్టి పదములు చాలసులభములును, భాషలో స్వేచ్ఛగా వాడుచున్నవియును అయియున్నవి. పండితు లెంతనిషేధించినను గూడ ఇవి వాడుకలోనుండి పోవునట్లు కనపడదు. ఈపదములను ధారాళముగా నుపయోగించు హిందీభాషయొక్కయు, ఆ గ్రంథములయొక్కయు వ్యాప్తి మన ఆంధ్రదేశమున హెచ్చుచున్నది. మఱియు సుమారు డెబ్బదిలక్షలమంది ఆంధ్రులు నైజామురాజ్యమున నున్నారు. అచ్చట హిందూస్థానీభాషా వ్యాప్తి పరిపాలకుల అభినివేశముచే దినదినమునకు హెచ్చుచున్నది అచ్చటివారికి అచ్చతెనుగు, సంస్కృతపదముల కన్న ఈపదములే యెక్కువ బాగుగా బోధపడును. వారితోను హిందీ, మహారాష్ట్రాది ప్రాంతములయందు కాఁపురముండు లక్షలకొలఁది ఆంధ్రులతోను సంసర్గము మనకు తప్పనందునను, ఆయా ప్రాంతములయందు వ్యాపారాదుల నిమిత్తము మనలో చాలమంది ప్రయాణములు చేయుచుండుటచేతను మనభాషలో నిట్టి హిందూస్థానీపదము లింకను హెచ్చును గాని తగ్గవు. వాటిని వాఙ్మయమునందుఁ గూడ విరివిగా నుపయోగించినయెడల ఆగ్రంథములు జనసామాన్యమునకు బాగుగా బోధపడుటయే కాక హిందీ మొదలగు ఆర్యభాషల పదజాలమునకును, ఆంధ్రభాషాపదజాలమునకును సామీప్యము వృద్ధియగును.

మఱియు పైని చెప్పిన కొన్ని సంస్కృతశబ్దములవలె కొన్ని హిందీశబ్దములు గూడ తెలుఁగులో వాడునపుడు అర్థములో స్వల్పభేదము కనఁబడుచున్నది 'రాజీ' అను శబ్దమునకు అర్థము హిందీలో అంగీకారము, తెనుఁగులో వివాదమునకు తరువాత సమీకరణము; 'బాకీ'— హిందీలో శేషము, తెలుఁగున ఋణము; 'సుమార్'— హిందీలో అనుమానము, తెనుఁగున కింవదంతి; 'కబుర్'— హిందీలో సమ్మతి, తెనుఁగున కదపా; 'ఠాణా'—హిందీలో పోలీసు కచ్చేరి, తెనుఁగున సాధారణముగా జమీందారీ ఆఫీసు; 'మతలబ్'-హిందీలో భావము, తెనుఁగున ప్రణాళిక; 'పుకార్'—హిందీలో పిలుపు, ఆంధ్రమున వదంతి. భాషలో కొన్ని శబ్దములకు మాత్రము ఇట్టిస్వల్ప భేదము కలుగుట ఆశ్చర్యము గాదు. కాని యిట్టిపదముల విషయమై గూడ నేను సంస్కృతపదములకు సూచించిన రీతిని దేశీయసాహిత్యపరిషత్తు నియమితార్థముల నిర్ణయించితమ నిఘంటువులో నిబంధనలను ఏర్పరుపవచ్చును.

దేశీయభాష లన్నిటికిని కలిపి ఒక సాహిత్యపరిషత్తు ఏర్పడినయెడల పైని చెప్పిన విధము గానే గాక యింకను ఉపయోగకరములగు ఇతరపదములను గూడ ఆపరిషత్తు చేయవచ్చును. ఒక్కొక్క

భాషలలోని అమూల్యగ్రంథములను ఇతరభాషలలోనికి తర్జుమాచేయించుటకును, లిపిసమస్యను పరిష్కరించుటకును, వాఙ్మయమును ఇతరవిధముల వృద్ధిచేయుటకును, వివిధప్రాంతీయులకు సామరస్యము కల్గించుటకును వారు చాల సాహాయ్యము కలుగచేయవచ్చును. కనుక ఆంధ్రదేశపు భాషాభిమానులును, భాషాసంస్థలును మన దేశమందలి యితరభాషల సంస్థలతోను, భాషాభిమానులతోను చర్చించి అట్టిదేశభాషాసంస్థను నెలకొల్పుటకు అనుకూల్యమును కలిగింపఁ గోరెదను.

---



ఏరుదాటు

(Wood-cut చిత్రము)

చిత్రకారుడు: టి. కేశవరావుగారు.

ఇటీవల చెన్నపురిలో జరిగిన లలితకళాప్రదర్శనమున నీ చిత్రమునకు 50 రూ. ల బహుమతి లభించినది.

శృంగారప్రబంధాలు చదవకూడదనేవారు కొందరున్నారుగాని వాటిలోగూడ చదువదగిన గ్రంథాలు కొన్ని వున్నాయి. ఏదైనా చదవంది, మంచిచెడ్డ లెలా తెలుస్తవి? శృంగారప్రబంధాలు చదివినంత మాత్రాన యువకులు చెడిపోతారనడం సమంజసంగాదు. చదువకుండా చిన్ననాటిలో తప్పుదారులు త్రొక్కినవారు నూటికి తొంభైమంది ఉన్నారు. నేటికాలపు ప్రణయగీతాల్లో చాలాభాగం రాధపరంగా వ్రాయబడినవి. ఇప్పటి తెలుగుభాషలో ఈదేవి కొక బంగారుగద్దె నిర్మించారు. భాగవతులలో అగ్రస్థానం రాధకే యిచ్చారు.

ముద్దుపళనిచే రచియింపబడిన రాధికాసాంత్వనము శృంగారరసప్రధానమగు పద్యకావ్యం. ఈగ్రంథం లభించడమే యీరోజుల్లో కష్టంగాఉంది. కారణం అందరికి దెలిసిందే. బహుప్రయాసతో దీన్ని సంపాదించి చదవడం తటస్థించింది నాకు. గ్రంథం చదువుతుంటే, విషయాలన్ని నే ననుభవిస్తున్నట్టే వుంది. స్వల్పలోపా లున్నా మొత్తముమీద గ్రంథం చాలాబాగుంది. ఇట్టి గ్రంథాలు చదువరాదని పలుమారు చెబుతూవుండే ఛాందసుల మీద నా కొకవిధమైన జాలి గలిగింది.

శ్రీకృష్ణునికి రాధ ప్రేమలాంఛనంగా ఒకకానుకను సమర్పిస్తుంది. అలాంటి కానుక ఎవరు ఇవ్వరు, ఇవ్వడానికి సమ్మతింపరు? కృష్ణునిమీద రాధకు గల ప్రేమానురాగములు, భక్తిశ్రద్ధలు వర్ణనాతీతములని, ఆదర్శప్రాయములని చెప్పడానికి యీకానుకే సాక్షి. తన మనోహరునికి తనయందు ప్రేమ యగ్గలమగుటకుగాను అతని కేది ప్రియతమమో, దానినే సమర్పించుటకు సంకల్పించింది, ముందువెనుక లాలోచించకుండా. ముద్దులుమూటగట్టు 'ఇళ' యను నొక మోహనాంగిని పెంచి, పెద్దదానినిజేసి, నీతులు నేర్పి, కృష్ణునికి సమర్పించి "జాగ్రత్తగ వాడుకొనవలసిన''దని మనవిచేసుకొంటుంది. రాధ అమాయికురాలుగాకున్న యిలా చేస్తుందా? ఏకారణంచేతనైనా, యెట్టి క్లిష్టపరిస్థితులలోనైనా యీపని చేయుటకు స్త్రీ సమ్మతిస్తుందా?

రాధ తన శయనమందిరంలో జేరి చేసినపనికి పరితపిస్తుంది. అప్పుడు అన్ని ఆలోచనలు వాటంతట అవే ఉదయిస్తాయి.

"సొమ్ము లియ్యవచ్చు సొమ్మంద మీవచ్చు
ఇయ్యరాని ప్రాణ మీయవచ్చు
తనదు విభుని వేరెతరుణిచేతికి నిచ్చి
తాళవశమె యెట్టిదానికైన?"

అని అనుకొంటుంది. అనాలోచితంగా సంచరించే స్త్రీల చిత్తవృత్తి యీసందర్భంలో

చక్కగా చూపబడ్డది. ఇంత పరితపించిగూడా తర్వాత కృష్ణునియొక్క ఒక్క గాఢాలింగ నంతో యివన్ని మరచిపోతుంది. పాపము, కుడుము చేతికిస్తే పండుగనుకొనే పిచ్చిది రాధ.

కొన్నాళ్లకు, ఇళాదేవితో సుఖిస్తూ కృష్ణుడు దూరమవుతాడు. రాధ మళ్లీ సేమపు ప్రారంభిస్తుంది; తన్నుదాను తిట్టు కొంటుంది; ఆహారవిహారములయందు శ్రద్ధ తప్పిపోయి పిచ్చిదానివలె సంచరిస్తుంది; కృష్ణునికి సందేశ మంపుతుంది; ఎట్టకేలకు తన జీవితేశుని సంపాదించుకొంటుంది. ఈగ్రంథమందలి కథ యిది.

గ్రంథకర్త్రి యీగ్రంథాన్ని చక్కగా నిర్మించింది. రాధయొక్క గొప్పతనము, త్యాగబుద్ధి, రసికత చక్కగా వర్ణింపబడ్డవి. తన తెలివితేటలతో ముగ్ధయగు ఇళను అచిరకాలంలో రాధ ప్రౌఢనుజేస్తుంది. కవిత్వం జాతీయంగా, మృదుమధురమగు శైలిలో మహారసవంతంగా ఉంది. మదధార, సుఖరసము, ఆటది, వలపుల దొరసాని, ఎదురుమ్రోలలు, దీవెనవీడెము, జిలుగుతిట్టులు - ఇత్యాది పదము లెన్నో సొంపుగా కూర్చబడ్డయి. సామెతలు, లోకోక్తులు పద్యములం దిమడ్చబడి, వింతయందాన్ని దాల్చింది. మచ్చునకు కొన్ని చూపిస్తాను—

౧. "అల్పునకు కల్మి వచ్చిన నర్ధరాత్రి
గొడుగు దెమ్మన్న కథగాను కోమలాంగి"

౨. "కొన్నంగడిలోపలనే
యన్నవలామారుబేరమగునే చెలియా,"

౩. "అత్తమీద కన్నులు, అంగటిపై చేతులు"

౪. "ఎల్లవారికి శకునంబు లెల్ల బలికి
బల్లి తా బోయి తొట్టిలో బడినరీతి"

౫. "పేగులోని తీటవిధ మాయె."

ఈగ్రంథకర్త్రి మగవారి బుద్ధి యిట్టిదని రాధచేత చెప్పించిన పద్యం చూడండి—

"కలలోనైనను బాయక
కలకాలము నున్న విభుడె కనుగాయకునై
పలుచనజేసె నటన్నక
చెలియా, మగవారి వలపు చెడ్డదిసుమ్మీ!"

సాధారణంగా అన్ని శృంగారప్రబంధాలలోను ఉన్న అసహజాలు ఈగ్రంథంలోగూడ ఉన్నయి. కాని దోషములకంటె గుణములే యెక్కువని చెప్పవచ్చు. ఇప్పటి సినిమా ప్లాటులవలె పూర్వపు శృంగారప్రబంధాలన్నీ ఒకదాన్ని ఒకటి అనుసరించినవి. అట్టి పద్యకావ్యా లన్నిటిలోను రాధికాసాంత్వనము ఏవిషయంలోను తీసిపోదనరేకదా, మీదు మిక్కిలి చదవదగ్గ గ్రంథమనికూడా చెప్పవచ్చు. గ్రంథకర్త్రి రసపోషణకు దిగి భావగాంభీర్యమును లోపింపజేసినా అన్నిప్రబంధాలలోవలె పాతపాటలు, రోతమాటలు గాకుండా శైలి మంచిపాకంలో ఉంది. మచ్చునకు రెండుపద్యాలు చూపి యీవ్యాసాన్ని ముగిస్తాను—

"వలచినవారు లేరో? యెడ
బాసినవారలు లేరో? వార లీ

యలమాట లందిరే? మిగుల
నందియు నావలె జీవయుక్తులై
నిలిచిరె? యేటిమాట లవి,
నేరకనాడితి భూమినుండగా
గలిగెను శౌరితో చెలిమి
కామిని, గంధగజేంద్రగామినీ!"

"కాలివాల్ పిట్టల కలకలంబులు మీరె
పగడకన్నుల యొజ్జ బయలుదేరె,
నెలరాజు పశ్చిమాచలరాజమున్ జేరె
బలుచంద్రకాంతపు శిలలు పేరె,
తారకాగణముల తళుకులెల్లెడ జారె
దీపంబు లెల్లను తెల్లబారె,
నతనుడు కేయెల్ల ననిజేసి వేసారె
ధర వియోగుల పరితాప మారె,
తమ్మి లలరారె, కలువల తావుదీరె,
కోకములు తేరెను, చకోరకులము తారె,
నినుడు గడితేరె, నినులు మొయిండ్లుమూరె,
తెలివి చేకూరె, బల్లున తెల్లవారె."

తెలుగువారిలో ఇట్టికావ్యాలు నిర్మించే స్త్రీ లున్నారని మనం గర్వపడాలి.



సంతకు
(Wood-cut చిత్రము)
చిత్రకారుడు: టి. కేశవరావుగారు.
ఇటీవల చెన్నపురిలో జరిగిన లలితకళాప్రదర్శనమువారి మెప్పునగన్నది.

# శబరి

మల్లాది రామకృష్ణశాస్త్రిగారు

(చింతా దీక్షితులుగారు, వరూధిని కావ్యావళి, తెనాలి, ౧౯-౩౮.)

హనుమంతుడు తరతరాలనుంచీ తెలుగు వారి యిష్టదైవము: పారిజాత తరు మూలవాసియైన ఆపవమాననందనుణ్ణి.. శాకినీ గణాల్ని తరిమివేయమనో, సంతానావాప్తి నొనగూర్చమనో, ఎప్పుడూ ఎవరో ఒకరు పనికల్పిస్తూనేఉంటారు: పట్టుమని పదిగడియలు ఏకాంతంగా ఉండి రామనామాన్ని జపించ డానికైనా తీరికలేకుండా ఉంది ఆనిత్యబ్రహ్మ చారికి. 'ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబకమ్' అన్నట్లు సంసారతాపత్రయము తనకు లేకపోయినా, లోకంలో గొడవలతో ఆతనికి క్షణం తీరిక ఉండదు: రామబంటుగానూ, మెదిలితే రాక్షసులను తన్ని తగిలివేసే వస్తాదుగానూతప్ప హనుమంతునిగూర్చిన వేరువిషయాలు వాల్మీకికూడా వ్రాయలేదు: దీక్షితులుగారి శబరి చదివినప్పుడు, హనుమంతుడికి, రామభక్తికైపు లేకపోతే మామూలుగా అందరితోబాటు సంసారిఅయి, వంశాభివృద్ధి చేసుకునేవాడేమోనన్న సూచనలు కనబడుతున్నవి. ఇద్రి చాలాఅల్లరిపిల్ల-కాని ధర్మపత్నికి కావలసిన గుణాలన్నీ ఆఅమ్మాయిలో పొటకరిస్తూన్నాయి: రామ అనే రెండక్షరాలతో పంజరం నిర్మించుకుని బంధితుడిలాగా కాలంగడపబోయే అంజనాతనయుడికి, లోకతత్త్వం మూచాయగానైనా తెలియచెప్పింది ఆపిల్లే-లేకపోతే, అనర్ఘమణిహారం చేతికిస్తే అందులో రామనామం లేదని ఆవలికి విసిరివేసే అలౌక్యుడికి, రాముడి విషాదవిప్రలంభం అర్థంచేసుకుని అనుతాపపడగల తాహతు ఎక్కడనుంచి వచ్చిందీ? అదంతా ఆసవరపిల్ల చలువ: దీక్షితులుగారు చాలా చక్కగా చిత్రించి, అంతకన్నా ఎక్కువ మనోహరంగా ప్రదర్శించారు ఆ రెండు మూర్తులనూ.

చాతకముని, ఒట్టి ఉత్సవవిగ్రహము: సంసారంసంగతి పుస్తకాల్లోనైనా చదువుకోకుండానే, సన్యసించడానికి తలపడి, జడలు పెరగడంచేత మునిగామారిన సాధకుడు: మతంగుడు దివ్యులలో కలిసిపోయినతరువాత, ఆశ్రమవాటికఅంతా..శూన్యంగాఉండకుండా.. ఉబుసుపోవడానికి, నాటకం నడవడానికీ, అవతరించిన-కల్పింపబడిన 'కాబోయేముని' చాతకుడు: తనవేసం చూసి, తనలోతానే నవ్వుకునే స్వభావం ఉన్నట్లు గోచరించే అమాయకుడు: నాటకానికి, పావురములు తోడ్పడినంతవట్టుకైనా సాహాయ్యకారి కాలేకపోయినాడు: కాని చాలాతమాషా ముని:

శబరి, ఎంతో ఆదుర్దాతో, రాముడు ఎప్పుడు వస్తాడాఅని ఎదురుచూస్తూంటే, చూసేవాళ్లకు;- ఊహుం-నాటకం చదివేవాళ్ల

కు-ఆతడు సీతావియోగదుఃఖితుడని తెలిసినా కూడా. . ఎందుకు అంతఆలస్యం చేస్తున్నాడని కోపం వస్తుంది. . శబరిభక్తి అప్రతిమానము . . వైష్ణవజనసహజమైన, సామాన్యప్రతిపత్తివిశేషం తనయిష్టదైవంఎడల వెలయించి, ఆదరించింది, రామాయణాని కంతటికీ ఆమె ఒక తయే: సీతాన్వేషణానికి బయలుదేరిన వానరులకు దోవలో హేమ చేసినవిందు శబరి ఆదరణకు సాటిరాదు: రాముడు ఎప్పుడు వస్తాడోఅని ఎంత ఎదురుచూసింది!—ఎంత ఆదుర్దా. . ఉబలాటపడ్డనీ. . చివరకు ఆతడు సాక్షాత్కరించినప్పుడు, ఆపారవశ్యముద్రను వీడకుండానే, ఆదిత్యలోకాన్ని అనుసరించి. . అతిక్రమించిపోయింది.. శబరిస్వభావాన్ని నిరూపించడంలో. . ఆయమభక్తినీ,పారతంత్ర్యాన్నీ చిత్రించడంలో చాలానైపుణ్యం కనబరిచారు దీక్షితులుగారు. . ఇంత సర్వతోముఖసామర్థ్యంతో పాత్రకల్పనమూ, పరిపోషణమూ పెంపొందింపబడిన నాటకాలు. . నవీనులు రచియించినవానిలో రెండోమూడో ఒకవేళ ఉండటం తటస్థించినా, వాని అన్నిటికీ నాయకమణిగా .. 'శబరి'నే నిరూపించవలసివస్తుంది.. దీక్షితులుగారి రచనలన్నిటిలోనూ సర్వోత్కృష్టమైనది.

శబరి, తాను ఎంగిలిచేసిన పళ్లు రఘూత్తముడికి ఆరగింపబెట్టినదని అపవాదుగా భావించి. . దీక్షితులుగారు.. ఔచిత్యంకోసం కాబోలును . . ఆశ్రమకిరాలచేతనే ఫలసము పార్జనము చేయించారు.

పండూ ఫలమూతిని, పండీయుందామంటే
పక్షిజాతుల ఎంగిలీ . .
వెలయ జలము తెచ్చి కడిగివేతామంటే
జలధీమత్స్యము లెంగిలీ . .

. .　　. .　　. .

ఎంగిలన్నవారు అజ్ఞానులాతేను
జగమంతా ఎవరెంగిలీ !

అన్న వేదాంతతత్త్వార్థానుగుణ్యంగా శబరిచేతనే ఎంగిలిచేయించి, ఆమె రుచిచూసి, సరిగా ఉన్నవని తలచినపిమ్మటనే రామునకాఫలమూలాదికంబుల నారగింప బెడితే సంప్రదాయానుగుణ్యంగా ఉండేదేమో ?— అయినా ఈమార్పుకూడా మనోహరంగానే ఉన్నదనవచ్చును:

నాటకాన్నంతా ఆవరించియుండే మనోహరభావప్రాబల్యానికి ప్రచురణాంగముగా. . దీక్షితులుగారికి భాషమీద ఉండే అధికారం తోడ్పడుతూన్నది: 'వింతభావా ల్వెదకడానికి' వింతరచనలు సల్పడానికీ, నవీను లందరిలోకి జయవీరుడు ఆయన ఒక్కడేనన్నది దీక్షితులుగారు శబరిమూలంగా సార్థకపరచుకున్నారు

అప్పకవి తృతీయాశ్వాసమందు యతిప్రసంగవశమున 'అగ్రాహ్యావిరామములు' అను శీర్షికక్రిందఁ గొన్ని పద్యములు కవిజనాశ్రయములోనివని యుదాహరించి వాని గ్రాహ్యతాగ్రాహ్యతలఁగూర్చి చర్చించియున్నాఁడు. ఈ పద్యములు వికటకవికల్పితంబులని యప్పకవి యాశయము. అట్లు గానిచో నీదృశలాక్షణిక విరుద్ధలక్షణములు భీమన చెప్పియుండఁడని యాతని యభిప్రాయము.

అందు 'అగ్రాహ్యభేదవర్గయతులు' అనునవి చెప్పుసందర్భమున రెండు పద్యములు చెప్పెను. ఇందులో రెండవది—

"భరితభువనార్ణవంబుతో వ్రంత సరియె
రమ్యమణిరాజరాజుతో లక్క సరియె
లలితవీణారవంబుతో ళక్క సరియె
యనఁగఁ జెల్లు నభేదాఖ్య నమరు వళ్లు."

(అప్పకవీయము, 3 ఆ. ప. ౨౬౦)

"ఈమూఁటిలోపలను భ క ర వ కారములకు నభేదవర్గవిరతి గనుక ప్రయోగింపవచ్చును. లవర్ణ ళవర్ణములకు నభేదవర్గవిరతులును గావు. కనుక ప్రయోగింపరాదు. రేఫమునకు లకారమునకు గ్రాహ్యంబుగాదు." (3. ౨౬౧) అను పైపద్యమును వచనమును వివరించి గ్రాహ్యాగ్రాహ్యతల నిర్ణయించెను. ప్రస్తుతమిందలి రలయతినిఁగూర్చి విమర్శింతము.

ప్రాచీనకాలమునుండియు రేఫలకారములకు విరతిఁ గూర్చు విషయమున భిన్నమతము లున్నవని పైవిషయమునుబట్టి మనకుఁ దెలియుచున్నది. శ్రీనాథాది ప్రామాణికకవులు గొంద ఱీరలయతినిఁ బ్రయోగించిరి. ఈ ప్రయోగములఁ గొన్ని లక్షణవిలాసమువారు చూపియుండిరి.

"కైలాటరాయ యభినవ
లీలామకరాంకచంద్రరేఖాంకురచూ
డాలంకారపదాంబురు
హాలింగితసుకృతనిర్మలాంతఃకరణా."

—శృంగారనైషధము, ౧. ౧౧౦.

"దానవసుందరు లత్తఱి
జానకి నందలమునీఁద సమ్మద మొదవం
గా నిలుప శారదాభ్రవి
లీనత నేపారు చంద్రరేఖయపోలెన్."

—రామాయణము, ౨౩౨౩.

వీనికి నప్పకవి లక్షణవిలాసమువారికిఁ దెలియదని యాక్షేపించుచు, "సంస్కృతమునందు రేఖాలేఖాశబ్దములు రెండును గలవు గనుక పద్యములందుఁ జెప్పిన రేఖాశబ్దము మొదలఁ దృతీయాంతస్థమని యెఱుఁగునది" (అప్ప. 3. ౨౬౪) అని వ్రాసెను. ఇట్లప్పకవి చెప్పుట కాధార మెద్దియుఁ గాన్పింపదు. రూపాంతరముండుటఁ జేసి తృతీయాంతస్థ మాదిఁగల్గు రూపమే యని చెప్పి స్వమతమును సాధించు

టయే ప్రయోజనము గాని మఱియొంకు గాదని పైయంశమునుబట్టి మనము గ్రహింపవచ్చును. మఱియు—

ద్వి. "చీకటి విరియించుఁ జిఱునవ్వుపసిఁడి
రేకులతో నెదిర్చించు చెక్కులును

కొందఱు 'రేకులతో మురాళించు చెక్కులును' అని చదువుదురు. అది వ్రాఁతతప్పు గాని కవిహృదయము గాదు" అని హరిశ్చంద్రునికథయందలి ద్విపద నొకదాని నిచ్చి, "ఎదిరించు, మురాళించు"అనువానిలోఁ బ్రథమ పాఠమే కవిహృదయమని యెఱుకపరచెను. మఱియు వసుచరిత్రమందలి

"ఓ లంబాలక.................
లోలంబాలక యోర్తుగ్రుంకిబిసవల్లుల్ దున్మి..."
—వసుచరిత్రము, 3. ౧౬౨.

ఈపద్య మిచ్చి, "యీపద్యము రెండవచరణమున లోలంబాలక గ్రుంకి యని కవిహృదయము. ఇది గానక కొందఱు 'ఇందిందిర శ్చంచరీకో రోలంబో బంభరో౽పిచ' అని నిఘంటువున్నదని రోలంబాలకయని చదువుదురు. అట్లని రామరాజభూషణుతలంపు గాదు." (అప్ప. 3. ౨౭౮.) అని వివరించెను. ఈ పై యంశములఁబట్టి రేఫలకారములకు విశ్రాంతి లేదని చెప్పుటలో నప్పకవి కెంత పట్టుదల కలదో మనకు స్పష్టపడుచున్నది.

ఇట్టి పట్టుదల యప్పకవి కుండుటలో హేతువు దురూహ్యము. కాని, రేఫలకారములకు మైత్రిఁ గూర్చువిషయమునఁ గొన్ని యుపపత్తులు మనకుఁ గాన్పించుచున్నవి. సామాన్యముగఁ బ్రాచీనకవులు యతివిషయమున వర్ణములకుఁ బరస్పరస్థానప్రయత్నసామ్యము నాధారముగఁ జేసికొని మైత్రిని నిర్ణయించిరని చెప్పవచ్చును. అట్లగుట రేఫ లకారము లేక స్థానజములే గదా. మఱియుఁ గొన్ని దకారము గల "ఎద, దొంగ, దిగి, దొప్ప"యీ మొదలగుపదములందలి దకారమున కాదేశముగ వచ్చునట్లు, "ఎడ, డొంగ, డిగి, డొప్ప" యీ మొదలగు పదములందలి డకారమున కాదేశయతిగ దకారడకారములును మైత్రి గూర్ప వచ్చునని యప్పకవి సూచించిన యంశమేగదా. అట్టియెడ లకారమునకు రేఫ యాదేశముగఁ బ్రాకృతాదిభాషలయందును వచ్చుట మన మెఱిఁగియే యున్నాము. ఆంధ్రవ్యాకరణకర్తలుకూడ బహువచనమందలి లు, ల లకు రు, ర లాదేశముగ వచ్చుటను జెప్పుట కూడ మనకుఁ దెలిసియే యున్నది.

౧. ప్రాకృతమున హేమసూత్రమగు "రసోర్లశౌ" (౮. ౪. ౨౮౮) అను దానిచే "రాజా—లాఆ, పురుషః—పులిశే, పరిచయః—పలిచయే"—ఈరూపము లగుచున్నవి. పైనుదాహరింపఁబడిన 'రాజా' మొదలగు వానియందు లకార మాదేశమై 'లా ఆ' అను మొదలగు రూపము లగుట మనకుఁ గాన్పించెడి.

౨. ఆంధ్రవ్యాకరణములందును బహువచనమందు 'లు, ల' లకు

"లాన్తాత్తు రురౌ తయోః క్రమేణ స్తః"
(ఆంధ్రశబ్దచింతామణి, అజన్త పరిచ్ఛేదము, ౧౫ సూ.)

అని రు, ర లాదేశముగ వచ్చెడి 'బాలురు, బాలుర౯' అను రూపములును, ద్విత్వయుక్త లాంతంబుమీఁది లు, ల లకు రు, ర లాదేశముగ 'మల్లురు, మల్లుర౯' మొదలగు రూపములును సాధింపఁబడియున్నవి. ఈపైవానినిబట్టి రేఫలకారముల కెట్టి సంబంధము కలదో, దానిని బుచ్చుకొని మైత్రి సలుపుటలో నెంత వఱ కుపపత్తి కలదో గ్రహింపవచ్చును.

"రాయంచకాళ్ల దాలకయమున్న"
—వసు. ౪. ౨౫.

ర ల లకు విరతి ప్రయోగించిన యీ పద్య మొకటి వసుచరిత్రమునఁ గాన్పించెడు. ఇయ్యది యప్పకవిదృష్టము గాదని మన మూహింపవచ్చును. అట్లు గానిచో నీదృశరేఫలకారవిశ్రమము స్వమతానుగుణ్యముగనే చేయువాఁడనుట యనాలోచితోక్తి గాదు. అహోబలపండితుఁ డీపద్యపాదమందలి ర, ల ల మైత్రిని గూర్చి విమర్శించుచు "రలయో ర్లడయోః......................స్యాదభేదః. ఏవంస్థితే అప్పకవినా యదుక్తం యత్తు రలయో ర్మిత్రతాస్తీతి లాక్షణికానా ముక్తి ర్నప్రామాణికీతి లీలామకరాంకచంద్రరేఖాంకురచూడాలంకారపదాంబురుహాలింగిత మహితనిర్మలాంతఃకరణేత్యాదౌ రేఖాశబ్దస్య లాదిత్వమపి నైఘంటికై రుక్తత్వా న్న రేఫాదిత్వమితి తదవిచారితాభిధానమేవేతి స్పష్టమేవ. ఏతేన 'రాయంచకాళ్ల దాలకయమున్న' ఇత్యాది కవిప్రయోగాణాం నకించిద ప్యసామంజస్య మితి ధ్యేయమ్."

"కలహంసకాళ్ల దవులకమున్న" అని మఱియొండు పాఠము దీనికిఁ గాన్పించుచున్నది.

"లీలాహాస్యకళాప్రసంగములను ద్రేకించి"-
—కాశీఖండము ౬. ౨౦.

దీనికి 'లీలాహాస్యకళాప్రసంగముల నుల్లేఖించి' అనియుఁ గలదు. ఇట్టియెడ ర, ల లకు యతి ప్రాచీనకవిసమ్మతమనియే చెప్పనొప్పును. కాని యేలాక్షణికున కాలాక్షణికుఁడు స్వమతమున కనుకూలమగునట్లు ప్రయోగముల దిద్దుచువచ్చిరి. ఇట్టిప్రయోగబాహుళ్యము లున్నకతనఁ గవిసమ్మత మిదియని నిర్ణయించుటకు వీలు లేకున్నది. కాని రేఫలకారములకు యతి వేయుట సమంజసమగునా, కాదా? అని చర్చించినచోఁ బైనఁ దెలుపఁబడిన యుపపత్తులఁ బురస్కరించుకొని రలయతి నంగీకరించుట సోపపత్తికముగ నున్నదని తోఁచెడిని.

# మహాత్ముని ఉపవాస చిత్రములు




౧. గాంధిమహాత్ముడు

'ఉపవాసకాలమధ్యమున'



౨. శ్రీ థాకర్సి సతిగారు

'పర్ణకుటి' యజమానురాలు.




3. 'పర్ణకుటి'
మహాత్ముఁ డుపవసించిన భవనము.

# దశరథుడు సత్యవాదియగునా!

శ్రీ తి. వ. నారాయణస్వామిగారు రచియించిన 'దశరథుఁడు సత్యవాది యగునా' అనుపేరుగల వ్యాస మొకటి ఆంగీరస సం ఆశ్వయుజమాసపు భారతియందు ప్రకటితమయినది. అందలి వస్తువు దానిపేరువలననే తెలియవచ్చుచున్నది. నారాయణస్వామిగారికి రామాయణమున వివరింపబడిన విషయములను మున్నిడికొనియె 'దశరథుఁడు చలచిత్తుఁడనియు, గామవశుఁడనియు, నసత్యవాదియనియు సందేహింపవలసివచ్చినది.' ఆవ్యాసమును ఖండించుచు (౧) శ్రీకాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు, (౨) శ్రీదర్భా కృష్ణమూర్తి శాస్త్రిగారు, (3) శ్రీ ఇంకొలను సీతారామ శాస్త్రిగారు వ్యాసములను వ్రాసినారు. మూడును ఖండనరూపములేయయ్యును అవి వేర్వేరుమార్గముల ప్రవర్తిల్లినవి. యథామాత్మకముగ వానిని ప్రకటించిన గ్రంథ మపరిమితముగ పెరుగును. కావున వానియందలి సారాంశములు క్రమముగా నీదిగువ పేర్కొనబడుచున్నవి:

౧. శ్రీకాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారి వ్యాసము 'దశరథుఁడు సత్యవాదియే' అను శీర్షికగలది. దానియందలి యంశములు:

దశరథుడు దుశ్శకునములను పరికించి తనకు మృత్యువు సన్నిహితమని యూహించి శ్రీరామపట్టాభిషేకమునకు గడగినాడు. మోసముచేయు తలపుగలవాడు ప్రజలనందరిని సభకూర్చి వారికి తాను తలపెట్టిన పట్టాభిషేకవృత్తాంతమును చెప్పడు; రహస్యముగా సాగించును. తన ప్రయత్నమున కాటంకము చేయు ప్రజలు తనరాజ్యమున లేరుకాన ప్రజలను కట్టుకొను తలంపును దశరథునకు బనిలేదు. దశరథుడు కైకేయిని మోసపుచ్చతలంచినచో నామెకు పట్టాభిషేకవార్తయే తెలిపియుండడు; ఆమెను సరకుపెట్టియేయుండడు. కైకకు రామునియెడలగల గౌరవానురాగములు బాగుగా దెలిసినవాడుకావున నతనికి పట్టము గట్టువార్త ఆహ్లాదజనకమగునని ఆమెకు తెలిపినాడు. కైక రామపట్టాభిషేకమును భంగముచేయబూనినపుడు వెంటనే యామెను కారాగారమునకు బంపియుండును కాని కాళ్లపైబడి బ్రతిమాలడు. కైకకు వరముల నెగబెట్టలేదు. శ్రీరాముని విడనాడజాలక యామెను దీనాతిదీనుడయి వేడుకొనినాడు, వేరువరమును కోరుకొమ్మని. కైకను పెండ్లియగుటకు ఆమెతండ్రితో చేసిన శపథముమాట మరచిపోయినాడు, దశరథుడు. పుత్రవియోగమునకు పరితపించుచు మృతినొందవలసిన మునిశాప మందుకు కారణము. కైకవివాహమునాటి ప్రతిజ్ఞ మామయల్లుండ్రుమాత్ర మెరిగినది; లోకవిదితము కాదు. అటులేని కైకను పెంచి పెద్దనుచేసి కూడవచ్చిన అంతఃపురదాసి మంథరకు తెలిసియుండకపోదు. అపుడు మంథర కైక కావిధమున స్వార్థలాభమును బడయ బోధించియుండునుగాని, వరములమాట యెత్తియుండదు. కావున కేకయదశరథుల కట్టి యొడంబడిక జరుగనే లేదనుట యథార్థము. ఈవిషయమును దెలిసినవాడు రాము డొక్కడే. అతడును తన్ను దోడ్కొనిపోవుటకయి వచ్చిన భరతున కావిషయమును జెప్పినాడు కాని లక్ష్మణునికి, కుపితుడయి తల్లిని, దండ్రిని దూషించుచున్నపుడుగూడ చెప్పినవాడు కాదు. కైకకిచ్చిన వరములను పాలించి సత్యసంధతను నిలుపుకొను

టకే పంపినా డనినాడు, భరతునితో నైన. ఆత డెంతకు తన్ను విడిచి మరలిపోవ డని తలంచిచెప్పిన లౌకికోక్తి యది. లౌకికనై పుణ్యమగును కాని యట్లు చెప్పుట మోసముకాదు. ఇంకొకమారును రాము డిట్లే చేసినాడు- రాముని రథముపై నెక్కించుకొని అడవులకు గొనిపోవుచుండగా దశరథుడు సుమంత్రుని రథము నిలుపగోరినాడు. రాముడు వలదని వారించినాడు; మీ కేక నాకు వినరాలేదని దశరథునితో చెప్పుమన్నాడు. పిల్లలు పట్టుపట్టినపుడు పండ్లిత్తుమనియు, నగలు చేయింతు మనియు కల్లలాడు తల్లులవంటివాడే రాముడు. కైకేయీదశరథసంవాదఘట్ట మంతయు దశరథుని సత్యసంధతను దృఢపరుచును. కైక తనమాటను వినలేదు. అపుడు తొలినాడు రామునికి వాగ్దత్తమయిన రాజ్యమును మరల యాచించినాడు.

దశరథుడు రాముని పట్టాభిషేకమున కుపవాసము చేయింప వసిష్ఠుని పంపినాడు. కేకయదశరథుల యొడంబడిక నిజమయినచో వసిష్ఠభగవాను డూరకయుండునా ? దశరథుని హెచ్చరింపడా ?

విశ్వామిత్రునివెంట రాముని పంప వెనుదీయుచుండ మున్ను కోరినదెల్ల నిత్తునని పలికి, ఇపుడు ఇట్లు వెనుకాడుట సత్యరతుడవగు నీకు తగదని వసిష్ఠుడు మందలించియుండలేదా ! కాబట్టి దశరథశపథవార్త కల్పితమని తోచుచున్నది. ఇట్లు సత్యసంరక్షణార్థము ప్రాణములను కోలుపోయిన దశరథుడు అసత్యవాది కాజాలడు.

స్వామిగారి చూపినరీతిని సత్యనిర్ణయము చేయబూనినచో రామాయణవర్ణితవ్యక్తులెల్ల మోసగాండ్ర పట్టికలోనికే చేరుదురు. ఆవ్యక్తులు :

౧. ఋశ్యశృంగుని వేశ్యల బంపి వంచించి రప్పించిన రోమపాదుడు.

౨. తండ్రికి దెలుపక శాంతను పెండ్లాడిన ఋశ్యశృంగుడు.

3. శ్రీరాముని తనవెంట బంపగోరుచు అతడు నారాయణుడని చెప్పక 'అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమం' అని యన్యాపదేశముగా చెప్పిన విశ్వామిత్రుడు.

౪. రాముడు శ్రీహరియని తెలుపక "కృతాస్త్ర మకృతాస్త్రంవా నైనం శక్ష్యంతి రాక్షసాః" అని చెప్పి నిజస్థితిని కప్పిపుచ్చిన వసిష్ఠుడు.

౫. సీతను కాపాడుటకయి రామునిచే నియమితుడయ్యును అట్లు చేయక మాయలేడికూతను విని సీతను విడిచిపోయిన లక్ష్మణుడు.

౬. సీతను వెదుక లంకకు బోయి 'నీ వెవ్వ' రని యడుగ తన పేరును చెప్పక లంకను చూడవచ్చినవాడ ననిన ఆంజనేయుడు.

౭. తన్ను కాచియున్న రాక్షసస్త్రీలు ఆంజనేయుని గని యాత డెవ్వడని యడుగ శ్రీరామబంటని చెప్పక నాకేమి తెలియునని చెప్పిన సీత.

౮. సీతాన్వేషణమునకు తాబెట్టిన గడువు దాటించిన సుగ్రీవుడు.

౯. శ్రీదర్భా కృష్ణమూర్తిశాస్త్రిగారి వ్యాసము "దశరథు డసత్యవాదియా" అను శీర్షిక గలది. దానియందలి అంశములు :

దశరథుడు పట్టాభిషేకార్థము కేకయజనకులను తప్ప మరియితరరాజులనుగూడ పిలిచినట్లు రామాయణమున గనుపడదు. దశరథుడు సార్వభౌముడు కావున అందరు రాజులు అతనిని సేవించుచు అక్కడనే యుండిరి. 'ఉపాసాంచక్రిరే' అను క్రియాపదమే దీనిని తెలుపుచున్నది.

కేకయజనకులను పిలువమికి అవకాశము లేకపోవుటయే కారణముకాని దశరథుని కుత్సితమనస్కత కాదు. పుష్యచంద్రయోగము పట్టాభిషేకమునకు ప్రశస్తము కాన, అది మరునాడే కావున భరతాదులు వచ్చుట కవకాశము లేదు. రాజనాశసూచకము లగు దుర్నిమిత్తములవలన మరియొక మహూర్తము చూచుకొనుట కవకాశము లేకపోయెను.

పట్టాభిషేకనిశ్చయము కావించుకొని వెంటనే కైకకడకు దశరథుడు పోయెను. కైకకు రామునియందు ప్రీతి గలదని దశరథుడు రామపట్టాభిషేక వృత్తాంతము నామెకు చెప్పినాడు. వివాహసమయ ప్రతిజ్ఞకు భంగములేదు. అట్టి ప్రతిజ్ఞ చేయలేదు. గుణగరిష్ఠుడగు కొండొకకొమరుని పట్టాభిషేకసమయమున జ్ఞాపకముచేయుమనినాడు, దశరథుడు. అట్లు కేకయుడు జ్ఞాపకముచేయలేదుకాన దశరథు డసత్యవాది కాడు. దశరథుడు తొలుత కైకతో కోపదుఃఖములకు లోనయ్యు, నీకోరిక చెల్లింప ననినను "ధర్మబంధేన బద్ధోఽస్మి" అని చెప్పి వరముల నిచ్చి మాటచెల్లించినాడు. స్వామిగారు దశరథు డసత్యవాదియని నిశ్చయించియే దశరథుని సత్యవాదితనుగూర్చి యొకమాటయైన జెప్పలేదు. దశరథుడు సత్యవాది యనుటకు హేతువులు గలవు.

### 3. శ్రీ ఇంకొలను సీతారామశాస్త్రి గారి వ్యాసము—"దశరథుడు సత్యవాదియగును" అని దాని శీర్షిక అందలి సారాంశము:

భరతునికి రాజ్యమిచ్చు విషయమున దశరథుని ప్రతిజ్ఞ సామాన్యవిశేషరూపముల రెండువిధములగును. దేవాసురసమరమునప్పటిది సామాన్యము. కైకవివాహమప్పటిది విశేషము. కైక కోరినట్లు రాముననవికి పంపినందున సామాన్యప్రతిజ్ఞ కింతయు భంగములేదు. "తతో దశరథ స్స్వమనోరథపరిపూరణాయ యతమానస్సన్ మమ తనయో యదిభవేయు స్తదా తేషా మన్యతమస్య తనయస్య పట్టబంధకాలే త్వయా యద్యహం స్మారిత స్స్యాం తదా తథైవ కుర్యా మితి ప్రతిజ్ఞాయ కైకేయీ ముదవహత్. తస్మాత్ 'ద్వి(ప్రోషి)తశ్చ భరత' ఇతి సమ్యగుక్తం దశరథేన. ఏవంచ భరతస్య సాకేతపురసద్భావదశాయాం శ్రీరామస్య రాజ్యార్హత్వం"—(రామాయణ రహస్యరత్నాకర తృతీయ తరంగః) దీనివలనను, ఉమాసంహితావచనము (స్వామిగారి వ్యాసమున గలదు) వలనను విశేషప్రతిజ్ఞయు వినష్టము కాలేదు. 'పంచాన్నృతా న్యాహు రపాతకాని' అనున్యాయము ననుసరించియు నిది దోషము కాదు. పట్టాభిషేకభంగభయమున కేకయుని పిలువకపోవుట యుక్తమే. జనకుడు రామునికి మామగారు కదా! ఆతనినేల పిలువకూడదు? కాబట్టి వారిని పిలువకపోవుట కవకాశాభావమే కారణము. దశరథుడు ప్రజల అనుమతిని పొందుటకు వారి నడిగెను. రాజునకు గలిగిన హాని పట్టాభిషేకమునకు విఘ్నముకాని భరతుని పక్షమున రు భరతునికి రాజ్యమనుగుట విఘ్నముగాదు. "భరతునకు రాజ్య మిచ్చెదనంటిని. వాడు లేనపుడే నీకు పట్టముకట్టెదను. వాడు వచ్చి రాజ్య మడుగునేని ఇవ్వకతప్పదు. అసత్యదోషము సంప్రాప్తమగును" అన్నాడు గాన అసత్యదోషమునకు జడిసియే దశరథుడు రామునకు పట్టముగట్ట తొందరపడెను. దశరథునికి "వివాహస్తు మమాభీష్టో నపుత్రే రాజ్యతర్పణమ్" అను సత్యోపాఖ్యాన రామాయణవాక్యానుసార మాతనికి రాజ్యప్రదానప్రతిజ్ఞ అనిష్టము. మరియు కేకయుడు జ్ఞప్తిచేయలేదు; రాజ్యము భరతున కీయలేదు. ఇం దసత్యదోషము లేదు. దశరథుడు వంచింపజూచినను కేకయరాజు తన మనుమని కిచ్చెదనన్న రాజ్యము నింకొకని కిచ్చుచుండ నూరకుండునా? మీదుమిక్కిలి కేకయుడు రామరాజత్వమునే అంగీకరించినాడు. దశరథుడు వంచకుడేయైన కైకకోరిన వరముల నేల ఎగబెట్టడు? అట్లు చేయక సత్యబద్ధు డయ్యెను. దశరథునికి మూడు ఇక్కట్లు — (౧) కైకవివాహమునాటి ప్రతిజ్ఞ, (౨) కైకకిచ్చిన వరములు, (3) పౌరులసమక్షమున రామునకు బట్టముగట్టెద ననుట. వీనిని తప్పించుకొని దశరథుడు సత్యసంధుడని ఖ్యాతిగనినాడు.

ఇంకను ఇట్లే-రామాయణకథ సాగవలయునను భావమునకు తగిన మరికొన్ని విషయములు. ఈమూడువ్యాసముల సారాంశ మిది.

వీనివలన స్వామిగారు చూపిన సందేహములు తీరునవి కావని పాఠకులు తెలిసికొన

గలరు. "రాముడు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు. ఆతని తండ్రియగు దశరథు డసత్య వాదియా? రామాయణమూలపురుషుని కీగతి పట్టింతురా?" అనుదృష్టి యుండునంతవరకు తత్త్వము నరయజాలకపోవుట వింతకాదు. ఖండనకారులలో తొలుతటివారు సెలవిచ్చినట్లు పురాణేతిహాసపాత్రములయందు లోపములనుకొనునవన్నియు లౌకికతంత్రములనుకొనుట యుక్తము. పురాణేతిహాసముల గాథలన్నియు లౌకికవ్యవహారబోధకములు. వానియందలి పాత్రములు తదనుకూలములుగ సృష్టింపబడియుండును. మీదుమిక్కిలి పురాణేతిహాసములు సంక్షిప్తప్రక్షిప్తభాగములకు స్థానములని ధీవిశాలురగు విమర్శకు లనేకులు చెప్పియున్నారు. తన్మాతృకల సూక్ష్మపరిశీలనము వారి కాధారము. కావున తద్గుణదోషపరిగణనవివాదము లసాధుకార్యములు. వానికంటిన దోషములను పరిత్యజించి గుణముల నాదరించుట భావ్యము. దోషముల సాన్నిధ్యముననే గుణములకు ప్రకాశ మధికము.

—సంపాదకుడు, భారతి.

---



కాశీవద్ద గంగానదిపై వంతెనలు
(ఒకటి రైలుబాట, మరియొకటి బండిబాట)

P. S. N.

# నిరపరాధి

౧

నిండినయింట్లో ఆనందదేవత గంతులు వేస్తూంది. పెళ్లిసందట్లో పందిగి స్తంభాలు పెళపెళమంటున్నవి. అటూ యిటూ మోటారు కార్లు హడావుడిగా తిరుగుతున్నవి. వాటి చప్పుడు విని దూరంగా కొట్టంలో కట్టివేసి వున్న ఆవుదూడలు బెదిరి గంతులువేస్తుంటే, వాటి తోకలు పట్టుకొని ఆడుకుంటూవున్న పిల్లకాయలు దూరంగా తొలిగి చప్పట్లు చరుస్తున్నారు. వాళ్ల గోలకు ఉడుకుబోతు తనం వచ్చి దూడలు ఇంకా అరుస్తున్నవి. వాళ్లు ఇంకా చరుస్తున్నారు.

పెళ్లికొడుకుకార్గు ముందు నడిచింది. దానివెనకనే ఆడబిడ్డలకారుఅంగలువేస్తూంది. మఱి చుట్టా లందఱికోసం ఏర్పాటుచేసిన మూడుబస్సులూ దానివెనకనే మూలుగుతూ పోతున్నవి. ప్లైపర్ కార్లకంటే పెద్దవైన తమ సందడిసీ వెనకవేసి వాటిని ముందు నడిపిస్తున్నారనే ఉక్కురోషంచేతనో, తమ సంగీతం వినిపించకుండా లోపల కూచున్న ముత్తైదువలు గడబిడచేస్తున్నారనే కంగారుచేతనో అవి సామాన్యంగా కదలటంలేదు; డ్రైవర్లకు లొంగటంలేదు; వాళ్లు చెవులు మెలివేసినా, చెక్కలు విఱిచినా, కాళ్లతో తన్నినా సహించి వూరుకుంటున్నవికాని ప్రయాణంమాత్రం మన స్ఫూర్తిగా సాగించేట్టు లేదు. చిట్టచివరకు మిగిలింది ఒకచిన్నకారు. అందులో ఒకరిమీద ఒకరు నలుగురు కుఱ్ఱవాళ్లు పడ్డారు. వెనుక సీటులో కుడివైపుగా వాలి ఆనుకొని కూర్చున్న పుండరీకం చేతిలోకి కళ్లజోడు తీసుకొని జేబురుమాలతో తుడుచుకుంటున్నాడు.

అందఱికంటే ముందు దారితీస్తున్న మేళగాళ్లల్లో ఒకడికి చీమ కుట్టింది. వాడు మద్దెల చాలించి మడిమ గోక్కున్నాడు. మద్దెల నిలిచిందని సన్నాయివాడు చాలించాడు. తాళపువాడు దగ్గాడు. మేళం నిలవంగనే ఫర్లాంగు దూరంలో ఉన్న బ్యాండువాళ్లు వెనక్కి తిరిగి చూచారు. ముందు నడుస్తున్న పెద్దమనుష్యులంతా కబుర్లు చాలించి నిలబడ్డారు. కారులన్నీ ఒకటితరువాత ఒకటి క్రమక్రమంగా నిలిచిపోయినవి.

వరసగా పోతున్న పెళ్లివాళ్లను చూడటానికి ముత్తైదువులంతా వచ్చి వాకిళ్లల్లో నిలవబడ్డారు. బాలవితంతువులు తలుపుల చాటున నక్కిచూస్తున్నారు. కొత్తపెళ్లికూతుళ్లు మేడలమీదినుంచీ మెరుస్తున్నారు. తలంటిపోసుకొన్న శిరోజములు చిక్కుడీసుకుంటూ సుందరమ్మ మేడమెట్లమీద నుంచో నుంది.

వరసగా నిలుచున్న కార్లలో ఒక్కొక్కటీ కదిలింది. మేళం, తాళం మళ్లీ ప్రారంభించినవి. స్వరం విన్న నాగేంద్రులవలె బస్సు

లన్నీ బుస్సుమన్నవి. శ్రీనివాసరావుగారి యింటి కెదురుగా నిలిచిన చివర కారుమాత్రం కదల్లేదు. డ్రైవరుతమ్ముడు దిగి స్టార్టుచేస్తానన్నాడు; అది వొద్దన్నది; అసహ్యించుకొన్నది; తల వూపింది;తంతానన్నది. 'అయ్యగార్లను దింపి, నెట్టనన్నా నెట్టండిరా'అన్నాడు డ్రైవరు. ఆమాట విని పుండరీకం కళ్లజోడు కటెక్కిన పెట్టుకొన్నాడు; తలుపు తెరిచి తొందరగా దిగాడు. భాస్కరం, ప్రకాశరావు అతనివెంటనే దిగి 'మనంగూడ నెడదాం పట్టండి 'అన్నారు. పుండరీకం నవ్వాడు. రుద్రాక్షంచు ఉత్తరీయం చుట్టచుట్టి సీటులో పడవేసివుంటే తీసుకొని భుజాలమీద ఎగుడు దిగుడుగా వేసుకున్నాడు. కాళ్లకు తొడుక్కున్న ఆకుచెప్పులలో ధోవతిఅంచులు చిక్కుకొంటే వొంగి తీసుకుంటూ "మనం నడిచిపోదాం, భాస్కరం"అన్నాడు.

శ్రీనివాసరావుగారు చెంబు పట్టుకొని మేడమీదనుంచి చరచరా దిగివస్తున్నాడు. మెట్లమీద భార్య ని .బడి వుంది; విడిపోయిన వెంట్రుకలు భుజాలమీద గుత్తులుగట్టి నల్లత్రాచుల్లాగా వేలాడుతున్నవి; ఎడమచేయి మెట్లకటకటాలమీద ఆనుకొని, అరచేతిలో చెక్కిలి వొత్తి అనిమిషనేత్రాలతో చూస్తున్నది; చేతిలోని దవ్వోన మెట్లమీద జారి పడిపోయింది; కుడిచేతి వేళ్లు కటకటాల అంచులమీద మెల్లగా ఆడుతున్నవి, వీణ తంత్రులు మీటుతున్నవి;

'కమలాకుచకలశీభర
విపులీకృత పులకం'

అనే పల్లవి తమలో తామే ఆలాపిస్తున్నవి. "ఇంత పెందలాడే లేచావు. మేళం వినేటప్పటికి మెలకువ వచ్చిందా యేమిటి?" అంటూ శ్రీనివాసరావుగారు మెట్లు దిగిపోతూవున్నాడు. సుందరమ్మ మాటలాడలేదు. ఆమాటలు ఆమెకు వినబడలేదు.

"అబ్బా! పసిపిల్లలాగా పెళ్లిమేళమంటే ఎంతకులాసా నీకు?"అని ఆయన ఆగి చూస్తున్నాడు.

"పసిపిల్లను కాదా యేమిటి?"అని సహజంగా అని ఊరుకున్నది. కాని యేమన్నదో ఆమెకే తెలియలేదు. అంతచనువుగా అన్నమాటతో కలిసి ఆమెమొగముమీద ఒక్క చిఱునవ్వు వస్తేనా! శ్రీనివాసరావుగారికి ముద్దువచ్చినది. "ఎంతచక్కగా మాటలాడుతావే, నీవు!"అన్నాడాయన, చూపులనిండా ఆనందరసం ఒలుకుతూ.

ఈఉషస్సులో, బాలసూర్యకుసుమము చిమ్ముతున్న బంగారుపుప్పొడిలో, మనోమోహనములగు మంగళవాద్యములముందు, స్వర్గసోపానసన్నిభమై యుండవలసిన యీ మేడమెట్టుమీద, ఈదంపతులవద్ద రసాభాస వర్ణింపవలసివచ్చింది. అంతసంతోషపడిన పెనిమిటికి ప్రత్యుత్తరముగా ఒక్క చల్లనిచూపైనా సుందరమ్మ చూడగలిగింది కాదు. ఆమె తల, మొగము, కండ్లు, మనసు, ప్రాణము—

అన్నీ ఆకార్లసందడిలోనే, ఆ ఆగిపోయిన చిన్నకారుమీదే లీనమై వున్నవి. పంతులు గారు కొంచెమునే పట్లాగే చూచి చూచి, ఆగిపోయినకారువంకా, ఆమెవంకా చూచి, మళ్లీ చూచి బెదిరిపోయినాడు; వెంటనే చెంబు తీసుకొని చరచరా దిగిపోయినాడు.

రోడ్డుమీద సంగతి చూడండి: చుట్టా లంతా ముందు సాగిపోయినారు. వెనకబడితే విడిదిలో ఉప్మా, కాఫీ దొరక్కుండా పోతయి. గంటసేపు నెట్టినా కారుచప్పుడయ్యేట్టు లేదు. దాన్ని బాగుచేసుకుంటూ డ్రైవరు చెమటలు కారుస్తున్నాడు. ప్రకాశరావు 'రావోయ్' అంటూ పుండరీకంచొక్కా పట్టుకు లాగాడు.

"నడిచిపోతే చుట్టాలంతా నవ్వరు టోయ్?"

"అట్టయితే ఇటు కాఫీహోటలుకు పోదాం పద!" అన్నాడు ప్రకాశరావు.

"ఎంత అభిమానం! పరిగెత్తుకు పోయి ఆవెనకకారులో ఎక్కుదాం పద" అని భాస్కరం అన్నాడు. పుండరీకం మొగం చిట్లిస్తూ, "అబ్బే, ఆడవాళ్లబండిలోనా?" అని మళ్లీ నవ్వాడు.

భాస్కరానికి పొట్ట బగల నవ్వు వచ్చింది. "ఆడవాళ్లంటే అట్లా బెదిరిపోతా వేమిటోయ్ నువ్వు! ఆకూచున్న అన్నయ్యా వాళ్లంతా మొగవాళ్లు కారూ? చదువుకునే కుఱ్ఱాడివి యింకా......"

భాస్కరాన్ని ఇక మాట్లాడనీయకుండా భుజము పట్టుకొని నెట్టాడు, పుండరీకం. అందఱూ నవ్వుకుంటూ వెనక్కి తిరిగిపోతున్నారు. పుండరీకంగొంతులో ఎప్పుడూ ఒకరాగం ఆడుకుంటూ వుంటుంది. అతని పెదవులమీద ఒకపాట పరిగెత్తుతూ వుంటుంది. ఇతరులు అతణ్ణి ఎగతాళిచేస్తుంటారు. అతడు తల వంచుకొనిపోతూవుంటాడు. ఉత్తరీయంచెఱగులు మాటిమాటికీ జారిపోతున్నవి. అవి మళ్లీ సర్దుకుంటున్నాడు.

ఒక్కొక్క ముత్తైదువా వొంగి గడపలో ముగ్గులు వేస్తున్నది. కొందఱు ఆడవారు తలుపులు వేసి లోపలికి పోయినారు. పిల్లకాయలు పెండ్లివారివెంట పడ్డారు. సుందరమ్మ చూస్తూనే నిలుచుంది. ఆమెమనస్సు చెదరలేదు. కాలు కదలలేదు. కారు ఆగిపోయిన చోటనే ఆమెదృష్టి సుస్థిరమై వుంది. అక్కడ మాత్రం ఇప్పు డేపదార్థమూ లేదు. కారూ లేదు, మనుష్యులూ లేరు. కాని ఆమె అక్కడే చూస్తూవున్నది. అయిదునిమిషాలక్రింద ఆమె మనస్సు అక్కడ వ్రాలి ఒకమూర్తిని సృష్టించింది. ఆమూర్తి అక్కడనే వుంది, ఆగాలిలోనే, ఆరోడ్డుమీదనే, ఆకారు నిలిచిన చోటనే—సన్నగా, ఊగుతూ, నవ్వుతూ......

౨

వీరయ్యగారి పెళ్లిపందిట్లో వెయ్యి మందిజనం ఉన్నారు. ఒక్కరోజుపెళ్లి కాబట్టి ఊళ్లో పెద్దలంతా ఆవేళే వచ్చారు. పెళ్లికూ

తుర్ని మేనమామ తీసికొనివచ్చి పీటమీద కూర్చోబెట్టాడు. ఆమె వెంటనే సుశీలా, సుందరమ్మామాత్రం అలంకారాలతో వచ్చి వెనక నుంచున్నారు. వచ్చే పేరంటాల నందరినీ వారు సత్కరించవలసివుంది.

పీటలకు ఎదురుగా పెళ్లికూతురుతండ్రీ, అన్నలూ కూర్చున్నారు. వారిపక్కనే భాస్కరం, పుండరీకం తములపాకులూ, అత్తరూ మొదలైనవి పెట్టిన పళ్లెమొకటి ముందు పెట్టుకొని చిల్లరడబ్బులసంచీ వొకటి పట్టుకొని కూచున్నారు. పెళ్లిమంత్రాలు సాగుతున్నా వీళ్లకబుర్లేమిటో వీళ్లు చెప్పుకుంటున్నారు గాని వెనక్కి తిరిగి చూడలేదు. కాసేపటికల్లా పెండ్లికొడుకుకు కట్నం వెండిపళ్లెంలో పెట్టి పదివందరూపాయినోట్లు ఇచ్చారు. అతడు పురోహితుడిచేతి కియ్యగా ఆయన పెండ్లికొడుకు తండ్రి పేరరాజుగారి కిచ్చాడు. పచ్చపచ్చని ఆపదికాగితాలలో ఎంతవిలువ ఉన్నది? ఆ పెళ్లికూతురుతండ్రి యెన్నాళ్లు అష్టకష్టాలూ పడి అవి సంపాదించాడోకదా! అందరికళ్లూ వాటిమీదే వున్నవి. పేరరాజుగారు నాలుగుసార్లు వాటిని లెక్కపెట్టుకున్నాడు. కొడుకును కన్నందుకు కృతార్థుడి నైనానుగదా అనుకున్నాడు. వేయిరూపాయలు! కొడుకుకు మెట్రిక్యులేషన్ చెప్పించిన ఖర్చుకు రెట్టింపు వచ్చిం దనుకున్నాడు. మళ్లీ బొత్తిని ఒక్కసారి లెక్కపెట్టి, పక్కన వున్న పుండరీకంను పిలిచి, "అబ్బాయీ! ఒకసారి చూడు—బావగారు కౌంటర్ ఫీ ల్లేమన్నా...!" అంటూ నవ్వాడు.

పుండరీకంకూడా సహజమైన చిఱునవ్వు నవ్వుతూ, లెక్కపెట్టి "మంచివేలే, బాబూ! దుంపతెంచక—" అన్నాడు.

సుందరమ్మకళ్లు చెదిరినవి; చెక్కులు పండినవి. అది రోడ్డు కాదు. కారు ఆగిపోయిన చోటు కాదు. అయినను ఆమెదృష్టి నిశ్చలమైపోయినది.

పేరరాజు చేయి చాచి 'ఇటు తె' మ్మన్నాడు. పుండరీకం నవ్వుతూ, 'బాబూ! డబ్బు ముందర పెట్టెలో వేసుకుంటా వేం? అమ్మాయికి రెట్టింపుసొమ్ము అందియ్యాలి, తెలుసునా?' అన్నాడు. 'నీమొగంలే, ఇటు తేవోయ్! మాఅమ్మాయికి సొమ్మేమిటి?' అంటూ ఆయన పుండరీకంకండువా పట్టుకొని లాగాడు. నాగవల్లి వేళ అయింది. అందఱూ లేవబోతున్నారు. ఉత్తరీయం రెండుబుజాల మీదా విసురుకుంటూ 'అజ గగనమే జయగీతాలీ' అనుకుంటున్నాడు పుండరీకం.

సుందరమ్మ కన్నులు మూసుకొన్నది; తెరిచి చూచింది. అది పందిరి; అడ్డమైన జనమూ ఉన్నారు. చరచరా లోపలికి పోయింది.

"సుందరమ్మ పాటలు పాడకుండానే పోతున్నది—" అన్నది సుశీల. ఆమె తిరిగి చూడలేదు. అయినా బాగుండదని, 'హారతిపళ్లెం సరిగా వెయ్యరని అలిగిపోతుందా యేమిటమ్మా' అన్నది సుశీల. సుందరమ్మ అదృశ్యయింది.

## 3

'సుందరీ'—

శ్రీనివాసరావుగారు క్రొత్తగా ప్రాక్టీసు పెట్టారు. అంతభాగ్యవంతుడికి కొంచెము ఆలస్యంగా పెండ్లి కావడం చూడడానికి ఆశ్చర్యకరంగానే ఉంటుంది. ఇరవైయారేండ్లకు సుందరమ్మను వివాహమాడాడు. మరుసటి యేడే ఆమె కాపరానికి వచ్చివున్నది. తను ఆమెను ప్రేమిస్తున్నా ననుకుంటాడు. ఆమెకు తనే ప్రాణమని నమ్మాడు. ఆమె సహజంగా తనతో మాట్లాడడానికి సాహసింపదు; సిగ్గు. అప్పుడప్పుడు ఏదో ఒకమాట అంటే ముద్దు వస్తుంటుంది.

ఇప్పుడు, ముప్పైయేండ్ల పొట్టి భారీ మనిషి; మొగముమీద స్ఫోటకపుమచ్చలున్నవి. గొడుగు వేసుకొని కోర్టునుంచి అప్పుడే వచ్చాడు. బైసికి లున్నది గాని మూడుపూట్లా అది తొక్కలేక యింట్లోనే ఉంచి పోతాడు. గబాగబా మేడపైకి పోయి పిలిచాడు. భార్య పలికినట్లు లేదు. జేబురుమాలుతో మొగముమీది ముత్యాలు పాడుజేసుకుంటూ మళ్లీ పిలిచాడు:

'సుందరీ'—

సుందరమ్మ కిటికీదగ్గర కూర్చుండి వీథి వంక చూస్తూవుంది. భర్తమాట ఆమెకు వినబడింది గాని పలకటానికి సత్తువ లేదు. ఆమె గొంతులో యేదో ఉండగట్టి గిరగిర తిరిగింది. ఆకిటికీలోనుంచి రోడ్డుమీదికి, ఆచోటికే, చూస్తూవున్నది. కాని అక్కడ ఏమీ లేదు. ఏమైనా వున్నా, ఆమెకు కనబడటానికి వీలు లేదు. ఆమెదృష్టికి పలుచని నీటితెర వొకటి అడ్డపడి వున్నది.

శ్రీనివాసరావు పైగుడ్డ మంచముమీద పారవేసి, మెల్లగా పోయి భార్యభుజముల పైన చేతులు వేశాడు; హాయి అనుకొన్నాడు. పన్నీటిలో తడిసిన బంగారుబొమ్మవలె ఉన్నది సుందరి. రోగివలె మెల్లగా ఆమె వెనుకకు తిరిగి చూచింది. ఆకంటిపొరలవెనుక, విషాదచ్ఛన్నమైన మూర్తి ఒకటి, ఆమె మనస్సు సృష్టించుకొన్న మూర్తి ఒకటి, నాట్యముచేస్తున్నది. 'ఉత్తరీయ మేదీ?' అని అకస్మాత్తుగా అన్న దామె. అతడు బిత్తరపోయి 'ఇదేమే, ఇట్లా వున్నావు? నే నెవరిని?' అన్నాడు.

ఆమెకు ఏడుపు వచ్చింది; వీథివైపుకు చూడగా ఆగిపోయింది; భర్తవైపు మళ్లీ చూడగా మళ్లీ వొచ్చింది. సిగ్గుపడి చివాలున లేచిపోతున్నది.

'ఇవ్వాళ టీ లేదా?'

సుందరమ్మ మాట్లాడకుండా దిగిపోయింది.

అసలే అతని కనుమానము. ఈపది రోజులబట్టీ యీవిచిత్ర మేమిటి? అనాడు— ఇవ్వాళ—ఈప్రవర్తన యేమిటి?

తనభార్యకు సొమ్ములు పెట్టినది తాను; అన్నము పెట్టుచున్నది తాను; పైగా, ఆమెను

పెళ్లిచేసుకున్నది తాను. ఆమె తనతో ఎందుకు మాట్లాడదు?

తనకు అందమున్నది; ఆస్తి వున్నది; వయస్సున్నది; హృదయమున్నది—తనతో సుందరి మాట్లాడ దెందుకు సరిగ్గా?

ఆమె తాను చెప్పిన పనియెల్లా చేస్తుంది; తను ఏది కావలె నంటే అది యిస్తుంది; తనకు లోబడి వుంటుంది—మఱి మాట్లాడ దెందుకు?

అతడు కిటికీలోనించీ చూశాడు. పేరాజుగారి యిల్లు బాగా కనబడుతున్నది. తులిశమ్మ బయట అంట్లు తోముతున్నది. బాబురావు బఱ్ఱెదూడకు మేత వేస్తున్నాడు. పక్కగదిలో అద్దెకు వున్న కుఱ్ఱవా డెవరో పడకకుర్చీలో కూర్చుని చదువుకుంటున్నాడు. అతణ్ణి యెక్కడనో చూచినట్టుంది. ఎక్కడబ్బా!

ఇంతలోనే టీ తీసుకొని సుందరి వచ్చింది. భర్తముందు అది పెట్టి తల వంచుకొని నిలబడ్డది. ఆలోచనలో మునిగివున్న అత డది ముట్టుకోకుండానే, 'సుందరీ! పేరాజుగారి గదిలో అద్దె కున్నవా రెవ్వరే' అని యోదాలాబంగా అడిగాడు.

ఆమె ఉలికిపడ్డది. నిలువున వొణికింది. తల మరింత వొంచుకొని, 'నా కేం తెలుసు?' అంటూ పోబోయింది.

'నీవు సాధారణంగా పోతూవుంటావుగా?'

ఆమె యిక నిలువలేక, తొందరగా దిగిపోతూ, 'నా కివ్వాళ తలనొప్పిగా వుంది' అని గొణుగుకొన్నది.

౪

పొద్దు గూకింది. పేరాజుగారి ప్రహరీ ముందు వచ్చి నిలుచున్నారు శ్రీనివాసరావుగారు. ఆకుఱ్ఱవాడు ఇంకా చదువుకుంటూనే వున్నాడు. పడకకుర్చీకి అంటుకు పోయింది అతని దేహం. ఒంటిమీద రుద్రాక్షంచు ఉత్తరీయం ఎగుడుదిగుడుగా పడి వేలాడుతున్నది.

'అబ్బాయీ!'

'ఎవరండీ?'

'పంతులుగా రున్నారమ్మా?'

'నాకు తెలియదు. పక్కన కనుక్కోండి.'

'ఓహో! మీరు బాడుగకు ఉంటున్నారా? ఏమిస్తావు నాయనా, ఈగదికి?'

'కూర్చోండి. మూడురూపాయలు.'

'చదువుకుంటున్నావా?'

'బి. ఏ.'

'నీపేరు?'

'పుండరీకాక్షుడు అంటారు.'

శ్రీనివాసరావు నిదానించి చూచాడు. అతని కళ్లలో ఆగ్రహం, ఈర్ష్య, భయం అవతార మెత్తివున్నవి. పుండరీకాని కేమీ అర్థం కాలేదు. 'నాతోటి యేమన్నా పని వుందా అండీ?' అన్నాడు.

'లేదు' అంటూ ఆయన వెనక్కి తిరిగి తమమేడమీాదకి చూస్తూ తిరిగిపోయినాడు. ఆకిటికీవద్ద సుందరిసుందరనయనద్వయము మెరుస్తున్నది. కాని అందులో సంపూర్ణమైన మానవలోకవిశాలదృష్టి లేదు. అవి ఒకటే లక్ష్యముమీాద నిలిచివున్నవి. భర్త ఆమెకు కనబడనే లేదు.

పుండరీకం పుస్తకం మూసి, ఉత్తరీయం పైన కప్పుకొని, కళ్లజోడు తుడిచిపెట్టుకొని, గదికి తాళంవేసి, షికారుకు బయలుదేరాడు; తలకాయి వంచుకొని కూనరాగం తీసుకుంటూ శ్రీనివాసరావుగారి యింటిముందఅగా నడిచిపోతున్నాడు.

శ్రీనివాసరావు కాళ్లజోడు చప్పుడు చేసుకుంటూ మెట్లమీాద నడుస్తున్నాడు. పైనుంచి, తలుపు లన్నీ తెరిచివేసి, దుఃఖపూరిత నయనాలతో వీథివంకకే చూస్తూ సుందరి పరుగెత్తుకొని వస్తున్నది. అతని తలపైన పిడుగు పడింది. ఆశ్చర్యంతో "ఎక్కడికే సుందరీ ?" అని అడిగాడు.

ఆమె కేమీా అర్థముకాలేదు. ఈలోకములో లేదు. తనమనసులో మూర్తి, కన్నులలో మూర్తి కలిసి ఒకటైనవి. తల వంచుకొని లోపలికి పోయింది.

శ్రీనివాసరావు మఱి భోజనము చేయలేదు. సైకిలు వేసుకొని బయలుదేరాడు. విసుగు పుట్టిందాకా తిరిగాడు. ఇంటికి వచ్చి తల పట్టుకొని కూర్చున్నాడు. మంచముమీాద పడి అటూ యిటూ పొర్లాడు. ఎంతసేపటికీ మనస్సు కుదరలేదు.

అర్ధరాత్రివేళకు లేచి తనభార్యకోసం చూశాడు. ఆమె పక్కమీాద లేదు. కిటికీ దగ్గర కూర్చునివున్నది. ఆశ్చర్యపడ్డాడు. ఆలోచించకుండా మేడ దిగి పేరాజుగారి యింటి వద్దకు పరిగెత్తాడు.

"అబ్బాయీ! పుండరీకం!"

రెండుమూాడు పిలుపులకు గాని అతడు లేవలేదు. పొద్దుపోయిందాకా చదువుకున్నాడు కాబోలు. తెల్లవారితే సెలెక్షన్సు ప్రారంభం. మూాడున్నరకు అలారం పెట్టి పడుకున్నాడు. అర్ధరాత్రప్పుడు ఎవరు వచ్చి పిలుస్తారు? తలుపు తీసి చూస్తే సాయంకాలం వచ్చిన పెద్ద మనిషి ప్రత్యక్షం!

'ఏమిటండీ ?'

'నువు కవిత్వం రాస్తావుట గదూ ?'

'ఎందుకు?'

'నీకు దేవు డెప్పుడన్నా కనపడ్డాడా ?'

'మీా రెందుకు వచ్చారో చెప్పండి?'

'నీకు దేవుణ్ణి చూపించడానికి—'

'ముందు నీసంగతి చెప్పవయ్యా, దేవుడా!'

పుండరీకానికి భయం పుట్టింది. శ్రీనివాసరావు చేతులో పిస్తోలు తీసి పట్టుకున్నాడు.

'దుర్మార్గుడా! నీవు నాసుందరిని వదలిపెట్టు—'

'ఎవరు సుందరి?—ఇదేమిటో నా కర్థం కావడం లేదు.'

మఱుక్షణంలో శ్రీనివాసరావుచేతులో ఉన్న పిస్తోలు ఢామ్మని మ్రోగింది. పొగ తగ్గిందాక అతడు బైటపడి, యింటివద్దకు పరిగెత్తాడు. మేడమీదికి చూశాడు. సుందరి కళ్లు రెండూ, ఆకిటికీలోనుంచి దూరానికి చూస్తూ, చీకటిలోకూడా మెరిసిపోతున్నవి. ఆకంటిపొరలలో లోతుగా ఒకమూర్తి ప్రకాశిస్తుంది—సన్నగా, పొడుగ్గా, ఉత్తరీయంతో కళ్లజోడుతో........

---

## అస్పృశ్యత కర్థము గలదా ?



# 'మిస్ రైలా'

గొల్లపూడి జోగారావుగారు [illegible]

## ౧

నాటిరాత్రి యెనిమిదిగంటలకు రాజమండ్రీ స్టేషను వదిలేను. ఒంటరిగా ఉండొచ్చుననీ, పెద్దవాళ్లు ఎక్కబండనీ రైలు కదలుతుందనగా వెళ్లి ఒకమూల కూర్చున్నాను. ఎక్కడికెళ్లినా యీదీను రాలి జీవన మొక్కలాగే వుంది. నన్నిట్టిబాముల గుడి పించుచున్న విధిని దూరేను. మాతృదేవి మంగళా కారమును దృష్టిపథమున గుర్తించుకొని వెక్కివెక్కి యేడ్చే నొక్కగడియ. నాతండ్రి మనోహరమూర్తి చిత్రించుకొని దుఃఖించేను. ఈవిశాలప్రపంచములో న న్నొక అనాథను గావించిన భర్త నొకసారి స్మరించు కున్నాను. నన్నింతవరకు పెంచిన మేనమామకు మనసులోనే వందన మొనరించేను. ఈర్ష్యావేశురాలై ...గర్వాంధురాలై...నన్నిట్టి నీచురాలిని గావించిన దాజేశ్వరినిర్దయకు చింతించేను. ఆమె అధికారగర్వమున కంతరాయము కలుగకపోవునా ? దిక్కులేనిదానని తెలిసియు నన్ను బారదోలిన దోస మామెకు దగులక పోవునా ?...అని మనసులో సంతుష్టి పొందేను. ఆమె భర్తకు చెల్లిలికూతుర్ని. అట్టి న న్నామె యేరీతి హింసించినదో గ్రహించి విలపించేను. 'దాసీ దానిగా వుంటా ......నాకు దిక్కు లేదు. నన్ను తరిమీకు......' అనిన నా దీనవచనములు పెడచెవిని పెట్టిన ఆమెకాఠిన్యమునకు ఆశ్చర్యపోయేను. 'తండ్రీ! న న్నింతదాని జేసి నాకు వివాహం చేసావు. ఇప్పుడు నన్ను వదిలిస్తావా ?' అని మేనమామదగ్గర రోదన మొనరిస్తూంటే, 'నాయింటివద్ద యేడవకు... అవతలకి పో' యను ఆమెఅధికారగర్వమునకు తెల్ల బోయేను. భర్తవంకవాళ్లు భాగ్యవంతులై నా యిల్లాంటి దీనస్థితిలో పనికొచ్చేరు కారు గదా అను కున్నాను. నాజననిస్నేహితురాలు అన్నపూర్ణ ఆదర భావమున కలరుతూంటే నాదురదృష్ట మామెయేకపుత్రీ మృత్యు వెట్లయిందో తలచి నామందభాగ్యము నకు నిందించుకున్నాను. పుట్టి పెరిగిన రాజమండ్రీలోనే కష్టదశయందు జీవనోపాయము లేకపోయింది కదా అని విస్మయ మందేను. నాలాంటి నిర్భాగ్యలు–అనాథలు– నికృతలై యెంద రీవిశాలప్రపంచమున రోదన మొనర్చు చుండిరో యని వెక్కివెక్కి యేడ్చా, మరొక్కమారు. రైలు రొజుకొనుచూ పోతూంది. ఎంతదూరం పోయిం దో, యెక్కడెక్క డాగిందో నేను చూడనే లేదు... అల్లా నాఆలోచనలు పోయాయి. తుదకు ఒకస్టేష నులో ఎవరో నే నున్న పెట్టి తోసి లోపల ప్రవేశిం చారు. నన్ను చూడ్డంతోటే ఆయన దిగిపోబోయారు కాని రైలు కదలింది. ఆపురుషు డల్లా కూర్చోవాలి సొచ్చింది. నావికృతాకారం వింతగా తట్టుండొచ్చు. ఒక్కగడియ నిదానంగా చూచే డాతడు.

'మీది రాజమండ్రీ కామా ?' అని ప్రశ్నించే డాయన. ఇంతసిగ్గు విడిచీ జీవనం చేస్తూన్నా పరపురుషు డల్లా ప్రశ్నించడంతోటే నాముఖాన్ని విపరీతపు సిగ్గు దొంతరలు అవనతక్రియలో దాచేశాయి. నీరవమైన కెంపెదవులు చలించిపోయేయి.

అతడు మళ్లీ ప్రశ్నించేడు.

'సత్యనారాయణగారు మీ మేనమామ గారూ ?'

అవునని జవాబు చెప్పే గాబోలు.

అతడు నాకేసి తిరి గిచూడలేదు.

బండి ఆగింది మళ్లా. ఆపెట్టెను విడిచి దిగి వెళ్లి పోయా డాయన. నావిపరీతపు సిగ్గును చూచే అత డల్లా వెళ్లిపోయుంటాడని గ్రహించేను. అట్టి సత్పురు షులు—సాధుశీలురు ఒకరిద్ద రున్నారని ఆనందించేను. బేసిన్‌బ్రిడ్జిస్టేషనువరకు అల్లాగే కూర్చున్నాను. ఎవరో సూటు వేసుకొని దొరటోపి చంకను పెట్టుకొని ఒకాయన బండీ యెక్క రక్కడ. టికెట్టు నాదగ్గర

లేదని తెల్సుకుని అతడు పెదవులు బిగించేడు. అతని వికృతాకారమునకు ఒడలు జలదరించింది. ఈరీతిగా సంభాషణ జరిగింది మాకు—.

అతడు—ఎవరు నువ్వు? టిక్కెట్టు లేకుండా యెందు కెక్కావు?

నేను—నే నొకదీనురాలిని...చెన్నపట్నంలో నాజీవనోపాధిని సంపాదించుకొనుటకై యిల్లా వచ్చేను.

అతడు—టిక్కెట్టుసొమ్ము లేకపోయిన బండి దిగు.

నేను—తండ్రీ! నేను అభాగ్యను. నన్ను వదలీ.

అతడు—దిగు... లేకున్న బలాత్కారముగా పైకి తోసేస్తా.

ఆకఠినహృదయుని మరలింపజాలనని తెలుసుకున్నాను.ఆతని క్రోరచూపులకు ఒళ్లు వణికింది. నెమ్మదిగా బండి దిగిపోయాను.

'పద — స్టేషనులోకి.'

నే నాతని నిర్దాక్షిణ్యమునకు తెల్లబోయి చూస్తున్నాను. నన్ను బండిలో ప్రశ్నించిన పురుషుడే తెంచి,

'ఎందు కామె నిట్లు బాధిస్తున్నావు?' అని ప్రశ్నించే డతణ్ణి యింగ్లీషులో.

'టిక్కెట్టు అడుగుతున్నా' (ఇంగ్లీషులోనే).

పురుషుడు మాట్లాడకుండా జేబులోంచి టిక్కెట్టు తీసి యిచ్చేడు. జరగిన సమాచారము గనుచూ స్తంభించిపోయాను. ఆవింతపురుషు డెవరగని యోచించేను ఆతని మొగముకేసి తెల్లబోయి చూస్తున్నాను.

'లీలావతీ, బండిలోకి పోయి కూర్చో. పనిమీద వెళుతూన్నా. మళ్లా నిన్ను కలుసు కుంటాను.'

మాట్లాడకుండా వెళ్లి పెట్టిలో కూర్చున్నాను. 'అతనికి నీపే రెల్లా తెలిసింది' అని మనసు నన్ను ప్రశ్నించింది. అత డెవరు? అతని నామమేనియు తెలిసికొననందులకు నాలో దూషించుకున్నాను. అత డేదేనా దురుద్దేశముతో యిల్లా జేస్తూన్నాడేమో అని భీతిల్లేను. ఇట్టి దీనజీవనము చేయుటకన్న మరణించుట మేలని భావించుకొని దుఃఖించేను.

౨

అల్లా యెంతసే పున్నానో స్టేషనుదగ్గర. అత డెప్పటికీ రాలేదు. ఆమద్రాస్ మహాపట్టణంలో ఎక్కడి కెళ్లడం? ఈదీనురాలిని చూచేవా రెవరున్నారు? వెళ్లాల్సిన స్థలము మనోగతం కాకపోవుటచేత కాళ్లు వెనక్కి లాగేయి. అయితే ఆరుబయల్నుండి యాపతిత చేసే దేముంది కనుక! ఆచలిగాలిలో వణుకుతూ—కళ్లవెంబడి నీళ్లు కారుస్తూ బయలుదేరేను, ఎచటికో. ఆపట్నంలోని ధ్వనులు మెల్లగా అంతరిస్తున్నాయి అప్పుడే. ఒకవిశాలమైన భవనందగ్గర కొచ్చాను. లోపల దీపాలతో కాంతిమంతమై ఉంది. గేటుమీద చెయ్యానుకుని శూన్యదృష్టులతో చూస్తూ నించున్నాను. ఈఅభాజనురాలి శల్యపంజరమును దాచుకొనుట కింత వసతి ఉంటుందని ఆశ జనించింది. ఈదిక్కుమాలిన దీనురాలిపై జాలి వహించకపోతారా యని ధైర్యం కలిగింది. గేటు తెరచి మెల్లగా అడుగులేసుకుంటూ లోపల ప్రవేశించాను. నాహృదయంలోని ఆకొంతఆసను ఎగరవైచుకు పోదామని సమీరణుడు కూడ నాసుకుమారశరీరాన్ని మరింత వేధిస్తున్నాడు.

'ఎవరు ?......' అని గంభీరనాదం వినబడ్డాది.

'నాయనా, నే నొక అనాథను. ఈరాత్రికి తల దాచుకొనుట కింత తావు లేదా?' అని జాలితో అడిగేను.

'దొరలు నివసించు బంగళా. ఇక్కడనుండి వెంటనే వెళ్లిపో......'

నా ఆశలన్నీ నిరాశ లయేయి. నాహృదయకేదారమున మొలకలెత్తిన ఆశలన్నీ ఆ గభీరఝంఝూనిలంలో పటాపంచ లయిపోయేయి.

'బాబా, దొరలైన నేమి?...ఒకమూల పరుండి ఉదయాన్నే పోతా!—' అన్నాను.

'ఏమి నీమూర్ఖత్వము! ఇచట పనికిరాదు. మరోదగ్గరకు పో.'

'నాయనా, నాకీ ఊరు క్రొత్త. ఈచలిలోనే చనిపోవనున్నాను' అని రోదన మొనరించేను.

'అవతలికి గెంటివేయవలెనా?' అని జవాబు వచ్చింది. అతని మూర్ఖత్వమునకు ఆశ్చర్యపోయాను. నానిర్భాగ్యత్వమునకు చింతించేను. దుఃఖము అతిశయించింది. వెక్కి వెక్కి యేడ్చాను. ఏడ్చి లాభ మేముంది గనక. మరల బయలుదేరా, ప్రపంచంలోకి. ఆకలి ఒకమూల దహించివేస్తూంది. రాజమండ్రీలో ఆవేళ మధ్యాహ్నము తిన్నా, ఆఖరుసారి. ఆనాటి దృశ్యము చిత్రించుకోనడంతోటే హృదయము ద్రవీభూతమైంది. అమాయకురాలైన విమలమరణమునకు కారకురాలిని గదా అని నాలో దూషించుకున్నాను. ఆమెను అరుగుపై ఒంటరిగ విడిచిపోయిన మహాపాపిని గదా అని వలవల యేడ్చాను. ఏకపుత్రీ వియోగమునకై అన్నపూర్ణ యెల్లా విలపిస్తూందో అని నీరవనై పోయా. ఏమైతే యేం లాభం? అరుగుపైనుండి పడి చనిపోయిన విమల బ్రతికిరాదు. కరుణాస్వరూపురాలగు అన్నపూర్ణ వికలమైన హృదయం సరికాదు......నిర్భాగ్యురాలగు ఈపాపి కెల్లా శాంతి కలుగుతుంది? అడుగులు తడబడుతూండగానే నడిచా. ఎంతదూరం నడిచానో— ఎంతసేపు నడిచానో: మళ్లా ఒక భవనమును దాగేను. క్రిందటిదానిమల్లే యిది నిశ్శబ్దంగా వుండలేదు. దాని యొక్క స్థితిగతులుబట్టి ఒకహోటలై వుంటుందని భావించుకున్నా. మెల్లగా నడిచి గేటువరకు వెళ్లాను.

'ఎవరమ్మా మీరు? ఇక్కడ బసచేస్తారా?' అని జాలి ఉట్టిపడేలా అడిగే డొకాయన, అరవంతో.

(తర్వాత తెలిసింది అత డాహోటలు యజమానని.)

'నే నొక అనాథను. నాదగ్గర తగినధన మేమీ లేదు. నన్నీరాత్రిచట తల దాచికొననీయండి' అన్నాను.

నే చెప్పిన దాతనికి బోధపడనట్టు చూచేడు. బోధపడీ అల్లా నటిస్తున్నాడో. అతనితో మాటాడుచుండిన పురుషు డొకడు–నేచెప్పిన దాతనికి అరవంతో తెలియచేసేడు. ముఖంలోని భావప్రకటనబట్టి అతడు నావిన్నపమును నిరాకరించినట్టు తెలిసికున్నాను. నా దురదృష్టమున కొకసారి విచారించాను.

'నాయనా, నాకెవ్వరూ దిక్కులేరు ఈ విశాలప్రపంచములో నే నేకాకిని....కట్ట గుడ్డ నిండుగా లేదు....తినుటకు తిండి లేదు. అట్టి యీదీనురాలిపై మీకు నిర్దయ యెందుకు?......' అని యింకా యేమేమో చెప్పబోతున్నాను. ఆపురుషుడు నావైపు పరికించి చూచేడు. ఆచూపులలో ఏదో అర్థముంది. అట్టి దృష్టిఘాతములకు భయవిహ్వల నయ్యేను. హోటలు యజమానితో యేదో భాషించే డాతడు. తర్వాత నాకేసి తిరిగి,

'అమ్మాయీ! నావెంట రా. నీకు తగిన సదుపాయము చేస్తా' అన్నాడు.

ఆకంఠస్వరములో మధురత్వము లేదు. ఆతని వెంట పోవటం మంచిది కాదేమో అని జంకేను. ఇట్టి పతితను హింసించి అత డేల పాపమున కొడిగట్టుకొనునని ధైర్యము వహించేను. ఆపన్నురాలను, అబలను; అట్టినాయెడ నాతడు వేరువిధముగ నేల చరించునని గర్వించేను. అతనివెంట బయలుదేరా. మేడమీద ఒక గదిలోకి తీసికెళ్లా డాయన. గదిముందు కెళ్లి యేదో వాగించేడు. కొలదికాలములోనే భోజనపదార్థములు పట్టుకొని ఒక డొచ్చాడు.

'ఇచట ఉంచి వెళ్లిపో.'

అట్టిగర్వితుణ్ణి చూచేను. నా శరీరము నాకు లొంగక వణక నారంభించింది.

'అమ్మాయీ!...మంచిబట్ట లిస్తా, అవి విప్పి.'

నా కివే చాలునని చెప్పలేకపోయాను. నాకేవీ అక్కరలేదు, పడుక్కుంటాను అని చెప్పాలనుకున్నాను. నో రెండిపోయింది. అతడు గదితలుపు

వేసాడు. నేను నీరవ నై పోయా. సూటుకేసులోనుండి ఒకచీర దీసి నాదగ్గర కొచ్చాడు. నాఅవయవములు మరి పనిచేశాయి కావు అతడు నాచెయ్యి పట్టు కున్నాడు. నాసౌందర్యమే నా కిట్టికీ డొనగూరుస్తూం దని తెలుసుకున్నాను. నాయీహృదయవైకల్య మునకు కారణము నామనోజ్ఞాకారమే అని గ్రహిం చేను. కెవ్వున నార్చి దూరంగా పోయా. ఎలాగో నాకే తెలీదు. అతని భావములు మారలేదు. నేను స్తంభించిపోయాను.

‘నిన్ను రక్షించేవా రిక్క డెవరూ లేరు. నీ కెందు కీదుఃఖము ?...నిన్ను ఆనందసాగరమున ముం చేస్తా......’ అని యింకా యేమో చెప్పబోతు న్నాడు.

నాభర్త నిశ్చలాకారమును చిత్రించుకున్నాను. ‘బొటబొట’ కళ్లెంబడి నీళ్లు కారిపోయాయి. ఈ దీనురాలి కేల యిన్ని సంకటములు ? హా విధీ! నన్నిలా పరీక్షిస్తున్నావేమి ?

పఢాలున తలుపు విరిగింది. నాకు రైలు దగ్గర కనబడిన పురుషుడు—చేత్తో కర్రను బట్టికొని, ఒక డ్రయివరు లోపలి కొచ్చారు.

అతని నేత్రాలలోంచి అగ్ని కురుస్తోంది.

అతని ముఖమంతా వేడిరక్తంతో కూడుకొనుంది.

‘దుర్మార్గుడా! ఆమె నీసోదరి కాదటరా ?... అట్టి అనాథను బాధింపదలచితివా ?...ధన సమన్వితుడ వైన నీకన్న...పవిత్రహృదయ యగు ఆమె వేయిరెట్లధికము కాదా !......’

అంతవర కావరించిన అంధకార మాతేజో మూర్తివల్ల పటాపంచ లయింది...’నీవు నాపాలిటి దైవమవు....నాదురదృష్టములో నే నదృష్టవంతురాలినే అనుచు మూర్ఛపోయాను.

* * * *

## 3

మధ్యాహ్నసమయానికి దగ్గరగా మళ్లీ తెలివొచ్చింది. నే నొక ఆసుపత్రిలో పరుపుమీద పరుండు న్నాను. తలకి కట్టుకట్టుంది. నాజీర్ణవస్త్రాలెల్లాగో మాయమయేయి. ఈదురదృష్టవంతురాలి కిట్టి సను పాయ మెల్లా సంభవించిందా అని సంకోచించాను. దగ్గ రెవరో వున్నట్టుగా తోచింది. కర్టెను తొలగించి చూచేను. దేనినో నిదానించి చూస్తూన్నా డాతడు. అతని చూపుల్లో బాధ మిళితమై వుంది. ఆచూపుల్నే అనుకరించాను. కాని నా కేమీ అగుపించలేదు. ఆలోచనాపూర్వకంగా నించున్నా డాతడు. అతని సమాధిని చెరపకుండా కొంతసేపు వూరుకున్నాను. కాని నాహృదయాందోళన ఆగలేదు. ఆబాధలో దగ్గొచ్చింది. అతనిసమాధి భిన్నమైంది. అతడు వెనుదిరిగి చూచేడు. నాచేతిని తీసి నాడి పరీక్షించే డాతడు.

‘ఒంట్లో మరేమీ బాధ లేదుకదా ?’

ఇల్లాంటి జాలిపలుకులు మళ్లా మూడుసంవత్సరాలకి విన్నాను.

‘లేదు. నిద్రపోయాను. తిరిగీ మంచిస్థితికి వస్తూన్నా ననుకుంటాను.’

అతడు మందిచ్చి వెళ్లిపోయాడు.

ఆరాత్రే అతడు నాచరిత్ర నంతను విన్నాడు. నే పడిన బాధలన్నీ తెలిసికున్నాడు. ఒక దీర్ఘనిశ్వాసము విడిచే డాయన. రోజూ రెండుపర్యాయములు చూస్తూ వుండేవారు.

ఆవేళ మామూల్గాలుగా ఉదయం ఏడుగంటలకి మేరీ వచ్చింది నాదగ్గరకు. మేరీ తెల్లనిశరీరం...విశాల నేత్రములు... పరుల నాకర్షిస్తాయి. ఆచూపు లాపవిత్ర హృదయప్రేమనైర్మల్యమును చాటుతాయి. రోగులను ఆమె నిర్మలమైన, సుకుమారమైన వేళ్లతో తాకేది. ఆమెకంఠము ముగ్ధవచనాలని వర్షించేది ...ఆమె నిర్మల హృదయ. ఆమె పవిత్రహృదయ. అందుచేతే ఆమె

శాంపిల్సు ఉచితము.

సహజమైన హెయిర్ టానిక్ తో మీ శిరోజములకు అందమును తెచ్చికొనుడు.

# కా మి ని యా నూ నె (రిజిస్టర్డు)



శిరోజములకును, మెదటికిని, యిది చాలా శ్రేష్ఠమైన నూనె. చలువ నొసగు పదార్థము లందు మిళితమై యున్నవి. కామినియానూనె మాడుపట్టును శుభ్రపఱచి, శిరోజ బీజములకు బలము నిచ్చి, వెంట్రుకలను పట్టువలె బాగుగా పెంచును. మంచి పరిమళ మిందు చేర్చబడినది. దీని నుపయోగించిన ప్రకాశవంతమగు శిరోజము లేర్పడును.

నేడే ఒకబుడ్డిని పరీక్షింపుడు. వెల బుడ్డి రు. 1-0-0, 3 బుడ్లు రు. 2-10-0.

వి. పి. ఛార్జీలు ప్రత్యేకము.

పోస్టేజినిమిత్తం ఒకఅణాస్టాంపునుపంపిన శాంపిలును ఉచితముగా బడయగలరు.

పరిమళ రాజు

# ఓ టో దిల్ బ హా ర్ (రిజిస్టర్డు)



OTTO DILBAHAR.

దీనికి సాటియైనది లేదు. దీని పరిమళము యింపుగాను, ఆనందదాయకము గాను యుండును. వాసన బహుకాల ముండును. కొన్ని బొట్లు మీ చేరుమాలుమీద వేసి చూడుడు. మీ చుట్టును అద్భుతమైన పరిమళ మీనుచుండును.

వెల $\frac{1}{4}$ ఔన్సు రు. 1-4-0. 1 డ్రాము సైజు 0-12-0 అణాలు.

వి. పి. ఛార్జీ ప్రత్యేకము.

పోస్టేజినిమిత్తం రెండుఅణాల స్టాంపులను పంపి శాంపిలును ఉచితముగా పొందుడు



ఆసియాలో ప్రధాన సబ్బులు

# కామినియా టాయిలెట్ సబ్బులు

వాడుకలో పోడిమి.

ధరలో పోడిమి.

పరిమళ మానందదాయకము.

రకము అసమానము.

నానావిధ పరిమళములందును దొరకును.

కామినియా ట్రాన్సుపరెంటు గ్లిసరిన్ సబ్బు.

కామినియా లవండరు సబ్బు.

కామినియా చందన సబ్బు.

కామినియా వైట్ రోజ్ సబ్బు.

దిల్ బహార్ సబ్బు.

ఈ సబ్బులు మీకు సంపూర్ణసంతృప్తి నొసగగలవు. 3 బిళ్లలుగలపెట్టె 1-కి 0-15-0. వి. పి. ఛార్జీలు ప్రత్యేకము

మీకు సమీపములోగల దుకాణములో అడగండి లేక మాకు వ్రాయండి.

కొనునపుడు ప్రతిపెట్టెమీదను కామినియా అను పేరుండుట గమనింపుడు.

ఈపేరు స్వచ్ఛతకును, గుణమునకు గ్యారంటీ నిలచును.

సోల్ ఏజెంట్లు:—ఆంగ్లో-ఇండియన్ డ్రగ్ అండు కెమికల్ కంపెనీ,

నెం. 285, జుమ్మామసీదు, తపాలాపెట్టె 2082, బొంబాయి.

శాంపిల్సు ఉచితము.



## కుసుమాల్ హెయిరాయిల్ (రిజిస్టర్డు)

శిరోజములకు, మెదటికి, శాకములతో చేయబడిన సహజమైన నూనె. శిరోజబీజములను కాపాడి, మాడుపట్టును శుభ్రముగాను ఆరోగ్యముగాను ఉంచును. ఇందు చలువనిచ్చు పదార్థములు మిళితమై యుంటచే ఆలోచనాపరుల కద్వితీయముగా పనిచేయును. మంచి పరిమళము గలది.

వెల బుడ్డి 1-కి రు. 1-0-0. 3 బుడ్లు రు. 2-10-0.

వి. పి. ఛార్జీలు ప్రత్యేకము.

ఉచిత శాంపిలుకొరకు ఒకఅణా స్టాంపును పోస్టేజినిమిత్తమై పంపుడు.



## కేటి వైట్ రోజ్ హెయిరాయిల్ నెం. 777 రు (రిజిస్టర్డు)

తాజా గులాబిపుష్పముల పరిమళమంగు ప్రతిబింబించియున్నది. మెదటికి చలువ నిచ్చును. శిరోజములకు మంచి టానిక్. వెల సీసా 1-కి 0-14-0 అణాలు.

వి. పి. చార్జీలు ప్రత్యేకము.

కొనునపుడు నెం. **777** రును గుర్తించి కేటి వైట్ రోజ్ హెయిరాయిలునే కొనుడు.

నమూనాలను అంగీకరింపకుడు.

## కేటి ఓటో రోజ్ నెం. 777 రు (రిజిస్టర్డు)



మంచి తాజా గులాబీపుష్పముల పరిమళము గల యత్తరువు. ఎక్కువకాలము వాసనపోకయుండునట్లు బాగుగా తయారుచేయబడినది. ఒకసారి పరీక్షించిన మీకే తెలియగలదు.

వెల $\frac{1}{4}$ ఔన్సు బుడ్డి రు. 1-0-0. వి. పి. ఛార్జీలు ప్రత్యేకము.

పోస్టేజినిమిత్తం రెండణాల స్టాంపులను పంపి ఉచితశాంపిలును పొందుడు.



## కామినియా స్నో

శరీరమున కుపయోగించుటకు శాస్త్రీయముగా తయారైనది. మొటిమలు, పొక్కులు, మచ్చలు మున్నగువాటిని తొలగించి, ముఖవర్చస్సులో సౌందర్యమైన నవయౌవనమును నెలకొల్పును. చర్మమును మృదువుగాను, ప్రకాశవంతముగాను చేయును. మనోహరమగు పరిమళము కూడినది.

వెల బుడ్డి 0-12-0 అణాలు. వి. పి. ఛార్జీలు ప్రత్యేకము.

సోల్ ఏజంట్లు:—**ఆంగ్లోఇండియన్ డ్రగ్ అండు కెమికల్ కంపెనీ,**

**నెం. 285, జుమ్మామసీదు, తపాలాపెట్టె నెం. 2082. బొంబాయి.**

తేజఃపూరితమై వుంది. ఆతేజస్సు ఆమెనేత్రాలలో నిండుకొని వుంది; ఆమె పెదవులపై దీపిస్తూంది.

అట్టి మేరీకి నాకూ పరిచయం కలుగజేసిన దేవుణ్ణి కీర్తించాను. ఆమెకు నాయెడ నుండే ప్రేమకు... ఆదరణభావమునకు సంతసించేను. ఈప్రపంచంలో ఇల్లా ఒకరికి ప్రేమార్హురాల నయ్యేకదా అని ఉప్పొంగేను. ఈనాలుగురోజుల పరిచయములో మేరీకి నాయెడ కలిగిన గాఢమైన ప్రేమకు గర్వించేను.

మేరీకి నాకూ ఇల్లా సంభాషణ జరిగింది—

మేరీ—డాక్టరుగా రొచ్చి చూసేరా?

నేను—ఊఁ.

మేరీ—ఏమంటున్నారు?

నేను—మేరీ చాల కష్టపడిం దన్నారు.

మేరీ—టానిక్కు పుచ్చుకున్నావా?

నేను—ఇప్పుడే తీసుకున్నాను.

మేరీ నాదగ్గర కొచ్చి తలగాయం పరీక్షించింది. ఆమె సుకుమారమైన వేళ్లు నాజుత్తును సరిచేస్తున్నాయి. ఆమెవిశాలనేత్రాలలోకి చూచేను. నాజాలిచూపులలోని రక్తిమ కనిపెట్టిం దామె.

'లీలావతీ! నీ వెన్నో బాధల కోర్చేవు. డాక్టరుగారి వల్ల నీచరిత్రంతా విన్నాను. ఆనందరావు, డాక్టరుగారు చదువుకున్నారు. నీభర్తను చూస్తే అతని కెంతో ప్రేమ. ఆనందరావు హాస్పిటలులో చనిపోవునపుడు నే దగ్గరే వున్నాను. అతడు దురదృష్టవంతుడు.'

నాకళ్లలో గిరగిర నీళ్లు తిరిగేయి.

'దుఃఖించొద్దు. భగవంతుని నమ్మియుండుము. అతడే నీకు సుఖము చేకూర్చగలడు.'

'నా కీజన్మమున నిక సుఖము లేదు, మేరీ!... నే తగిలివేయబడ్డా. ఎక్కడికి కెళ్లినా తగిలివేయబడ్డాను... ఆసుపత్రిలోనుండికూడా వెళ్లిపోవాలి... మళ్లా యీలోకంలో నే నేకాకినే.... భిక్షురాలినే. ...మేరీ! నన్ను రక్షింపవు?'

## ౪

ఆసాయంత్రము మేరీ నన్ను తనగదిలోకి తీసుకుపోయింది. ఆమెమంచాని కెదురుగా యేసుక్రీస్తు బొమ్మ తగిలించుంది. మేరీ చిన్నతనంలోనే ఆమెజననీజనకుల గోల్పోయింది. కాన్వెంట్ (Convent) స్కూలులో విద్యాభ్యాస మొనరించి...తన జీవితమును పరుల కుపయోగింప నిశ్చయించి నర్సైయి నింగ కెళ్లింది. మేరీ ఆసుపత్రిలో దాదిగా ప్రవేశించుపుడే మూడేళ్లవుతుంది. మేరీ వివాహం చేసుకోలేదు. ఆమె తన వక్షస్థలమున దీపించుచున్నక్రాసు (Cross) నే నమ్మింది.

గదిలో ప్రవేశించగానే మేరీ తన పరుపుమీద నా కాసనం చూపింది. ఆప్రేమమూర్తిశిలమును మనసులోనే కీర్తించాను. ప్రక్కనున్న కుర్చీలో కూర్చుండామె. మేరీమొగములోని సూచనలబట్టి అమె నాకేదో చెప్పదలచుకున్నట్టు గ్రహించేను. టేబిలుమీదున్న బైబిలు తీసి దాని నూరక త్రిప్పుచు నాకేసి చూచింది.

మేరీ—లీలావతీ! నీ వీనరకకూపమునుం డీవల బడుట కొక ఉపాయం ఉంది.

నేను—అల్లాంటిది నాకు చెప్పమనే కాదూ కోరింది.

మేరీ—నీవుకూడ నొకదాదిగా నేల ప్రవేశింపరాదు?

నేను—అట్టిపని నాకు లభ్యమవడం ఎల్లాగ?

మేరీ—నీయిష్టం చెపితే డాక్టరుగారితో చెప్పి నీ కది సాధ్యం గావిస్తాను. పరులకై యీజీవితము నుపయోగించుటకన్న ఘన మేమీ లేదు.

నేను—మేరీ! నేను నిజముగా నట్టిదానికి పాత్రురాలనేనా?

మేరీ—నీజీవితము నంతకంటె మంచి విధముగా నుపయోగింపజాలవు.

మేరీమూర్తి నాకు రోజూకన్నా అందంగా కనబడ్డది. అమె కాంతితో నిండుకొనిఉంది. మేరీ

వక్షస్థలాన్నున్న క్రాసులో ఎదురుగా నున్న యేసు మూర్తి ప్రకాశిస్తూంది. 'మేరీహృదయం గ్రహించు. ఆమె చెప్పినట్లు చెయ్యి' అని అతడు చెపుతూన్నట్టుగా అనుకున్నాను. ఈపతిత యిల్లా ఒరులకు పరిచర్య సలుపడానికి వీలు కలుగుతుంది కదా అని నాలో ఆనందించేను. పనికిమాలిన యీదీనురాలు పరులకష్టదశలో నుపయోగపడునని తలచి నాకష్టములను మరచిపోయాను. తినుటకు నిండుగా తిండిలేని యీనిర్భాగ్య స్వతంత్రజీవనము సలుపటానికి తగిన సమయం వస్తుంది కదా అని ఒకటిరెండు హర్షాశ్రువుల రాల్చేను. మానభంగమునకై వెఱచిన యీదీన మళ్లీ పవిత్రజీవనము చెయ్యగలనని గ్రహించి సంతసించేను. 'రాజేశ్వరీ! నీవు నన్ను తగిలీసేవు; అది నా కుపకారమే అయింది' అని ఆమెను మనసులోనే తలచుకున్నాను.

'మేరీ! నేనూ ఒకదాది నవుతా. నాసోదరుల నెందరినో మృత్యుగహ్వరమునుండి తప్పిస్తాను. ఇల్లా దీనదశలో వుండే నా దేశానికై పాటుపడతా.'

'యేసు నీకు మేలొనగూర్చుగాక!' అంది మేరీ.

'మేరీ! నీవు ప్రేమజీవివి అల్లా జీవించడం నాకూ చెప్పేవు. నీవు నాగురువువి.'

'అందరికీ గురువు ఆయేసువు.' అంది మేరీ.

ఆ ప్రేమజీవిని ధ్యానించే నొక్కసారి.

మేరీ నిశ్చలాకారమును చూచేను. మంచం దిగి పోయి ఆమెపాదములదరి మోకరించేను.

'మేరీ! ఒక పేదరాలిని రక్షించిన పవిత్రహృదయవు నీవు.'

ఆ తెల్లనిచేతిని నా పెదవుల కంటించేను. మేరీ నామొగ మెత్తి నానుదుటిని ముద్దాడింది నిశ్శబ్దంగా.

ఆసాయంకాలమే మీ పరిచితురాలు లీలావతి 'మిస్ లైలా' అయింది.

---



తులసీఘట్టము, కాశీ
(ఈ చెట్టుక్రిందనే తులసీదాసు రామాయణమును వ్రాసె నని ప్రవాదము.)

P. S. N




[తా. క. ఇకమీద భారతిలో పిట్టకథలకు తావులేదు. —సంపాదకుడు, భారతి.]

## వాణిజ్య సూత్రాలు

కారంశెట్టి వెంకటరంగయ్యగారు

ఒక గ్రామంలో ఒక కోమటి. అతడు లక్షాధికారి. ఇంత దానం ధర్మం కూడ ఎపుడయినా చేస్తూ ఉండేవాడు. వర్తకం బాగా సాగింది అతడికి. అతడికి లేక లేక చాలపళ్లకు ఒక కొడుకు పుట్టాడు.

కొడుకు బాగా పెద్దవాడు కాకుండానే సెట్టికి చావు సమీపించింది. అప్పుడు కొడుకును దగ్గిరికి పిలిచి "నాయనా, వర్తకానికల్లా నాలుగే సూత్రాలు. వాటిని బాగా అర్థంచేసుకొని చక్కగా వ్యాపారం అభివృద్ధి చేసుకోవాలి నీవు" అని, "నీడలో పోయి నీడలో రా; అప్పిచ్చి అడగవద్దు; ప్రియంగా కొని నయంగా అమ్ము" అనే మూడు సూత్రాలనూ రహస్యంగా చెవులో చెప్పి నాలుగోది చెప్పకుండానే ప్రాణాలు విడిచాడు.

చిన్న సెట్టి తండ్రిమాట జవదాటకుండా వర్తకం సాగించడం మొదలుపెట్టాడు. మొదటి సూత్రంప్రకారం ఇంటిదగ్గరనుంచి అంగడి వరకూ పందిరి వేయించి ఆ నీడనే నడుస్తూ ఉండేవాడు. రెండోసూత్రంప్రకారం అడిగినవారికల్లా అప్పిచ్చి, మళ్లా వాళ్ల నడగడం మానేశాడు. మూడోసూత్రంప్రకారం సరకును వెల ఎక్కువ పెట్టి కొని తక్కువకమ్ముతూ ఉండేవాడు.

ఇట్లా చేస్తూండడంవల్ల దినదినానికీ ధనం విపరీతంగా తరిగిపోతూవచ్చింది. ఏమయినా సరే, తండ్రిమాట జవదాటేవాడు కాడు అబ్బాయి.

ఇట్లా కొన్నాళ్లయింది. ఒకనాడు పెద్దసెట్టి నేస్తం ఒకాయన వాళ్లింటికి వచ్చాడు; అబ్బాయిపద్ధతంతా కనిపెట్టాడు. మనస్సు ఉండబట్టక అతణ్ణి అడిగాడు. "నాన్న చెప్పినట్లు నేను చేస్తూన్నా" నన్నాడబ్బాయి. ఆయన కాశ్చర్యం వేసింది. "ఏం చెప్పాడు మీనాన్న?" అన్నాడు. ఎంతకు చెప్పాడు కాడు, అబ్బాయి, అది రహస్యమని. చివరకు కొత్తాయనబాధ పళ్లేక చెప్పేశాడు.

అబ్బాయి తెలివితక్కువకు చింతిస్తూ ఆయన "వెర్రిబాబూ, మీనాన్న చెప్పిన సూత్రాలకు అర్థం అది కాదు. నేను చెబుతాను విను: మొదటిసూత్రానికి 'సూర్యోదయం కాకుండానే అంగడికి పోయి, పగలల్లా, రాత్రి పొద్దుపోయేదాకా బేరంచేస్తూండాలి. తర్వాత ఇంటికి రావాలి' అనీ, రెండో సూత్రానికి 'మనదగ్గిర సొమ్ము అప్పు తీసుకుపోయి మనం అడక్కుండానే మళ్లీ ఇచ్చేవాళ్లకే అప్పు ఇవ్వాలి' అనీ, మూడో సూత్రానికి 'బజారులో అందరికంటె కొంచెం ఎక్కువధర పెట్టి మంచిసరుకు కొని దాన్ని అందరు అమ్మేవెలకంటె కొంచెం చౌకగా అమ్మాలి' అనీ అర్థం. అట్లా చేస్తే చాలా లాభం వస్తుంది, వర్తకంలో. నీవు అట్లా చేసుకోవోయి" అని బుద్ధి చెప్పాడు. అబ్బాయి కళ దెలుసుకున్నాడు. ఆయన చెప్పినట్లే చేసి కొన్నాళ్లకల్లా తండ్రిని మించాడన్నిట్లో. నాలుగోసూత్రం ఏమిటయితే నేం?

---

## నీడ

ఆకుండి సత్యనారాయణగారు

వెనుకటికాలమున ఒకఊరిలో ఒకమహాత్ముడుండేవాడు. అతని ప్రేమ స్వార్థరహితమయినది. అతని హృదయము నిష్కల్మషమయినది. అతడు పరోపకారపరాయణుడు.

ఒకనాడు దేవతలు అతనికి ప్రత్యక్షమయినారు. "ఈశ్వరునకు నీపయిని అనుగ్రహము కలిగినది. వరము కోరుకొ"మ్మన్నారు. అత డేమియు మాటాడలేదు. "నీ దృష్టి మీదపడినమాత్రమున ఎంత పతితులైనా పరమపవిత్రు లవుతారు" అని దేవతలు తామే వరమిచ్చారు. దాని కత డంగీకరించలేదు. దేవతలు తిర్గి "నీ ముఖము చూచినంతమాత్రమున పరమనాస్తికులయినా ఆస్తికు లవుతారు" అన్నారు. అత డందులకును సమ్మతించలేదు. దేవతలు విసుగు చెంది, "మహాత్మా, ఈ వరములు నీ కెందుచేత ఇష్టపడలేదు?" అని అడిగినారు. "దయామయులారా, ఈశ్వరుని ఇచ్ఛామాత్రముననే కాగల కార్యములను నేను చేయుచున్నానను అహంభావము నా కేల? ఆయనకు నాపయి దయ గలిగినప్పుడు, ఇంకను నేను కోరవలసిన దేమున్నది?" అన్నాడు. "ఏమయినా సరే, నీవు వరము కోరక తప్పదు. ఇది ప్రభువాజ్ఞ" అన్నారు దేవతలు. "ఇక తప్పనిసరి అయినపుడు నావలన లోకానికి ఏపాటి మేలు కలిగినా దానిని నే నెంతమాత్రము గుర్తించలేనట్లు కటాక్షింపుడు" అన్నాడు మహాత్ముడు. దేవతలు అంతర్ధానమయినారు.

అప్పటినుంచి ఆమహాత్ముడు ఏదిక్కుకు మళ్లినా ఆయననీడమాత్రము ఆయనకు వెనుక ప్రక్కనే పడుతూఉండేది. ఆ నీడ పడిన చోటులలో అద్భుతమయిన మార్పులు జరుగుతూఉండేవి. ఎడారులు పచ్చికబయళ్లు అయ్యేవి; మోడులు చివురులెత్తేవి; ఎండిన బావులు నీటితో నిండేవి; రోగపీడితు లారోగ్యవంతు లయి అభినవ జీవకళలతో ప్రకాశించేవారు.

మహాత్ముడు తన యీ ప్రభావము నెరుగడు. అతనిప్రేమ స్వార్థరహితము; హృదయము నిష్కల్మషము. అతడు నిరంతరము పరోపకారమునకయి పాటుపడుతూ ఉండేవాడు.

ప్రజలు క్రమక్రమముగా ఆయన పేరును కూడా మరచిపోయినారు; ' నీడ ' అనే పిలువ సాగినారు.

---

## అయోమయము

జి. జాషువగారు

౧

"నా కవిత్వంబునందు రత్నములు గలవు-వానిఁ బెకలించి చూపెడువాఁడు లేఁడు
కాల మిట్లున్న" దని మొనగాఁడుబోలె-బలుకు కవిగాఁడ యేటి కీస్వాతిశయము?

౨

ఏవీ యారతనంబులు? - నీవే పెకలించి చూపి నీయింటికిఁ గొం
పోవోయి! అట్లొనర్పఁగ - నీవల నఱ్ఱగాద, యింక నీల్గెద వేలా?

3

"ఇయ్యది నిక్కపుంగవిత, యీ కవనంబును జూచెనేని, న
న్నయ్యయుఁ గొయ్యవాఁటి చనఁడా" యని వెఱ్ఱిమొగాలు పప్పురా
మయ్యలు కొంద ఱన్న విని యాత్మను బొంగుదె? వడ్లగింజలో
బియ్యపుగింజ గా కిది కవిత్వమటోయి బడాయిగొట్టగన్!

౪

కమ్మని భావము గల పద్య మ్మొక్కటి వ్రాయఁజాల వన్నిటిలో, ము
గ్ధమో, ప్రణయమో యని - యుమ్మలికించెదవు, నీదియుం గవనంబా?

౫

ధ్వనిచే ముద్దులుగారు భావములు చిందన్ ముచ్చటల్ సెప్పచున్
దెనుఁగుంగబ్బపు వన్నెలాఁడి మును జన్మించెన్ గవిబ్రహ్మ తా
ల్చిన ఘంటంబున, నీ యభావ కవితాచిత్రాంగినిన్ దిక్కనా
ర్యుని ముం దేల ప్రవేశపెట్టెదు, ఘనాయుష్కాలగర్వోద్ధతిన్?

౬

వరిగడ్డింబలె పేలవంబగు నభిప్రాయంబు గర్భంబునం
దిఱికింపంబడి, పెద్ద మూఁగదయిపోయెన్ బద్య మీ సొమ్ము లూ
సరవెల్లుల్, జరణంబు సాఁగని నికృష్టంబైన మార్గానఁ జీ
దరఁ బుట్టించెద వేల, శ్రోతల కనర్థ వ్యర్థ వాచాలతన్?

౭

కవిసమయంబుఁ దప్పి, నుడికారపు సొంపును పాడుచేసి, నీ
వెవతుకకోసమో కుమిలి యేడ్చుచుఁ జక్కని తెల్గుకైత కా
యువులు గుదించి యేమిటి కయోమయముం బొనరింతు వోయి! నీ
కవనము పాడుగాను చెడుగా, యిఁక నేనియు రమ్ము దారికిన్.

౮

ఇమ్మాడ్కి ప్రణయ మధుర రసమ్మున్ జవిసూపి నిన్ను సాధించుచు నీ
గమ్మత్తుసేయు నెవ రా - యమ్మాయి వచింపరాదటయ్యా, మాతో?

---






## కుట్టుపని III

కో. నరసింహాచారిగారు

చిత్రము a కంబళి కుట్టు (Blanket Stitch) అనబడుచున్నది. దారమును 1 వద్ద వెలికి దీసి 2 వద్ద గ్రుచ్చి మరల 3 వద్ద వెలికి దీసినయెడల కుట్టు ఏర్పడును. ఇదే రీతిని, వరుసగా చిత్రము b యందలివిధముగ 4 వద్ద గ్రుచ్చి 5 వద్దను, 6 వద్ద గ్రుచ్చి 7 వద్దను దారమును వెలికి లాగుచు వచ్చినయెడల కుట్లు వరుసగా ఏర్పడును. ఇదే కుట్టును చిత్రము b వలె దూరదూరముగ నైనను, c వలె దగ్గర దగ్గరగనైనను వేయవచ్చును.

f, g, లయందలి కుట్టునకు Open loop అని పేరు. ఇందలి కుట్లు ఒకదానితో నొకటి చేరక యుండుట యొకవిధము (చిత్రము h). ఒకదానితో నొకటి చేరియుండుట మఱియొక విధము (చిత్రము j). ఈకుట్టునందు సూదని గ్రుచ్చవలసిన ప్రదేశములు, చిత్రము d, e ల యందు చూపబడియున్నవి. ఇందలి యంకెల వరుసనే 1 యందు దారమును వెలికి దీసి 2 వద్ద గ్రుచ్చి 3 వద్ద f నందు చూపినవిధముగ వెలికి దీసి మరల 4 వద్ద గ్రుచ్చి 5 వద్ద వెలికి దీసిన యెడల (చిత్రము g) ఒకకుట్టు ఏర్పడును. ఇదే రీతిని మరల 6 వద్ద గ్రుచ్చి 7 వద్ద వెలికి తీసి 8 వద్ద గ్రుచ్చి 9 వద్ద వెలికి దీయవలెను (చిత్రము h). ఈకుట్టునందలి 1,-2; 5,-6; అనెడు శృంగములను ఒకే చోట చేరునట్లు కుట్టినయెడల (చిత్రములు o, q, r, s) Closed loop అను కుట్లు ఏర్పడును. ఈ రెండువిధముల కుట్ల యందును తోకలు (3-4; 7-8) కుఱుచగానైనను, నిడుపుగానైనను (చిత్రములు i, k) కుట్టవచ్చును. ఈవిధపుకుట్లను పూవులు కుట్టుటకు ఉపయోగించవచ్చును (చిత్రములు m, n). చిత్రము m నందు Open loop కుట్లును, చిత్రము n నందు Closed loop కుట్లును కల పూవులు కలవు. l నందు తోకలన్నియు ఒకే చోట చేరియున్నట్లు కుట్టబడి యున్నవి. చిత్రము m, n లందు తోకలు మధ్య భాగమును చేరక ముందే ముగియుచున్నవి.

x. y. కుట్లకు బత్తాసు రంధ్రపు కుట్లు (Button-hole Stitch) అని పేరు. బత్తాసురంధ్రమునకు అంచుచుట్టును కుట్టుటకు ఉపయోగించును. చిత్రము w నందుగల కుట్టు, విచ్చియుంచిన coat - stand ను బోలియున్నది.

దారమును 1 వద్ద వెలికిలాగి, 2 వద్ద గ్రుచ్చి లాగి, 6 వద్ద గ్రుచ్చి 7 వద్దను, 8 వద్ద గ్రుచ్చి 3 వద్ద వెలికిలాగి, 4 వద్ద గ్రుచ్చి 5 వద్ద వెలికి 9 వద్దను లాగుచు కుట్టవలెను.






౪. ఉపవాసదినములందు మహాత్ముని పరీక్షించుచుండిన వైద్యులు. నడుమ శ్రీ సరోజినీదేవి.




౫. శ్రీమతి సరోజిని దేవి

'పరకుటీ' భవన ద్వారపాలిక




౬. తాన్ యుషాన్

మరణాంతోపవాసమునకయి శపథముచేసిన చైనాసన్న్యాసి.

'ఆస్తి' అనగా వస్తువులను ఉపయోగించుటకును, అనుభవించుటకును, ఇష్టము వచ్చినట్లు చేయుటకును గల ప్రత్యేకహక్కు. ఇది నా 'ఆస్తి' అనగా నావస్తువును నే నుపయోగించుటకును, ఉపయోగింపక పోవుటకును, దానమిచ్చుట, విక్రయించుట, అద్దెకిచ్చుట మొదలగు పనుల చేయుటకును హక్కు నాకు గలదనుట.

ఉపయోగించుటకును, అనుభవించుటకును హక్కు ఉన్నమాత్రమున నది యాస్తి కానేరదు. ఇల్లు నద్దెకిచ్చినపుడు, కాపురమున్నవా రాయింటిని ఉపయోగించి అనుభవించుచున్నారు. కాని అది వారి యాస్తి మాత్రము కాదు. ఇష్టమువచ్చిన ట్లుపయోగించు హక్కు 'ఆస్తి' కి ముఖ్యము. కాపురమున్నవారు అద్దెయింటిని దానవిక్రయాదులు చేయలేరు.

ప్రస్తుతము లోకములో—ఒక్క బోల్షివిక రష్యాలో తప్ప—మనుజుల కున్న హక్కులలో నీ 'ఆస్తి' ఒకటి. అనగా, ఏమనుజుడైనను ఆస్తిని సంపాదింపవచ్చును. అట్లు సంపాదింపబడిన ఆస్తులనుగురించిన 'న్యాయముల'కై కోర్టువారి సంరక్షణ పొందవచ్చును.

కాని పూర్వమునుండియు అన్నిచోటులను ఈ హక్కు లేదు. అమెరికాలో బానిసత్వ మున్నపుడు బానిసలు ఆస్తిని సేకరించ వీలు లేకుండెనిది. Feudalism లో సాధారణముగా భూమియంతయు ప్రభువులది. రైతులు దానిని కవులుకు తీసుకొనమాత్రము సమర్థులు.

ఫ్రెంచిరివల్యూషనులో వారు గుర్తించినహక్కులలో నొకటి 'ఆస్తి'. అటులనే అమెరికా యింగ్లాండునుండి విడిపోయినపుడు 'ప్రతిమానవునకును—బానిసలు తప్ప—అనగా ప్రతి తెల్లవానికిని—ఆస్తిని సేకరించుటకు హక్కు గలదు' అని గుర్తించిరి.

కాని యీహక్కు మంచిదా, చెడ్డదా యను సందేహము ౧౯-వ శతాబ్ది చివరభాగమునుండి ప్రబలుచు వచ్చినది. రష్యాలో చివరకు ౧౯౧౭ లో ప్రత్యేక ఆస్తు (Individual Private Property) లుండకూడదని తీర్మానించిరి. రష్యాలో ఎవరిమటుకు వా రాస్తులను సేకరించకూడదు. ఆస్తియంతయు సంఘమునకు జెందును. ప్రతిమానవునకును అనుభవించుటకో, ఉపయోగించుటకో మాత్రమే హక్కు గలదు.

కాని మిగిలినదేశము లీపని చేయలేదు. పూర్వము వలెనే ప్రతిమనుజుడును ఆస్తిని సంపాదించి యనుభవింపవచ్చును. కాని కొన్ని కొన్ని మార్పులుమాత్రము జరిగినవి.

ఈ పరిణామమునకు కారణము ఆస్తి కొన్ని చెడుగులకు కారణ మగుచున్నదని గుర్తించుటయే. అందుచేత మన మిప్పుడు, ఏ యేకారణములచే 'ఆస్తి' సంఘకల్యాణమునకు కారణమో, ఏవిధముగా నది చెరుపో, యిప్పటి కర్తవ్య మేమో ఆలోచించవలసి యున్నది.

ప్రత్యేకముగా ప్రతియొకరికిని 'ఆస్తి' ఉండవలె ననుటకు కారణములు:

౧. ఏమనుజుడు కష్టపడిన, దాని ప్రతిఫలము నాతడే యనుభవించుట నీతిదాయకము, ధర్మము. చెట్టు నాటినవా డొకడైన ఫలములు తినువాడు మరియొకడుండుట న్యాయము కాదు. బానిసలు కష్టపడి పండించినదానిలో భాగమైనను వారి కీయక యజమానులనుభవించుట తప్పనియే బానిసలను విడిపుచ్చి, వారికికూడ ఆస్తిని సేకరించుకొనుటకు హక్కు నిచ్చుటకు ముఖ్యకారణము.

అది గాక తాను జేసినదానికి ఫలముగ తాను గాక మరియొకడు సౌఖ్యపడు నని తెలిసిన పనిచేయువారరుదుగ నుందురు. అందరును ఆత్మత్యాగు లగుదురా? పనిచేయనివారి సంఘము సోమరిపోతుసంఘమై చెడి

చిత్రము z, a, b, c లలో Ear-stitch అను కుట్టు చూపబడి యున్నది. 1 దారమును తీసి, 2 వద్ద గ్రుచ్చి 3 వద్ద తీసి, 4 వద్ద గ్రుచ్చి మరల 3 వద్దనే వెలికి దీసి, 5 వద్ద గ్రుచ్చి మరల 3 వద్దనే వెలికి దీయవలెను. ఈరీతిని వరుసగా కుట్టుచు బోయినయెడల c వద్ద నుండు విధమున ఏర్పడును. పైని చెప్పబడిన కుట్లు ప్రత్యేకముగనైనను, ఒకవిధమగు కుట్టును మరియొకవిధమగు కుట్టుతో చేర్చియైనను మన కిష్టము వచ్చినన్ని చిత్రరూపములను ఏర్పరచుకొనవచ్చును. ప్రారంభమున గల చిత్రము c యందలి కుట్టును ఆకురూపములందు కూడ నుపయోగించవచ్చును.



---

# పాతపాటలు

నేదూరి గంగాధరంగారు

౧

ముగ్గురన్నలతోటి నే బుట్టినాను
నానడుము మువ్వంచు చీరె గోరింది
నలుగురన్నలతోటి నే బుట్టినాను
నానడుము నల్లంచు చీరె గోరింది
అయిదుగురన్నలతోటి నే బుట్టినాను
నానడుము అద్దాల రవికె గోరింది.

౨

గోడమీాద గుడ్డ గొలుసుల గుడ్డ
ఇంత చక్కనిగుడ్డ యెవ రంపినారు
మన్నేన వుండేటి బా వంపినాడు
మన్నెమ్ము పేరేమి బావ పేరేమి
మన్నెమ్ము రాజమండ్రి బావ పుల్లయ్య.

౩

పన్నెండు ధనియాలు పత్తిగింజల్లు
అవి యివి కలబోసి సీత కొడిగట్టె
శ్రీరాము తవ్వేడు సీత తోడింది
మారాము తవ్వేడు మగువ తోడింది.

౪

చెంగుమీాద చెంగేసి చేడె చెంగేసి
ఆపైని చెల్లెలిది చేమంతిచెంగు
పడుచు నిస్తావ అన్నా ! పాడి నిస్తావ
పడుచు నివ్వ నమ్మా, పాడి నిస్తాను
అట్టే వెళ్లి చెల్లెలు కోపగించింది
పాడి నివ్వ నమ్మ, పడుచు నిస్తాను.

౫

వెల్లే వెల్లేతోవలో మేడ లున్నాయి
మేడమీాద మేనత్త కూతు రున్నాది
మేళమ్ము కట్టుత మేడ దిగనీదు
సరసమ్ము లాడుత సాగి నడనీదు.

౬

చక్కన్ని వాడమ్మ సారంగధరుడు
చిక్కేడు పింతల్లి చిత్రాంగిచేత
కన్నతండ్రిచేత కట్టుబడలేక
మారుటితల్లి చే మాటబడలేక
అడవిపాలై పోయె అతను సారంగు.

పోవును. అట్టి సంఘమున కధోగతియే కాని ఊర్ధ్వగతి యుండదు. అందుచేత మనుజులు పనిచేయవలెనన్న, వారి ఫలము వారికి ముట్టునను నమ్మిక యుండవలయును. అట్టిదియే ఆస్తిని కలిగియుండుటకు గల హక్కు.

౨. మానసికముగ నాలోచించిన మనుజుడు కష్టపడుట కేదైన 'యెర' యుండవలయును. కూలిపనివారి కష్ట మింతింత యనరానిది. ఏ పని చేయుటకూడ కష్టమే. కాని కూలివాడు ధనముకొరకై కష్టపడి పని చేయును. అటులనే ప్రతివాడును. తన కేదైన ప్రతిఫలము ముట్టునని నమ్మిక యుండిన గాని యెవ్వనికిని పనిచేయ నిచ్ఛ పుట్టదు. అట్టి యిచ్ఛను పుట్టించి మనుజునిచేత పనిని చేయించునది 'ఆస్తి' యే.

3. మనుజు డెల్లకాలమును ఆరోగ్యవంతుడై యుండి పని చేయలేడు. కొంతకాల మతనికి జబ్బు చేయవచ్చును. వార్ధక్యమున పనిచేయుట కష్టము. లేదా పనిచేయ శక్తి యున్నను పని దొరకక పోవచ్చును. పని చేసినపుడు 'ఆస్తి' ని సంపాదించుకొనియున్నచో ఇట్టి సమయముల నాతనికి పనికివచ్చును. కాకపోయిన మిగుల కష్టపడును. అందుచేతనే ప్రతివారును సంపాదనను కొంత వెనకకు వేసికొని కూడబెట్టుకొందురు. అట్లు కూడబెట్టుకొనుటకు హక్కు ప్రతివారికిని ఉండవలెననుట న్యాయము.

౪. మనుష్య నాగరికతను మనము జూచిన యెడల నాగరికత వృద్ధి పొందుటకు కారణము 'ఆస్తి' యే యని తేలుచున్నది. చరిత్రకు పూర్వకాలమున (Pre-historic) 'ఆస్తి' లేదు. వేటాడి జీవించు నపుడు తాను చంపినదానిని తిని వేసెడివాడు. తొడుగుకొనిన కొన్ని చర్మములు తప్ప 'నావి' అనుకొనుటకు వాని కేమియు లేవు. వారు దేశదిమ్మరులు. వేటాడుచు నెంతదూరమైనను పోయెడివారు. అట్టివారికి విజ్ఞానము, నాగరికత చాల తక్కువ. కాని రాను రాను, 'ఉన్నదానిలో వెనుక వేసికొనుట' ప్రబలినది. ఎక్కువ దొరకిన నాడు కొంత దాచుకొని, దొరకనినా డుపయోగించు కొనెడివారు. తరువాత భూములను వ్యవసాయము చేయుట వచ్చినది. అప్పుడైనను 'ఆస్తి' యంతయు సంఘమునకు చెందియుండెడిది కాని ప్రత్యేకముగా ప్రతి ఒక్కరికిని 'ఆస్తి' లేదు. రానురాను ఎవరిమటుకు వారాస్తిని సంపాదించుకొని, ఉపయోగించుకొనుటకు మొదలిడిరి. అప్పుడే నిజమైన విజ్ఞానము, నాగరికత ప్రబలినవి. 'నాది' యనుదానియం దొకవిధమైన భావ ముదయించును; నాదేశము, నాతల్లి అనుభావములు 'ఆస్తి' కి హక్కు గుర్తింపబడినతరువాతనే వచ్చినవి. అందుచేత నాగరికతకు మూలము 'ఆస్తి' యే.

౫. ఆస్తిమూలమున మరికొన్ని చిన్నిలాభములు కూడ కలిగినవి. ధన మున్నవానికి దానముచేయవలె ననుబుద్ధి, బంధువులయెడ ప్రీతి, వారిని పోషించుట మొదలయిన సుగుణము లలవడును. అందుచేత 'ఆస్తి' మూలమున సంఘము చాల లాభములను పొందినది, పొందును. 'ఆస్తి' యే లేకపోయినచో నాగరికత, విజ్ఞానము వృద్ధి పొందవు.

ఈ సమర్థనవాదముల ననుసరించి ప్రతిదేశమునను ప్రతిమనుజునకును 'ఆస్తి' కి హక్కు ఈయబడినది. కాని దీనిమూలమున సంఘమునకు కొన్ని చెడుగులు గూడ కలిగినవి. అందుచేత 'ఆస్తి' కి ప్రతిమానవునకును హక్కుండకూడదనియు, అథవా ఇప్పుడున్నటుల గాక యీహక్కును కొంత మార్చవలయు ననియు నొక బలమైన వాదము బయలుదేరినది. ఈవాదము ననుసరించియే రషియాలో Private Property ని తీసివేసిరి. ఆస్తిని వలదని యెవ్వరును అనరు. కాని 'ఆస్తి' సంఘమున కుమ్మడిగా చెందవలయునా లేక ప్రతిమనుజుడు వేరెవేరె 'ఆస్తి' ని కలిగి యుండవచ్చునా అనునదియే సమస్య.

దీనికి కారణములు :

౧. తాను చేసిన పనికి ప్రతిఫలము తాను పొందవలయుననియు, నట్టిది 'ఆస్తి' మూలమున జరుగుచున్నదనియు చెప్పు వాదము సత్యము కాదు. ఇప్పుడున్న 'ఆస్తి' యేవిధముగ వచ్చినదో మనము పరీక్షచేసి చూచిన యీసంగతి బోధపడును. మనలో

'ఆస్తి' ని కలిగి యున్నవారిలో ముప్పాతికమంది జమీందారులు. వీరందఱును ఒడలు వంచి కష్టపడుట మూలముననే వీరి కీయాస్తి వచ్చినదా? కష్టమే గణింప బడునేని నిజముగ కష్టపడువా డెవ్వఁడు? తెల్లవారు జామున నాలుగుగంటలనుండి రాత్రి తొమ్మిదిగంటలవరకు, ఎండనక వాననక కష్టించునది రైతా, లేక కాలుమీద కాలు వైచుకుని కూర్చుని, మెత్తనిదిండ్ల కారులలో 'కదుపులోని చల్ల కదలకుండ' తిరుగు జమీందారులా? ఒకరు కష్టించినదాని ప్రతిఫల మింకొక రనుభవింప కుండుటకు 'ఆస్తి' కి హక్కుండవలయునట? కష్టపడునది రైతుబిడ్డ; కవులుకు తీసికొనినవాఁడు. అనుభవించునది భూమి నొకమారైనను జీవితకాలములో చూడక, భూమి యేదిక్కున నున్నదోకూడ తెలియని జమీందారుబిడ్డ. ఇది 'ఆస్తి' మూలముననేకదా. ఇదియా ధర్మము, న్యాయము? జమీందారున 'కాస్తి' యెటుల వచ్చినది? దైవవశాత్తు జమీందారునింట పుట్టినంత మాత్రమునకదా! ఇట్టి స్థితిలో 'ఆస్తి' కష్టమునకు ఫలమని చెప్పుట సత్యమా? ఇప్పటిస్థితిలో చాల మటుకు 'ఆస్తి' పుట్టుకకు ఫలముగ కన్పడుచున్నది గాని, కష్టమునకు ఫలముగ కన్పించుట లేదు.

మనము నివసించునది ప్రజాస్వామిక పరిపాలనములో. ఇందు పుట్టుకకు స్థానము లేదు. శక్తియే ముఖ్యము. మాక్డొనాల్డు పూటకు గతిలేనివాని కొమరుఁడు; పైకివచ్చినది తనశక్తిమూలమున. కాని అంతటి వాని కొమరుఁడు శుంఠ కావచ్చును. మేక్డొనాల్డుకొమరుఁడని యాతనికి ప్రత్యేకస్థానము లేదు. పుట్టుకకు స్థానము లేనపుడు, పుట్టుకపై నాధారపడియుండు 'ఆస్తి' (Hereditary Property) కి కూడ స్థానము లేదు. దీని కుదాహరణము: సంతానము లేని ధనవంతుఁడు చనిపోయినపుడు పదిహేనుతరములనాటి ౨౦ వేల్లు విడిచిన మేనత్తకొమరుకో, పినతల్లికొడుకో, వారసు డొకడు బయలుదేరి 'ఆస్తి' ని తెచ్చుకొనును. అది దేనిపై నాధారపడిన హక్కు? అబద్ధము లాడి కష్టపడినందులకా? కష్టమునకును ప్రతిఫలమైన 'ఆస్తి' కిని సంబంధమే లేదిపుడు. అందుచేత ఈ వాదన సత్యముకాదు.

లేదా, ఒకవేళ కొంచెము సంబంధ ముండినను చాల వ్యత్యాస ముండవచ్చును. రోజంతయు కష్టపడిన కూలివానికి నాలుగణాలు. మోసముచేసి మాయమాటలు చెప్పి దొంగసరకు లంటగట్టు సాహుకారునకు రోజున కేబదిరూపాయిలు.

కాకపోయిన, చేయుపని సంఘమునకు లాభకారి కాకపోవచ్చును. ఆబ్కారీపాట పాడి కల్లమ్మిన వానికి ధనము మిక్కుటముగ వచ్చును. కాని దాని మూలమున సంఘనీతి, శాంతి మొదలయినవి చెడిపోవుచున్నవి. అందుచేత నిట్టి 'యాస్తు' లను కష్టములకు ప్రతిఫలములని సమర్థించుట సత్యము కానేరదు.

౨. రెండవవాదము కూడ—పనిచేయవలెనన్న యెర యుండవలెననుట—సరికాదని రషియావా రిపుడు లోకమునకు చాటుచున్నారు. రషియాలో ప్రతివాడును 'ఆస్తి' కూడబెట్టుకొనుటకు వీలు లేదు. 'ఆస్తి' అంతయు సంఘమునకే చెందును. కాని అచట పని చేయుట లేదా? వారి యైదేండ్ల ప్రణాళిక నెగ్గినదని వా రనుకొనిరిగదా!

సోమరితనముకూడ కష్టమే. ప్రతివాడునుకూడ కొంతపనిని చేయ నిచ్ఛగించును. కాని పని మిగుల కష్టమైన దయినప్పుడే వాడు ప్రతిఫలము కోరును. అందుచేత పని విసుగెత్తకుండ చూచినయెడల మనుజులు ప్రతిఫలము లేకనో, లేక కొంచెము ప్రతిఫలముతోనో—తాను సౌఖ్యముగ నివసించుటకు తగినంతతో—తృప్తిపడును. అందుచే మనుజులచే పనిచేయించుటకుగొప్ప 'ఆస్తు' లవసరము లేదు.

3. కూడబెట్టిన 'ఆస్తి' యంతయు తాను కష్టకాలములం దున్నపుడు సహాయపడుటకు కూడపెట్టినది కాదు. నూటికి ౬౦ రూ.లకు వడ్డీకిచ్చి, పాపమును కూడబెట్టినట్లు ధనమును కూడబెట్టిన పీనాసి చనిపోవునప్పుడు డాక్టరునకైన దమ్మిడీ నిచ్చుటకు సమ్మతింపడు. ఇట్టివాటికి సరియైన మార్గము 'ఆస్తి' ని కూడబెట్టుకొనుట కాదు. భీమాలను చేయించుకొనుటయే. ఇంగ్లాండు మొదలయిన దేశములలో పనిలేనివారి

జీవితములకు ఖాయిలాపడినపుడు, ముసలితనమునకు భీమా లున్నవి. వానిమూలముననే నిజమైన, సరియైన సహాయమును పొందగలుగుచుందురు కాని సంపాదించిన 'ఆస్తి' మూలమున కాదు.

౪. అన్నిటికన్నను ముఖ్యమైనకారణ మింకొకటున్నది. మనము చరిత్రను బాగుగ పరికించి చూచిన యెడల నది యంతయు రాజకీయవిషయములవల్ల నైనది కాదు. చాలమట్టుకు—అంతయుకూడ నని—ఆర్థికవిషయములవలన నేర్పడిన దని, లెనిన్, మార్క్సు (Lenin, Marx) మొదలయిన మహాశయుల యభిప్రాయము. జపానునకును, చైనాకును జరుగు యుద్ధము రాజకీయ సంబంధములవలన కాదు; ఆర్థికవిషయముల వలననే. అటులనే గడచిన ఐరోపాసంగ్రామము, ఫ్రెంచి రివల్యూషను, అమెరికను యుద్ధము, ఇంగ్లండులోని అంతఃకలహము (Civil War) అని చాలమంది యభిప్రాయము. అందుచేత నార్థికవిషయము చాల ముఖ్యమైనది. దానిపైననే దేశకల్యాణము, లోకకల్యాణము ఆధారపడి యుండును.

ఇపుడు లోకములో ధన మెట్లు పంచబడి యున్నదో చూచినయెడల కనిపించునది, వేళ్లమీద లెక్కింపదగు ధనికులు, లెక్కకు మిక్కుటమగు బీదలు. బీదలకు, ధనవంతులకు సంబంధమే లేదు. "బీదలును, ధనవంతులును రెండు కులము" లని యొకరు చెప్పినది చాలమట్టుకు సత్యము. దీనిమూలమున సంఘమునకు చాల నష్టములు కలవు.

ఏపనినిచేయుటకైనను, ధనము—పెట్టుబడి—అవసరము. అది కొందరివద్దనే యుండును. కాన వారే ప్రభువులు. బీదలకు వారే ఆధార మగుటవలన బీదలు గొప్పవారిచేతిలో కీలుబొమ్మలు. వారి ప్రాణము లింకొకరిచేతులలో నున్నపుడు వా రేమి చెప్పిన చేయరు? అందుచేత చాలమంది బీదవారు పేరునకు స్వతంత్రులయినను, నిజమునకు ధనవంతులకు బానిసలు. రాజకీయ-బానిసత్వము, మతైక-బానిసత్వము పనికిరాదను నీకాలము ఆర్థిక-బానిసత్వమును సహింపునా? సహించిన, పూర్వము చెప్పినటుల, రాజకీయ మార్థికముపై నాధారపడి యుండుటచే నావిషయమున మాత్రము వారు బానిసలు కారా?

మనలో చాలమందికి 'వోటింగు' అధికారము కలదు. ఇందులో నిజముగా, తగినవానికి వోటు నిచ్చెడివా రెందరు? ఇతరులకు లోబడి వోటుచేసెడివా రెందరు? ఒక జమీందారునికడనున్న పరివారమువా రందఱును ఆతనిపై ఏవిధముగ నాధారపడి యున్నను, చెడ్డవా డని తెలిసినను, ఆతనికో, ఆతడు చెప్పినవానికో వోటుచేసి తీరవలయును కదా. లేకపోయిన తమ యుద్యోగము, తిండి పోవు నని భయము. మరి యిక వోటువలని ప్రయోజన మేమి? ఆర్థికముగ దాసానుదాసులై యుండి, మేము రాజకీయముగ వోటుచేయగల యధికారమును పొందియున్నారము గావున స్వతంత్రుల మని చెప్పుకొనుటయందలి యర్థ మేమి? ఎన్ని యెలక్షనులలో ధన మిచ్చి వోటులను వేయించికొనుట లేదు? నిజముగా నాలోచించిన ఎలక్షనులను నీతిరహితముగ జేసి పాడుచేసినది యీధనవంతులే.

రాజకీయముగనే గాక సాంఘికముగకూడ నొకని కడనే ధనరాసు లుండుట చాల అనర్థదాయకము. సంఘమున ధన మున్నవాని మాటయే చెల్లును. బీదవా డెంత సుగుణవంతు డైనను ఆతనిమాట లెక్కకే రాదు. ధనము సెన రిచ్చి వేనిని కొనిన, వానినే సంఘము తయారు చేయుచుండును. ధనవంతు డొకడు, అనవసరమైనను, పదివేలరూపాయిల నొక మోటారుకారు కొరకీయగలుగును గాన సంఘము మోటారుకారులనే తయారు చేయును. పదివేలమంది 'అన్నమో రామచంద్రా' యని యేడ్చుచున్నను వారు ధనము నిచ్చుకొనలేరు గాన వారిసంగతి నాలకించువారే యుండరు. సంఘకల్యాణమునకు న్యాయబుద్ధితో, ధర్మబుద్ధితో నాలోచించిన ఏది ముఖ్యము? కారా, లేక పదివేలమందికి భోజనమా? అమిత ధనవంతులు లేక, ధనము ప్రతివారికి కొంచెముకొంచె మున్నయెడల ఒకనికి కారు లేకపోయినను, పదివేలమంది కన్నము దొరకియుండును కదా? కారులు మొదలయిన భోగవస్తువుల (luxuries)

ను చేయుటకు ఎంతమంది పనిచేయుచున్నారో? అమితధనము కొందరికడనే కూడియుండినయెడల, వారిమూలమున సంఘముయొక్క శక్తి 'అవసరముల' (necessities) కొరకు కాక భోగములకొరకు వెచ్చింపబడును. Laski మహాశయుడు వ్రాసినట్లు, పదివేల పడిపోవు గుడిసెలప్రక్క నొక రాజసౌధము. వేలకొలది జనమునకు గంజి త్రాగి ప్రాణముల నిల్పికొనుటకుగూడ లేనపు డొక జమీందారునకు 'సిగరెట్లకాగితము' లు ప్రత్యేకముగ పారిసులోనో, అమెరికాలోనో తయారు కాబడి వచ్చును. ఇదియా న్యాయము?

ఇంతే కాక, ధనవంతులు చేసినపనిని బీదలుకూడ ననుకరింపజూతురు. ధనమదాంధతచే క్రొవ్వియున్న పుల్లమ్మ ధరించిన 'లోలకు'ల వంటివి—డైమండువి కాకపోతే, ఇమిటేషన్‌వైనా సరే—ప్రతి వెంకమ్మ, యెల్లమ్మ ధరించవలసినదే. 'మింగ మెతుకు లేనివాని మీసాలకు సంపెంగనూనె' యను సామెత వ్యర్థమైనది కాదు. ఇట్టినాటిమూలమున దేశములో దారిద్ర్యదేవత తాండవించును. సంఘమున దురాచారములు హెచ్చును కాని కల్యాణమును పెంపొందింపవు. అందుచేత ఇప్పుడున్న విధముగ ప్రత్యేకపు ఆస్తి (Private Property) ప్రజాస్వామికపరిపాలనమునకు, సమత్వమునకు, స్వతంత్రత్వమునకు వ్యతిరిక్తము. అందుచేత 'ఆస్తి' ని ఇప్పుడున్నటులకాక మార్చుటయో, లేక పూర్తిగా తీసివేయుటయో ముఖ్యావసరము.

ఒకవేళ పనిచేయుటకు కొంత 'ఆస్తి' రూపకమైన ప్రతిఫల మవసరమని యొప్పికొనినను, ఇప్పుడున్న పరిస్థితులు దానికి సహాయకారిగ నుండుటలేదు. ఇప్పుడు ధనమున్నవారు 'వారికే మమ్మ, తండ్రులు గడించి పెట్టారు. హాయిగా కాలిమీద కాలేసుకు తినొచ్చు' ననే స్థితిలో పడ్డారు. పని చేయకపోయిన సంఘము సోమరిదగును. పనిచేయవలెనన్న 'ఆస్తిని' చేసికొనుటకు హక్కుండవలె ననునది వ్యర్థవాద మగుచున్నది. 'ఆస్తి' యుండుటచే పనిచేయుట మానివేయుచున్నారు, చాలమంది. అందుచే ధనమే సోమరిసంఘమును తయారు చేయుచున్నదేమో యను అనుమానము గల్గుచున్నది.

౫. మన మిప్పుడు ధనదాసులము. ధనదాహమందరికి మెండు. ధనమును పూజచేయుచున్న కాలమిది. 'రూపాయిలో దేవు డున్నా' డనునది సామెతైపోయినది. దీనికి కారణము 'ఆస్తి' యే. లెక్కకు వచ్చినది ధనమే కాని, ధన మెట్లు సంపాదింపబడినదో యెవ్వరికిని అక్కరలేదు. 'వెధవపబ్బు. భోగంది గడిస్తుంది' అను మాటలు పాతమాట లయినవి. ధనవంతునకే అందరును చేతు లెత్తుట. ఆధనము ప్రజలను మోసము చేసి సంపాదించినను సరియే. అందుచేత నిపుడు ప్రతివానికి ఎంత త్వరితకాలములో — మంచినో, చెడ్డనో—గొప్పవా డగుట యెట్లా యనెడి చింత తప్ప వేరొకటి లేదు. అందుచేత సంఘము చెడిపోయి, నీతిబాహ్యముగ నున్నది కాని మరొకటి కాదు.

దేశములోని రాజ్య మందరికొరకును ఏర్పడియున్నది కాని దేశములోని ఒకపక్షమువారికొరకు కాదు. కాని ఎపుడును ధన మున్నవారి చేతియందే అధికార ముండుటవలన జరిగెడి పనులన్నియు వారి సౌకర్యముకొరకే జరుగునుగాని బీదల సౌకర్యముకొరకు గాదు. నూటికి ఒకడో యిద్దరో ధనవంతులు కొను కారులపై సుంకముల తగ్గింతురు కాని, ఊరక వచ్చిన, దానిమూలమున నింకొక వస్తువు బీదలకు కొన వీలగునట్లు చేయు, ఉప్పుమీది పన్నుకు లెక్కచేయువా రెవరును ఉండరు. టోలుగేట్లు కారుల కక్కరలేదట, ఎద్దుబండ్ల కుండవలెనట!

అందుచే రాజ్యము, సంఘము ధనవంతులదగుచున్నది కాని ప్రజల దగుటలేదు. దీని మూలమున 'న్యాయము, ధర్మము, నీతి' మంట గలియుచున్నవి. మొన్న మాస్కోయందు బ్రిటిషువారిని విచారణ చేయుచు, రషియను కోర్టులు న్యాయస్థానములు కావనినదానికి జబాబుగ నచటి న్యాయవాదిగారు 'ఆదేశములలో బీదల కొకవిధమైన న్యాయమును, ధనవంతులకు మరియొకవిధ మయిన న్యాయమును గలదు. కాని రషియాలో న్యాయ మందరికి నొకటే' అనిరి.

ఈదుర్గుణము లన్నియు మూర్తీభవించినవారు మన 'మహారాజులు.' వీరు తిండిలేక మలమల మాడు ప్రజల

కడనుండి పన్నులను వసూలుచేసి, సంవత్సరమున కొరు నెలలు పారిసులోనో, లండనులోనో గడపి ధనము నంతయు తగులవేసెదరు. వీరినిగురించి యెంతకఠినముగ వ్రాసినను అన్యాయము, అసత్యము కానేరదు.

అందుచేత ఇప్పటి సమస్య: మంచికంటె చెడుగులనే యెక్కువగా గల యీ 'ఆస్తి'కి హక్కును ప్రతిమనుజునకును యివ్వకుండ, రష్యాలో వలె పూర్తిగా సంఘమునకే యిచ్చుటా, లేక 'ఆస్తి' యొక్క చెడుగు దేనివలననో కనుగొని, ఆచెడుగులు రాకుండ యీహక్కును మార్చుటా?

'ఆస్తి'ని పూర్తిగా తీసివేసిన, దానియొక్క మంచికూడ పోవును. వ్యాధిగల మనుజుని వ్యాధిని తీసివేయక, మనుజునే సంహరించినట్లు, 'ఆస్తి'నే పూర్తిగ తీసివేసిన, ఉండు నని చాలమంది పెద్దల యభిప్రాయము. రష్యాలోకూడ నీమధ్యన కొన్నివిధము లైన వస్తువులను 'ఆస్తి' గా స్వీకరించవచ్చు ననియనిరి.

ఇన్ని చెడుగులకు ముఖ్యకారణము ధనము చాల కొద్దిమందిదగ్గర సర్దుకొనుటయే. అందుచేత ముఖ్యముగ చూడవలసినది, యెవరికడనుకూడ ధనరాసులు కూడకుండుటయే. అందుచేతనే కాంగ్రెసువారు, ఉద్యోగమునకు నెలకు ౫౦౦ రూ॥ ఉండిన చాలు నని యభిప్రాయపడిరి. ౧౦ రూ. సంపాదించువారు ౧౦ వేల మంది, ౨౫ వేలు సంపాదించువారు ముగ్గురు ఉండుట కంటె అందరును ౫౦ రూ. మొదలు ౪౦౦ రు. వరకు కలిగియుండుటే సంఘమునకు కల్యాణదాయకము. అందుచేత చెడుగులను తగ్గించుటలో నొక విధము ఇంతకంటె యెక్కువ జీతము లుండరా దనుట. ప్రతిదేశములోను ఈ సంగతి గుర్తింపబడినది. తన సొమ్ము కాదని పంచిపెట్టే హిందూదేశంలో తప్ప, ఎక్కడా యింత హెచ్చు జీతములు లేవు. అది గాక Income-tax, Super-tax, Profession-tax ల మూలమున కొంత సంఘమునకు చేరు చున్నది.

లోకములో గనులు, భూమి మొదలయినవి స్వభావసిద్ధములు. వీనిని మనుష్య ప్రయత్నముచే నెక్కువచేయలేము. కావలెనన్న ఒక్క రోజులో కొన్నికోట్ల గజముల గుడ్డను తయారుచేయవచ్చును. కాని సెంటుభూమినికూడ కల్పించలేము. అందుచేత వీనిని జాగ్రత్తగా వాడుకొనవలెను. భూమి యున్నగాని ధాన్యము పండించుటకు వీలు లేదుగదా? ఒక లక్షాధికారి చుట్టుప్రక్కల భూముల నన్నిటిని కొని చాల ఎక్కువకు గాని కవుల కీయనని పట్టుపట్టిన మరి సామాన్యుల గతి యేమి? ఇట్టిస్థితి యేర్పడినపుడే పూర్వము రోము నందును, గ్రీసునందునుకూడ కొన్ని యెకరముల భూమి కంటె నెవ్వరును ఉంచుకొనకూడదను శాసన మొకటి యుండెడిది. అట్టిశాసన మొకటి ముఖ్యావసరము.

అది గాక, యీ హక్కునకు గలది—ఉపయోగించిన ఉపయోగించవచ్చును, లేకపోయిన ఊరకొనవచ్చును. అందుచే 'గడ్డివాములోని శునకము' వలె స్వభావసిద్ధమయినవాటిని (భూమి మొ.) ఉపయోగింపకపోయిన, ఎవరికిని లేకుండచేసినవా రగుదురు. అట్టివి జరుగకుండ చూడవలెను.

కష్టపడకుండ ఎవరికిని ధనము అనవసరముగా రాకుండ చూచుట చాల ముఖ్యమైనది. అనగా, తండ్రి సంపాదించిన సొమ్ము కాలుమీద కాలు వేసికొని తిను వారి సంఖ్య తగ్గించవలెను. ఇంగ్లాండు మొదలయిన దేశములలో ఎస్టేటుదారు చనిపోయి, ఆతనికొడుకు దాని కధికారి అయిన అతనికడనుండి ౫౦% వరకు పన్నుక్రింద తీసికొందురు. ఇందుమూలమున తండ్రి సంపాదించిన అంత ధనమునకును ఆత డధికారి గాక, కొంతయైనను రాజ్యమున కిచ్చును.

ఇప్పటికాలమున 'ఆస్తి' చాలమటుకు పెట్టుబడి మూలమున ఉన్నది. మిల్లులయందో, వ్యాపారమునందో పెట్టుబడి యైయున్నది. అట్టి 'ఆస్తి' యొక్క హక్కును మూడువిధములుగ విభజింపవచ్చును—

i వడ్డీని అనుభవించుటకు

ii లాభములను పొందుటకు

iii అధికారము చేయుటకును, స్వాధీనమునం దుంచుకొనుటకును గలహక్కులు (right to control).

వీనిలో ఒక్క మొదటిదాని ననుభవించుటకే న్యాయమైన యధికార మున్నది. లాభమును అందరితోను కలిసి—మిల్లునకు పెట్టుబడి పెట్టిన, మిల్లులో పని చేయువా రందరితో కలిసి—యనుభవించవలెను. అధికారము చేయు హక్కుండకూడదు. గవర్నమెంటు సెక్యూరిటీలలో ధనమును పెట్టుబడి పెట్టినను కూడ గవర్నమెంటువారిపై నధికారము చెలాయించుటకు ఎట్లు వీలు లేదో, అట్లే మిల్లులో పెట్టుబడి పెట్టినను కూడ మిల్లును స్వాధీన పరచుకొనుటకు అధికారముండకూడదు. అట్టి అధికారము రాజ్యమునకో, సంఘమునకో యుండవలయును.

వీనిని చేసినయెడల 'ఆస్తి' వలన కలుగు చెడుగులు చాలమటుకు తగ్గిపోయి దాని మంచిలాభము లనుభవించుటకు వీలగును. ప్రజాస్వామిక రాజ్యములో ఇప్పుడున్నటువంటి 'ఆస్తి' కి తావు లేదు. లేకపోయిన ప్రజాస్వామిక రాజ్యము వెక్కిరింపు, కన్నీళ్లతుడుపు కాని నిజము కానేరదు.

---

# ప్రేమగాయకుఁడు

బాలాంత్రపు వేంకటరావుగారు

౧

మాన్యుఁడగు రాము చరిత రామాయణముగ
మానవతి సీత చరిత రామాయణముగ
మానవప్రేమచరిత రామాయణముగ
మాని వెలయించెఁ దన ప్రేమగానమందు—

౨

సీత పూతచరిత్ర ప్రసిద్ధమయ్యెఁ
గుశ లవ సురూప విభవంబు విశదమయ్యె
జానకీపతిమది సుప్రసన్నమయ్యె
మౌనిరత్న దివ్య ప్రేమగానమందు—

౩

లలిత సుకలాభ్యుదయమూర్తి లవునియందు
కుశలమంత్రాభ్యుదయమూర్తి కుశునియందు
చిరపవిత్రాభ్యుదయమూర్తి సీతయందు
మౌని వెలయించెఁ దన ప్రేమగానమందు—

౪

ఇతఁడె-ఆ ప్రేమగాయకుఁడు-ఇతఁడె-యితఁడె
యాతఁడె-యితండె యని పంచభూతములును,
దశదిశ, లనంతభువనముల్, నిశలుఁ బవలు,
పాడి చెప్పుచునున్నవి నాఁడు-నేఁడు—

---

# వ్యవసాయ మన నేమి?

దువ్వూరి బాలకృష్ణమూర్తిగారు

"కృషి", "వ్యవసాయము" అను ఈ రెండును సంస్కృత పదములు. సంస్కృతములో "కృషి" అనగా నేల దున్నుట, పంటలు పండించుట అని అర్థము. వ్యవసాయము అనగా ప్రయత్నము, పాటు పడుట అని యర్థము. అయినను తెనుగులో "వ్యవసాయము" అనుమాట నేలను దున్ని పంటలు పండించుట అను అర్థమున వాడుచున్నారు. ఈ అర్థమును దెలుపుటకు ఇంగ్లీషులో "అగ్రికల్చర్" అనుమాట వాడుదురు. ఈ మాటకు నేలను పనిచేయుట అని వ్యుత్పత్త్యర్థము.

వ్యవసాయము అనుమాటలో ఎంతో గొప్ప అర్థము ఇమిడియున్నది:— నేలను మొక్కలు పెరుగుటకు తగిన స్థితికి తెచ్చు మార్గములు అవలంబించుట, అందుకు కావలసిన పనిముట్లను, ఇతర సాధనములను సేకరించుట, దేశ కాల భేదములనుబట్టి ఆలోచించి తగిన విత్తనములను సంగ్రహించుట, ఆవిత్తనములు చెడకుండునట్లు కాపాడుట, దానిని చల్లుటకు కావలసిన పరికరములను, సాధనములను కూర్చుట, విత్తనములు మొలచిన తరువాత మొక్కలకు చీడలు పట్టకుండునట్లు కాపాడుట, ఆ మొక్కలకు కావలసిన ఆహారము నేలలో సమకూర్చుట, నీరు కావలసినప్పుడు వాన లేనియెడల ఏళ్లు, చెఱువులు, బావులు మొదలగువానినుండి మొక్కలకు నీరు పెట్టుట, అందుకు వలయు సాధనములను సమకూర్చుట, ఆమొక్కలకు గాలి, పశువులు, పక్షులు, దొంగలు మొదలగువారివలన బాధలు కలుగకుండునట్లు సంరక్షించుట, పండిన చేలు యుక్తకాలములో కోసి, నూర్చి, గింజలను శుభ్రముచేయుట, ఆగింజలలో ఏంచి మంచివి విత్తనములకొరకు భద్రపరచుట, వ్యవసాయపుపనులకు కావలసిన పశువులను సేకరించి వానికి వ్యాధులు రాకుండునట్లు కనిపెట్టి సంరక్షించుట, వాని ఆరోగ్యమునకు హాని కలుగకుండునట్లు వాని మలమూత్రాదులను భద్రపరిచి నేలకు ఎరువుగావేయుట— ఇవి మొదలుగాగల అన్నిపనులును వ్యవసాయ శబ్దార్థములో ఇమిడియున్నవి.

యూరోపు మొదలగు పశ్చిమఖండముల వారు ఇంకను పెక్కుపనులు వ్యవసాయములోనివిగానే భావించుచున్నారు:—పశువులను పెంచి, పాలు, పెరుగు, వెన్న, నేయి మొదలయిన పదార్థములను తీసి, వానిలో నిలువ చేయవలసినవానిని చెడకుండునట్లు నిలువ చేయుట, పాడికి పనికిరాని పశువులను కటిక వారి కమ్ముటకై క్రొవ్వెక్కునట్లు మేపుట, పనులు చేయుటకు తగిన మంచిమంచిజాతుల

౭

రాయండ్రా పిల్లల్లాల్లా
రాతికింద ముత్యాలు
కరణాలదొడ్లో కాసులపేరు
పందిరిమీద పువ్వులకోడి
కోడి కోడి కొక్కురో కో.

౮

వెర్రికుక్కను బట్టి వేటాడరాదు
చాదస్తు పెనిమిటితో వేరుండరాదు
గుణవంతుడు పెనిమి టైతే కూడి వుండరాదు.

౯

తిరుపతి చదరాడ తీరైన కొల్లేరు
తగిన పెద్దాపురము తామరాడ
రామచంద్రపురము రచ్చలకు పెద్ద
అటుకులు బెల్లం తినుట కనపర్తి పెద్ద
రాజమహేంద్రమ్ము రంగులకు పెద్ద
కాలసుఖములకును కాకినాడ.

౧౦

పాలడుగు చేబ్రోలు మరి పత్తిపాడు
పులివర్రు సంతన రావూరు పొనునూరు
మంగళగిరియును మరి మంచి మునుగోను
నాదెండ్ల రాయిపూడి ఆది నూతక్కి
కూచిపూడి తాడికొండ గుంటూరు
పదునాల్గు వసతులు పట్టణములును
కొండవీటి సీమను మరి దండి యొప్పు.

౧౧

చామలు ఉలవలు సజ్జలు కందులు
అరిగలు పెసలు ఆముదాలు మినుగులు
జొన్నలు రాగులు చోళ్లు బొబ్బర్లు
పత్తియు చందలు పదునాల్గు పంటలు
మరి చెప్ప యింకేమి మారెళ్లసీమ.

౧౨

కాసు పుట్టని వూళ్లు వూసరమళ్లు
దాసరి దేవళ్లు మాసినగుళ్లు
చెవుల ముత్తెముజోళ్లు చిత్రరుమాళ్లు
పెద్దమద్దెళ్లు కడు వేటకాళ్లు
పరదేశి సావళ్లు బంగారు మెడనూళ్లు
తోపుమామిళ్లు మరి తుమ్మబీళ్లు
కర్ణాటదేశమ్ము కలిమి నిలువెళ్లు.

౧౩

పాలరేవళ్లును పాంకోళ్లు సిగముళ్లు
చెవుల వజ్రపురాళ్లు నోర సిగముళ్లు
చేయాటె పదిమూళ్లు చిత్రరుమాళ్లు
చాలు మామిళ్లు లోతునీళ్లు గలయూళ్లు
ఉప్పుమళ్లు తూర్పు నున్న దేశాలు.

౧౪

సూర్యగ్రహణ మొకటి చుక్కల్లగ్రహణ
మొకటి
ఏడాది కొకసారి చంద్రగ్రహణమ్ము.

---

ఎడ్లను, గుఱ్ఱములను వృద్ధిచేయుట, కటిక వారికి అమ్ముటకొరకు పందులను పెంచి వాని ఆహారముకొరకు దుంపజాతులు మొదలగునవి పండించి ఆ పందులను క్రొవ్వు పట్టునట్లు మేపుట, కోళ్లు మొదలగు పక్షులను పెంచి, వానిని, వాని గుడ్లను అమ్ముకొనుట, బొచ్చు కొరకును, మాంసముకొరకును గొఱ్ఱెలను పెంచుట, చెరువులు మొదలగు జలాధారములలో వివిధజాతుల చేపలను పెంచుట, తేనెటీగలను పెంచి, వానికి వలయు తేనె గల పూవులకొరకై చెట్లు పెంచి, మంచి మంచి తేనెపట్లు పట్టించుట, పట్టుపురుగులను పెంచి, వాని ఆహారముకొరకు తగిన చెట్లు పెంచి, "కాసెనకాయలు" పట్టించుట—ఇవి మొదలగు పనులన్నియు వ్యవసాయములోనివే అని వారు చెప్పుదురు.

మొత్తముమీద అన్నవస్త్రములకు పనికి వచ్చు మొక్కలను, జంతువులను పెంచుట వ్యవసాయము అనవచ్చును.

భారతభూమికి వ్యవసాయము వెన్నెముక

శాస్త్రీయ మగు మంచి వ్యవసాయమే హిందూదేశమునకు మోక్షసాధనము. వ్యవసాయము మడిలోను, మందలోను నేర్వతగినది గాని బడిలోను, బట్టలోను అబ్బదు.

కసువు లేనిచో పశువు లేదు.

పశువు లేనిది పెంట లేదు.

పెంట లేనిది పంట లేదు.

సేద్య మొకవ్యాపారము; వ్యవసాయ మొక శాస్త్రము; ఈ రెంటి సమ్మేళనమే సాఫల్యసాధనము.

దేశైశ్వర్యవృక్షమునకు వ్యవసాయము తల్లి వేరు. పరిశ్రమలు, వాణిజ్యము శాఖాపత్రములు. వేరు చెడిన, కొమ్మలు ఎండి, ఆకులు రాలి చెట్టు నశించును. మంచి వ్యవసాయమున కెన్నో మార్గములు గలవు.—

ముఖ్యమైనవి మూడే మాటలు—

1. మంచివిత్తనముల నెంచుట

మంచివిత్తనము కల్తీలేకుండుటచే, ఒకే కాలమందు సరాసరిగా పండి, చీడలబాధ తగ్గి మంచిలాభము నిచ్చును.

2. కలుపు తీసి నేలను శుభ్రపరచుట

కలుపుమొక్కలు పొలములలోని దొంగలవలె పైరుమొక్కల స్థలము నాక్రమించి, వాటి నీటిసత్తువులను హరించి పాడుచేయును.

3. పశువుల ఎరువును భద్రపరచుట

పేడ పిడకలుచేయక, పశువులను సరిగా పోషించి, చెత్తచెదారములు చేర్చి, మూత్రమును పోనీక, ఎండవానలనుండి యెరువును కాపాడవలయును.

వివరములను వ్యవసాయశాఖోద్యోగీయులే నడిగి తెలిసికొనవలయును.

---

# రామరాజన బఖైరు

డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు

(తరువాయి)

ఈప్రకారము యేనుగులను తెప్పించి ఖాసా యేనుగులకు కవచములు ఆయుధములతోడి అంబారులు సవడోలు వేయించి, ఆసవడోలునందు ధనుర్బాణములను పెట్టించి ముస్తీదు చేయించ [మనగా*] అట్లె ఆయెను. ఈ యేనుగులుగాక ౧,౦౦౦ నిశానియేనుగలు, ౨,౦౦౧ జజాయియేనుగలు, 3,౦౦౦ హతరనాళియేనుగలు సహితము తెప్పించి ౭౨ నియోగములు సమస్త మార్భట తాళదంతమాబఁలసహితుడై తుంగభద్రాతీరమున ఎనిమిది ఆమడలదూరము అడ్డముగ విడిసి కృష్ణాతీరముపర్యంతము శిబిరమును బయట వేయించినవాడాయెను. రాజభూవరు డన్నదో కసుబా తావరగెరె కృష్ణగిరుల మధ్య విడిసినవాడాయెను.

అటుప్రక్క దౌలతాబాదు సింహాసనాధీశ్వరు డగు నిజాంశాహా భైరీపాదుశాహా భీమరథనదిని దాటి సుల్తానుపురము అను పేరు గల ఫేరోజాబాదు అను నగరము బయట విడిసెను. అక్బరజలావుద్దీన్ పాదుశాహా దుర్గము బయట నిలచిరి. వాహిబల్ హింబల్ కుతుబుశాహా పాదుశాహా తెలుగాణ్యమునకు చేరిన ముదగల్లు, రాయచూరులమధ్య తన సైన్యముతో విడిసెను. వహాడదేశపు ప్రభువు ఇమామ్-ఉల్-ముల్కు తన సైన్యముతోకూడ— అట్లే విజాపుర సింహాసనాధీశ్వరు డగు అల్లీ అదులశాహపాదుశాహా స్వసేనాపరివృతుడై— జమాల్ఘుర్ అను దుర్గమునకు వచ్చి విడిసినవారైరి.

నాలుగు దిక్కులను ముసల్మానుపాదుశాహుల సైన్యము నిండినది. ఈదండునకు సంబంధించిన కాలిబంట్లగుంపు, పిండారీలగుంపు, బాణకారులగుంపు, దొంగసిపాయీలు [సహా*] కృష్ణానదిని దాటివచ్చి రాజభూవరుని దేశమునకు చేరిన సీమల నన్నిటిని లూటీచేసి, చెరబట్టి, కొల్లజేసిపోవ నారంభించిరి. కర్ణాటకదేశమునందంతటను బనులు ౨ గ్రామ, నగర, దుర్గ, పట్టణములకు వలసలుపో నారంభించిరి.

రాజభూవరు డన్నను తమదండునకు, సరదారులకు తాకీదు చేసిన వివరము: జినుగుబాజారు బయట ౧,౦౦౦౦ గుఱ్ఱములు, ౨,౦౦౦౦ కాల్బలము; దానికి సంబంధించిన సామాను 3 ఈప్రకారము యిచ్చి తమ వజీరులకు మీరు మీమీదళము [తత్సంబంధమైన *[ యుద్ధసామగ్రులతోకూడ సరిహద్దు సమీపమున నుండు డని ఆజ్ఞ చేయగా అప్పుడు రాజకుమారులు, రాజకంఠీరవులు, రాజమార్తాండులు, రాజతేజోనిధులు, రాజరత్నాకరులు, ఛత్రపతులు మొదలుగునట్టి యసంఖ్యాకులైన క్షత్రియకులపు శూరులు తమసైన్యసహితముగా రాక్షసతగడి బయట విడిసినవారైరి.

అటుతరువాత [యుద్ధసంబంధమైన] సామగ్రి కొనిపోయన వివరము: స్థూలయంత్రములు మూడు వేలు. మధ్యమధ్యస్థయంత్రములు మూడువేలు: అణువుయంత్రములు నాల్గువేలు. ఈప్రకారము యంత్ర

---

౧. ఈమాటకు అన్వయము చక్కగ బోధకాలేదు.

౨. ఇచ్చట మూలవాక్యములోని కొన్నిమాటలకు అర్థము తెలియలేదు.

3. ఇచ్చట కొంత గ్రంథపాత మున్నది. రాజభూవరుడు గడిప్రాంతముల నచ్చటచ్చట కాపుండుటకు కొంతసైన్యమును సర్దారుల కిచ్చి పంపినట్లు తెలియుచున్నది. అట్లు కాపలాయుంచిన స్థలములలో జినుగుబాజా రొకటి. తక్కిన స్థలములను చేర్కొనక "ఈ ప్రకారము" అని తరువాతి వాక్యమును ఆరంభించుట వలన ఇచ్చట గ్రంథపాత మున్నదని యూహించుట కవకాశము కలుగుచున్నది.

ధారులు సైన్యముచుట్టును ఆవరించుకొని [యుండిరి*]. అట్లే యసంఖ్యాకులు జంజాదారులు, బాణాకారులు కాలుపేదలు సహా సైన్యమున కూడియుండిరి. ఆసమయమునందు [అచ్చట నున్న*] బాణవిశేషములు: ధనుర్బాణములు, రామబాణములు, కుమారబాణములు, చ[ం*?]డీ బాణములు, యీప్రకారము నాల్గుదినుసుల బాణములు ౪౦,౦౦,౦౦ లను యెద్దులమీద నెక్కించుకొని వచ్చి నిలచినవారైరి. అట్లే నాజూకైన మందుగుండ్లను తెప్పించిరి. సమస్తమైనవారికి మందుగుండ్లను పంచియిచ్చిన వారైరి.

ఈప్రకారము యుద్ధసామగ్రితో కూడుకొన్నవారై సైన్యమున, మహాబలిష్ఠమగు యుద్ధము జరుగు సమయమందు, ఎవ్వరెవ్వరే ప్రకారము నిలిచియుండ వలయునో ఆప్రకారము నిలిపి, తరువాత నరపతి [తన*] యొద్ద నున్న సేనానాయకులు, అష్టప్రధానులు, దళవాయీలు, బిసలప్ప నాయకుడు, కార్తికనాయకుడు, వీరప్పనాయకుడు మొదలగు నాయకులను పిలిపించి వారికి తగినటువంటి ఆధార ౧ బహుమానములును, నూతన రత్నఖచిత కటక కంఠమాల కుండల కిరీట కౌంస్తుభాంగుళ్యహారములను, కలికితురాయీలను దత్తముచేసి అట్లే నూతన విచిత్ర ౨ వస్త్రములను యిచ్చి బహుమానము చేసి వారికి ఆజ్ఞాపించిన వివరము: "మహమ్మదీయ పాదుశాహులు మనమీద నడచివచ్చుచున్నారు. వారితో యుద్ధము సేయుటకు యుద్ధసామగ్రిని కొనిపోయి చక్కగ యుద్ధము సేయుడు" అని యాజ్ఞాపించగా తత్క్షణమే వారు రాక్షసతగిడి దగ్గరనుండి లేచిపోయి[ కృష్ణా* ]నదిసమీపమున విడిసిరి.

ఈ సమాచారమును, నలుగురు ముసల్మాన పాదుశాహుల హరకారీలు, చోడేదారులు3, బెస్తవారు తీసుకొనిపోయి తమ ఖామందులకు మనవిచేసుకొన్న వారైరి. ముగ్గురు ౪ పాదుశాహులును కూడి యేకస్థులై వజీరోమ్రా సేనాపత్యష్టప్రధానదళవాయీల నందరిని పిలిపించి బహుమానము చేసి, "ఇప్పుడు నరపతి పాదుశాహు దండుతో వచ్చి రాక్షసతగడి బయట విడిసియున్నాడు. యికమీద మనము వెనుక నుండరాదు. చక్కగ సమరము సేయవలయును" అని చెప్పి, తమతమ జగతఖానా౫ వారిని పిలిపించి—పెద్దపెద్దఫిరంగులు ౪,౦౦౦, మధ్య [రకపు*] ఫిరంగులు ౫,౦౦౦, చిన్న ఫిరంగులు ౬౦,౦౦౦, జంజాలు ౫,౦౦౦, హతరకాలు౬ ౧,౦౦,౦౦౦, లేఖీలు ౧౨,౦౦౦౭, సుతరనాళీకలు౮ ౧౨,౦౦౦, బందూకులు ౫,౫౬,౦౦౦,...... ౫,౦,౦౦౦౦౯, విండ్లు అంబులు ౨,౦౦,౦౦౦, గాడద

---

౧. 'ఆధారబహుమానగవ' అని మూలము.

౨. 'అచోద్యవస్త్రగళన్ను' అని మూలము: 'అచోద్య' "not marvellous, not strange" అని కిట్టెలుదొర అర్థము వ్రాసియున్నాడు. ఆయర్థము ఈ సందర్భమున సరిపోదు.

3. ఒక తరగతి చాకర్లు. చేయుకార్యము ఇట్టిది యని తెలియదు.

౪. 'నాల్కారు'—'కొందఱు', 'కొన్ని' అని యీ మాటకు అర్థము. ఇచట 'నాల్కారు'ను 'కొంద' అని యాంధ్రీకరించుటకంటె, ముగ్గురని యాంధ్రీకరించుటయె సమంజసముగ నున్నట్లు తోచినది. అందుచేత నట్లు చేయడమైనది.

౫. ఈమాటకు అర్థము సరియైనది తెలియదు. మందు గుండు మొదలగు యుద్ధసామగ్రులకు సంబంధించిన కచ్చేరి యని తోచుచున్నది.

౬. ఈ ఆయుధముల స్వభావ మిట్టిదని నిర్ణయించుటకు వీలు లేకున్నది.

౭. డిటో,

౮. ఉష్ట్రముల మూపులపై నిల్పి కాల్చు చిన్న ఫిరంగులు.

౯. ఆయుధముల పేరు మూలమునందు వదలబడియున్నది.

వారు ౧ ౩,౦౦,౦౦౦, పరంగివారితో ౨,౦౦,౦౦౦. ఈప్రకారం అందఱిని పిలిపించి రాజ భూవరునితో యుద్ధము చేయవలయునని ఆజ్ఞాపించగా-౨ [వారు*] ఆరాజభూవరుడు దండు దిగినట్టి రాక్షసతిగిడీకి యోజన ప్రమాణమునందు వచ్చి విడిసినవారైరి.

అటుపిమ్మట నిజాంశాహ పాదుశాహ, ఇబరాహింమ్కుతుప్శాహ, ఇమామ్-ఉల్ ముల్కు వీరు ముగ్గురు ౩ కూడి తమ సైన్యమున యేకముచేయుటకు నారంభించిరి. అటుతరువాత [అనుకొన్న*] మాటప్రకారము చక్కగా లడాయిచేయవలెనని మనస్సులో నిశ్చయము చేసుకొనియెదురెక్కి. నడచివచ్చి యెదిరించియుద్ధమునకు ఆరంభించినవారైరి. దీనిని నరపతి చూచి తమ సైన్యములోని సమస్త సరదారులను పిలిచి సైన్యము యేకము చేయించి 'సిపాయితనమునకు కీర్తి తెచ్చుకొనవలె' నని చెప్పగా అట్లే (?) యుద్ధమునకు నడచినవారైరి. ఇమామనములుకునపాదుశాహ సైన్యముతో కూడ ఒకప్రక్కకు జఖలాంవుకూడి౪ యుద్ధమునకు నడచినవాడాయెను. దీనిని చూచి కర్ణాటక సైన్యము ధైర్యముగ నడచినవారైరి. ఒక అరాఫు ౫ యుద్ధమునకు [వచ్చిన*] ఆసైన్యమును వర్ణించుటకు శక్యము కాదు. మూడు దినములు మంచుపొగవల్ల ఒకరిముఖ మింకొకరికి కనుపించలేదు. మందు సామానులు పేలు శబ్దములు: భడభడఢంఢం అను శబ్దము; ధడధడనడ యను శబ్దము; క్రమముగ బారుతెంచు గుండ్లశబ్దము; సరసరసరసురుసురుసురు అను శబ్దములు; ఛటఛటఛట, ఛటల్ అనెడు తుపాకుల శబ్దములు యీప్రకారము అనేకశబ్దములు [వాతావరణమును నింపుచుండెను*]. ఒకచోట సిపాయీలు సిపాయీలతో చేతులుచేతులు కలిపి యుద్ధము చేసిరి. ఏకరీతిని మూడుదినములు యుద్ధము నడచెను. కర్ణాటకమువారు బహు పరాక్రమమును చూపిరి. అప్పుడు దౌలతాబాదు సింహాసనాధీశ్వరుడగు నిజాంశాహపాదుశాహ తెలుగుప్రాంత్య [ప్రభువగు*] కుతుపుశాహపాదుశాహ వీరుకూడి యుద్ధము చేసిరి. ఉభయపక్షముల యందును చలముపట్టి యుద్ధము చేసిరి. సమరరంగమునందలి వర్తమానమును చూచుటకు శక్యపడలేదు; వినుటకు శక్యము గాలేదు; చెప్పుటకును శక్యము గాలేదు. ఉభయపక్షములయందును మృతినందినవారును, గాయపడినవారును అసంఖ్యాకులు. కనుపడక పోయినవారి సంఖ్య చెప్ప శక్యము గాదు.

నిజాంశాహపాదుశాహ, కుతుపుశాహపాదుశాహలు తమయుద్ధము చక్కగ నడచిన దనియు, అవమానము కలిగినందుకు దొడ్డ కయ్యము నడచుటకు దేవుడు అనుగ్రహించినా డనియును సంతోషపడిరి. వీరిలో ననేకులు [యుద్ధమునందు*] మృతినందిరి. తమకర్మఫలమువల్ల దేవుడు కృప యుంచినాడని సంతోషపడుచు వెనుకకు తిరిగిపోయిరి.

---

౧. 'గాడదేరు' అని మూలము. మొదటిశబ్దము 'గాడి' యైన 'బండ్లవా' రని యర్థ మగును. 'గాడిద' అయినచో 'గాడిదలవారు' అని యర్థము.

౨. మూలము తారుమారుగా నుండుటచేత తర్జుమా యథామాత్రకముగ జేయుటకు వీలైనది కాదు.

౩. "ఆమేలె నిజాంశాహపాదశాహను యిబరాహితుశాహ యిమామ్ కుతుపుశాహోను యివరిబ్బరుకూడి" అని మూలము. 'ఇబ్బరు' అని యున్నది గాని వాక్యమునందు మూడు పేర్లున్నవి. (1) నిజాంశాహ, (2) యిబరాహి[ంకు*]తు[ పు*]శాహ, (3) యిమామ్ కుతుపుశాహ [కుతుపుశా అనుట పొరబాటు. ముల్ముల్కు అని యుండవలయును.]; కావున 'ఇబ్బరు' అనుట తప్పనియు, 'మూరుమంది 'యనియు ండవలయు ననియు తలచి యూయూహ ననుసరించి యాంధ్రీకరించితిని. ఇందుకు అనుగుణ్యముగ యుద్ధమునకు నడచిన తురకరాజులలో ఇమామనముల్క్ ఉన్నట్లు మూలములోని యీ క్రిందివాక్యమువల్ల తెలియుచున్నది. "యిమామనములకున పాదశాహన సైన్యవందు కడగె జఖలావు కూడి యుద్ధక్కె నడెదవరాదరు."

౪. ఈమాటకు అర్థము తెలియదు.

౫. డిటో.

అటుతరువాత కన్నడజాణ అల్లి అదులశాహ పాదుశాహ, తదొరదేశపుహాడగు[౧] వాహిం [?*] మనముల్కు పాదుశాహ[౨] వీరిరువురును తనుతమ సైన్యమును ముస్తైదు చేసుకొని తమతమ స్థళములయందే ఉండిరి. యుద్ధమునకు పోలేదు. అయినను[3] తమమీద కావలెనని నడచివచ్చినయెడల 'ఒకచేయి చూతము' [అని*] యూరకనె యీ మూడు దినముల యుద్ధములోను [తటస్థులై యుండిరి*].[౪]

ఈ నిజామాబాదు పాదుశాహ ఖైరీ[౫] తెలుగాంణ్యమువారి పాదుశాహకుతుపుశాహ [వీరి*] దండులోపల [మృతినందిన*] వారిలో అనామీకులు పోగా చిక్కిన పేరుగలవారలు :—

గాయపడిన వివరము :— శివాజీరాజు, నాగోజీరాజు, నింబాజీకాళె, పీరోజీబాపు, సూరరావు, అంకుశరావు, హసనాజి, ఇబరాయితఖాన్, సుజాతఖాన్, లిమెలఖాన్, మర్తుజా బేగ్, సిద్ధిహాజీ జిలా, హినాయతఖాన్, మమదుఖాన్, దావతు ఖాన్, అల్లీఖాన్, యేకలాసఖాన్, హజరతుఖాన్, హసనఖాన్, అంబాజీరావు, సుబ్బరావు, ధళసోజలరావు, నాగోజీ తుకదేవు. మొత్తము ౨౫.

చెర జిక్కినవారు :—అల్లినాయక, మహంమదుజనాలు, అబ్దుల్ నాయక, పీరునాయక, శిలాలునాయక, పరసనాయక, మల్లినాయక, నాగోజీనాయక, తిమ్మనాయక. మొత్తము ౯.

చనిపోయినవారు :—యల్లాజి తుకుదేవ, జమాతవారి తులశిరావు, కేదాజిన సూర్యవంశ, చంగాజిబండగహ, భుజబలరావు, సులతాన్ ఖాన్, బడేఖాన్, మల్లిక్ సాహేబు, హసన్ ఖాన్, హుశేన్ ఖాన్, అకబత ఖైరుఖాన్, రహిమత్ ఖాన్, ముఖరాబు అల్లిఖాన్, మహమ్మదల్లిఖాన్, జాఫరల్లిఖాన్, రసూల్ ఖాన్, సిద్ది ముర్తుజా ఖాన్, భుజంగరావు, యల్లాజిరావు, సుఖానరావు, భొంసెరావు, శివరావు, హిందూరావు, మురారిఘోర్పడే, రామరావు. మొత్తము ౨౫.

రామరాజుయొక్క జను

పట్టుబడిన వివరము :—[౬]

చనిపోయినవారు :—రాఘువప్పనాయక, కార్తవీర్య, కౌమారరావు, అవధూతరావు, శివాజిరావు, అంకుశరావు, శూరణరావు, జగతీపతిరావు. మహీపతిరావు, భుజంగరావు, యల్లాజిరావు, తిమ్మనాయక, దేవరాజు, శెట్టిసాళువ, సోమంణనాయక, దళవాయి జగతీపతి, గోపాలరాజు, రాజకుమార, శంకరరావు, రాజగోపాల, రాజహంసరాజ, సేనాపతి రఘువీరనాయక, పులితోలు సారంగనాయక, హూకశేషంశెట్టి వీరప్ప నాయక.

౧. 'తదొరదేశాదాత్రను' అని మూలము: దేశాదాత్ర నుశబ్దము తప్పు. 'దేశదాతను' అని యుండవలయును. 'తదొర' యనుదేశ మెచ్చటిదో తెలియదు. ఒకవేళ 'బిదర' యనుశబ్దము వ్రాయసకాని నేర్పువల్ల 'తదొర'గ మార్పు జెందినదేమో !

౨. వాహిం ?...మనముల్క్ ఇమామనముల్క్ కాజాలడు. ఏలన అతడు నిజాంశాహ కుతుపుశాహలతో నేకీభవించి రాజభూవరునితో యుద్ధము చేసినట్లు ఇంతకు ముందు చెప్పబడియున్నది. కాబట్టి యుద్ధమునకు పోక అదలశాహతో కలిసియుండిన మనముల్కు మఱియొకడుగ నుండవలెను. అతడు బరీదుల్ ముల్కుగ నుండవచ్చునా ?

3. 'తత్రాపిశి' అని మూలము: రూపు మారి పోవుటచేత మాటకు సరియైన యర్థము తెలియలేదు.

౪. ఈసందర్భములో 'నామాంకితపుత్రయివన తప్పిశి' అనువాక్యము పూర్వాపర సందర్భశుద్ధి లేక త్రిశంకువునుబోలి మధ్య వ్రేలాడుచున్నది. గ్రంథపాతమున్నట్లు తోచుచున్నది.

౫. 'భైరవ' అని మూలము. 'భైరవ'యే 'ఖైరీ' గా మారినదని యందరెఱుగుదురు. నిజామాబాదు అహమదు నగరమునకు నామాంతరమేమో?

౬. పట్టుబడినవారి పేర్ల జాబితా మూలమునందు లేదు. గ్రంథపాతమున్నట్లు తోచుచున్నది.

గాయము [పడినవారు*]:— సిలారఖాన్, సైదలి, లాలశివాజీరావు, సులతాన్‌జీరావు, హీరోజీరావు, కృష్ణాజీ రావు, దౌలతుసింగు, రాజఅంకుశ, రాజభీమాసన, భాస్కరరావు.

ఈప్రకారము పట్టుబడినవారు, గాయపడినవారు, చచ్చినవారల సమాచారమును రాజభూవరుడు విని తనకడ నున్న కొందఱు వజీరులను, దొడ్డదొడ్డసరదారులను, సైన్యములతోకూడ జమాయితుకాండ్రను పిలిపించి, బహుమానముచేసి, చెప్పినది: 'మీరు మీ మీ స్థళములలో సకలసైన్యయుక్తులై సిద్ధమై యుండుడు. మేము వచ్చువఱకును యుద్ధమునకు పోవద్దు. మేము వచ్చినపిమ్మట శత్రువును మర్దించుటకు సమస్తసైన్యమును జమచేసికొని అటుపిమ్మట యుద్ధమునకు సన్నాహము చేసి పోవచ్చును." అని చెప్పి, అల్లీ అదలపాదశాహునిదగ్గరకు దళవాయి గిరప్పనాయకునితోడను, జమదరఖానపవాడినాయకునితోడను చెప్పి పంపిన వివరము:

"నీ వన్ననో బాల్యమునుండియు మా కుమారుడవనిపించుకొనుచుంటివి. నీవు మాయొద్దకు వచ్చి, తొడమీద కూర్చుని పసితనమందు ఆడుకొనియున్నావు. నిన్ను ఆటలాడించి పెంచినందుకు, ఇంతటి చెడుకార్యమునకు పాల్పడితివి. ముసల్మానులు ముగ్గురితో కలసి మామీద దండువెడలుట యుక్తము గాదు. నీకు పాలువెన్నలకు రాయచూరు, ముదగల్లు, ఆదవాని యీ మూడు సీమలును యిచ్చి నిన్ను సంరక్షణ చేసియున్నాము. నీవు వారితో కూడి మామీద నడచి వచ్చుట మంచిది కాదు. నీకు ఉత్తరోత్తరము [శుభము*] అగును." అని చెప్పి పంపగా దానికి అల్లీ అదలశాహ పాదశాహగారు జవాబు ఇచ్చినది:

"నే నన్ననో వారితో మనసు యిచ్చి కలసినవాడను గాను. వారై బలాత్కారముగ నారాజ్యములో ప్రవేశించి, రాష్ట్రమును పాడుచేసిరి. నా రాజ్యములో పర్వతారణ్యప్రదేశము విశేషముకలదు. పర్వతమును కొట్టి చదునుచేసి ఆఘాటు మార్గములందు గుఱ్ఱములు సహా నడచునట్లు మార్గమును విస్తరింపజేసుకొని బలాత్కారముగ నారాజ్యమును జొచ్చియున్నారు. నేను ఏమియును చేసినవాడను కాను. ఇట్లు నీ కొమారుడ ననిపించుకొని, నీతొడమీద కూర్చుని, నీకు హృదయమును యిచ్చియున్నాను. దానికి విరోధము లేదు. ఇచ్చిన ఆనకు తప్పుట లేదు. మీరు నామీద ఆయాసపడవద్దు. నేను మిమ్ము కలసియేయున్నాను. కార్యమును కాలమును అనుసరించి వచ్చియున్నాను. అంతే గాని మనఃపూర్వకముగ కాదు."

అని వచ్చిన హేజీబులకు చెప్పి, సందర్భోచితములగు మాటల నాడి పంపించినవాడాయెను.

వీరు వచ్చి రాజభూవరునికి యావద్వర్తమానమును విన్నపము జేసి తమతోకూడ తోడితెచ్చిన అల్లీ అదలశాహగారి హేజీబులకును హరకారాలకును రాజాగారి భేటీ చేయించి ఉత్తమమైన వస్త్రములను ముత్యాలతురాయి, కమర్‌బందు, శాలువ, ఖబాయి, జలతారు పాగ యిప్పించిరి. అల్లి అదలశాహగారికి యుత్తమమైన ఫిరంగి, వెలగల ముత్యమును,౧ [రాజభూవరుడు*] యిచ్చిపంపెను. ఈ సమాచారమును, దౌలతాబాదు సింహాసనాధీశ్వరు డగు నిజాంశాహ భైరీ పాదుశాహ, గోలకొండ తెలుగాణ్యపు ప్రభువు కుతుపుశాహపాదుశాహ, జహల్నాపుర సింహాసనాధిపతి అకబరు జలాదీను మొగలపాదుశాహ, వీరు ముగ్గురును విని అల్లి అదలశాహకు చెప్పి పంపినది:

"మేము మీరు యేకస్థలమై రాజభూవరుని మీదికి యుద్ధము౨ వెడలితిమి. నీవు లోపలలోపల అనుసంధానమును పెట్టి రాజు[కు*] వస్త్రముల[నేల*]పంప

౧. దుర్ద అని మూలము. 'దుర్ద' అనగా మద్యము త్రాగినపిమ్మట పానపాత్ర యడుగున నంటుకొనియుండు మద్యలేశము. దీనిని రాజభూవరుడు బహుమానము నంపియుండడు గదా: దుర్యాణ (ముత్యము) సరియైన పాఠముగ నుండవచ్చును.

౨. 'బందీ' యని మూలము. ఇది సరియైన మాట కాదు.

వలయును ? ఆయన నీకు [ఏల *] పంపవలయును ? దీనికి కారణ మేమి ? నీవు కుట్రకు లొంగితివి. నిన్ను నమ్మకూడదు. నీవు యీ ప్రకారము సేయుట యుక్తము కాదు. అందరము కూడి రాజరాజుమీద తంబిపోహ జాయిస[౧] వలెను. కార్యమును జయము సేయవలయును అని చెప్పి పంపుచున్నాము. ఇంకను నీవు కుట్రలో పాల్గొనుచుండిన, మేము వేరై తిరిగిపోవలయును. వేరు [మార్గము*] లేదు. నీవు మాతో కూడ వచ్చిన మంచిదే. నీవు మాతో కూడ రాకపోయినను మంచిదే. మేము రాజభూవరునిమీద [యుద్ధమునకు*] పోవలయును [అను*] సిద్ధాంతము ఉన్నది. భావికాలమున నిన్ను రాజభూవరుని యిద్దరిని కూడ తంబి పోహజాయించి లడాయి చేయుదుము.

అని చెప్పి పంపగా దానికి అల్లీ అదలశాహ భయస్తుడై [జవాబు *] చెప్పి పంపినది:

“మీరు ఏమి ఆలోచన చేయుచున్నారో అది నాకు సమ్మతమే. మీరు చెప్పినట్లు వినెదను” అని హరకారాలయొద్ద చెప్పి పంపగా ముగ్గురు పాదుశాహులును సంతోషభరితులై వచ్చిన హరకారులకు బహుమాన మొసగి పంపిరి.

అటు తరువాత రాజభూవరుడు రాక్షసతంగిడి దగ్గర నొక మైదానము ఉండగా అచ్చటికి పోయి విడిసి రణఘంటను కట్టి రణస్తంభమును నాటెను. ఆ రణస్తంభముదగ్గర విడిసెను. కర్ణాటక సైన్యము సర్వము ఒక గుంపై విడిసెను. అటుతరువాత యుద్ధము ఆరంభము ఆయెను. ఇరువదియేడు దినములు పోరు నడచెను. జ[ల*]నపురి సింహపీఠాధీశ్వరు డగు అఖబరజలాయిన్ మొగలు పాదుశాహ పఠానులు, రాజపుత్రులు, మహారాష్ట్రులు, వజీరులు, సామంతులతో కూడి, తాళికోట నలువదివాడలమధ్య విడిసిరి. వీరితో యుద్ధము ఆయెను. ముగ్గురు పాదుశాహులును కూడి రాజభూవరునిమీదికి నడచివచ్చిరి.

రాజభూవరునికడ నున్న [౨] రాచబిడ్డలు, తక్కిన దొడ్డదొడ్డ వజీరులు ఉమ్రాలు తమతమ బలసహితముగా వచ్చి ప్రాతఃకాలమునుంచి ఆరంభము చేసుకొని తొమ్మిది ఘంటల పర్యంతము [యుద్ధము చేసిరి *]. ఉభయపక్షములయందును లడాయి చక్కగ నడచెను. ఉభయపక్షములయందును రణమై యనేకులు మడిసిరి. అనేకులు గాయపడిరి. రాజభూవరుని పక్షమందలి రాచబిడ్డలు వజీరులు, సమస్తమైనవారు యేకాంతమందు రాజభూవరునితో మనవి చేసుకొన్నది:

“ముగ్గురు పాదుశాహులును యేకస్థులై నడచి వచ్చినారు. మనము వెనుకబడక ఎదుటికి పోయి ముఖమున (?) నిలిచి అట్లే యుద్ధముచేసి సంహారము సేయవలయును. ఆ ప్రకారము మొగముపై గొట్టి కార్యమును జయించవలయును. అల్లీఅదల్ శాహు, ఇమాంమన[ము*]ల్క వీరిద్దరు తమ సైన్యముతో తమ స్థళమునందు ఉంటున్నారు. వారు లడాయికి రాబోవునది లేదు. వారు మోసము చేయవచ్చును. వారియందు మాకు నమ్మకము లేదు. ౧౨,౦౦౦ గుఱ్ఱములును, ౨౦,౦౦౦ కాల్బలమును, ఒక నాయకుని [వారిని అడ్డగించుటకు*] నియమించితిరా మేము నిశ్చింతితులమై సమాధానముతో యిటుప్రక్క శత్రువులసంగడ యుద్ధము చేయుదుము. తంబీ పవుజాయింతుము.” అని రామరాజుయొక్క సేవకులు విన్నవించుకొనిరి. రాజు సంతోషించినవాడై, అదే ప్రకారము దళమును పంపి విన్నపము జేసినవారికి బహుమానములను యిచ్చి, తమ వజీరుల కందరికిని నూతనమైన వస్త్రముల నొసగి ఆయా స్థళములకు యుద్ధమునకు పంపెను.

అటుతరువాత యుద్ధము బహుళముగ నడచెను. అఖబరజలాదీనుపాదుశాహ యుద్ధముచేసి వెనుకకు జరిగెను. అటు పిమ్మట మొగలు పాదుశాహ, నిజాముశాపాదుశాహ, వీరిద్దరు కూడి చలపట్టి యుద్ధమును

౧. ఈ పార్సీమాటలు రూపుచెడియుండుటచేత అర్థము కాకయున్నవి. వాని భావ మిట్టిదని యూహించుట సులభము.

౨. 'కడెలిదాలు' అని మూలము: తప్పు.

చేసిరి. వారి కెవ్వరును కృపరాలు౧ కాలేదు. నిజామశాహపాదుశాహ, కుతుపుశాహపాదుశాహ తమ ఫౌజు తీసుకొని యొకతట్టునకు పోయిరి. కర్ణాటకము వారు బహుసంతోషితులైరి. అప్పుడు లక్షబాణములకు యేకరంజకము చేసి విడిచిరి. ఆసమయమందు యిద్దరు పాదుశాహుల దండును అనేకప్రకారములై కొందరు మడిసిరి. కొందరు గాయపడిరి. కొందరు తమతమ స్థలములకు బోయిరి. మరల యిద్దరు పాదుశాహులును వచ్చి యుద్ధము చేసిరి. రెండు ప్రక్కలను యుద్ధము చక్కగా నడచినది. అనేకులు గాయములు పడిరి. అటు తర్వాత రామరాజు మిక్కిలియు కోపమును జెందినవాడై వజీరుల నందరిని పిలిచి ఉత్తరువుల చేసినవాడాయెను.౨ 'రాజహంస'3 యనెడు (అమృతపు)౪ యేనుగమీద కూర్చుని, యావత్తుసైన్యమును వెంటబెట్టుకొని, యెడమప్రక్క గొప్పగొప్ప పేరుగల యోధుల యంబారులయందు గూర్చుండబెట్టుకొని, వెనకప్రక్క భేరీనినాదముసేయించుచు, ముందర తుత్తారలు, పిల్లనగ్రోవులు, తప్పెటలు, సన్నాయిలు, భజంత్రులు మొదలగువాద్యముల ఘోషతో నలుగురు౫ పాదుశాహులమీద యుద్ధమునకు నడచెను. ఫిరంగులు, రామసింగులు, జంజాలు, బాణములు, ఉక్కు బొంబాసుగుండ్లు అసంఖ్యాకముగ తెప్పించి ఆ సమయమందు యేకరంజకము చేసిరి. పాదుశాహులప్రక్క లెక్కలేనందరు ప్రాణములను గోల్పోయిరి; మూర్ఛిల్లిరి; గాయమును పొందిరి. ఈప్రకారము మూడు దినములమీద తొమ్మిదిగంటలపర్యంత్రము యుద్ధము సాగెను. అప్పుడు ముగ్గురు పాదుశాహుల పక్షము వారు గుంపై పలాయనమై పారిపోయినది లెక్కయే లేదు. నలుగడల, నాల్గుదిక్కులకు జరాకట్టై పలాయనము చెప్పి జీవము తప్పించుకొనిపోయిరి. అడవిని పట్టి పారిపోయిరి.

అటుతరువాత ముసల్మానుపాదుశాహులు రెండు క్రోసులు [దూరము *] వెనుకకు జరిగి విడిసిరి. అటు పిమ్మట రాజభూవరుని దండు బహుకుశాలుపడి తమ యుద్ధము జయమైన దని వినోదములు పల్కుచు తమ తమ విడిదల కరిగిరి. దండంతయు అచ్చెరువందియుండెను.౬ ఇక మనమీద యెవ్వరును రాబోవునది లేదు. మనకు లక్ష్యము లేదు. అని యజాగ్రత్తతో సావకాశముగ విడిసియుండిరి. వారివారి రాణువలవారు కోటెపాళి౭ కట్టుటకు ఆరంభించిరి.

అదే సమయమున ముగ్గురు పాదుశాహులును తమలో తాము ఆలోచన చేసుకొని అలీ అదులశాహపాదుశాహదగ్గరకు తమ హేజీబులనున్ను, బంధువుల

---

౧. 'కృపరాలు' అని మూలము. మాటకు అర్థము తెలియదు. క్రింది వాక్యమువల్ల మహమ్మదీయుల దండు భగ్నమైనట్టు తెలియుచున్నది.

౨. రామరాజు చేసిన ఉత్తర వేదో మూలములో లేదు - గ్రంథపాతము కలదేమో.

3. 'రాజహంస' రామరాజు గుఱ్ఱముపే రని యింతకుపూర్వము జెప్పబడినది. ఆపేరిటి యేనుగు నొకటి యుండెనేమో !

౪. 'అమృతద' అని మూలము. ఈసందర్భమున 'అమృతద' అనుమాటకు సరియైన అర్థము తెలియ లేదు.

౫. 'నాల్కుమంది' అని మూలము. తప్పు. 'మూరుమంది' అని యుండవలయును.

౬. అర్థము తెలియదు.

౭. 'అచోద్యవాదరు' అని మూలము. ఈ మాటకు "not marvellous - not strange" అని కిట్టెలు పండితుడు అర్థము వ్రాసియున్నాడు. ఈ యర్థము ప్రస్తుత సందర్భమున సరిపోదు.

౮. 'కోటెపాళి' యనగా యుద్ధభూమియందు సైనికులు తమచుట్టు తాత్కాలికముగ గట్టుకొను ప్రహరి.—'అజాగ్రతతో సావకాశముగ నుండిరి' అను పూర్వవాక్యముతో 'కోటెపాళి కట్ట నారంభించిరి' అనువాక్యము విరోధించుచున్నది.

నున్ను, పెద్దలనున్ను, కొందఱు వజీరులనున్ను పంపించి, “నీవన్నానో యుద్ధమునకు రాలేము : ‘దండు మణిగి పోయినను పోవచ్చును, జయమైనను కావచ్చును’ అని శత్రువుయొక్క బలమును దలచి, వెనుక నిలిచి యుద్ధమునకు రాకపోతివి. మంచిది. దేవుడు చేయించినది అగునని మేము మనశ్శుద్ధితో యుద్ధముచేసి జయించుచున్నాము” అని పల్కిరి.

అదేప్రకారము [ వారు * ] తమ పెద్దలముందు పల్కినవారైరి. అందుకు పెద్దలు [ జవాబు* ] చెప్పినది: “మీరు ఆడినారే మరత్తుమాట, ఆమాట నిదానముగ జయమగును” అని చెప్పగా అదేప్రకారము తమ దండుయొక్క భరవసా తమకు కలుగునని అప్పుడు మరల లడాయికి ఆరంభము చేసిరి.

అదే సమయమందు పదునొకండు గంటలప్పుడు అల్లి అదులశాహాపాదుశాహా మూడవ నమాజు చేసుకొని, తమదేవుని మనస్సున వేడుకొని, ‘స్వామి! మామనస్సునందున్న మనోరథసిద్ధి కావలెను’ అని యనేకప్రకారముల దేవుని ప్రార్థనజేసి, “మనసున నున్నట్టి కార్యము జయము చేయవలయును. మా ముసల్మాను పాదుశాహుల మానమును నిల్పుము, స్వామి!” అని ప్రార్థన చేసి దండును సర్వమును ఆయితపఱచుకొని రాజభూవరుని దండుమీద పడి లడాయి చేయుటకు ఆరంభించెను. రాజభూవరుని దండు అజాగ్రత్తగ నుండినకారణముచేత యెల్లవారితోకూడా దండు యావత్తు మణిగిపోయెను. దండు, బేదండు[౧] అంతయు లూటీ అయిపోయెను. అప్పుడు రాజభూవరుని పట్టుకొనెను.[౨]

అటుతరువాత రాజభూవరుడు అల్లిఅదలశాహుతో పల్కినది: “నీవన్నను నా కుమారుడ వనిపించుకొని యీప్రకారము చేయుట యుక్తము కాదు. నీవన్నానో ధర్మవంతుడవు. పెంచినతండ్రిని కన్నతండ్రిని ద్రోహముచేసినతరువాత వృద్ధికాగలవు. ముందు గొప్ప అదృష్టశాలివి కాగలవు. గురుద్రోహ పితృద్రోహములకు యీసడింపు లేదు, వెనుకతీయుట లేదు. విశేషముగ కీర్తి వచ్చినది. మానము చేకూడినది.[3] ఇకమీద నాయత్న మేమున్నది? దండంతయు మణిగిపోయినది. రణమండలమందు మడిసిపడియున్నది. కొడుకని నేను నమ్మియుంటిని. నన్ను మోసము చేయవని నమ్మియుంటిని. నీవు విశ్వాసఘాతుకుడవైతివి. నన్నుగూడ మోసము జేసితివి. మంచిది. ఏమైనది?[౪] నీవు కుమారుడవైనందుకు నన్ను శత్రువుచేతికి పట్టియిచ్చి తల గోయించవద్దు. నీవె ఫిరంగి తీసుకొని మా శిరమును కొట్టివేయుము. ఇప్పటినుంచి పుత్రపౌత్రపర్యంతము భాగ్యము ననుభవించుకొని యుండవలెను. పరంపరగ ప్రభుత్వమును చేయుచుంటిరి. తలిదండ్రులు గురుదైవములమీదనైనను అవహితము సేయుచుంటిరి. అదృష్టశాలులై పుట్టితిరి. రాజ్యమునంతటిని ఒకటి చేసితివి. ఇకమీద నేమి కానున్నది? నీమనస్సున నున్నట్లు అయినది. ఇక యత్నము జరుగదు. మా మరణకాలము వచ్చినది. ఇకమీద వాపోవలసిన కారణము లేదు.”

అని చెప్పి ఖరీదు గల టోపి మాణిక్యపుకులాయి పెట్టుకొని పూల[౫]శాలువను కప్పుకొని తన దైవమును స్మరణచేసికొని, అటుతరువాత అల్లీయేదులశాహును

౧. బేదండు అనగా యుద్ధములో పాల్గొనక యుద్ధముసేయు వారికి సర్వవిధములగు సామగ్రులను సార్లా చేయువారు. వీరిని నాన్‌కంబాటెంట్సు అని యిప్పు డందురు.

౨. ఈ కడపటివాక్యము రామరాజు అల్లీ అదులశాహునితో నాడు పరుషోక్తులమధ్య నున్నది. అది ప్రథమముననే యుండుట యుక్త మని తలచి తర్జుమాలో యట్లే ప్రథమమున చేర్చితిని.

3. “నామూసికి బంత్తు” అని మూలము. ఈ వాక్యము సందర్భశుద్ధి లేక పూర్వాపరవాక్యములతో విరోధించుచున్నది. సందర్భానుసారముగ మార్చినాను.

౪. ‘ఏనాయితు?’ అని మూలము. ‘ఏనో ఆయితు’—‘అయినదేమో అయిన’ దని నా మిత్రులు హెచ్. శేషయ్యంగారు అర్థము చెప్పినారు.

౫. ‘పూలి’ అని మూలము. అనగా జరీబుటేదారి పనిచేసిన అని యర్థము.

పిలిపించి చెప్పినది: "నీవు నాకుమారుడవైనందుకు వైరి చేతికి నన్ను పట్టియియ్యక నీవె కత్తి తీసుకొని ఒక పెట్టుకు నరికివేయుము. రెండవదెబ్బకు అవకాశము ఉండనీయకుము" అని దొడ్డ ఆనబెట్టి తన దేవుని స్మరణ చేసుకొనెను. అటుతరువాత అల్లి అదులశాహ [రాజభూవరుఁడు*] ఉండినచోటికి వచ్చి యెదుట నిలుచుకొనెను. స్వయము తానే ఫిరంగి తీసుకొని రాజభూవరుని తలను కోసెను. ఈ సమాచారమును ముగ్గురు పాదుశాహాలును విని సంతోషించినవారైరి.

తర్వాత కర్ణాటకపు దండు సమగ్రము లూటి కొట్టబడెను. దండంతయు పారిపోయెను. అనేక గుఱ్ఱములు, మందుగుండు నించిన ఖజానా సర్వమును లూటి అయిపోయెను. మిగిలిన సైన్యము విజయనగరమునకు పరుగెత్తి వచ్చెను. రాజభూవరుడు చనిపోయిన సమాచారము నగరపు చంద్రలయందున్న తల్లిగారికి వచ్చెను. [కుమారుడు*] చనిపోయిన సమాచారమును విని [ఆమె*] అపరిమితముగ దుఃఖించెను. కుమారుని దోషమునకు 'బెల్లాహారమును'[౧] పుచ్చుకొని ప్రాణత్యాగము చేసెను. ముగ్గురు భార్యలున్ను యిదే ప్రకారము తమతమ ఆభరణములు, వస్త్రములు, నవరత్నఖచితమైన అలంకారములు, జడబంగారు సీసఫల్లు,[౨] ముత్యపుదండ, బాదంబల్యాభరణము,[3] నూతనవస్త్రములుసహా యజ్ఞపురుషాంతర్గతుడగు పరమాత్మునికి సమర్పణము చేసి 'బెల్లాహారము' తీసుకొని ముక్తిని బొందిరి.

అటుతరువాత ముగ్గురు పాదుశాహాలున్ను సైన్యసహితముగ విద్యానగరమునకు వచ్చి ఊరిముందర బయలులోని కోటలో నుండిన సామాను, ఖజాన [లో*] సేకరించియుండిన అపరిమిత ద్రవ్యము నూతనమైన వస్త్రాలంకారములతో సహా మూలముగా యెత్తుకొని గజతురగ రథములు, నానావాహనములు తీసుకొని తమతమ స్థానములకు తెరలిపోయినవారైరి. అఖబర జలావుదిం పాదుశాహను, యిమాములుకు పాదుశాహను, వరాడదేశమువాడు నిజాముశాహి భైరిపాదుశాహును [ఈ*] ముగ్గురుపాదుశాహులును బహుమానము చేసి పంపి తర్వాత రాజభూవరుని [యస్తులను*] కాసివారణాసికి పంపించి జయించునిమిత్తము తాను పెనుగొండకు సైన్యము సాగించుకొని తెరలిపోయి, నెలవరకు ముట్టడి వేసి విశేషముగ యుద్ధము చేసి చలపట్టి యా కోటను జయించి అచ్చట దండును నిలిపి విజాపురమునకు తెరలిపోయినవాడాయెను.

రక్తాక్షి సంవత్సర వైశాఖ బ ౨ సోమవారము శ్రవణ నక్షత్రమునందు రాజభూవరుడు ముక్తుడాయెను.

క్రోధి నామ సంవత్సర ఆషాఢ బ ౮ రామరాజుయొక్క బఖైరు సంపూర్ణము.

---

౧. విషాహారమని యర్థము. విషము బెల్లముతో కలిపి తినుటచే ఆపేరు వచ్చినట్లున్నది.

౨. ఈ నగయొక్క స్వరూప మిట్టిదని తెలియదు.

3. డిటో.

# ప్రపంచదుస్థితి: దానిని తొలగించుటకు మార్గములు

## అంతర్జాతీయభావములను పెంపొందించుటయొక్క ప్రాముఖ్యము

చా. వెం. హనుమంతరావుగారు, యమ్. ఏ., బి. ఇ డి.

౧

ప్రస్తుతకాలములో ప్రపంచము ఆర్థికముగ చాల క్లిష్టపరిస్థితులగుండ పోవుచున్నదని అందరకును తెలిసిన విషయమే. ఈవిషమపరిస్థితులనుండి బయటికి వచ్చుటకు మార్గము లెవ్వి? ఇకముందెప్పుడును వీలైనంతవర కిట్టిపరిస్థితులే ఏర్పడకుండ చేయుట ఎట్లు? అనుప్రశ్నలు ప్రపంచమందలి వివిధదేశముల ప్రభుత్వములచేతను, ధీమంతులచేతను ఆలోచింపబడుచున్నవి. ప్రస్తుతపరిస్థితులకు కారణములను నిర్ధారణ, చేయుటలో వివిధదేశనిపుణులమధ్య భేదాభిప్రాయములు లేవనియే చెప్పవచ్చును. మొత్తముమీద వాటినిగురించి అందరును ఏకాభిప్రాయమునే కలిగియున్నారు. కాని ఆకారణములకు తగినట్టి సంస్కరణము లెవ్వి? ఎట్లాసంస్కరణము లాచరణయందుంచబడవలెను? అనువిషయములనుగురించి భేదాభిప్రాయము లున్నవి. ఇట్టి ప్రపంచ మంతను ఆవరించిన ఈసమస్యాసందర్భములలో అట్టిభేదాభిప్రాయము లుండుట సహజమే.

౨

ప్రపంచ-ఆర్థికదుస్థితికి కారణములలో ప్రధానస్థానము యుద్ధసంబంధమైన నష్టపరిహారములకును, వాటితోపాటే యగు యుద్ధఋణముల సమస్యకును ఈయవలసి యున్నది. జర్మనీ యుద్ధములో ఓడిపోవుటచే ఆదేశస్థులు గెల్పొందినపక్షమువారికి వార్సేల్సు సంధిప్రకారము నష్టపరిహారముల నిచ్చుటకు తీర్మానింపబడెను. జర్మనీవారు కొంతకాలము వాగ్దానము ప్రకారము నష్టపరిహారముల నిచ్చినప్పటికిని, తరువాత తమదేశపు ఆర్థికస్థితినిబట్టి అటుతరువాత తగ్గుమొత్తముల కాని ఈయలేమనిరి. ఆసంగతిని విచారించుటకై మొట్టమొదట డాస్ అనునాయనను, తరువాత యాంగ్ అనునాయనను మధ్యవర్తిగ ఏర్పాటుచేసి, వారు చెప్పిన ప్రకారము తగ్గుమొత్తములను జర్మనీవారు ప్రతికక్షుల కిచ్చుచుండిరి. చివరకు జర్మనీదుస్థితి క్రమేపి హెచ్చగుటచే వారసలే ఏమియు నష్టపరిహారములక్రింద చెల్లించ లేమనిరి. ఈనష్టపరిహారములు జర్మనీ చెల్లించవలెననిన, డబ్బు, లేక బంగారుతో చెల్లించవలెను. లేదా, వస్తువులరూపముగ చెల్లించవలెను కాని వాటిని పుచ్చుకొనువారిలో ముఖ్యులగు ఫ్రెంచివారు, బెల్జియమువారును బంగారులో గాని నష్టపరిహారములను తీసికొనమని పట్టుపట్టుటచే పరిస్థితులు మరింత దుర్భరమయ్యెను. కాని ప్రస్తుతప్రపంచపరిస్థితుల ననుసరించి ఒకదేశము ఆర్థికముగ నీరసస్థితియందుండుటవలన ఇతరదేశములకు గూడ నష్టమే. ఇట్లు జర్మనీ నష్ట పరిహారముల నిచ్చుకొనలేక కష్టదశయందుండుట ప్రపంచపునరుద్ధరణమునకు, ప్రపంచ ఆర్థికోన్నతికి భంగకరమని గ్రహించియే యూరపియన్ రాజకీయవేత్తలు వాటిని తొలగించుటకు నిర్ణయించునిమిత్తము పోయినసంవత్సరము లాసేనిసమావేశమును ఏర్పాటుచేసిరి. ఆసమావేశమునందు జర్మనీ నష్టపరిహారముల నికముందు ప్రతిసంవత్సరము నీయ నవసరము లేదనియు, మొత్తముగా ఒకసారిగా నష్టపరిహారముక్రింద కొంతసొమ్మును బ్యాసిల్ అంతర్జాతీయ బ్యాంకునందు కట్టున ట్లేర్పాటుచేసిన సరిపోవుననియు నిర్ణయింపబడెను. ఆనిర్ణయముప్రకారము నష్టపరిహారసమస్య పూర్తిగ పరిష్కరింపబడినదనియే చెప్పవచ్చును. నష్టపరిహారములు తొలగింపబడుటవలన జర్మనీకి తనజాతీయ-ఆర్థికజీవితమును స్థిరమైన పునాదులపై

ఏర్పాటుచేసికొనుట కనువగు పరిస్థితు లేర్పడినవి. కాని జర్మనీస్థితి దానివలన బాగుపడినదని తలంచుట పొరపాటు. ప్రపంచమం దితరదేశములతోపాటు జర్మనీ కూడ ఆర్థికదుస్థితి, వర్తకపుకష్టములకు లోనై క్లిష్ట పరిస్థితుల కాలవాల మగుచున్నదని మనము జ్ఞాపక ముంచుకోవలసి యున్నది. ఇతరదేశములవలెనే జర్మనీ కూడ అవసరమునకు కావలసినవాటికంటె హెచ్చువస్తువులను తయారుచేయుటయందు నిమగ్నయై యుండుటవలన వర్తకము పడిపోవుటతో ఆసరకు లమ్ముడుపోక, పరిశ్రమలు లాభములు తగ్గిపోవుటయు, పనిచేయువారకు కూలియందు "కోతలు"ను, పనులనుండి తొలగింపులును హెచ్చయినవి. నిరుద్యోగసమస్య హెచ్చుగానున్న దేశములలో జర్మనీదేశముగూడ ప్రధానస్థానము నాక్రమించుచున్నది.

3

నష్టపరిహారసమస్యతో నెక్కువసంబంధము కలదియు, ప్రపంచఆర్థికదురవస్థకు కారణములలో నొకటియు నగునది యుద్ధఋణముల సమస్య. యుద్ధఋణములు యూరపియన్ దేశములు అమెరికాకు ఈయవలసినవై యున్నవి. యుద్ధమునకు కావలసిన డబ్బు అమెరికా పెట్టుబడి పెట్టుటచే అమెరికావా రాయప్పును తీర్చుడని కోరుటలో తప్పేమియు లేదు. కాని ఆఋణములను బంగారులోనే తీర్చవలె ననుపట్టు పట్టుట ప్రపంచమునకు, అందు ముఖ్యముగా యూరపియన్ దేశములకు, అమెరికాకు కూడ అధికనష్టము కల్గించుచున్నది. యూరపియన్ దేశములకు జర్మనీవద్దనుండి నష్టపరిహారములు వచ్చుచున్నంతకాలము వారికి అమెరికా దేశపుఋణమును తీర్చుట కష్టముగా లేకుండెను కాని, నష్టపరిహారములు లాసేనీఒడంబడిక ప్రకారము తీసివేయబడినప్పటినుండియు, వారికి తమ ఋణసంబంధమగు వాగ్దానముల నెరవేర్చుట చాల కష్టముగా నున్నది. ఈ ఋణముబాధ ఎంతఒత్తిడి కలుగచేయుచున్నదియు, ఫ్రాంసులో దీనినిగురించి హెరియట్ ప్రభుత్వమువారు చాల ధైర్యముగ పోరాడి రాజీ నిచ్చిరనియు, ఇంగ్లండులో బంగారుప్రమాణము తొలగింపవలసి వచ్చినదనియు, ఇకముం దేదేశము గాని యుద్ధఋణములు తీర్చు స్థితియందు లేకపోవుటచే వాటినిగూర్చి యేదో యొక నిర్ణీతపరిష్కారమునకు రావలసిన యావశ్యకతను ప్రతివారును గ్రహించుచున్నారనియు చెప్పిన స్పష్టము కాగలదు. ఈసమస్యనుగురించి పర్యాలోచన చేసి ఒక విధమగు నిర్ణయమునకు వచ్చుటకు త్వరలో ఒకసమావేశము ఏర్పాటు చేయబడు ననువార్తలు వినవచ్చుచున్నవి. యుద్ధఋణములను పూర్తిగ తొలగించి వాటినీయవలసిన దేశములకు కొంత విశ్రాంతి నిచ్చినగాని ప్రపంచోద్ధరణోద్యమమునకు తగుప్రోద్బల మేర్పడదని గ్రహింపవలసి యున్నది.

౪

ప్రపంచపునరుద్ధరణకై ముఖ్యముగ జరుగవలసిన సంస్కరణములలో సుంకముల నిర్మూలనము ఒక ముఖ్యవిషయమై యున్నది. యుద్ధానంతరము ఏర్పాటుకాబడిన మధ్యయూరప్‌నందలి చిన్నచిన్న దేశములును, యుద్ధమునకు పూర్వము హెచ్చుగ వ్యవసాయముమీదనే ఆధారపడియుండిన ఇండియా మొదలగు దేశములును తమతమ బాల్యావస్థయం దుండిన పరిశ్రమలకు రక్షణ నిచ్చుకొనుటకై సుంకములను మొట్టమొదట విధించుట మొదలిడి క్రమక్రమేణ వాటిని హెచ్చుచేయుచు వచ్చినవి. క్రొత్తగా పరిశ్రమల నభివృద్ధిచేసికొను ఈదేశములే గాక పూర్వమునుండి పరిశ్రమలందు ముందడుగు వైచుచుండిన అమెరికా, జర్మనీ, రష్యా మొదలగు కొన్ని పెద్దదేశములు తమతమ సుంకముల రేట్లను విపరీతముగ హెచ్చుచేయ మొదలిడినవి. చివరకు చిరకాలమునుండియు "ఫ్రీ ట్రేడు" సూత్రము నవలంబించుచు, ప్రపంచమందలి "ఫ్రీ ట్రేడు" పద్ధతి నవలంబించు దేశములలో అగ్రస్థానము వహించుచుండిన ఇంగ్లండు కూడ ఆపద్ధతిని వదలి సుంకములపద్ధతినే అవలంబించుట తటస్థించినది. సుంకములను విధించు పద్ధతివలన ప్రపంచమున కేవిధముగ నష్టమని మనమాలోచించిన తేలున దేమనగా, వివిధదేశములమధ్య

నిరాటంకముగ వర్తకవ్యాపారములు జరుగుటకు దాని వలన నిరోధము లేర్పడుటయే. సుంకములమూలమున ఒకదేశమునుండి ఇంకొకదేశమునకు వస్తువులఎగుమతి తగ్గిపోవును. వర్తకము తగ్గిపోవుటవలన పరిశ్రమలవలన తయారయిన వస్తువుల అమ్మకము తగ్గిపోవును. పరిశ్రమలఫ్యాక్టోరీలకు పని లేకుండపోవును. ఫ్యాక్టోరీలకు పని తగ్గిపోవుటతో పనిచేయువారలకు పని లేకుండ బోయి జీవనోపాయము లేకుండపోవును. నిరుద్యోగ సమస్య యభివృద్ధి చెందుటయు, నిరుద్యోగులదుస్థితి హెచ్చుగుటయు, ప్రజలలో చాలమందికి డబ్బు లేక పోవుటచే తయారగుచున్న వస్తువు లమ్ముడుపోకుండుటయు, వాటిధరలు పూర్తిగ పడిపోయి ప్రజాసామాన్యమునకు తీరనినష్టము వాటిల్లుటయు సంభవించును. ఈవిధముగ ఒకనష్టమునుండి ఇంకొకనష్టము, ఒకకష్టము నుండి ఇంకొకకష్టము, ఒకదానిఫలితముగ ఇంకొకటి బయల్వెడలి ప్రపంచదుస్థితిని హెచ్చుచేయుటకు మాత్రమే తోడ్పడుచున్నవి. ఇవన్నియు ఒకదానికొకటి పరస్పరసంబంధ మున్న విషయము లగుటచే, ఒకదానిని నిర్మూలము చేయవలె నన్న అన్నిటికిని మూలాధారమగు సుంకములను తొలగించుమార్గ మేర్పాటుచేసిన క్రమేణ తక్కిన వన్నియు వాటియంతట నవియే సర్దుబాటగును.

ఏదేశమున కాదేశము ఈవిషయమై నిర్ణయించుకో వలసి వచ్చిన ఎన్నటికిని కూడ సుంకములసమస్య తృప్తికరముగ పరిష్కరింపబడు ననుట కవకాశములు లేవు. దేశదేశములమధ్య నున్న అసూయలు, అనుమానములు పూర్తిగా నశించి ప్రతిదేశమును ఇతరదేశముల ప్రసక్తి లేకుండ సుంకముల తగ్గించునని తలంచుట వెర్రితనము. జర్మనీ ఫ్రాంసుల మధ్య, ఫ్రాంసు ఇటలీల మధ్య, అమెరికా జపానుల మధ్య ఇట్లు దేశదేశములమధ్య నున్న అసూయలు వాటియంతట నవి తగ్గిపోయి వాటికి సమైక్య ఏర్పడునని చెప్పుట సాహసమే. వివిధదేశముల ప్రతినిధుల నొక్కచోట చేర్చి, అన్నిటికిని అనుకూలముగను, సంతృప్తికరముగను ఉండునట్టి ఒక పరిష్కారమును సమష్టిపై ఏర్పాటు చేయుటయందే ఈసమస్యాపరిపూర్తి ఇమిడియున్నదని చెప్పవలసి యున్నది. అట్టి అంతర్జాతీయ పరిష్కారము నేర్పాటు చేయుటవలననే వివిధదేశముల లాభమును ప్రపంచలాభముకూడ చేకూరగల దను నభిప్రాయము దినదినము ప్రబలమగుచున్నప్పటికిని, చిరకాలమునుండి యుండిన అనుమానపిశాచము, జాతీయభావములు పూర్తిగ పోకుండుటయే, ఆ ఫలితము రాకుండుటకు అడ్డుగ నున్నవని చెప్పుటలో విరుద్ధమేమియు లేదు. సుంకములమూలమున, ప్రపంచవర్తకమునకు కల్గిన అడ్డంకులమూలమున ఆ వర్తకవ్యాపారము ౧౯౨౯ సంవత్సరముకన్న ౧౯౩౨ లో సగముకంటె ఎక్కువగా తగ్గిపోయినదనియు, వివిధదేశములందలి నిరుద్యోగులసంఖ్య ౧౦ మిలియన్లనుండి ౩౦ మిలియన్లవరకు పెరిగినదనియు నానాజాతి సమితివారి ప్రచురణలయందు కలదని మన మీ సందర్భములో జ్ఞాపక ముంచుకొవలసి యున్నది.

సుంకముల విషయమై ఆలోచించుచున్నప్పుడు దానితో ఎక్కువసంబంధము గల వేరొకవిషయమును మనస్సునం దుంచుకొ వలెను. ప్రపంచమందలి దేశములన్నియు ఒకేస్థితియందు లేవు. కొన్నిదేశములు పూర్తిగ పారిశ్రామికదేశములుగా నున్నవి; మరికొన్ని వ్యవసాయమే ప్రధానవృత్తిగా గలవిగా నున్నవి. కాని ఏదేశము కాని ఎల్లప్పుడును వ్యవసాయదేశముగానే కాని, లేక ఎల్లప్పుడును పారిశ్రామికదేశముగానే కాని యుండు నని తలంచుట పొరపాటు. అది స్వభావమునకు వ్యతిరేక మగునట్టి విషయము. గమనించి మనము చూచిన ఏదో ఒక్కవృత్తిమీదనే ఆధారపడియుండు దేశము త్వరలో తన పరిస్థితులయందు మార్పు కోరుట గోచరించును. ఆవిధముగనే పూర్తిగ పారిశ్రామికదేశమగు ఇంగ్లండు ఇప్పుడిప్పుడు వ్యవసాయపరిశ్రమయొక్క ప్రాముఖ్యమును గ్రహించుట తటస్థించుచున్నది. పూర్తిగ వ్యవసాయ వృత్తిపైననే ఆధారపడియుండిన హిందూదేశమువంటి దేశము పరిశ్రమల నభివృద్ధి చేసికొనుటకు ప్రయత్నించు

చున్నది. కాని ఈమార్పు అనుకొనినంత, కోరినంత త్వరలో వచ్చునని తలంచుటకు వీలు లేదు. అది చాలకాలము తీవ్రప్రయత్నముమీద కాని కొనసాగ నేరదు. క్రొత్తపరిశ్రమల నేర్పాటుచేసికొని, వాటి యభివృద్ధికొరకై తంటాలుపడుచున్న దేశములకు తమ ఉద్దేశ్యమును నెరవేర్చుకొనుటలో సుంకముల విధించుట ఒక ముఖ్యమార్గముగ నున్నది. అట్టి దేశములు సుంకములు తగ్గించుట కుద్దేశింపబడిన యుద్యమమునకు సహాయపడు నని తలంచుట కవకాశములు లేవు. ఈ సందర్భములలో ఏవిధముగ ఈ సమస్య పరిష్కారము చేయబడవచ్చు నని మన మూహించిన తేలున దేమనగా, క్రొత్తగా పరిశ్రమల నేర్పాటుచేసికొనుచున్న దేశములకు తగు ప్రోత్సాహ మిచ్చి ఆయా దేశముల కనుకూలముగ నుండు పరిశ్రమల నభివృద్ధి చేసికొనుట కవకాశములు కలుగజేయుటయు, ఆ మార్గముగ ఆదేశములకుగూడ ఇతర పారిశ్రామిక దేశములతోపాటు తమ ప్రజాజీవితమును, జాతీయజీవితమును పెంపొందించుకొనుటకు వీల్లు కల్గించుటయు నై యున్నది. దీనివలన ప్రపంచవర్తకము మామూలు పద్ధతులకు వచ్చుటకు కొంత అడ్డము కలుగు ననుమాట నిజమే. ఎందువల్ల నన, ఏదేశమున కాదేశమే స్వశక్తిపై నాధారపడియుండు పరిస్థితులు దానివలన నేర్పడును. కాని దేశమునందు తయారయిన వస్తువులు అమ్ముడుపోవుచుండుటచే, దేశీయపరిశ్రమలకు ప్రోత్సాహము కల్గి, నిరుద్యోగసమస్య కొంత తగ్గుటయు, అవసరమునకు హెచ్చుగా వస్తువులు తయారగుట తగ్గిపోవుటయు, మొత్తముమీద లాభమే కల్గుటయు జరుగును. పైన చెప్పినదానిని బట్టి తేలున దేమనగా, ప్రతిదేశమునందును ఏదో ఒక్కవృత్తియందే ప్రజలందరును నిమగ్నులై యుండక, వీలైనంతవరకు వ్యవసాయము, పరిశ్రమలు రెండింటిని కూడ అభివృద్ధి చేసికొనుటయే ప్రపంచముయొక్క దుస్థితిని తొలగించుటకు ప్రధానమార్గ మనువిషయమై యున్నది.

## ౬

ప్రపంచ ఆర్థికదుస్థితిని తొలగించుటకు ముఖ్యమార్గము ఆర్థికవిషయములలో అంతర్జాతీయభావములను పెంపొందించుటయే. ప్రపంచమందలి వివిధ దేశముల మధ్య ఆర్థికసంయోగము చేకురనంతకాలము ఈ అల్లకల్లోలము తగ్గుట కవకాశములు లేవు. కాని అంతర్జాతీయభావములు పురికొల్పవలెనని మనము తెలిసికొనిన లాభము లేదు. అట్టిమార్పు ఆచరణలోనికి దీసికొనివచ్చుటకు అనుకూల పరిస్థితు లేర్పాటుచేయుటకు ప్రయత్నము చేయవలసియున్నది. లేకపోయిన ఎంత కష్టముమీద, ఎంతజాగ్రత్తగ అంతర్జాతీయసౌధమును నిర్మించినప్పటికిని దానికి బలహీనమైన పునాది యుండుటచే ఏమియు సంతృప్తికరమగు ఫలితములు రాకపోవచ్చును. ఈ పునాదులు బలముగ నుండుటకు కావలసినది ప్రపంచశాంతి. ప్రపంచశాంతి అంతర్జాతీయ ఆర్థిక పునరుద్ధారణముపై ఎట్లాధారపడియున్నదో అట్లే ఆర్థిక జీవిత పునరుద్ధారణ ప్రపంచశాంతి పూర్తిగ ఏర్పాటయిన గాని జరుగుట దుర్లభము. వీటిరెండింటికిని పరస్పర అవినాభావసంబంధ ముండుటవలన ప్రపంచప్రజ లందరును ఏకగ్రీవముగ కోరదగిన దేమన, ప్రస్తుతము జినీవాలో జరుగుచున్న ప్రపంచ-ఆయుధవిసర్జనసమావేశము జయప్రదముగ ముగియవలె ననునదై యున్నది. కాని ఆ సమావేశము జయప్రద మగుటకు ప్రధానమగు ఆడ్డంకులలో ఒకటి దానియందు పాల్గొనుచున్న వివిధదేశములమధ్య నిజమగు సయ్యోగ్యత లేకపోవుటయు, ఒకదేశమును చూచి ఇంకొకదేశ మోర్వలేక పోవుటయు, అపనమ్మకము లెక్కువగ నుండుటయును. రెండవవిషయము: జర్మనీ ఫ్రాంసులకు కొన్నితరములనుండి వచ్చుచున్న విరోధము వలన జర్మనీ ఫ్రాంసుతో సమానముగ ఆయుధసామగ్రులను కల్గియుండుటకు హక్కు కావలెనని పట్టుపట్టి, తనహక్కు నిరాకరింపబడిన ఆయుధవిసర్జన సభనుండి విడిపోయెదనని బెదరించుచున్నది. ఇట్టిసందర్భములలో సమావేశము భగ్నమగుట కంగీకరించుటకంటె ఇతరదేశములు జర్మనీయొక్క హక్కును అంగీకరించుట కనుమతించుట కొంతవరకు శుభదాయకమే. ఆయుధవిసర్జన

# కొడైకెనాల్ చిత్రములు

(యస్. శంకర సుబ్రహ్మణ్యంగారి చిత్రములు)



౧. చెరువు, ఒకమూల



౨. చెరువు, ఆరామము



3. చెరువుకట్ట



४. పడవపై విహారము

సమావేశముపై ప్రపంచశాంతి ఆధారపడియున్నదనియు, ప్రపంచశాంతిపై ప్రపంచ - ఆర్థికపరిస్థితుల బాగోగులు ఆధారపడి యుండుననియు ఇదివరలో చెప్పియుంటిమి. ఈ విషయమును ప్రపంచమందన్ని దేశములవారును గ్రహించియే యున్నారు. ప్రపంచ ప్రజాభిప్రాయము దీనికి పూర్తిగ అనుకూలముగ నున్నది. ఆయుధవిసర్జన సభయందు కూడిన వివిధదేశ ప్రతినిధులకు ఈ ప్రజాభిప్రాయమును తృణీకరించుటకు గాని, దానికి వ్యతిరేకముగ నిర్ణయించుటకు గాని సాధారణ సందర్భములలో అవకాశ ముండదనియే చెప్పవచ్చును. ముందు రాబోవు యుద్ధములో-అట్టియుద్ధము వచ్చుటయే తటస్థించుచో-ప్రజలకు కలుగుకష్టములు ఇంతింత యని చెప్ప నలవిగాకుండ నుండునని అందరును గ్రహించిన విషయమే. వాటి హృదయనిర్భేదనమునుగూర్చి ఈమధ్యనే బాల్డ్విను గారు పార్లమెంటులో వర్ణించియున్నారు. అట్టికష్టములకు ప్రపంచమును పాల్పడచేయకుండ నుండు గొప్ప బాధ్యత వివిధప్రభుత్వములపై నాధారపడియున్నది.

## ౨

ఆయుధవిసర్జన ఇంకొకసందర్భమునుబట్టికూడ ప్రపంచపునరుద్ధరణకు చాల ముఖ్యమైనదిగా నున్నది. ఆర్థికదుస్థితికి ముఖ్యకారణములలో యుద్ధఋణములొకటి యనియు, వాటివలన ప్రపంచమందలి బంగార మంతయు ఒక్క అమెరికాదేశమందే కేంద్రీకరింపబడుటచే ఇతర దేశములలో సంక్షోభ మెక్కువై ద్రవ్యసంబంధమైన సంచలన మెక్కువ యగుచున్నదనియు ఇదివరలో చెప్పియుంటిమి. యుద్ధఋణములసమస్య ఈమధ్య చాల ప్రాముఖ్యము వహించినది. అమెరికాప్రభుత్వమువారు డిశంబరు ౧౫-వ తేదీ వాయిదా నాటికి తమకు రావలసిన యుద్ధఋణములను చెల్లించవలసినదని యూరపియన్ దేశములను తొందరచేయుటయు, అట్లు చెల్లించుటకు తమకు శక్తి లేదని ఫ్రాంసు, బెల్జియము మొదలగు దేశములు ప్రకటించి తమవాయిదాలను చెల్లించలేకపోవుటయు, ఇంగ్లండుమాత్రము ఎట్లో అతికష్టముమీద తా నీయవలసిన అప్పువాయిదామొత్తము (సుమారు ౯౫,౫౦౦,౦౦౦ డాలర్లు (డాలరు=సుమారు రు. 3-౮-౦) ను చెల్లించి ఇకముందు చెల్లింపలేమని తెల్పుటయు అందరకును తెలిసినవిషయములే. ఆ యుద్ధఋణములను పూర్తిగ మానివేయవలెనని ఇంగ్లండు, ఫ్రాంసు మొదలగుదేశములు కోరినప్పుడు, అమెరికా 'యూరపియన్ దేశములు ఆయుధవిసర్జన చేయక, ఆయుధములను సమకూర్చుకొనుటలో డబ్బుఖర్చుచేయుచున్నంతకాలము ఋణముల నిచ్చుకోలేమని చెప్పుటయు, వాటిని తొలగించు మనుటయు అసమంజసములగు కోరిక' లనియు, 'అట్లు తగ్గించుటకు వీలు లే'దనియు బదులు చెప్పెను. అమెరికాప్రభుత్వము తమకు రావలసిన యుద్ధఋణములను తీర్పు డని, యూరపియన్ దేశములను కోరుటలో తప్పేమియు లేదు. ఆయుధవిసర్జనయొక్క ప్రాముఖ్యమునుగూర్చి పట్టుపట్టుటలో కూడ వారు న్యాయముగనే ప్రవర్తించిరని చెప్పవలసి యున్నది. కాని జ్ఞాపకముంచుకోవలసిన విషయము లేమన, యుద్ధఋణము లమలులో నున్నంతకాలము యూరపియన్ దేశముల ఆర్థికస్థితి బాగుపడుట కవకాశము లేదనియు, దానియందు అభివృద్ధి కన్పడినకాని ప్రపంచ-ఆర్థికస్థితి యభివృద్ధికి అడ్డు ఎప్పటివలెనే యుండు ననియు, ప్రతి యూరపియన్ దేశపు ఆదాయమందును పూర్వముకన్న చాల తగ్గుదల యున్నదనియు, అమెరికా ప్రపంచపునరుద్ధరణోద్యమమునకు సహాయపడుటకు మార్గము యుద్ధఋణములు తొలగించుటయే యనియు నను నవై యున్నవి. యుద్ధఋణముల భావిదశ నాలోచించుటకు అమెరికాప్రభుత్వము అంగీకారముగ నుండుట, దానికై ఒక అంతర్జాతీయసమావేశము నేర్పాటుచేయుట కంగీకరించుట శుభచిహ్నమే. కాని యుద్ధఋణములను తొలగించుటతో ఆయుధవిసర్జనసమస్యకూడ పరిష్కార మయినయెడల ప్రపంచమునకంతకును ఎంతేని లాభము కలుగును.

## ౩

ప్రపంచ ఆర్థికదుస్థితిని తొలగించుటకు ముఖ్యమార్గ మొక్కటే కల దని ఇంతవరకు స్పష్టమైనది.

అది అంతర్జాతీయ సమావేశము; అంతర్జాతీయ ప్రబోధము. ఏదేశమున కాదేశము, ఏఖండమున కాఖండము ప్రత్యేకించి తన సమస్యలను నిర్ణయించి, వాటిని తమంతట తాము పరిష్కరింప జూచుకొనుటవలన లాభ ముండదు. ఈకాలమందు అన్ని విషయములందును ప్రపంచ మంతయు ఏకమగుచున్నది. శాస్త్ర సంబంధమగు క్రొత్త మార్పులవలనను, ఇతరకారణములవలనను ప్రపంచజీవిత మంతయు ఏకోన్ముఖమునకు తీసికొని రాబడినది. ఒకదేశమున ఏవిషయమై గాని కొంత కలవరము బయలుదేరిన, అది ఆదేశముతో అంతరించక, ప్రపంచమందలి దేశములన్నింటిలోనికి వ్యాపించి, అన్ని జాతుల జీవితమునందును అలజడిని కల్గించును. అన్ని విషయములందును ఈ అంతర్జాతీయభావము యుద్ధానంతరము హెచ్చుగ పెరిగినది. నానాజాతిసమితి ఏర్పాటగుటతో ఈభావములకు ప్రోత్సాహము బాగుగ కలిగినది. ఇట్లు ప్రపంచమందలి దేశము లన్నియు ఒకదానిపై ఇంకొకటి ఆధారపడి యుండుటచే, ఒకదేశమందలి పరిస్థితు లింకొకదేశమందు ప్రతిఫలించుటచే, ఏదేశము కాని తనంతట తాను తన సమస్యలను పరిష్కరించుకొనుటకు స్థితిగతు లనుకూలముగ నుండవు. ఏ ముఖ్యసమస్య తీసికొనినను దానికి అంతర్జాతీయపరిష్కారమును ఆలోచించి మాత్రమే పని చేయవలసి యున్నది. అట్లు చేయుటకు తగు పరిస్థితులు ప్రస్తుతము పూర్తిగ ఏర్పడలేదనిన దానికి కారణము, ఇదివరలో చెప్పినట్లుగానే, ఇంకను అన్ని దేశములందు ప్రజలును, ప్రభుత్వములు కూడ స్వజాతీయత, స్వజాతీయభావములు మొదలయిన వాటినుండి విడివడలేకుండుటయే కాని, అంతర్జాతీయ మార్గము ననుసరించుటలో తప్పులు, లోపములు ఉన్నవని కాని, అదియే సరియగు మార్గ మనువిషయమును గురించి అభిప్రాయభేదము లున్నవని గాని కాదని స్పష్టముగ గ్రహింపవలసి యున్నది. జాతీయభావముల వలన, ఒకదేశము మాత్రము ప్రపంచమందలి ఏఇతరదేశముతోను సంబంధము లేకుండ ఆర్థికసమస్యను పరిష్కరించుకొనుటకు పూనుటవలన ఏమినష్టము లున్నవో, ఎంత కష్ట మున్నదో రష్యాదేశపు ఈమధ్యఆర్థిక చరిత్ర గమనించిన తెలియగలదు. ఆదేశమందు "౫ సంవత్సరముల ప్లాను" ననుసరించి పని జరుపుటలో ఆదేశమునకు కొంతలాభము కల్గి యుండవచ్చును. కల్గిన దనియే మన మొప్పుకొనవలెను. కాని ఆలాభము ఏవిధానమువలన కలిగినదో, ఇతరదేశములకు దానివలన నష్ట మెంత కల్గుచున్నదో కూడ మనము గ్రహించిన, రష్యాదేశపు ప్రత్యేకప్రయత్నములో నున్న లోపములు గోచరించును. ఈలోపములను గ్రహించిన, అంతర్జాతీయ మార్గముయొక్క లాభములు వెంటనే కాకపోయినను కొద్దికాలముతరువాతనైనను ప్రపంచ మంతయు ఆమోదించి ప్రపంచప్రజాసౌఖ్యమున కదియే ప్రధానమార్గమని తెలిసికొనకుండ ఎవరు నుండజాలరు.

కాన ప్రపంచ మేమార్గము త్రొక్కిన ప్రస్తుత కలవరమునుండి బయటపడుట కవకాశము లున్న వను విషయమును గురించి భేదాభిప్రాయములు చాల తక్కువగ నున్నవి. కాని అభిప్రాయములందు ఏకత్వ ముండినప్పటికిని, వాటి నాచరణయందుంచుమార్గములలో అచ్చటచ్చట భేదాభిప్రాయములు, అనుమానములు, అభ్యంతరములు లేకపోలేదు. అయినను నానాజాతి సమితి పనిచేయుచున్నంతకాలము, కొన్ని ముఖ్యదేశములలో అంతర్జాతీయభావములు దినదినాభివృద్ధి నొందుచున్నంతకాలము, తప్పక ఈవ్యాసమునందు పైన సూచించిన మార్గ మెప్పటికైన అవలంబింపబడు నను ఆశ నిరాశ కాజాలదు.

౬

మన ప్రస్తుతసమస్య హెచ్చుగ ఆర్థికసమస్య. ఆర్థికముగ ప్రపంచమందు మామూలుపరిస్థితు లేర్పాటయిన, తక్కినవిషయములందుకూడ అట్టిపరిస్థితులే త్వరలో ఏర్పాటగునని తలంచుట కవకాశ మున్నది. దీని కనువగు మార్గములను విచారించుటయే త్వరలో సమావేశము కానున్న ప్రపంచ-ఆర్థికమహాసభ (World Economic Conference) యొక్క ప్రధానకర్తవ్యమైయున్నది. ఆసభయొక్క సమావేశముపైననే ఇప్పుడు

ప్రపంచదృష్టి యంతయు కేంద్రీకరింపబడి యున్నది. ఆ సమావేశమునందు సుంకములు, యుద్ధఋణములు, నాణెముల సమస్యాపరిష్కరణము మొదలగు విషయములను గూర్చి ఏర్పాట్లు చేయవలసి యున్నది. ఆయేర్పాట్లు ప్రపంచమున కంతకును అనువర్తించునట్లు చేయుట చాల ముఖ్యమైన కార్యము. వర్తకసంబంధములు వివిధ దేశములమధ్య ఏర్పాటుచేసి, ఏయే దేశములు ఏయే దేశములతో ఎట్టిషరతులపై వర్తకము చేయవలసి యుండునో ఆలోచించుటకు, ఆవర్తకపు టొడంబడికలు వాటి షరతులు ఆచరణయం దుంపబడునట్లు చూచుటకు ఒక శాశ్వతమగు ప్రపంచ-ఆర్థిక-సలహాసంఘము (World Economic Advisory Council) నేర్పాటు చేయుట కూడ ఆసభయందు జరుగవలసి యున్నది. ఈ సంఘమువారు నానాజాతిసమితివారి యాజమాన్యము క్రింద పనిచేయున ట్లేర్పాటుచేసిన దాని నిర్ణయములు పాటింపబడుట కెక్కువ అవకాశము లుండును.

ఇంకొక ముఖ్యమగు మార్పును సూచించి ఈ వ్యాసమును ముగించెదము. ప్రస్తుతము ప్రపంచమందున్న బంగారములో చాలభాగము అమెరికాదేశమందును, అంతకన్న కొంత తక్కువభాగము ఫ్రాంసునందును చేరియుండి తక్కిన దేశములందు బంగారము చాల తక్కువగ నుండు పరిస్థితు లేర్పడినవి. ఇతర దేశములలో బంగారము ఇంత తక్కువ యుండుటయే వాటియందు వస్తువులధరలు తగ్గిపోవుటకును, ప్రజలలో దుస్థితి పెరుగుటకును కారణమైనది. ప్రపంచమందలి వ్యవసాయప్రధాన దేశములకు ఈధరలు తగ్గిపోవుటవలన ముఖ్యముగ తీరనినష్టము వాటిల్లుచున్నది. మన హిందూదేశమునుండి కొంతకాలముగా క్రోట్లకొలది విలువగల బంగారము విదేశములకు, ముఖ్యముగ ఇంగ్లండునకు ఎగుమతి యగుచున్న సంగతి ఎల్లరు నెరింగినదే. ఈ బంగారమున కంతకును చివరకు అమెరికాదేశమందలి ఫెడరల్ రిజర్వు బ్యాంకే గమ్యస్థానము. ఇట్లు బంగారము దేశమునుండి ఎగుమతి యగుచున్నంత కాలము, ఇదివరలో బంగారము కూడబెట్టి, దానినే తమ మూలధనముగ జూచుకొనుచున్న మన హిందూ దేశప్రజలవంటివారికి ఎంతనష్టము కల్గునో వేరుగ చెప్పనక్కరలేదు. దీనికి కావలసినమార్పు, కొన్ని దేశములందే కూడియున్న బంగారమును అవసరమును బట్టి ఇతరదేశము లన్నింటికిని పంచిపెట్టుటయై యున్నది. దానికి అమెరికా, ఫ్రాంసు దేశములు ప్రస్తుత మంగీకరింపక పోవచ్చును. కాని అట్టి మార్పుయొక్క లాభము వారు గ్రహించునట్లు చేసిన వారు దాని నామోదింతు రనుటలో సందేహము లేదు.

---



మణికర్ణికా ఘట్టము, కాశీ　　　　P. S. N.

# దేశీయవ్యాయామ ప్రాముఖ్యము

శ్రీ యశ్వంతసింహగారు
(ఆంధ్రవ్యాయామ మహాసభాస్థాయిసంఘ కార్యదర్శి.)

చరిత్రార్థమైన దేశీయ వ్యాయామ విధానము శరీరాభ్యుదయ పద్ధతులలో తగుస్థానము వహింపకుండుటకు మనము పాలితుల మగుట కారణమని భావించెదను. మనకర్తవ్య మేమనిన, మన విధానముయొక్క విలువను గ్రహించి అవలంబించుటయే. దేశీయ వ్యాయామ విధానము మన విజ్ఞానమునకును, సంప్రదాయములకును, నాగరికతకును అనుగుణముగ నున్నది. మన సాంఘికాచార వ్యవహారములకును, హిందూదేశ శీతోష్ణస్థితికిని ఎంతయో తగియున్నది. మనపద్ధతిని అనుసరించిన దేహబలము, మనోబలము ఉచితరీతిని వృద్ధియగును. ఈడునకు తగిన ఆరోగ్యము, శరీరపాటవము మనుజున కొసంగుటయే మనశిక్షణాదర్శము.

క్రీస్తుకు ౨౦౦౦ సం. లకు పూర్వమే, తత్వవేత్తలగు మనఋషులు వేదగీతికల గానముచేసినప్పటికే మనవ్యాయామవిధానము వాడుకలో నుండెను. పతంజలి మహాఋషి యోగవ్యాయామపద్ధతిని సూత్రరీత్యా క్రీస్తుకు ౧౫౦ సం. లకు పూర్వమే కట్టుదిట్టము చేసెను.

పురాణయుగమందు సప్తమహాఋషులలో ఒకడును, క్షాత్రతేజోవిరాజితుడును నగు విశ్వామిత్రుడు రాజకులతిలకుడగు శ్రీరామచంద్రమూర్తికి వ్యాయామ విధానము నేర్పెనని వినుచున్నాము. ద్రోణాచార్య భీష్మాచార్య కర్ణ కృష్ణార్జునాభిమన్యులు మొదలైన పురాణపురుషులు చూపిన దేశీయ వ్యాయామక్రీడల ప్రదర్శనములనుంచి అనేకోదాహరణము లివ్వవచ్చును.

చరిత్రాత్మక దృష్టితో చూచిన అలెగ్జాండరు హిందూదేశముపై దండెత్తి వచ్చినప్పుడు సింధునదీ ప్రాంతమున పురుషోత్తమ మహారాజు చూపిన శౌర్య బలపరాక్రమముల కచ్చెరు వందెను. ప్రతిసర్దారును, రాజన్యుడును దేశీయ వ్యాయామపద్ధతులపై క్రమశిక్షణ నొందెడివారు. జగద్విఖ్యాతమగు మనవ్యాయామపద్ధతిని నేర్చుకొనదలచి అరేబియా, ఈజిప్టు, టర్కీ, పాలస్టైన్, యూరపుఖండ మధ్యదేశములనుండి పలువురు నలంద, తక్షశిల విశ్వవిద్యాలయములకు వచ్చెడివారు. మౌర్యులును, గుప్తులును రాజ్యము చేయుచున్నకాలమున దేశమం దెల్లెడలను వ్యాయామశాలలు స్థాపింపబడి వృద్ధి గాంచెను. మొగలు సామ్రాజ్యసంస్థాపకుడైన అక్బరుచక్రవర్తి దేశీయ వ్యాయామపద్ధతినే శిక్షనొందెను. సుప్రసిద్ధుడగు అక్బరుసార్వభౌముడు మన పద్ధతుల ననుకరించుటవలననే అద్భుతమగు మనోదేహబలసంపన్నుడాయెను. మహారాణా ప్రతాపసింహుడు, రాఠూరు దుర్గాదాస్, ఛత్రపతి శ్రీ శివాజీ, సింహగడ విజయి యగు తానాజీయు, భారతదేశ స్వాతంత్ర్యమునకై ఘోషించి కరవాలంబును కరంబున దాల్చి రణరంగంబున నిజప్రాణము లర్పించిన ఝాన్సీ లక్ష్మీబాయియు, రాజనీతికోవిదురాలగు అహల్యాబాయి సర్కార్, రణనీతి విశారదయైన చాంద్ బీబీ, సిక్కులను రణోన్ముఖుల గావించిన పదియవ గురువగు గోవిందసింగును, విజయనగర సమ్రాట్టులైన శ్రీ కృష్ణదేవరాయలును మొదలైన సుప్రసిద్ధ హిందూ మహమ్మదీయ వీరులు దేశీయ వ్యాయామవిధాన ప్రకారమే క్రమశిక్షణ నొందిరి. నేటికిని ఆచరిత్రాత్మకమైన విధానము మొక్కవోవక ఉత్తేజముగ నుంచుటకు కారణభూతులైన అస్మన్ గురువులగు రాజరత్న ఆచార్య మాణిక్యారావుగారు బరోడాయందు శాయాజీ రావు మహారాజులంగారి సానుభూతిని జుమ్మాదాదా వ్యాయామ కళామందిర మనుసంస్థను స్థాపించి ముప్పది సంవత్సరములనుంచి తదేకదీక్షతో పెక్కురు యువతీయువ

కులకు శాస్త్రసమ్మతముగా మనవ్యాయామవిద్యను నేర్పి ఆర్యావర్తమున ఈవ్యాయామవిద్యను గరపు ఉత్సాహ సంపన్నులైనవారలతో మించిపైచిరి. ఆంధ్రవీర కంఠీరవ, మల్లగాజతిలక, జగదేకవీర మొదలైన బిరుదాంకితులైన కోడి రామమూర్తిగారు మనవ్యాయామపద్ధతినే అవలంబించుటవల్ల ప్రఖ్యాతులైరి. ప్రస్తుతము ప్రపంచకమున నెల్లరకును మల్లవిద్యలో అగ్రజుడైన గామా పైల్వాను మనపద్ధతినే అవలంబించి వన్నెకెక్కెను. ఈరోజులలో కినుక వహింపక క్రమశిక్షణ నొసంగెడి వారలలో అగ్రగణ్యుడైన శ్రీ బులుసు రామజోగా రావుగారు దేశీయపద్ధతులనే శిరసావహించుట మీ కందరకును బాగుగ తెలియును.

ఇటీవల నేను మైసూరుప్రాంతముల కేగినపుడు అక్కడ కర్ణాటయువకుల గాంచితిని. వారు వజ్రముష్టి యందు మిక్కిలి నేర్పరులు. మన దేశీయవ్యాయామ విధానమందు ఇది యొక ముఖ్యాంగము. పాశ్చాత్య వ్యాయామ వ్యామోహము ప్రబలియున్న ఈకాలమున వేదకాలమునుండియు ప్రసిద్ధి గాంచిన సూర్యనమస్కారముల మహిమను గుర్తింపజేసి అనేకులచే ఆచరించుటకు చేయూత నొసగిన ఔంధుప్రభువును మన మెప్పటికిని మరువజాలము. స్వసంప్రయోగ (Active form of Exercise) మనియు, అన్యసంప్రయోగ (Passive form of Exercise) మనియు మన వ్యాయామ విధానము రెండువిధములు. ఒక్కొక్కటి నాలుగు ఉపశాఖలుగా విభజింపవచ్చును. రెండవపద్ధతిలో ౧. ఖుషీక్, ౨. చంపీలా, ౩. కందళితము, ౪. Hacking ఉన్నవి. ఏవిధమైన పరిశ్రమ చేయలేనివారు ఈపద్ధతుల సాహాయ్యమున ఆరోగ్యము గాంచగలరు. స్వసంప్రయోగములో: ౧. సాధనములతో, ౨. సాధనరహితము, ౩. ఒక్కొక్కరు చేయుట (Individualistic), ౪. పలువురు కలసి చేయునది (Team Exercises). సాధనసహిత వ్యాయామములలో ముఖ్యమైన వేవనగా, ౧. ఏకంగ్ లక్డీ, ౨. దో అంగ్ లక్డీ, ౩. ఫిరంగ్ ౪. లాఠీ, ౫. పరిగదాక్, ౬. లజీమ్, ౭. జోడీ, ౮. కరేలా, ౯. వజ్రముష్టి, ౧౦. మల్ఖాం, ౧౧. బాగ్ నఖ్, ౧౨. ధనుర్విద్య-మొదలైనవి.

౧. జోర్, ౨. పలువిధములైన బసీక్, ౩. సూర్యనమస్కారములు, ౪. ఈత, ౫. కుస్తీ మొదలైనవి సాధనరహిత వ్యాయామములు.

ఈపై వ్యాయామము లన్నియు వ్యక్త్యనుగుణముగను (Individualistic), సంఘములుగను (Groups) కూడా చేయుటకు వీలైనట్లు కవాతులో అమర్పబడి యున్నవి. పదియేండ్ల బాలబాలికలకును, ఇరువదియేండ్ల తరుణులకును, నలుబది సంవత్సరముల ప్రౌఢులకును కూడ నభ్యసించుటకు అనుగుణముగ నుండునట్లు మన వ్యాయామపద్ధతులు చక్కగ విభజింపబడి యున్నవి. జోర్, బసీక్, శ్వాసనిరోధక వ్యాయామములు మొదలైనవి ఛాతీ, నడుము, కాళ్లు, చేతులకు బలము నొసంగును. వ్యాయామము చేయువారికి విసుగు జనింపకుండునటుల పలువిధములగునవి కలవు. వ్యాయామ మాచరించు మనుజుడు ఇచ్చవచ్చినట్లు శక్తిని దేహమునందలి వివిధభాగములలో కేంద్రీకరించుటకై వీలు కలదు. ఈప్రాణాయామము గురుముఖముగా తెలుసుకోతగినది. ఇది ఆరోగ్యాభివృద్ధి కల్గించును. కరేలా, జోడీ మొదలగు వ్యాయామము లభ్యసించినచో భుజములకును, శ్వాసకోశములకును, చేతులకును బలము కలుగును. ఈత, లాఠీ మొదలగునవి నిర్వ్యాపారులకు (Men of sedentary habits) చాలా లాభకరములు. వీనివలన వారిదేహములందు ఉత్తేజము కలిగి రక్తప్రవాహము వృద్ధి గాంచును. లజీమ్ అభ్యసించుటయందు దుముకుట, తన్నుట, గంతులు వేయుట, దేహమును పలువిధములుగా వంచుట మొదలగు వివిధక్రీడలు కలవు. అందుచే ఆపాదమస్తకము పరిశ్రమ కల్గి అభివృద్ధి గలుగును. ఏడేండ్లు మొదలుకొని పదునాలుగేండ్ల వఱకు వయస్సు గల బాలబాలిక లందరును అభ్యసింప తగిన ఫరీగదాక్ చాలా పౌరుషమును పెంపొందించు వ్యాయామము. నేత్రములకును, కరములకును చక్కని తర్ఫీదు నొసంగును. మల్ఖాం అను వ్యాయామము నరములపట్టును వృద్ధిపరచి మల్లవిద్య

నభ్యసించువారలకు నెంతయొ ఉపయోగపడును. కుస్తీ చాలా ఉన్నతమైన పరిశ్రమ. దీనివలన మనుజుడు శౌర్యవంతు డగును. ఇందు శత్రువును ఓడించుటకు ౧౨౦ విధములగు పట్లు కలవు. మనరాజులలో పలువురు దీనిని వ్యాయామముగా నభ్యసింతురు. నిరోధకశక్తిని ( Body resistance power ) సహితము పెంపొందించును. యోగవ్యాయామ శ్రేష్ఠత్వమును కనుగొని పామరజనులకు వెదజల్లుటకై నామిత్రులైన శ్రీ కువలయానందగారు (పునహా సమీపమున) కైవల్యధామ మను ఆశ్రమమున విశేషపరిశ్రమ గావించి తమ పరిశోధన ఫలితములను యోగమీమాంస యను పత్రికయందు ప్రకటించుచున్నారు. శీర్షాసనము, మయూరాసనము మొదలగు యోగవ్యాయామములందును, నేతి, ధౌతి, బస్తీ మొదలగు యోగక్రియలందును అభిరుచి గలవారు కైవల్యధామమున కరిగి వానిని గురుముఖముగా అభ్యసించిన ఎట్టిప్రమాదములకును లోను గారు.

దేశీయవ్యాయామ విధానము చొప్పున వ్యాయామశిక్ష నొందినవారు ఉత్సాహవంతులుగను, సుశిక్షితులుగను, సమయోచితబుద్ధి గలవారుగను నగుదురు. సమష్టిభావము, ఉదారగుణములును వీరియందు అభివృద్ధి చెందును. ఈవిధానము లాభదాయకముగను, ఆనందదాయకముగనుకూడ నున్నది. కాన స్వదేశ సంస్థానములయందేమి, మరి ఇతరప్రాంతములయందేమి, ఉన్న విశ్వవిద్యాలయాధికారులును, విద్యాశాఖామంత్రులును దేశీయవ్యాయామ పద్ధతియొక్క ఔన్నత్యమును గుర్తించి, మరి ఏఇతరపద్ధతులతోపాటైనను పాఠశాలలయందేమి, కళాశాలలయందేమి తప్పక త్వరలో తావొసంగెదరని విశ్వసించెదను.

---



మణికర్ణికాఘట్టము, కాశీ
(మరియొక దృశ్యము)

P. S. N.

# ఆత్మపరీక్ష

కుందుర్తి నరసింహరావుగారు 

పసరుచివుళ్ల దాపరికముండిన పికస్వరము పాడినదంట 'హరిజను'లని;
లేయెండ మొగసాల పాయలూడిన జడ నల్లు జవ్వని పాడె 'హరిజను'లని;
సందెగాడుపు గొంతు సవరింప పసుల కాపరి పాడుచున్నాడు 'హరిజను'లని;
ఇంటింట తనసొత్తునే చూచు బిచ్చగా డరచుచున్నా డోయి 'హరిజను'లని;
అక్కళించు మహాత్మగర్భాంతరమున - బక్కప్రాణాలు తమలోన చిక్కబట్టి
మాడుచున్న ప్రేవులమూక మరల మరల-'హరిజనులు,హరిజను'లని యరచినపుడు!

ప్రారంభించితి వోయి, తండ్రి! వికటప్రారబ్ధసంకల్పితా
చారధ్వంసమహోద్యమాధిగతయజ్ఞం బింతలోనే! బలే!
వీరాగ్రేసరచక్రవర్తి! హృదయోద్వేగవ్యథాభిన్నమై
వారింపన్ వరియింప లోక మిటు లేద్వన్ లెక్క లేదయ్యొ గా?

నీయుపవాసదీక్ష విననే వినలేని జగాలపాటవై
పోయిన్ దేమి సేయగలమోయి, తపస్వి! వినీలనేత్రగో
ళాయతమైన దీకమలజాంశము నీపరిహాసదృష్టిలో—
తీయని నీదు లేనగవు తీవియలే మము నానపెట్టెడున్.

గుండె గుభిల్లుమన్న దనుకో, నిను జూడగ నింత పెద్దబ్ర
హ్మాండము సేయ నేటికి మహామహు లై నుతిగన్న మానవుల్?
కండలు గట్టియున్న తనుకాంతి రవంతయు లేక యిట్టి రే
యెండల గుప్పుచున్న మహనీయత నీకడ నేమి యున్నదో!

బక్కనరాలలో ముసలివగ్గువు! హైందవకోటి పేర్చు కం
పెక్కిన పాపరాశికి పవిత్రత నేడు ఘటిల్లజేయ నీ
వెక్కటి నింతబాధ సహియించెదవోయి, మహాత్మ? మాకునై
చక్కెరపూత బూసిన విషంబుల నెల్ల భరింతువో, సఖా!

కలుషము మూర్తికట్టినదో కాని, మతం బనుమాటతోడ మ
మ్మలముచు కొంప గూల్చిన భయంకరమూర్తులు మూఢదేవతల్

కాశీ

కలరట సంప్రదాయవిష కాంతకు దాసులు: వింధ్యశైలసం
చలనము జూచియుం గదలజాలవొ వారి హృదంతరాళముల్!

ఆత్మజ్యోతి స్వతంత్రమై వెలుగు నీయం, దార్యవిద్యారహ
స్యాత్మోత్తేజము నీకనుంగవకు పూజల్ దిద్దు వైరాగ్యక
ర్మాత్మాభిజ్ఞత నాడినాడికిని తానై నిల్చి వెల్గొందు; ప్రే
మాత్మా! నీ కిక భౌతికాశనము లేదన్నన్ కొఱంతా యిటన్?

లోకము నీపదార్చనవిలోలత గన్నులు మూసి ధన్య యౌ
నే కద? అట్టివేళ నిను నీవ పరీక్ష యొనర్తు, వెంత విం
తో కదటోయి, మౌనివర! దోర్బలదుర్జయు లైనవారు నీ
పోక లెఱుంగలేక కయిమోడ్తుర టౌరక వింతవింతగా!

మతములతల్లి మాభరతమాత ధరించిన పూలదండ దే
వతలకు గూడ గంధపరిపక్వత చాటు మతంబు హైందవ
ప్రతతికి వేదకాలమున వచ్చిన దిట్లు విదగ్ధ మైనచో
బ్రతుకున కాస వీడి పరిపాలన సేతు వటోయి, తాపసీ!

నేషం బొక్కటె నిల్చిపోయిన మతోద్వేగాన అస్పృశ్యతా
దోషాంకూరము పెల్లగిల్లవలె పో! దోశ్శక్తికిం దక్క వీ
కాషాయాంబరధారి పూనిన మహోగ్రప్రత్యహింసాత్మక
ద్వేషాభావ సుహృన్మిళన్నిరశనో ద్రిక్తప్రతిజ్ఞావిధుల్!



దుర్గాఘట్టము, కాశీ

P. S. N.



చైత్రము

శ్రీ యస్. కాశీనాథరావుగారి తంజాపుర చిత్రసంచయమునుండి.

# భారతసంస్థానములు—భావిసంస్కరణములు

వడ్లమూడి సత్యనారాయణగారు 

భారతదేశమునందలి రాష్ట్రములను, సంస్థానములను కలిపి రాబోవుసంస్కరణములలో నొక సమాఖ్యగా జేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. ఇట్టి తరుణమున భావిరాజ్యాంగములో సంస్థానముల కెట్టి స్థాన ముండవలెనని చర్చించుట అనవసరము కాదు. ఇందుకుగాను మొదట సంస్థానముల పూర్వచరిత్ర కొంచెము తెలిసికొను టుచితము,

## పూర్వచరిత్ర

భారతదేశమునందలి మొత్తము సంస్థానములు చిన్న, పెద్దలు కలసి ౫౬౩. ఇందు కొన్నిటి సంవత్సరాదాయము వందలుమీఱదు. ఈసంస్థానములం దధికాంశము బ్రిటిషువా రిచ్చట రాజ్యము సంపాదించక పూర్వము మొగలుచక్రవర్తుల యధికారముననో మహారాష్ట్రసమాఖ్య యధీనముననో యుండెడివి. ఈప్రధానాధికారములు నశించినపిమ్మట నీసంస్థానములు బ్రిటిషువారి క్రిందికి క్రమక్రమముగా వచ్చెను. కొన్ని సంస్థానములు బ్రిటిషువారిచే స్వయముగా సృష్టింపబడినవి. కొందఱు సేనానాయకులు యుద్ధములలో ఈస్టిండియాకంపెనీ సైన్యములకు సహాయముచేయుటచే వారికి కొన్ని భూభాగములనిచ్చి యీసంస్థానముల సృష్టించిరి.

ఈసంస్థానములు మొదట పేరునకు కంపెనీవారి యధీనత నంగీకరించినను, స్వతంత్రాధికారములను చాల గలిగియుండెడివి. కాని వీటికి విడిగా నాంగ్లేయుల నెదుర్కొను శక్తి లేకపోవుటచేత, ప్రతిసారియు కొన్నియధికారముల తగ్గించుచు, క్రొత్త క్రొత్త సంధుల చేసికొనుట కీసంస్థానముల నాంగ్లేయులు వివశము చేసిరి. ఈరీతిగ వీటియధికారముల నన్నిటి పూర్తిగా తగ్గించివేసిరి.

భారతదేశమునందలి కొంద ఱాంగ్లోద్యోగులు సంస్థానములను పూర్తిగా నంతరింపజేసి బ్రిటిషురాజ్యభాగమునందు కలుపుకొనుట తమకు లాభదాయకమని తలచిరి. ఈయుద్దేశము నమలులోనికి తేబూనినవారిలో వెలస్లీ, డల్‌హౌసీలు ముఖ్యులు. తత్ఫలితముగా నాగపూరు, సతారా, ఝాంసీ మున్నగు స్వతంత్రరాజ్యము లంతరింప జేయబడెను. ఆంగ్లేయుల యీ రాజనీతిచే దేశమంతటను హాహాకారములు బయల్వెడలెను. ఈరాజనీతియే ౧౮౫౭-వ సంవత్సరపు 'సిపాయి పితూరి' అనబడు విప్లవమునకు ముఖ్యకారణ మయ్యెనని చరిత్రకారుల యభిప్రాయము.

విప్లవానంతర మీనీతి యుపసంహరించు కొనబడెను. విప్లవము నణచుటకై బ్రిటిషువారిచే నెక్కువ నష్టమును పొందని సంస్థానములు కొన్ని యద్భుతమైన సహాయము చేయుటచే, భారతదేశములో బ్రిటిషుప్రభుత్వ చిరస్థాయిత్వమునకు సంస్థానముల యవసరము నాంగ్లేయులు గ్రహించిరి. పిమ్మట భారత ప్రభుత్వాధికారము కంపెనీనుండి పార్లమెంటునకు సంక్రమించెను. తరువాత సంస్థానముల అంతఃపరిపాలనలో నింగ్లీషువా రంతగా జోక్యము కలిగించుకొనలేదు.

## ప్రస్తుతస్థితి

కాని యానీతి తుదివఱక సాగి సంస్థానముల నంతరింపజేయు కార్యము పూర్తిగా సఫలీకృతమయినచో బాగుండెడిదని తలచువా రనేకు లిప్పుడు భారతీయులలో లేకపోలేదు. ఇందులకు కారణము భారత స్వరాజ్య సంపాదన యత్నమునకు సంస్థానాధీశు

లడ్డుతగులుచు ప్రజాభిప్రాయమున కంతగా సుముఖులు గాకుండుటయే.

భారతదేశమునందలి సంస్థానములలో కొన్నిటికి స్వయముగా నాణెముల వేసికొను హక్కు కలదు. స్వకీయమైన వ్యాపారనీతియు (trade policy), సుంకముల విధించు హక్కును (customs' rights), సివిల్, క్రిమినల్ న్యాయనిర్వహణాధికారములును గలవు. అవసరమైనపుడు తమరాజ్యము లందలి శాంతి, భద్రతల రక్షించుకొనుటకును, బ్రిటిషువారికి కోరినపుడు సహాయము చేయుటకును కొన్ని సేనల నుంచుకొను అధికారమును కలదు. మించివచ్చిన రాజప్రతినిధి యొక్కయు, భారతప్రభుత్వ సేనలయొక్కయు సహాయము నపేక్షింపవచ్చును. ప్రస్తుతము ఆళ్వారు, కాశ్మీరు రాజ్యములందలి ముసల్మానుల తిరుగుబాటు నణచుటకై యారాజ్యములు భారతప్రభుత్వ సహాయము గైకొనుట మన మెఱుగుదుము.

ఇక కొన్ని చిన్నరాజ్యములకు న్యాయ్య నిర్వహణాధికారము గాని, నాణెములు వేసికొను హక్కు గాని లేదు. వీటికి సొంతపోలీసు శాఖ గాని సైన్యముల పోషించవలసిన యవసరము గాని లేదు. ఈసంస్థానము లందలి ప్రజాశాంతిని, సంస్థానాధీశుల హక్కులను భారతప్రభుత్వమే రక్షించును. ఇవి పేరునకు మాత్రము సంస్థానములు. హిందూస్థానమునందలి సంస్థానములన్నిటియందును సంస్థానాధిపు డన్యాయవర్తనుడై ప్రజలను పీడించుచున్నచో ప్రజలయొక్క న్యాయ్యమైన హక్కుల రక్షించునిమిత్తము, సంస్థానముల అంతఃపరిపాలనలో జోక్యము కలుగజేసికొనుటకు భారతప్రభుత్వమునకుహక్కుకలదు. కానిధనికులయొక్కయు,అధికారులయొక్కయు, మహారాజులయొక్కయు విశృంఖలత్వమునకు సామాన్యులు బలియగుచుండ చూచుచునూరకుండుట మన ప్రస్తుత ప్రభుత్వమునకు పరిపాటి యైపోయినది.

## ప్రజలు, ప్రభువులు, పరిపాలన

ప్రస్తుతము భారతసంస్థానములందు ౮ కోట్లకుపైగా జనసంఖ్య గలదు. బ్రిటిషుఇండియా ప్రజలకన్న వీరు బీదవారని చెప్పిన వారి దరిద్రదశ యెంత దుర్భరమైనదో తెల్లముకాగలదు. సంస్థానప్రజలను మొత్తముమీద విద్యాశూన్యులనియే చెప్పవలెను. కొన్నిసంస్థానములు తమ ప్రజల విద్యాసౌకర్యమునకును, వైద్యసహాయమునకును కలిపి నూటికి ౨ వంతులకన్న నధికముగా వెచ్చించవు. అట్టియెడ వా రెంతటి విద్యాప్రవీణులై యుండగలుగుదురో యూహించుట కష్టము గాదు. కొచ్చిన్, తిరువాన్కూరు, మైసూరు, బరోడా, గ్వాలియరువంటి కొన్నిరాజ్యములందు ప్రజల కెక్కుడు విద్యాసౌకర్యము లుండుట సత్యము. వీటిలో తిరువాన్కూరు సంస్థానము ప్రజలకు విద్యాసౌకర్యముల కలుగజేయుటయందు బ్రిటిషుఇండియాకన్న ముందంజ వేయుచున్నది. ౧౯౩౦-౩౧-వ సంవత్సరమునందు తన ప్రజల విద్యాభివృద్ధికై యీరాజ్యము తన మొత్తము రివిన్యూనుండి నూటికి ౨౧.౬ వంతులు వ్యయము జేసెను. ఈసంస్థానమునందు ప్రతి ౨.౦౬౧ చదరపు మైళ్ల విస్తీర్ణమునకును, ప్రతి ౧,౩౭౬ గురు జనులకును నొకప్రభుత్వపాఠశాల గలదు. ఇట్టి సంస్థానమునందు విద్యాభివృద్ధి బాగుగా నుండుట వింతగాదు. ౧౯౨౯-౩౦ సంవత్సరమునకన్న ౧౯౩౦-౩౧-వ సంవత్సరము ౭,౦౧౦ లకు పైగా విద్యార్థు లెక్కువయిరి. ప్రస్తుత మీరాజ్యమున స్త్రీవిద్యార్థినులే ౨,౨౧,౦౦౦ కన్న నెక్కువగా నున్నారు. ఈయభివృద్ధి సంతోషదాయకమే. కాని మన మిప్పు డన్నిసంస్థానముల ప్రజలను గూర్చి మొత్తముమీద విచారించవలసి యున్నాము.

మైసూరు, తిరువాన్కూరు, బరోడా, గ్వాలియరులవంటి కొలది సంస్థానములందు తప్ప మిగతావాటియం దెన్నదగిన పరిశ్రమలు సున్న. గృహపరిశ్రమలకు కూడ తగిన ప్రోత్సాహము లేనికారణముచే వ్యవసాయమే శరణ్యము. వ్యవసాయకుని యుత్పత్తి నుండి పదింట ఆఱువంతు లేవిధముగానైనను సంస్థానపు కోశమున జేర్చబడును. రైతుల పశుసంపద వారి కార్యములకు గాక సంస్థానోద్యోగుల యక్కఱల తీర్చుట కుపయోగపడును.

ఇక వెట్టిచాకిరి (బేగారీ) యన నేమియో రైతువారీపద్ధతి యములులో నున్నచోటి ప్రజలకు తెలియదు. కాని బ్రిటిషు ఇండియాలోగూడ జమీందారీరైతులకు దాని మహాత్వము బాగుగా తెలియును. బ్రిటిషు ఇండియాలోనే వెట్టిచాకిరీనుండి విముక్తి లేనపుడు నిరంకుశత్వమే యుగ్గుపాలుగా పెరిగిన సంస్థానాధీశుల పరిపాలనలో రైతులకీ వెట్టిచాకిరీనుండి రక్షణ లేదను టతిశయోక్తి గాదు.

ఆంధ్రదేశపు జమీందారీలలోని దాసీజనులను గూర్చి మనము కొంతవఱకు తెలుగుదుము. వారి జీవితయాత్రావిధానమును గూర్చియు, జమీందారులయెడ వారు నిర్వహించవలసిన బాధ్యతలగూర్చియు నెల్లఱకు విదితమే. ఇంతకన్న నీచావస్థయందున్న దాసీజనులు సంస్థానములందు వేలకు వేలున్నారు. తమ యధీనమునందున్న భారతసంస్థానములందు బానిసప్రవృత్తి లేదని యథార్థస్థితిని మఱుగుపఱచి జాతిసమితివంటి సభలందు బ్రిటిషుప్రతినిధు లితరదేశీయుల కళ్లనెంతగా కప్ప యత్నించినను, ఏటేట సంస్థానములందలి జనాభా లెక్కలను పరిశీలించిన నిజము స్పష్టము కాగలదు.

చాలమంది సంస్థానపతులు స్వదేశమునం దుండి తమ ప్రజల శ్రేయము నాశించి, కష్టముల నివారింప యత్నించుటందుకంటె, పాశ్చాత్య దేశములందు విచ్చలవిడిగా ధనమును దుర్వ్యయము జేయుచు భోగవిలాసముల దేలుటయందు తమ కాలము నధికముగ వినియోగింతురు. స్వదేశములో వారి యారోగ్య మంతగా బాగుండదు. ఒక మహారాజు గడచిన మూడు వత్సరములలో నాల్గుసారులు యూరోపు కేగెను. ప్రస్తుత మాతడు పాశ్చాత్యఖండమునందే యున్నాడు. కొందఱు మహారాజుల 'జనానా'లను సవరించుటకై వేలకొలది రూప్యముల వేతనముపై నియమింప బడిన పాశ్చాత్య రమణులున్నారు. సంస్థాన ప్రజలయొక్క భాగ్యాభాగ్యములు నిరంకుశులును, ధనలోలుపులును అగు నుద్యోగుల వశమం దుండును. ఈ యుద్యోగుల దుండగములు మహారాజుతో చెప్పికొనుట కవకాశము లుండవు. అయినను వినువా రెవరు? మొన్న మొన్ననే పన్నుల భారముచే క్రుంగిపోయిన రయితులపై విధించిన క్రొత్తపన్నును భరించజాల మని చెప్పికొనుటకై మహారాజు భవనమువద్ద కేగిన ఉదయపూరు సంస్థాన ప్రజాసమూహముపై తుపాకుల కాల్చుట మనము పత్రికలలో చదివియున్నాము. నిరంకుశులగు నుద్యోగులచే బాధింపబడు ప్రజలకు తమ యధిపునియెడ భక్తి యెటులుండును? ఇతరులకు తాము సుపరిపాలకుల మని తెలియజేయుటకై తమ ప్రజల రాజభక్తిని గూర్చి సంస్థానాధీశు లెంతగానైన చెప్పికొననిండు. అళ్వారు, కాశ్మీరు రాజ్యముల యల్లరులును, ఇటీవల మనము పత్రికలలో చూచుచున్న హైదరాబాదుసంస్థానములోని యత్యధికసంఖ్యాకులైన హిందువుల యసంతుష్టియు సంస్థానాధీశులయెడ వారి ప్రజలకున్న రాజభక్తిని బయలు వెట్టుచున్నవి. నే నీవిషయము రసపుత్ర సంస్థానములందు పర్యటన మొనర్చునపుడు బాగుగా గ్రహించ గలిగితిని.

బ్రిటిషు ఇండియా పద్ధతి ననుసరించి కొన్ని సంస్థానములందు శాసనసభలును గలవు. కాని తిరువాన్కూరు, కొచ్చిన్, మైసూరువంటి ౪, ౫ సంస్థానములందు తప్ప తక్కినసంస్థానములందు వాటి కెట్టి విలువయు లేదు. చాలవఱకీ శాసనసభలు అసలు కూడనే కూడవు. కూడినను ౧, ౨ రోజులలో పనియంతయు ముగించును. ౧౯౩౯-౪ సంవత్సరమందు బికనీరు శాసనసభ ఏప్రిలు ౧౫, ౧౬ తేదీలందు సమావేశమై యా రెండుదినములలోనే యావత్తుకార్యము ముగించెను. ౪౫ గురు సభ్యులలో ౨౩ గ్గురు హాజరైరి. ఈరెండురోజులలోనే శాసనసభబడ్జెటుకూడ చర్చించి, విద్య, వైద్యము, రోడ్లు మొదలగు ప్రజోపయోగకరములగు కార్యములకు మొత్తము ౧౦,౦౦,౦౦౦ పౌనుల రివిన్యూలో నుండి నూటికి ౩.౬ వంతునను, మహారాజ భవనమునకును కుటుంబమునకును నూటికి ౨౨.౬ వంతునను వెచ్చించ తీర్మానించెను.

జాం నగరు సంస్థానమునందు ౧౯౨౬-౨౭ బడ్జెటు ననుసరించి మహారాజు సొంత ఖర్చులకుగాను మొత్తము ౧౦,౦౦,౦౦౦ పౌనుల రివిన్యూ నుండి

౭,౦౦,౦౦౦ పౌనులు ఖర్చయ్యెను. ఈ ౭ లక్షల పౌనులు మహారాజకుటుంబమునకు, భవనములకు, మహారాజు మోటార్లు తిరుగురోడ్లకు, అతిథిశాలకు, తదితర-చిల్లరఖర్చులకు వెచ్చింపబడెను. ఎంతటి సద్వినియోగము!

అధికారుల యుత్తరువు లేనిదే యెట్టి మీటింగులు (సాంఘికములగునవి కూడ) చేయుటకు వీలుండదు. ఈమధ్యనే హైదరాబాదుసంస్థానమునందు మూడవ సంస్థానాంధ్రమహాసభాసమావేశమును నిషేధించిరి. ఈ క్రింది షరతుల కంగీకరించిన సభ సమావేశమగుట కనుజ్ఞ యివ్వమని ప్రభుత్వమునకు సిఫార్సు చేసెదనని పోలీసు మెంబరగు కల్నల్ ' ట్రెంచి ' దొర తెలియజేసెను.—

" విద్య, రాజకీయములు, తదితరవిషయములందు ప్రజలకు గల కష్టసుఖముల నొక వ్యక్తి గాని, సంస్థ గాని యెట్టి పబ్లిక్ మీటింగు జరుపకుండగనే ప్రభుత్వము వారికి చెప్పికొన నవకాశ మున్నందున పైవిషయములను గూర్చిన ప్రభుత్వనీతి గాని, యాజ్ఞల గాని యీసభలో చర్చింపరాదు, విమర్శించరాదు.

" పైషరతు ఉల్లంఘింపబడవని సమావేశ కర్తలగు మాడపాటి హనుమంతరావుగారును, ఇతరులును ౨,౦౦౦ రూపాయిలకు జామీ నివ్వవలెను. షరతు ఉల్లంఘింపబడెనో, లేదో, నిర్ణయించునది ప్రభుత్వమొక్కటే."

ఈవిషయ మొక్కటియే సంస్థానములందు గల ప్రజల స్వాతంత్ర్య మెట్టిదియో తెలుపును.

## సమాఖ్య

సామాన్య మానవ-హక్కులనుండి గూడ వంచింపబడిన ప్రజలుగల సంస్థానములను, కొంతవఱ కంత కన్న నధికమగు స్వేచ్ఛ ననుభవించుచున్న బ్రిటిషు ఇండియా రాష్ట్రములను కలపి యొకసమాఖ్యగా చేయ నిర్ణయించిరి. సమాఖ్య యనగా పూర్తిస్వాతంత్ర్య మనుభవించుచుండి, సమానప్రతిపత్తిగల కొన్ని రాష్ట్రముల కలయిక. సమాఖ్యలోని రాష్ట్రము లన్నియు సమాన స్వాతంత్ర్య మనుభవించున వపుడే నాసమాఖ్యకు స్థిరత్వము కలుగును. లేనిచో నది చిరకాలము నిలువజాలదు. అట్టియెడ ప్రజాపరిపాలితములగు బ్రిటిషు ఇండియా రాష్ట్రములును, నిరంకుశ రాజపరిపాలితములగు సంస్థానములును కలపి సమాఖ్యగా చేసిన ఏమి లాభ ముండును? అందుచేతనే జిన్నా వంటివారు కూడ ప్రస్తుత పరిస్థితులలో సంస్థానములతో సంబంధము లేకుండ బ్రిటిషు ఇండియా రాష్ట్రములను మాత్రమే యొక సమాఖ్యగా చేయ టుచితమని చెప్పుచున్నారు. కాని యేది యెట్లున్నను సంస్థానములను కూడ సమాఖ్యలో చేర్చుటకు నిర్ణయించి బ్రిటిషుఇండియా ప్రతినిధులును, పార్లమెంటు ప్రతినిధులును, సంస్థాన ప్రతినిధులును కలిసి సంప్రతింపులు జరుపుచున్నారు. ఇందు కనుకూలవాతావరణము కల్పించుటకే బట్లరు, డేవిడ్సన్ కమిటీలు నియమింపబడి వాటిచే నివేదికలు ప్రకటింపబడెను.

## బట్లరు కమిటీ

ప్రథమమున సంస్థానములకు, ఇండియా ప్రభుత్వమునకు గల సంబంధముల వివరించుటకుగాను బట్లరు కమిటీ నియమింపబడెను. ఈ కమిటీ, సంస్థానములపై ఇండియా ప్రభుత్వము (సభాయుతుడగు గవర్నరు జనరలు) ఈ క్రింది యధికారములు చలాయించ హక్కు గలిగియున్న దని యొప్పికొనెను.—

౧. విదేశ వ్యవహారములు.

౨. సంస్థానములలోని విదేశప్రజల రక్షణ. సంస్థానముల వలన వారికి గలుగు నష్టములకు పరిహారము నిప్పించుట.

3. అంతర్జాతీయ వ్యవహారములందు సంస్థాన ప్రతినిధుల నియమించుట.

౪. బానిస వ్యాపారము నణచుట.

౫. విదేశ-నేరస్థులను స్వాధీన పఱచుకొనుట.

౬. దేశరక్షణ.

౭. యుద్ధసమయములందు కావలసిన రోడ్లు, రైళ్లు, విమానాశ్రయములు, సైనికస్థానములు, సైనిక

మార్గములు, కోటలు, ఆయుధశాలలు, మందుసామాను, పోస్టు, టెలిగ్రాఫ్, టెలిఫోను, వైర్‌లెస్ ఆఫీసుల నుపయోగించుకొనుట.

౮. విద్రోహసమయముల సంస్థానాధీశుని రక్షించి యుచితమైన ప్రజల కష్టముల నివారణ చేయించుట.

౯. సంస్థానపతి దుష్పరిపాలకు డగుచో, లేక రాజభక్తిశూన్యు డగుచో నాతని తొలగించుట, లేక యధికారము తగ్గించుట, లేక యాతనిపై నొక రాజకీయ నిరీక్షకుని నియమించుట.

౧౦. సంస్థానములలో రాక్షసకృత్యములు జరిగినచో, ఘోరశిక్షలు విధింపబడినచో వానిని నివారించుట.

౧౧. మహారాజు మైనరగుచో నాతనికి విద్యగఱపుట, ఆతని సంస్థానమును పాలించుట.

౧౨. సంస్థానములు చిన్నవై ప్రభుత్వ బాధ్యతల నిర్వహించుట కసమర్థములైనచో జోక్యము కలిగించుకొనుట.

౧౩. యావద్భారత వర్షపు టార్థిక హితమునకు భంగము కలుగు నని తోచినపు డుచితరీతిని నిర్ణయించుట. (బట్లరు కమిటీ రిపోర్టు, పేరా ౪౬ నుండి ౫౫ వఱకు).

ఈ పైయధికారముల సర్వాధికార మింతవఱకు ఇండియా కార్యదర్శిద్వారా రాజుగారి ప్రతినిధిగా పనిచేయు సభాయుతుడగు గవర్నరుజనరల్ గారిదేనని బట్లరుకమిటీ స్పష్టముగానే యొప్పికొనెను. సభాయుతుడగు గవర్నర్ జనరలనగా ఇండియాప్రభుత్వమే యనుట నిర్వివాదాంశము. కాని యిండియాప్రభుత్వ పరిశీలనకు లోబడి యుండుటకు సంస్థానాధీశు లంగీకరించరు. కారణము, ఇండియాప్రభుత్వము భవిష్యత్తున వారివలెనే నల్లతోలు గలవారి యధీనమున నుండునన్న భయము తప్ప వేఱు కానరాదు. కాని బట్లరుసంఘము వారిభయమును తీర్చివేసినది. బట్లరు నివేదికయొక్క ౫౭-వ పేరాలో సంస్థానములకును, ఇండియాప్రభుత్వమునకును ఇపుడున్న సర్వాధికార సంబంధమును (relationship of the Paramount Power and the Princes) సంస్థానాధీశుల యిష్టము లేనిదే భారతశాసనసభలకు బాధ్యమైన నూతనభారత ప్రభుత్వమునకు మార్చగూడదని వ్రాయబడెను.

బట్లరుకమిటీవారి విచారణ రహస్యముగా జరిగెను. సంస్థానప్రజల యభిప్రాయము గాని, బ్రిటిషు ఇండియా ప్రజల యభిప్రాయము గాని తెలిసికొనబడలేదు. అసలా సంఘమున కిట్టి సలహా నిచ్చు అధికారమే లేదు. సంస్థానములకును, ఇండియాప్రభుత్వమునకును గల ప్రస్తుత సంబంధములను వివరించుటకే యాసంఘము నిర్మింపబడెను గాని భవిష్యత్సంబంధములగూర్చి సలహా నిచ్చుటకు గాదు. అట్టియెడ నిట్టి యభిప్రాయ మిచ్చుట యనౌచిత్యమని సర్ తేజ్ బహద్దర్ సప్రూ, దివాన్ బహద్దరు మోచర్ల రామచంద్రరావు మొదలగు సుప్రసిద్ధ భారతనాయకు లెల్లరు ఖండించిరి.

## డేవిడ్సన్ కమిటీ

తిరిగి ఈయభిప్రాయమునే డేవిడ్సన్‌కమిటీవారు గూడ స్థిరపఱచిరి.

సంస్థానములపై భారతప్రభుత్వమునకు పరిశీలనాధికారమే లేనిచో సంస్థానాధిపుల నిరంకుశత్వ మిప్పటివలెనే సుస్థిరమై యెగడును.

## నెహ్రూని వేదిక

కాని ౧౯౨౭-వ సంవత్సరము మద్రాసులో జరిగిన అఖిల భారత జాతీయ మహాసభవారి యాదేశానుసారము భావి భారతరాజ్యాంగ విధానము నిర్ణయింప నేర్పడిన నెహ్రూకమిటీవారు సంస్థానములపై భారత ప్రభుత్వమువారు ప్రస్తుతము చలాయించుచున్న యధికారము లన్నియు నికముందుకూడ భారతప్రభుత్వమునకే యుండవలె ననిరి. ఇట్లగుచో సంస్థానాధీశుల నిరంకుశత్వమునుండి ప్రజల కొకప్పుడైన రక్షణ గలుగును. బ్రిటిషు ఇండియానాయకు లెల్లఱును, సంస్థాన ప్రజా

నాయకులును నెహ్రూసంఘమువారి యభిప్రాయము నంగీకరించిరి.

### బ్రిటిషు వైఖరి

ఇక బ్రిటిషుప్రభుత్వమువా రెంతవఱకు సంస్థానాధిపతులనే సమర్థించుచుందురు. ఆ కోట్ల సంస్థాన ప్రజల కష్టసుఖములను వారు లెక్కచేయరు. సంస్థానాధీశుల పరిపాలనను గూర్చియు, వారిని బ్రిటిషువారు సమర్థించుటకు గల కారణమును గూర్చియు నీమధ్యనే లండనులోని 'డెయిలీ హెరాల్డు' పత్రికయందు ప్రొఫెసరు హెరాల్డు జె. లాస్కీగా రిట్లు వ్రాసిరి :

"వీనిలో (సంస్థానములలో) క్రౌర్యము మూర్తీభవించి యున్నది. ఇక్కడ మానవత్వమునకు స్థానము తక్కువ. ఈ సంస్థానప్రభువుల దుశ్చర్యలు హద్దుమీఱి పోవున్న నదియే పదివే లని చెప్పవచ్చు.

"........సాధారణముగ మనము అనాగరిక మని చెప్పుటకు తగిన పరిస్థితులను సహితము సహింతుము.

"సంస్థానములలో పెట్టబడు బాధలను గూర్చియు, జరుగు హత్యలను గూర్చియు నిదర్శనపూర్వకమైన గ్రంథములు కలవు. కాని వానిని మనము పరికింపము. సంస్థాన ప్రజాప్రతినిధులు (తమ ప్రభువుల) ఘోర నిరంకుశ చర్యలనుగూర్చియు, నీచభోగలాలసత్వమునుగూర్చియు గాథలను తెలుపుచుందురు. కాని వానిని మనము వినము.

"సంస్థానాధీశుల దుశ్చర్యలు దుర్భరము కానంతవఱకు మనము వారితో గావించుకొన్న సంధిపత్రముల షరతులను పాటించుచు మౌనము వహింతుము.

"దీనికి కారణము సంస్థానాధీశులు బ్రిటిషు రాజ్య సమర్థకులై యుండుటయే......."

తిరిగి హెచ్. జె. లాస్కీగారు తమ వైవ్యాసమునందే బ్రిటిషువారి నిట్లు ప్రశ్నించుచున్నారు.— "భారతీయు లందఱు గర్వపడుటకు తగినట్లుగా తిరువాన్కూరు మహారాణిగారు పరిపాలన కొనసాగింపగలిగినప్పుడు మన సర్వాధికారమును వినియోగించి తక్కిన సంస్థానాధీశులుగూడ నట్లే పరిపాలన గావింపవలెనని మన మేల పట్టుపట్టగూడదు?"

మించివచ్చిన తప్ప బ్రిటిషువా రట్టిపని చేయరు. కారణము పైన విదితమే. అందుకనియే సంస్థానాధీశులు భారతీయులకు బాధ్యత వహించిన ప్రభుత్వము తమపై నెట్టి యధికారము వహించుట కిష్టపడకున్నారు. ఆంగ్లేయులుకూడ సంస్థానాధీశుల నడ్డుజేసికొని సాధ్యమైనంతకాలము భారతస్వపరిపాలనాపథమును నిరోధింప యత్నించుచున్నారు. అందుచేతనే భారత సంస్థాన ప్రజలలో సగముమందినైన పాలించు సంస్థానాధీశులు భావిసమాఖ్యయందు జేరుట కిచ్చగించువఱకు కేంద్రప్రభుత్వమునందు బాధ్యత ప్రసాదింపబడదని కడచిన మూడు రౌండుటేబిల్ సభాసమావేశముల యనంతరము వెలువరించిన వైటుపేపరునందు బ్రిటిషుప్రభుత్వమువారు స్పష్టముగా తెలియజేసిరి.

నెహ్రూకమిటీవారు తమ నివేదికలో, బ్రిటిషు ఇండియా కొకవేళ స్వపరిపాలనము నివ్వవలసివచ్చినను, సంస్థానములను మాత్రము ఐర్లండులోని అల్‌స్టరువలె జేసి చిరకాలము తమ వ్రేళ్లపై నాడించుటకు బ్రిటిషురాజకీయవేత్తలు యత్నించుచున్నా రను భయమునుకూడ వెలిబుచ్చిరి.

కాని బ్రిటిషుఇండియాకు మాత్రము స్వపరిపాలనము నిచ్చిన యెడల, సంస్థానములందు మహారాజుల నిరంకుశపరిపాలనము నిర్నిరోధముగా కొనసాగుట కష్టసాధ్యమని యాంగ్ల రాజకీయవిదులు తెలిసికొనిరి. మహారాజుల నిరంకుశత్వమే కొనసాగనిచో బ్రిటిషు ఇండియానుండి సంస్థానములను విడదీసి లాభ మేమున్నది? బ్రిటిషువారు చెప్పినటుల వినువా రెవరుందురు? అందుచే బ్రిటిషు ఇండియాకు స్వరాజ్య మివ్వకుండ సాధ్యమయినంతకాలము సంస్థానముల నడ్డుపెట్టుటే యుత్తమమయిన పద్ధతి యని ఆంగ్ల రాజనీతికోవిదులు నిశ్చయించిరి.

ఒకప్రక్క మొత్తము సంస్థానముల జనసంఖ్యలో సగము జనులనైన పరిపాలించెడి సంస్థాన

పనులు ఫెడరేషనులో జేరుట కియ్యకొనినదే కేంద్రము నందు బాధ్యత నెలకొల్ప వీలు లేదని ప్రభుత్వము తెలుపుచుండ నింకొకవంక ఫెడరేషనులో చేరుటవలన కలుగు నపాయముల జాగ్రత్తగా నాలోచించుకొను డని బ్రిటిషు 'టోరీ' పత్రికలు సంస్థానాధిపుల కర్ణపుటములు మార్మ్రోగునట్లు ఘోషించుచున్నవి. ఈ ఘోష విఫలమై, సంస్థానాధీశులు భావిభారతసమాఖ్యలో చేరినను భారతప్రజాసామాన్యమున కందువలన సిద్ధించు లాభ మేమియు నుండదు. బ్రిటిషువర్తకుల స్వార్థసాధనకే వా రుపయోగ పడుదురు. లేనినాడు వైస్రాయిగారి సర్వాధిపత్య (Paramountcy) మున్నది గదా వారిని దారికి తెచ్చుటకు? అట్టియెడ నాంగ్లాధికారు లాడించిన ట్లాడుటే వారికి విధి, లేక గతి కాదా? ఈ యుద్దేశముతోనే వైటుపేపరువిధానము తయారు చేయబడినది.

సంస్కరణముల యనంతరము ఫెడరల్ శాసనసభల రెంటింటియందును కలిపి ౬౩౫ గురు సభ్యులుండునట్లు నిర్ణయింపబడెను. అందు మొదటిశాసనసభయందు ౩౭౫ గురును, రెండవశాసనసభయందు ౨౬౦ మందియు నుందురు. దీనిలో సంస్థానాధీశులకు మొదటిసభకు ౧౨౫ మంది ప్రతినిధులను, రెండవసభకు ౧౦౦ మంది ప్రతినిధులను ఎన్నుకొను నధికారమివ్వబడెను.

భారతసంస్థానములలోని జనసంఖ్య సుమారు ౮ కోట్లు. అనగా మొత్తము భారతదేశ జనసంఖ్యలో నాల్గవ వంతుకు తక్కువ. భారతదేశ జనసంఖ్యలో నాల్గవ వంతుకూడ నివసించని ౫౬౩ సంస్థానములకు రెండుశాసనసభలందును కలిపి ౨౨౫ స్థానము లివ్వబడెను. అనగా మొత్తము స్థానములలో మూడవ వంతు కన్న నెక్కువ సంస్థానాధీశులకు లభించెను.

ఇక సంస్థానములు బ్రిటిషుఇండియాకన్న విద్యావంతములు, విజ్ఞాననిలయములు, నాగరికతాభరితములు ననుకొన్న నట్లుకాదు. ఇప్పటి సంస్థానములు ఒకశతాబ్దమువెనుక నుండవలసిన స్థితిలో నున్నవి. అట్టిచో నీసంస్థానములపై బ్రిటిషువారి కేల ఇట్టి యవ్యాజానురాగము కలిగెను?

సంస్థానాధీశుల ప్రతినిధులు తాము చెప్పినట్లు చేతు రన్న నమ్మకము బ్రిటిషువారి కున్నది. ప్రభుత్వసభ్యులు, యూరోపియను, ఆంగ్లో ఇండియను ప్రతినిధులు, స్వదేశీయుల విశ్వసింపజాలక బ్రిటిషువారి రక్షణ నాశించు నితరమైనారిటీసంఘముల ప్రతినిధులు ప్రభుత్వమును వ్యతిరేకించరు. ఇట్టి స్థితిలో బ్రిటిషువారు కేంద్రప్రభుత్వమునం దివ్వదలచు కొలది బాధ్యతయుగూడ భారతజాతీయవాదుల హస్తగతము కాకుండ జేయగలుగుదురు. ఇంతకన్న వారికి కావలసిన దేమున్నది?

## భావిస్థితి

ఇక సంస్థానప్రజలకు భావిరాజ్యాంగముతో నెట్టి సంబంధము నుండదు. భావిసమాఖ్య వారి నే విధముగను ప్రస్తుతనిరంకుశత్వమునుండి తప్పింపజాలదు. ఫెడరల్ శాసనసభలకు ప్రతినిధుల నెన్నుకొనుటకు వారికి హక్కు లేదు. ఫెడరల్ శాసనసభలకు సంస్థానముల ప్రతినిధుల నెన్నుకొనుహక్కు సంస్థానాధీశులకే యివ్వబడెను. పైగా ఫెడరల్ శాసనసభలచే గావింపబడు చట్టములు మహారాజుల యంగీకారము లేనిదే సంస్థానములం దమలులోనికి రాజాలవు. ఇట్టి రాజ్యాంగవిధానమును ప్రజ లామోదించకపోవుటలో నాశ్చర్య మేమున్నది?

సంస్థాన ప్రజాసంఘము లన్నియు తమ హక్కుల కొఱకు తీవ్రాందోళన మొనర్చుచున్నవి. సంస్థానాధీశుల నిరంకుశత్వమును సుస్థిరమొనర్చు నీ రాజ్యాంగవిధానమును ప్రజాసంఘము లన్నియు నేకగ్రీవముగా ఖండించినవి. ప్రజల యసంతుష్టి పెచ్చుపెరిగి పోవుచున్నది. సంస్థానములందలి యసంతుష్టిని గూర్చి హెరాల్డు లాస్కీగా రిట్లు వ్రాయుచున్నారు: "ఆళ్వారుప్రజల విప్లవము భారతదేశసమస్యలను శ్రద్ధగా పరిశీలించుచున్నవారి కాశ్చర్యజనకముగ లేదు.

తక్కిన పెక్కు భారతదేశసంస్థానములందు చాల కాలము క్రిందనే విప్లవము ప్రారంభము కాకుండుటయే వారి కాశ్చర్య మొదవించును."

ఇట్టి స్థితిలో బాధ్యత గల భారతనాయకు లెల్లరు సంస్థానాధీశులు తమ సంస్థానపరిపాలనలో ప్రజలకు సంపూర్ణబాధ్యత నీయనిదే వారికి భావి సమాఖ్యయందు స్థాన మిచ్చుటయ నుచితమని నుడువుచున్నారు. 'ఔంధ్' సంస్థానాధీశుమాత్రము ౧౯౩౮-వ సంవత్సరాంతమునకు తన సంస్థానపరిపాలనయందు ప్రజలకు సంపూర్ణబాధ్యత నిచ్చెద నని ప్రకటించెను. కాని యీ సంస్థానము చిన్నది. తక్కిన సంస్థానాధీశులు 'ఔంధ్' సంస్థానాధీశుని ఆదర్శముగానైన గైకొను సూచన లేవియు గానవచ్చుటలేదు.

కొందఱు తలచునట్లుగా ఫెడరల్ శాసనసభలలో సంస్థానాధీశుల కట్టి ప్రాతినిధ్యము లేకుండ జేయుట ప్రస్తుతపరిస్థితులలో నసంభవము. తుదకు మహారాజులకు న్యాయనిర్వహణాధికారము లేని సంస్థానములలోకూడ ఫెడరల్ శాసనసభలకు ప్రతినిధుల నెన్నుకొను హక్కు ప్రజలకే యొసగబడు నాశకూడ కాన్పించుటలేదు. సమాన స్వాతంత్ర్యము లేని రాష్ట్రముల సమాఖ్య భగ్నమగుట తథ్యమని పలువు రనుభవజ్ఞుల యభిప్రాయము. రాజప్రభుత్వ సమర్థకులగు సంస్థానప్రతినిధులకును, ప్రజాస్వామికాశయములుగల బ్రిటిషుఇండియా ప్రతినిధులకును సంఘర్షణ తప్పదు. భిన్నాశయములుగల వారి కలయిక సుస్థిరమైన దెట్లగును? అట్టియెడ భావి రాజ్యాంగవిధానము దృఢముగా నెట్లుండగలుగును?

---




## మధురమైన విటమిన్ ఆహారము

మాల్టుసారమును, కాంతివంతమైన పాలక్రొవ్వును ఏ. బి. సి. డి. విటమినులు విరివిగాగల యితర పదార్థములును, యిందు మిళితమైయున్నవి.

## అమూల్యమైనది

ఎదిగేపిల్లలకు ఆరోగ్యము నిచ్చుటలోను, దంతములను, ఎముకలను చక్కగా నిర్మించుట యందును, అసమానమైనది.

## రేయాల్టు

కృంగి కృశించెడివారికిని, పాండురోగమునకును, సామాన్య దుర్బలత్వమునకును, గర్భిణి సమయమందును, ప్రసవానంతరమును సరియైన పోషణ నొసగుటకును ఉపయోగించును.

# Bengal Chemical & Pharmacutical Works, Ltd.,

## CALCUTTTA.

మద్రాసుస్టాకిస్టులు :—యస్. దేశాయిగౌండర్, బందరువీధి,

చిల్లరప్రదర్శనశాల :—చైనాబజార్ రోడ్డు, రాజుగారి ప్రతిమకు యెదురుగా.

# అస్పృశ్యత

కూచి నరసింహముగారు

పెంపుడు కుక్కయును, పెంపుడు పిల్లియును స్పృశ్యము లైనప్పుడు మనుష్య జాతులలో నేదియుఁ గేవలము పుట్టుకచేత అస్పృశ్య మనుట న్యాయ్యము గాదు. హరిజనుల నస్పృశ్యులఁగాఁ జిరకాలము నుండి మనము చూచుటవలన నిజముగాఁ దా మట్టివారే యనుకొని వా రాత్మగౌరవముఁ గోల్పోయి విద్యావిహీనులై వాసగ్రాసవిహారములయందు శుచిత్వశుభ్రతలు లేక చెడిపోయినారు. శోచనీయమైన వారి దుస్థితికి వారికంటె వారిని నీచముగాఁ జూచుచుండిన పైజాతి వారే ప్రబలహేతువు లనుట సత్యదూరము గాదు.

మఱియొక యన్యాయము చిత్తగింపుఁడు. మన మతము వదలి యేహరిజనుఁడేని యితర మతస్వీకారము చేసినతోడనే మనకు స్పృశ్యుఁడును, గౌరవపాత్రుఁడును అగుచున్నాఁడు. ఎట్టి మతోన్మాదగ్రస్తుఁ డైనను ఇది నిజమైన మతాభిమానమని చెప్పఁగలఁడా? క్రైస్తవులలోఁ గలసిన హరిజనులు ఇండ్లు శుభ్రముగా నుంచుకొని శుభ్రమైన బట్టలు కట్టుకొనుటకుఁ గారణ మేమి? ఇతరులు వారికి గౌరవము చూపి విద్యాబుద్ధులు చెప్పించుటయే. అస్పృశ్యతా బాధవలన నేఁటేఁట నెన్ని వందలమంది మన హిందూమతపు హరిజనులు మతాంతర ప్రవిష్టు లగుచున్నారో చూడుఁడు. సంఖ్యలో మన హైందవసంఘ మెంత దుర్బల మగుచున్నదో యాలోచించుకొనుఁడు.

పరంపరగా వచ్చుచున్న యాచారము నెల్లు నిరసించి ప్రవర్తింపఁ గలమని సందేహించుట సదాచారములపట్టున నగును గాని దురాచారములపట్టునఁ గాదు. సదాచార మేదో, దురాచార మేదో సామాన్యజనులు కనుఁగొను టెట్లు? సంఘములోని పరమపూజ్యులు స్వయముగా నాచరించి బోధించునవి సదాచారములు. వారు నిషేధించి, యాచరింపకుండునవి దురాచారములు.

ఎట్టివారు పరమపూజ్యులు? నిశితమైన బుద్ధి, దూరదృష్టి, సచ్ఛీలము, అంతర్బాహ్య శుచిత్వము, విపులమైన లోకానుభవము, అనహంకారము, అవ్యాజదైవభక్తి, స్వార్థత్యాగము, పరోపకారపరాయణత్వము, దేశాభ్యుదయ తీవ్రకాంక్ష, సత్యదీక్ష, అహింసావ్రతము, తోడిజనుల దైన్యమును దొలఁగింపఁ బ్రాణము లైన నర్పించుటకు సిద్ధముగా నుండు మేరుధైర్యము, దేహాత్మబుద్ధి సడలిన వైరాగ్యము, అఖండ బ్రహ్మచర్యము—ఇవియు, నిట్టివియును పరమపూజ్యుల లక్షణములు; వారే శిష్టు లనఁదగినవారు; వారు తమ నిత్య ప్రవర్తనమందుఁ జూపు చర్యలే తక్కువారు సదాచారములుగాఁ బరిగణించి అవలంబింపఁ దగినవి. వారే సజీవధర్మశాస్త్రములు, జంగమశ్రుతులు. అట్టి వారిలోనివాఁడే గాంధిమహాత్ముఁడు.

కలియుగాంతమువఱకు అమలులో నుండవలయు విధినిషేధరూపధర్మముల నేర్పాటుచేసిపెట్టిన పరాశరాదుల వాక్యములకు ఆయన బోధనములు విరుద్ధముగా నున్నచో నవి యాచరింపవచ్చునా?

కలియుగాంతమువఱకు సంఘధర్మములను విధించిపెట్టు సమర్థత యెట్టి తపస్సంపన్నుఁ డైనను, ఎట్టి పరోపకారియగు బుద్ధిశాలి యైనను మనుష్యమాత్రున కుండఁజాలదు. ఎంత గొప్పవాఁ డైనను మనుష్యుఁడు కించిజ్ఞుఁడును, సప్రమాదుఁడును గాని భగవంతునివలె సర్వజ్ఞుఁడు కాలేఁడు. ఒకకాలపు బుద్ధిమంతులును, యోగ్యులును వ్రాసిపెట్టిన నియమములు మఱియొక కాలమునకు సరిపడనప్పుడు తత్కాలపు ధీమంతులును, శీలవంతులును వానిని సవరించి క్రొత్తనియమముల నేర్పఱుతురు. ప్రజలు వానిని శిరసావహించి యవలంబితురు.

ఇదియే సర్వదేశములందును, సర్వకాలములందును జరుగుచున్న పని. ధర్మములు కాలములనుబట్టియు, స్థితిగతులనుబట్టియు మాఱనియెడల, నిలువనీరు చెడి యారోగ్య భంజక మగున ట్లవి యహితములును, అనర్థకారులును అగును.

అట్లైనచో శాశ్వతధర్మము లనునవి లేనే లేవా యేమి? ఉన్నవి; లేక పోలేదు. అవి సంకుచితములై యేకదేశమునకే, యేకకాలమునకే, యేకజాతికే యనుకూలింపక సార్వత్రికములై, సర్వకాలములందును ఆచరణీయములై యుండును. మన స్మృతులలో ఆదిమస్మృతిగా నెంచఁబడు మనుస్మృతి (౬-౯౨) లోఁ గాన నగు నీ శ్లోకమును చిత్తగింపుఁడు.—

శ్లో. ధృతిః క్షమా దమోఽస్తేయం
శౌచ మింద్రియ నిగ్రహః,
ధీ ర్విద్యా సత్య మక్రోధో
దశకం ధర్మలక్షణమ్.

వీని నాధారముగాఁ జేసికొని చెప్పిన విధినిషేధరూపపు తప్పొల్లు మాత్రము ప్రజల విద్యాభివృద్ధిని బట్టియు, నాగరకతాభివృద్ధినిబట్టియుఁ, గాలపరిస్థితులఁ బట్టియు మాఱక మానవు. అట్లు మాఱుటచేతనే మన కొక స్మృతి గాక అనేకస్మృతులు పుట్టినవి. ఒక కాలమున యుక్తములుగా నెన్నఁబడిన అశ్వమేధమును, గోమేధమును, మాంసశ్రాద్ధమును, దేవరన్యాయమును, సన్యాసమును ఒక కాలమున నిషేధింపఁబడినవి. నిషేధింపఁబడిన సన్యాసము మరల మంచిదని యొప్పుకొనఁబడినది. దయామయులగు శ్రీ రామానుజాచార్యులవారును, శ్రీమధ్వాచార్యులవారును యజ్ఞములందు సజీవజంతుహింసను నిషేధించి పిష్టపశుయజ్ఞముల నంగీకరించినారు. మన దేశమునకు హైందవులే ప్రభువులై యుండినయెడల నీపాటి కన్నియో క్రొత్తస్మృతులు పుట్టియుండును. అప్పు డీకలఁతలే యుండకపోవును. మన ప్రస్తుత ప్రభువులగు నాంగ్లేయు లన్యమతస్థులు. అయినను దేశభక్తులగు సంస్కర్తల ప్రేరణమున సహగమనము, అతి బాల్యవివాహము మున్నగు కొన్ని దురాచారములను శాసనబలమున సమయించినారు.

విధినిషేధరూపనియమములు మాఱుట యెట్లు?

ప్రకృతిశాస్త్రములును, మనశ్శాస్త్రమును, నీతిశాస్త్రమును, శారీరశాస్త్ర వైద్యశాస్త్రములును వర్షవర్షాభివృద్ధిఁ గాంచుచున్నవి. కనుక తత్తత్సంబంధములైన సత్యములఁ గూర్చి ప్రజల కుండు నభిప్రాయములు మాఱక తప్పదు. విషూచికా మసూరికాదులు అమ్మవారి యాగ్రహమువలనఁ గలిగిన పీడ లని వెనుక నమ్మెడివారిప్పు డవి రోగవిశేషములు గాని యన్యములు గావని నమ్ముచున్నారు. అట్టి నమ్మికలఁబట్టి శౌచవిధులు గూడ మాఱుచుండును. ఆహార విహారాదులందు మార్పులు గలుగుచుండును. కోడిపుంజులవలె యుద్ధములం దొకరి నొకరు పొడుచుకొని చచ్చుట శూరకృత్య మనియు, అట్టి ధైర్యశాలులు వీరస్వర్గ మనుభవింతు రనియు విశ్వసించువారు నేటికిని గలరు. అది ఘోరపాతకములను మహాహత్యలలో నొకటిగాఁ బరిగణింపఁ దగిన దనియు, సాత్త్వికసాధనములచేత విప్రతిపత్తులు నివారించుకొనుట నాగరకతాలక్షణము గాని యొకరి నొకరు చంపుకొనుట కేవల పశుకృత్య మనియు నిప్పటి రాజ్యతంత్రజ్ఞులు బోధించుచున్నారు. హింసచే హింస హెచ్చును గాని యెప్పుడు నశింప దనియుఁ, గష్టసహనరూపమైన ధైర్యముచే, సత్యదీక్షచే, అహింసావ్రతముచే, భూతదయాపూరితమైన హృదయముచే, స్వార్థత్యాగ పరహిత పరాయణత్వ మనోనైర్మల్యములచే, భగవద్భక్తిచే నన్ని యధర్మములును, అన్యాయములును, సర్వ దేశారిష్టములును బోవు ననియు మహానుభావుఁ డగు గాంధిగారు స్వాచరణపూర్వముగా బోధించుచున్నారు. ఆ సదుపదేశములు గ్రహించి తదనుసారముగాఁ బ్రవర్తించు ప్రజలసంఖ్య యేఁటేఁట హెచ్చుచున్నది.

గాంధిగారుమాత్రము పొరపాటుపడఁగూడదా? పూర్వస్మృతికర్తలగు శంఖలిఖితాదులకంటె ఆయన యెక్కువ యేమున్నది?

గాంధిగారును ప్రమాదవశులే, సర్వజ్ఞులు గారు, అందఱును ఆయనను మహాత్ముఁ డనుచున్నారు గాని,

"నేను ప్రజాసేవకుఁడను" అనియే ఆయన చెప్పుకొనుచున్నాఁడు. యుక్తులఁ జూపి, ప్రస్తుత దేశనికృష్టస్థితిఁ జూపి, ఐకమత్యాభావమువలని నష్టములఁ జూపి, హరిజనులకుఁ జిరకాలమునుండి పైజాతులవారు చేయుచుండు అన్యాయములను, అనర్థములను జూపి అస్పృశ్యతా నివారణ మహాకార్యనిర్వహణమునకు ఆయన కంకణము గట్టుకొని, "దేశములో నేనైన నుండవలెను, అంటరానితనమైన నుండవలెను గాని యుభయులము నుండఁజాలము" అని చాటించి చెప్పుచున్నాఁడు. విద్యావంతులును, లోకజ్ఞులును, ధర్మజ్ఞులును, దేశశ్రేయోభిలాషులును అగు పెక్కురు సనాతన ధర్మావలంబులే-మదనమోహన మాలవ్యాపండితులవంటి జగత్ప్రసిద్ధి వడసిన వృద్ధులే—గాంధిమహాత్ముని యుపదేశములు శిరసావహించి కార్యశూరులై ప్రవర్తించుచున్నారు. కనుక అస్పృశ్యతానివారణ మవశ్యకర్తవ్యమైన సత్సంస్కరణమని మనము విశ్వసింపవచ్చును.

ఇఁక గాంధిగారిని పూర్వస్మృతికర్తలతోఁ బోల్చి తారతమ్యనిర్ణయము చేయఁబూనుట అప్రస్తుతము, నిష్ప్రయోజనము. పూర్వస్మృతికర్తల వాక్యములు కొన్ని యీకాలమున అనుకూలింపనట్లే గాంధిగారి యుపదేశములు కొన్ని భావికాలమున కుపయోగింపక పోవచ్చును. అప్పటి స్థితిగతుల ననుసరించి తత్కాలపు బుద్ధిమంతులును, నయజ్ఞులును, వానిని మార్చి క్రొత్త నియమముల నేర్పఱుచుకొనవచ్చును. ఇదియే సంఘాభివృద్ధికరమైన స్వాభావిక సన్నియమమార్గము. పరాశరునివంటివాఁడు పరాశరుఁడే. ఆయన తిరిగి బ్రతికి వచ్చి చెప్పినఁ గాని స్మృతుల సవరింపఁగూడదు—అని వాదించుట న్యాయవిరుద్ధము. స్థితిగతులు ప్రత్యక్షముగాఁ జూచి చెప్పు నిప్పటి నీతిమంతులగు మనీషులమాటలు, భావిసంఘస్థితుల నూహించి లిఖించి పెట్టిన పూర్వ ధర్మశాస్త్రకర్తల వాక్యములకంటె నెక్కువ విశ్వసనీయములు. జన్మపరంపరాసిద్ధాంతమొక్క వేదమతమే కాక బౌద్ధాద్యవైదికమతములు కూడ నొప్పుకొనుచున్నవి. అనేకజన్మము లెత్తి కొందఱు బుద్ధిబల నీతిబలాధ్యాత్మికబలములు క్రమముగా హెచ్చు చేసికొని యధర్మ మణఁచి ధర్మము నిలఁబెట్టు మహాపురుషులై యిప్పుడు పుట్టుట యసంభవము గాదు. అట్టి మహాప్రయోజనములు నెఱవేర్చుటకు పూర్వస్మృతికర్తలే, బహుభవసమార్జితమైన ఆత్మవికాసాతిశయముతో, నిప్పటి గాంధిమహాత్మునివంటివారై పుట్టఁగూడదా? ప్రతియుగమందుఁ జతుర్యుగధర్మములును నడచునని పెద్దలు చెప్పుదురు. మహాత్ముని బోధనమువలన మన సంఘములో నెంత సత్యసంపత్తి, యెంతనీతి, యెంత ధైర్యము, ఎంత దేశభక్తి యుదయించినదో ప్రత్యక్షముగాఁ గాన్పించుట లేదా? జాతివిద్వేషవైషమ్యరూపమైన యధర్మము పోవుట దేశాభ్యుదయాపాదకమైన కృతయుగలక్షణమేమో! కాదని యెవరు చెప్పఁగలరు?

హరిజనులు త్రాగుదురు, మృతజంతుమాంసము తిందురు. వారిలోఁ గొందఱు గోమాంసభక్షకులు. శుచితాశుభ్రతలు వారికి లేవు. కొందఱు మఱుఁగుదొడ్లు తుడుతురు; పశువులచర్మము లొలిచి వానితోను, ఎముకలతోను వ్యాపారము చేయుదురు. అట్టివారు మనకు స్పృశ్యు లెట్లగుదురు?

గొడ్డుమాంసము, చచ్చిన పశువులమాంసము తినుట హరిజనులు మానుకొనునట్లు పై జాతివారు ప్రబోధము చేయవలెను. వారికి శుచితాశుభ్రతలు నేర్పవలెను. వారిచే త్రాగుడు మాన్పింపవలెను. గోమాంసభక్షకులును, సురాపాయులును అగు పెక్కురు పాశ్చాత్యులే మద్యమాంసములు త్యజించి కేవలశాకాహారులై మంచి నీరు త్రాగి బ్రతుకుచున్నారు. బుద్ధాచార్యుఁడు పుట్టిన మనదేశములో ఈ సంస్కారము చేయుట సుసాధము గాని అసాధ్యము గాదు. హరిజనులలో విద్యావంతులైనవా రట్టి దురభ్యాసములు మానుకొనుచున్నారు. పై జాతివారి సాంగత్యము వారికి లభించినకొలఁది బ్రాహ్మణాదుల పరిశుభ్రత వారికిని అలవడక మానదు. అన్యాయమైన అంటరానితనముచేతనే యింతకాలము మఱకను హరిజనులు అపరిశుద్ధులై పడియున్నారు. మన యుపేక్షచేత అశుచిత్వస్థానములగు మాలపల్లెలలో తఱచుగా బయలుదేఱు విషూచి మున్నగు అంటురోగ

ములు పైకి వ్యాపించి పై జాతివారినిగూడఁ జంపుచున్నవి. సంఘ మనుశరీరములో నొక యవయవమును పాడుగానిచ్చిన నితరావయవములకు ముప్పు గాదా?

ఇఁక పాకీదొడ్లు తుడుచుట, చర్మములు దీయుట—వీనిమాట యేమి? తల్లులు బిడ్డలకుఁ జేయు నుపచారములే, వైద్యులును శస్త్రవైద్యులును రోగులకుఁ జేయు నుపకారకృత్యములే హరిజనులు మనకుఁ జేయుచున్నారు. అందులకు సంఘస్థు లందఱు వారికిఁ గృతజ్ఞులై యుండవలయును గాని రోఁతపడి వారిని వెలివేయఁగూడదు. గాంధిమహాత్ముఁడు సెల విచ్చినట్లు, ఆపనులు ఆరోగ్య శాస్త్రానుసారముగా, శుచిత్వమునకు భంగము కలుగకుండ సాగు నేర్పాటులు విద్యాధికులు చేయవలెను. ఎంతో కష్టముతో దూఱి గాని వెళ్లుటకు వీలులేని కన్నములవంటి ద్వారములు మఱుఁగుదొడ్లకుఁ బెట్టుమని యెవరు చెప్పినారు? అది యేటిన్యాయము? సౌకర్యములు కల్పింపక, మన సుఖముకై రోఁతపనులు వారిచేఁ జేయించి, వారి సేవ గించుట యేమి ధర్మము?

చర్మకారజాతిలోఁ బుట్టినవాఁడు ఆమరణాంతము చర్మకారుఁడుగానే యుండవలయునా? విద్యాబుద్ధులును, యోగ్యతయును గడించుకొని గొప్ప పదవులకు రావచ్చునా? ఏల రాఁగూడదు? వృత్తి సౌకర్యముకై వర్ణవిభాగము చేసిన మన ప్రాచీనమహర్షులు నిమ్నజాతుల నడఁగఁద్రొక్కుట కట్లు చేయలేదు. అవకాశములు కల్పించి నిమ్నజాతుల నుద్ధరించుటకు వారు తగిన యేర్పాటులు చేసినారు. తరువాతి స్వార్థపరుల వ్రాఁతలచేతను, చర్యలచేతను సదుద్దేశముతోఁ జేయఁబడిన ఆవిభాగము న్యూనాధికభావకలుషితములైన వైషమ్యవిద్వేషములుగా మాఱినది. గుణకర్మములచేత జన్మములవలనఁ గలుగు నెక్కువతక్కువలు తాఱుమాఱు గావచ్చును. దారులు గొట్టి బ్రతికిన కర్మచండాలుఁడు ఋషుల యుపదేశముచే శ్రీమద్రామాయణ మహాకావ్యకర్తయగు వాల్మీకిమహర్షి యైనాఁడు. జన్మముచే చండాలుఁడగు ధర్మవ్యాధుఁడు బ్రాహ్మణునకు వ్యాధగీతారూపమున సమస్తధర్మము లుపదేశింపఁదగిన యాచార్యుఁడైనాఁడు. అవతారపురుషుఁడగు శ్రీరామచంద్రమూర్తికిఁ బూజ్యపురోహితుఁడగు వసిష్ఠమహర్షి భార్య అరుంధతీదేవి మాతంగజాతి స్త్రీ. ఇవన్నియు యుగాంతరపుమాట లందురేమో! వైష్ణవాలయములలో నిప్పుడును బూజింపఁబడుచుండు ఆళ్వారులలో నమ్మాళ్వారు కాఁపు, తిరుప్పాణి ఆళ్వారు కడజాతియాయన, తిరుమంగయాళ్వారు మ్లేచ్ఛుఁడు. ఈపూజ్యులు కలియుగమందలి వారే. ఇఁక గొప్ప దేశాభిమానియగు పి. సి. రాయ్ గారీవిషయమున నితరదేశములలో సంగతిసందర్భము లెట్లున్నవని చెప్పినారో వినుఁడు—

౧. బ్రిటిష్ప్రాజ్య సుప్రసిద్ధమంత్రియగు "లాయిడ్ జార్జి" ని పెంచి పెద్దవానిని జేసిన మేనమామ, చెప్పులు కుట్టుకొని బ్రతికిన బీదవాఁడు.

౨. సోవియట్ ప్రజా పరిపాలనాధ్యక్షుఁడగు "స్టేలిన్" కొంతకాలము చర్మకారవృత్తి చేసికొని జీవించినాఁడు. అతనితండ్రియుఁ జర్మకారుఁడే.

3. కోటీశ్వరుఁడై గతించిన "బేటా" గారు చర్మకారుని కొడుకు. ఇప్పుడు ౧౭ ఏండ్లవాఁడై యున్న యతనికుమారుఁడు పదివిమానముల కధికారి యఁట.

౪. గొప్ప రసతంత్రవేత్తయును, రోగాణుజీవి పరిశోధకుఁడును అగు "లూయీ పేశ్చర్" గారు చర్మములు బాగుచేసికొని బ్రతికిన పరమ దరిద్రుని కొడుకు.

౫. ఇంగ్లండుప్రభువగు "విల్యమ్ విజేత" గారి తల్లి చర్మశోధకుని కూఁతురు.

౬. వంగదేశమందు గొప్ప క్రీస్తుమతబోధకుఁడై, మన దేశభాషలు పెక్కు నేర్చుకొని, ౧౮౦౦-వ సంవత్సరమున "ఫోర్టు విల్యమ్" కళాశాలలో ప్రథమ వంగభాషాధ్యాపకుఁడై, అధునాతన వంగభాషాగద్యరచనా ప్రతిష్ఠాపకుఁడని పేరుపడిన "విల్యమ్ కేరీ" గారు మొదట చర్మకారవృత్తి నవలంబించి పైకి వచ్చినవారే.

కనుక అవకాశము లిచ్చిన, చర్మకారులగు మన హరిజనులలోఁగూడఁ బ్రఖ్యాతపురుషులును, యశస్వినులగు నారీమణులును బయలుదేఱక మానరు. చర్మకారజాతిలోఁ బుట్టినవాఁడు చర్మకారుఁడుగానే చావవలయు ననుట అధర్మము, విపరీతనియమము.

హరిజనులలోనే మాలలని, మాదిగలని, పాకీవాండ్రని అంతర్భేదము లున్నవి. ఒకరు నీళ్లు తోడుకొను నూతిలో ఒకరు తోడుకొనరు. ఒకరితో నొకరు భోజనము చేయరు. వారిని ముందు కలిపి కదా పైజాతులకు వారిని స్పృశ్యులఁగాఁ జేయఁ బ్రయత్నించుట!

ఔను! అట్టిభేదము లున్నమాట వాస్తవమే. హిందూసంఘ మొకవిధముగాఁ గాదు చీలి చెడిపోవుట. పైజాతుల సద్గుణములును, సద్ధర్మములును క్రిందిజాతివారి కలవడుట కష్టము గాని దుర్లక్షణము లిట్టె ప్రాఁకి యంటుకొనును. శ్రీమద్భగవద్గీతలోఁ జెప్పిన నాలుగు వర్ణములును చీలి అసంఖ్యాకములగు అంతర్వర్ణములైనవి. నిక్షేపమువంటి హిందూసంఘము వెఱ్ఱితలలు వేసిన చెట్టువలె వినాశదశకు వచ్చుచున్నది. ఉత్తమజాతు లనుకొనువారికి హరిజనులు స్పృశ్యు లగునెడల హరిజనులలో నుండు పరస్పరభేదములు వానియంతట నవియే యంతరింపక మానవు. భగవత్కృపవలన మహాత్ముని యీయుద్యమము నెఱవేఱుచో శిథిలమైన మన సంఘ మైకమత్యముచే మరలఁ బుష్టమై పూర్వపుఁ బేరుప్రతిష్ఠలు సంపాదించుకొని పడిపోయిన భారతమాతను లేవనెత్తి సుఖపెట్టి మాతృఋణము తీర్చుకొనఁగలదు.

భారతీయులకు సవినయముగఁ జేసికొనుమనవి:— ఇంతవఱకు హరిజనులకు మనము చేయుచుండు అనాదరణము కేవల మన్యాయము, అస్పృశ్యతా నివారణ మవశ్యకర్తవ్యము—అని అంతరాత్మప్రేరితులై నిజముగా నమ్మువారు తమ వక్తృత్వబల ధనబల నీతిబలాధికారబలము లుపయోగించి హరిజనులలోని యసహ్యపుటలవాటులను మాన్పి వారిని పరిశుద్ధులఁ జేసి అంటరానితనమును గెంటివేయుఁడు. యూనియనులలోను, తాలూకాజిల్లాబోర్డులలోను, మ్యునిసిపల్బోర్డులలోను పలుకుబడిగలవారు ఇతరులకువలె హరిజనులకుఁగూడ విశాలమైన నివేశనస్థలము లిప్పించి, యింటిమీఁద ఇల్లు కట్టుకొనకుండ నడుమ సరియైన వీథులు వదలిపెట్టి మాలపల్లెలు కట్టుకొనునట్లు చేసి, యిండ్లముందఱ పందిపెంటలు, దుర్వాసనగొట్టు పదార్థములు లేకుండఁ గఠిన మైన నియమములు గావింపుఁడు. వారిలోఁ గొందఱు చేసికొను అసహ్యపు వ్యాపారములు సహ్యమైన పరిశుద్ధవ్యాపారము లగునట్లు ఏర్పాటులు గావించి హరిజనుల యారోగ్యమును, తద్ద్వారమునఁ దదితరుల యారోగ్యమును సంరక్షింపుఁడు. అన్నపానవిహారాదులందు శుచిత్వము వారి కబ్బినచో అస్పృశ్యత ఆల్కహాల్ వలెఁ దానంత నదియే హరించి యెగిరిపోవును. పరిశుభ్రతకుఁ గావలయు గట్టి కట్టుపాట్లతో, సామాన్యజనసంఘోద్దిష్టములైన నూతులు, చెఱువులు, విశ్రాంతివసతులు, బడులు, దేవాలయములు హరిజనులను గూడ నుపయోగించుకొననిండు. పరిశుద్ధుల సాంగత్యమున నపరిశుద్ధులుకూడఁ బరిశుద్ధు లగుదురు. హరిజనులు పైజాతివారితో గుళ్లలో భగవంతుని సేవించుటవలన, జంతుబలులు, మద్య నైవేద్యములు మున్నగు వామాచారములు తొలఁగిపోయి సాత్త్వికభక్తి దేశమునఁ బ్రబలును. సర్వనాగరక ప్రపంచమును వేనోళ్ల సంస్తుతించు చున్నది మన సుస్థిరసనాతనోపనిషన్మతము గాని కాలానుగుణముగా మాఱవలయు కర్మమతము గాదు.

ఇఁకఁ బరంపరాగత మగు కర్మకాండమే పరమపురుషార్థమనియు, అస్పృశ్యతానివారణ మనర్థకారియును, ఆధ్యాత్మికజీవనమున కడ్డంకియగు ననియు స్వార్థపరులై కాక, అంతశ్శుద్ధితో విశ్వసించి బాధపడు భారతీయ సోదరులారా! మిమ్ము బాధపెట్టుఁడని మహాత్ముఁడు సంస్కర్తలకు బోధించుట లేదు. అహింసామూర్తి యగు ఆయన యట్లెన్నఁడును జేయఁజాలఁడు. మీరు మీ ప్రాచీనాచారములనే యనుష్ఠించుకొనుఁడు, మీ ధనము వినియోగించి కాని, బుద్ధి నుపయోగించికాని, అధికారబల ముపయోగించి కాని

హరిజనులకు విద్యాబుద్ధులు చెప్పించి, పరిశుద్ధత నేర్పు నేర్పాటుల చేయించి, వారి నుద్ధరించు పుణ్యముఁ గట్టుకొనుఁడు! హరిజనులు హిందువులే కారనియు, సంస్కారప్రియు లగు బ్రాహ్మసామాజికులును, ఆర్య సామాజికులును, దివ్యజ్ఞానసమాజమువారును అంతకంటె హిందువులు గారనియు వాదించు సాహసికులు మాత్రము గాకుఁడు. ఎక్కడె క్కడకో వెళ్లి చీమలకై పుట్ట లలో నిత్యము నూకలు పోయుదురే కొందఱు! తోడిమానవులగు హరిజనులు చీమలపాటివారైనఁ గారా? వారి దీనస్థితి బుద్ధాచార్యుఁడు పుట్టిన దేశములోఁ బుట్టిన మీహృదయములు గరఁగించి వారిని మీకృపా పాత్రులను జేయకుండునా?

శ్రీ వివేకానందస్వామి మున్నగు మహానుభావులు చెప్పిన మఱియొకమాట చిత్తగింపుఁడు—

సర్వదేశ పూర్వచరిత్రలు—ముఖ్యముగా మన హిందూదేశచరిత్ర—పరికించి చూచినచో, దేశమును కొంతకాలము పురోహితబృందము (అనఁగా బ్రాహ్మణులు) నడపినట్లును, కొంతకాలము ప్రభుబృందము (అనఁగా క్షత్రియులు) నడపినట్లును గానిపించును. పిమ్మట నింతవఱకును ధనవద్బృందము (అనఁగా వైశ్య బృందము) నడపుచున్నది. అధికారము చేతిలోఁ బెట్టుకొన్నవారు తమక్రిందివారు పాటుపడి పండించినపంటలును, శ్రమపడి సృష్టించిన యితర భోగపదార్థములును యథేచ్ఛముగా ననుభవించుచుండియు వారికష్టములు తొలఁగించి వారిని సుఖపెట్టుటకుఁ బ్రయత్నింపలేదు. అట్టి సస్యసస్యేతరవస్తూత్పాదకులు కాఁపులును, హరిజనులును అయియున్నారు. కష్టపడి దేశములో సుఖజీవనమున కావశ్యకమగు సర్వపదార్థములును కల్పించువారు వారు; అల్పశ్రమముతో అవి యనుభవించి బొజ్జలు నిమురుకొనుచుఁ గూర్చుండువారము మనము. వారిలో విద్య వ్యాపించుచున్నది. దేశములోఁ దమ ప్రాధాన్యమును వారు కనుఁగొనుచున్నారు. జ్ఞానముతోపాటు ఆత్మగౌరవ మంకురించి యంతకంత కతిశయింపక మానదు. అధికారము వారిచేతులలోనికి రానున్నది. పాశ్చాత్యదేశపరిస్థితు లెట్లున్నవో యించుక కనువిచ్చి చూడుఁడు. ఈ యన్నవస్త్ర వస్తూత్పాదకుల సంఖ్య మనసంఖ్యకంటెఁ గడు నెక్కువగా నున్నది. మర్యాద దక్కించుకొని న్యాయ్యమైన వారి హక్కులను వారి కిచ్చుట మంచిది. లేనియెడల బలవంతముమీఁద వాని నొసఁగవలసి వచ్చును. సమ్మెకట్టు లెట్లు బయలుదేఱి తమ ప్రయోజనముల నెఱవేర్చుకొనుచున్నవో మనము చూచుచునే యున్నాము. ఇది కృషీవలులయొక్కయు, కర్మకారులయొక్కయు కాల మనుమాట మఱచి పోఁగూడదు.

హరిజనుల కొకమనవి:—బుద్ధిపూర్వకముగానో, యజ్ఞాన మత మౌఢ్యములచేతనో పై జాతులవారు మీ కష్టసుఖము లెంచక మిమ్మింతకాలము చులుకనగా జూచినందులకు మీరు కినియకుఁడు. మిమ్మపేక్షించిన జాతులవారే మీ జ్ఞాననేత్రమును విప్పి మిమ్ముద్ధరింప నడుము కట్టుకొన్న సంస్కర్తలైనా రన్నమాట మఱవకుఁడు.

లోకా స్సమస్తా స్సుఖినో భవంతు!

# వసంతాంత శ్రీముఖము

కవిరాజహంస, వోలేటి పార్వతీశముగారు 122

కష్మతాపిఁ గడల గమ్ముగ మ్మనిపించి - తేనెపానకములఁ దేంట్లఁదనిపి
సత్ఫలోపకృతికి సర్వస్వ మర్పింప - నలరు లెల్ల సిద్ధమగుచు నుండె.
చివురులనవకంబు చెదరుచున్నకొలఁదిఁ గోకిలకంఠంబు గొణఁగఁదొడఁగె ;
విరిదేనెఁ బుప్పొడి పొర మించినకొలందిఁ దేఁటినాలుక ఓట దేఱఁదొడఁగె ;
కరువల్లు పడమరఁ దిరుగుచున్నకొలంది నెళనీళ్ల నులివెచ్చ మలయఁదొడఁగె ;
పట్టుగొమ్మల దోరపండ్లూడినకొలందిఁ బేదతీగలగొంతు బిగియఁదొడఁగె ;
ఇనుఁడు రోహిణివగలఁ బెల్లెగయుకొలఁది- భువనగర్భాంతరాళంబు పొగయఁదొడఁగె;
శశి విశాఖాంతరస్థుఁడై జరగుకొలఁది - మధువనోపవనశ్రీలు మాయఁదొడఁగె.

ఆఁకలి దీరఁగాఁ జిగురుటాకులు మేయుచు నేఁడె మోహన
శ్రీకలపంచమశ్రుతులచే జగమెల్ల సుధామధుద్రవా
సేకవిముగ్ధ గానటులు చేసి ప్రమోదరసాబ్ధిఁ దేల్పుఁ డో
కోకిలలార! పల్కుబడి కోరిన రాదిఁక మీకు మీఁదటన్.

చీలికలైన వేణికలు చిక్కి నితంబము లాని తూలి కై
వ్రాలఁగఁ ; దల్లడిల్లి నిడువాలుగ వాలుగనుల్ చలింపఁగా
నేల పరిభ్రమింతు వుదధీశదినేశు లుదారు లప్పలం
దేలిచి మేర మీరకయె తీరుతు రోడకు మోపయస్విని !

అడుగక పెట్టకుండఁగ సుఖానుభవంబులు సేయ సర్వమున్
విడిచి విహంగసంతతికి విందులమందిర మైననాపయిన్
బడితల మోఁది మోఁది ఫలభంగము చేసిరి క్రూరు లంచు బె
గ్గడిలకు త్యాగశీలి కడగండ్లకు జంకునటమ్మ చూతమా !

సరసఫలోన్నమద్ఘ నరసాలవనంబులఁ జేరి సౌమ్యవా
నరముల నాకలోకభవసౌఖ్యము లందితి రెల్లకాల ము
ర్వర నొకరీతి సాగ దుపవాసము సేయుఁడు గాని వేపలం
దిరిసి కులంబు గౌరవము తేలిక చేయకుఁ డమ్మ కీరముల్.

నడక బడలి, యాఁకలిమంట నుడికి చిలుక-కొట్టని తినంగ ఫలము గైకొంటి గాని
పాంథుఁడా! సంశయంబయ్యెఁబట్టి త్రిప్పి-చూచుకొనుమోయి! త్రాచుమూచూచెనేమొ?
నిన్న నిలిచెనె నేఁటిలో నిండకుండ ? - పగలు మిగిలెనె రాత్రిలోఁబడకయుండ ?
అట్లె యీవసంతము గ్రీష్మమైనదాఁకఁ - గూరుచుండదు మన కిది క్రొత్తగాదు.

---

# రామారావు చిత్రకళ

శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు

ఉదయగిరి శిఖరావనికపయి
బాలభానుడు తెలుగు చిత్రము
రచనచేసెను ప్రజలు మెచ్చిరి
చూడ ర మ్మిటు తమ్ముడా!

శ్రీని రామారావు మరణించిననాడు రాజమహేంద్రవరపు రసజ్ఞ ప్రజా సంఘము ముక్తకంఠాన్ని ఘోష సల్పింది. అతని జ్ఞాపకార్థము అతని చిత్రములూ, చిత్రకళాసేవద్వారా పతిపూజ చేస్తూన్న అతని సతీమణి సత్యవాణీ ఆంధ్రలోకానికి మిగిలినారు. ఆంధ్రు లానిర్మలాత్ముని పూజకి నేకరించిన దేమీ లేదు. మీదుమిక్కిలి అతని కళను గురించి లోతు తక్కువ అభిప్రాయాలు ప్రబలుతున్నాయి. కళాకారులు చేయవలసిన విమర్శనకు నాబోటి హీనసంస్కారులు పూనుకోడము సాహసమే; కాని తప్పనిసరి. శక్తిగలవా రుదాసీనత వహించక ఈ వ్యాసమునందలి సత్యాసత్యము లరయుదురు గాక యని నా ప్రార్థన.

మానవు డేకదృశ్యమును — పురాణదృశ్యము కానీ, సాంఘికము కానీ, ప్రకృతిసంబంధము కానీ— చూచో, ఊహించో, తాను పొందిన ఆనందమును పరులకుకూడా పంచే ఉద్దేశ్యముతో రంగులతో రచించేదే చిత్రకళ. కాబట్టి కళావిర్భావానికి మూలకందము తన్మయత్వమూ, సమాధి. రామారావు చిత్రరచనా కాలమం దొంటిగా కూర్చునేవాడట. సమాధికి వ్యక్తచిహ్నము ఏకాకిత్వమే. సమాధిసత్యాసత్యములు వీటిని బట్టి చెప్పవలెనే కాని వారి మనసులలో దూరి మనము గ్రహించగలమా? సమాధికి సత్ఫలము కళావిర్భావమే. కళారచననుబట్టి రచయితకళాకారిత్వమును మనము తెలుసుకోవచ్చును.

పైని చెప్పిన నిర్వచనమునుబట్టి రచయిత పొందిన ఆనందము ద్రష్టకు కలిగినప్పుడే కళ సార్థకమౌతుంది. కళాకారుని చేతినుండి బయలుదేరినదల్లా కళ అనడానికి వీలు లేదు. కాబట్టి జనసామాన్యానికి హృదయానందము సమకూర్చే విషయాలను తక్కిన కళల నుంచి గ్రహించి ఆవిషయాలు రామారావుచిత్రములలో కనబడుతున్నవా అని పరిశీలించితే మనకు రామారావు చిత్రకళలోని లోపాలోపాలు బోధపడతాయి. కాని మనము చిత్రకళకీ తక్కిన కళలకీ గల భేదములు చూస్తూనే ఈచర్చ చేయవలసి ఉంటుంది. ఏమందురా? మానసికద్వైవిధ్యమును మూర్త్యాధారము నాశించే చిత్ర, వాస్తు, శిల్ప కళలు చూపించలేవు. అలాగే సహజస్వరూపాన్ని నిరాధారాలయిన కవిత, సంగీతము చూపలేవు. ఈవిషయాలు గమనిస్తూ ఇతరవిషయాలను అన్నికళలకీ ఒత్తవచ్చును.

ఏచిత్రమైనా ఒక రసాన్నే ప్రతిపాదించాలి. రెండుకత్తులు ఒక ఒరలో ఇమడలేనట్లే కళాకారుని మనస్సు నావరించినవి రెండురసాలైతే పరిపూర్తి పొందలేవు. తన్మయత్వము భాగా లవలేదు. కాబట్టి ఏకరసావేశుడైన చిత్రకారుడు చిత్రించే అంశాలన్నీ చిన్నకథలోని ఘటనాసంచయములాగే ఏకరసోత్పాదనకే దారి తీస్తూండాలి. ఈ గుణాన్నే కళాభిజ్ఞులు ఐక్యము అంటారు. వర్ణనలో వర్ణ్యవస్తువునకు సంబంధించిన విషయాలు తప్ప తక్కిన అనవసరవిషయాలను వ్రాయడము నేల విడిచిన సాము. రసోత్పాదకములగు చిత్రము లన్నిటిలోను విషయైక్యము ఉంటుంది, ఉండాలి. రాజసభలో పావురాలు, అడవులలో ప్రాసాదములు, చీకటిచిత్రములలో నిండుచంద్రుడు అసంబద్ధాలు, ఐక్య వినాశకాలు. ఇలాంటి ప్రమాదాలు సంగీతసభలో పిల్లవాని ఏడ్పులాగే క్షమించబడవు.

కాబట్టి కళావినాశకములైన విరుద్ధవిషయాలు చిత్రకళ లోనే కాదు, ఏకళలోనూ దొర్ల కూడదు.

కాని ఐక్యమును సాంద్రపరచి వ్యక్తము చేయ డానికి వైషమ్యాంశాలు తోడ్పడుతూంటాయి; అవ సరము కూడాను. అమావాస్యరాత్రిని చిత్రించవలె నంటే నల్ల కాగితముమీద పెన్సిలుతో సుడిసెలను గీచి ఇది అమావాస్యచీకటి అంటే మనము అవు నంటామా ? అట్లు కాక బొమ్మనంతా చీకటిమయము చేసి, ఆ చీకటిని మనకు చూపించడానికి ఏగుడిసెలోనో ఒక దీపము కూడా రచిస్తే చీకటియొక్క దట్టతనమును ఈ గుడ్డి దీపము మనకి "చూపిస్తుంది". దీపము చీకటికి వైషమ్య విషయమే అయినా, ఆచీకటిని మనకి చూపించడానికది అత్యావసరము. ఈవర్ణనను చూడండి—"సూర్యుడు వంశ ధారనదిమీద మిలమిల మెరుస్తున్నాడు. చెట్లు ఆకుల్ని వాల్చేసి సొమ్మసిల్లేయి. మేకలూ, గొర్రెలూ తాటిచెట్ల నీడలకి సర్దుకుని నెమరుస్తున్నాయి. పట్నానికి పోయే వర్తకులు బళ్లు విప్పేసి తోపులో పడుకుని నిద్రపో తున్నారు. దూరాన్ని ఏచెట్టుమాటునుంచో కోయిల 'క్కో' యని కూస్తోంది." ఇది వేసవిదృశ్యము. ఎండ వేడికి స్తబ్ధత వహించిన ప్రకృతి దీనికి వస్తువు. నీటిమీద మిలమిల మెరిసే సూర్యుడూ, ఆకులు వాల్చిన చెట్లూ, కొంచెపాటినీడ నిచ్చే తాటిచెట్ల నీడలకే సర్దుకున్న మేకలూ, నిద్రపోయే వర్తకులూ స్థావరజంగమప్రకృతీ స్తబ్ధతను సూచిస్తే, దూరమునుంచీ కూసే కోయిల ఈ స్తబ్ధతని మనకి వినిపిస్తోంది. ఈ కోయిలే లేకపోతే స్తబ్ధత మనకి వినరాదు. కోయిలకూత వేసవికాలపు మధ్యాహ్నానికి వైషమ్యముగా కనబడినా, తక్కిన వాటితో చేరియుండడమువల్ల ఐక్యపోషకమే అయింది. కాబట్టి సమగ్రైక్యమును సాంద్రీకృతముచేయడానికి వైషమ్యాంశ మొకటి ఎప్పుడూ తోడ్పడుతూంటుంది. వర్షాకాలపు ఆకాశమునకు మెరుపూ, నిశ్శబ్దనిశీథములో కీచురాయి నిస్స్వనమూ, క్రూరకిరాతుని బంధుప్రేమ, మాతృదేవతా ప్రేమచుంబనములతో వెలుసడే తిట్లూ ఇలాంటివే.

రామారావుచిత్రములలో ఐక్యవైషమ్యాలు పగలు రాత్రులవలె కలిసి ఆచిత్రములను మనహృదయాల మీద అచ్చొత్తుతున్నాయి. 'పుష్పాలంకారము *' చూడండి. చంద్రికవన్నెచీర కట్టి అంతర్వత్నియైన ఆడపడుచు నాలుగుకాళ్లపీటమీద కూర్చుని శిరస్సు వంచింది. ఆమెతల్లి సుమంగళు లిచ్చిన పువ్వులని ఆమె జడకొప్పులో అమరుస్తోంది. చుట్టమొకర్తె పేరంటాం డ్రకు పన్నీరుబుడ్డి అందిస్తూంటే చిన్నవయసులో నున్న తరుణి సహజచాపల్యముతో పన్నీరు జల్లడానికి చెయ్యెత్తింది. తీరుబడిగా ఇద్దరు గోడకి జేరబడి మాట్లా డుకుంటున్నారు. ఇంకో కుటుంబిని పళ్లూ, పసుపూ, కుంకం దాసిచేత మోయించుకుని ఇప్పుడే వచ్చి చేరింది. ఇంతవరకూ అంతా స్త్రీలోకమే. కొత్తగా వచ్చిన ఆవిడకుమారుడు తల్లి నేమో అడుగుతున్నాడు. చిత్ర కారుడు ఇంతవరకూ స్త్రీవాతావరణము కల్పించి ఈ బాలునిమూలమున ఆ వాతావరణమును ప్రత్యేకము చేస్తున్నాడు. మగవారిచిత్రమునకు వైషమ్యాంశాలే. ఐనా బాలుడు కాడు. ఐక్యమును పూర్తి చేసే ఈ వైషమ్యాంశాన్ని చిత్రకారుడు ఒకమూలకి తోసి నాడు. ఈబాలుడు మధ్య నుండకూడదు. ఇంతే కాదు. వస్త్రాలూ, చీరలూ అన్నీ లలితవర్ణయుతాలు. ఈకుర్ర వాని అంగవస్త్రము దట్టమైన యెరుపు. కాబట్టి ఇది సులభముగా మనదృష్టి నాకర్షిస్తుంది. అప్పుడు స్త్రీ వాతావరణానికి ఒకసరిహద్దు ఏర్పడుతుంది. ఈతని బట్టి స్త్రీవాతావరణానికి హద్దేర్పరిస్తే ఇతడు పురుషు లీచోటికి రారాదని పలుకుతున్నాడు. బాలుడు లేకుంటే దీనికి సంపూర్ణత లేదు. అప్పుడు ఈస్త్రీ లందరూ ఏదో పనిమీద వచ్చిన ట్లుంటుంది. ఈ చిత్రము సంపన్నుల అంతఃపురభాగ మౌతుంది. బాలు డుండుటను బట్టి ఇది "పుష్పాలంకార"మనే ఇంటి పండు గౌతుంది.

"శ్రీరామవివాసము" రెండవది. నిరాడంబరా లైన వస్త్రాలు ధరించి శ్రీరాముడు వనవాసానికి బయలు దేరాడు. జానకి యాతనికి నీడ అయింది. సౌమిత్రి

---

*ఈ త్రివర్ణచిత్రము భారతి ఎనిమిదవసంపుటము పదునొకండవ సంచికయందు ప్రకటితమయినది.)

రోషము నంతటినీ విల్లు కందించుతూ బయలుదేరాడు. దశరథుడు తన స్త్రీలోలతను నిందించుకుంటూ దుఃఖము నంతటినీ లోపలనే అణుచుకుంటున్నాడు. సుమిత్ర పుత్రస్నేహము పురికొల్పితే ఎలాగో లేచింది గాని దుఃఖావేశమువల్ల చెలికత్తె చేతులలో మూర్ఛపోయింది. కౌసల్యాదేవి ఇదివరకే తెలివి తప్పిపోయింది. ఆమెకి యొక్క నీలిమ దట్టమైనది. దీనిరంగు తక్కిన వాటి రంగులాగే లేత దైతే కైకేయినికూడా మనము వెతక వలసి వస్తుంది. అప్పుడు చిత్రములోని శోకానికి రూపము రాదు. ద్రష్టకు కరుణరసావేశము కలుగదు...వస్త్ర వర్ణవిభేదమువల్ల విషయైక్యమును సాంద్రీకరించుటను ప్రఖ్యాతప్రతీచీ చిత్రకారుడైన రాఫేల్ లోకూడ చూడ వచ్చును. ఆతని చిత్రముల నిక్కడ వర్ణించడ మధిక ప్రసంగము. రాఫేల్ కేవలవర్ణములనే కాక వ్యక్తిరూపాలను కూడా వైషమ్యాంశాలుగా వాడుక చేశాడు. యుద్ధావసరాన్ని ఆతురులైన సైనికులు కవచాలు, ఆయుధాలు సర్దుకుంటూన్న గంభీరచిత్రములో బంగారుజుట్టుగల చిన్నపిల్లని ప్రవేశపెట్టినాడు. ఆడవారిక్కడ ఐక్యవినాశకులే ఐనా బాలిక కాదు. ఈమె సైనిక వాతావరణానికి హద్దు. రామారావు "పుష్పాలంకారము"లో వాడిన కుర్రవాడు ఇక్కడి బాలికకంటె స్వభావసిద్ధముగా నున్నాడు.



"శ్రీరామ వివాసము"

శైత్యోపచారాలు చేసే చేడియ రాఘవునిదృష్టి మరలించ యత్నిస్తోంది. ఈచిత్రమంతా హేమంతకృష్ణా నంతశర్వరీరూపము. దీనికి జీవమూ, చైతన్యమూ పోస్తేనే కాని చిత్రకారుని ఆశయము సఫలీకృతము కాదు. దశరథమహారాజు నిద్రపోయాడేమో? రాముడు సహజబంధుప్రేమను జార్చివేసినాడేమో? ఈనిశ్శబ్దానికి కైకేయికంటియెరుపు జీవమిస్తోంది. కనులు మూసిన దశరథుని గుండెమంట, పిడికిటివిల్లుని పీడించే సౌమిత్రి కోపావేశమూ, పోవుచు కొంచెము వెనుకకు చూచే శ్రీరాముని సహజసౌజన్యమూ కైకేయి ఉండడమువల్ల మనకు గోచరిస్తోంది. ఇంతకరుణరసపూరితదృశ్యాన్ని చూచికూడా కలగని కైకేయి చిత్రవస్తువుకు విరుద్ధ విషయమైనా రసైక్యముకే తోడ్పడుతోంది. ఇది లేకున్నా, మధ్యన ఉన్నా చిత్రమునకు జీవము పోతుంది. వస్త్రము లన్నిటిలో కైకేయి చనుకట్టు

రామారావు రచించిన "కార్తికపౌర్ణమి" చూడండి: రంగము రాజమహేంద్రవరములోని మార్కండేయాలయ ముఖమండపము. సువాసినులు పెక్కురు వచ్చినారు. పువ్వులు, పళ్లు మొదలైన పూజాద్రవ్యాలతో ఒక యువతి, ఆమె కూతురు ఇప్పుడే మండప మెక్కారు. దూరాన్ని కొందరు ప్రదక్షిణము చేస్తున్నారు. నందీశ్వరుడి నుదుట కుంకుమ పెట్టే దొకతె. చెవి తడివే దొకతె. నిలిచి చూచే దొకతె. ఈ ఆఖరామె ఆలయము నుంచి వచ్చింది కాబోలు. అందుచేత తెరిపిగా చూస్తోంది. ఇంక గుడిలోనికి వెళ్లేవారు చాలామంది. ఈరంగమంతా స్త్రీలతో నింపి, చిత్రకారు డొక మూలను యాచనకు వచ్చిన బ్రాహ్మణుని ప్రవేశపెట్టినాడు.

యువతుల దృష్టిలో ఇలాంటి పురుషులు "పురుషులు" కారు. అందువల్ల స్త్రీ వాతావరణానికి భంగము లేదు. దాని కీతడు సరిహద్దు. ఇతనివల్ల చిత్రమునకు సంపూర్ణత వచ్చింది. ఈతడు లేకుంటే ఇది "కార్తిక పౌర్ణమి" కాదు. రామారావు సత్కళావశ్యకములగు సైక్యవైషమ్యాలను బాగుగా వాడుకచేసినాడు. చిత్రకళలో ఈ విషయము గమనించినవారే అరుదు. వైషమ్యమును ప్రవేశపెట్టినాడని మితిని గాని, స్వాభావికతను గాని దాటిపోలేదు. అనగా ప్రయత్నపూర్వకముగా వైషమ్యమును తీసుకొని రాలేదు. స్త్రీలు పేరంటములకు కుమారులను తీసుకొని పోవుట చాలా స్వాభావికము. నిజ మాలోచిస్తే ఆదృశ్యాలకు జీవము బాలుడే. స్త్రీల ఉత్సవాలలో డబ్బు దండుకొనుటకు యాచకులు-అందును పంచాంగపు బ్రాహ్మణులు చేరుతారు, వైషమ్య విషయాలను తీసుకొని రావాలి కదా అని వేటినో కాక సంపూర్ణతతోపాటు ఐక్యమును దట్టపరచే అంశాలను వాడడములో ఎన్నికగన్నవా డితడు.

కళ మనిషి చేసినది. కాబట్టి కళాకారుని బొటనవ్రేలిసూటు దానిలో కనబడాలి. కళ జనసామాన్యాని కుద్దేశించబడింది. కనుక దానిలో సార్వజనీనములయిన విషయా లుండవలెను. జనమంచి వేంకటరామయ్యగారి నవకుసుమాంజలి చూడండి:

"నేలం బ్రాకెడి పూవు దీగవలెనే,
 నే నుందు నో దేవ; న
న్నీలోకంబున కేల దెచ్చితివో, నా
 కిచ్చోటు నేమించితో!
పూలా పూవను, మొగ్గలా తొడువనుక్,
 బ్రోడైన గానుం, బసుల్
కాలం ద్రొక్కగ స్రుక్కుచుందు; నిది నా
 కర్మంబె సర్వేశ్వరా."

మొదటి రెండుపాదములలోని భావాలూ మానవునివి. తరువాతి రెండుపాదములు వేంకటరామయ్యగారి సొంతము. ఇవి కళాకారుని బొటనవ్రేలి సూటు తె , మొదటిరెండూ జనసామాన్యమున కంతటికీ వర్తించును. మొదటి రెండుపాదములతోను గాయకుడు ఫిడేలు తీగలనువలె, కవి జనసామాన్యము హృదయాలను సరిచేసి, చివరి రెండుపాదాలనే కమానుతో తన హృదయావేగము వాటి కెక్కించు తున్నాడు. పద్యము చదవగానే మన హృదయాలు రింగుమంటాయి.

ఇక నీపద్యము చూడండి:

కోయిలపాట—

 పాతపాటలనే యేల పాడె దీవు?
 క్రొత్తపోకడ నీకడ సుత్త దకట!
 మెచ్చుకొనువార లుండవచ్చుగాక,
 నాకుమాత్రము నీపాట నచ్చలేదు.

ఈ భావము "జ్వాలా" విలేకరులవలె చవకగా నవీనత్వము సాధించేవారికే గాని జనసామాన్యానికి నచ్చేదానిలాగ లేదు. దీనిలో మానవస్వభావము పాలు తక్కువ, కవిపాలు ఎక్కువ. ఇంకొకటి:

"శ్రీరఘురామ, చారుతుల
 సీదళదామ, శమక్షమాది శృం
గార గుణాభిరామ, త్రిజ
 గన్నుత శౌర్యరమాలలామ, దు
ర్వారకబంధరాక్షసవి
 రామ, జగజ్జనకల్మషార్ణవో
త్తారకనామ, భద్రగిరి
 దాశరథీ, కరుణాపయోనిధీ."

ఈ పద్యమును ఆత్మ పలికింది. దీనికి మానవత్వము లేదు. కవి ఎవరో, ఎట్టివాడో తెలుసుకోలేము. జీవుడు పరమేశ్వరునిగూర్చి అన్నమాట లివి. ఇది కవిత కాదు, ప్రకృతి. సార్వజనీనత్వ మెక్కువైతే, కవిత కాదు, ఏకళయైనా ప్రకృతిలో లీనమౌతుంది.

వంగదేశీయ చిత్రకారులు వ్రాసిన చిత్రములు మనలో చాలమంది చూచి యుందురు. శకుంతల నొక ప్రసిద్ధ చిత్రకారుడు చిత్రించినాడు. చిత్రము యొక్క సౌందర్యము రంగులకు వారిచ్చే అతిలోక

ప్రయోజనముల పైననే ఆధారపడి యున్నది. ఈశకుంతలను చూచి దుష్యంతమహారాజు మాటకేమి, నాటకములోని బూటకపు దుష్యంతులుకూడ మోహించలేరు. "అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహైః" అని ఈ మహానుభావురాలినిగురించే పలికినాడా కాళిదాసు? అయితే కేవలము రంగులపేచీకా దీచిత్రము. ఈ చిత్రకారునివే చైతన్యదు, యమున, రాధాకృష్ణ బాగున్నవి. చిత్రకారుని ఊహాప్రపంచములో నీమె భాసురకాంతిస్వరూపిణియై ప్రత్యక్షమయ్యేను గాబోలు. కాని ఈరూపు దాల్చిన ఆ కళాత్మకుని దివ్యస్వప్నమును మన మానందించలేము. ఏకాక్షర కవిత్వమును శబ్దకోశసహాయముతోను, గాయకుని విపరీతస్వరకల్పనలను ఆవృత్తములకు గల మాత్రలతోను చూచినట్లు, ఈ చిత్రమును కూడా రంగులకు వారిచ్చే వివిధార్థములపట్టికను పెట్టుకొని చూడవలెను. ఈరకపు చిత్రములలో "పరుల కర్థమ్ము కాని భావగీతము" లలో వలెనే కళాకారుని వ్యక్తిగుణ మెక్కువై పోయింది.

ఇంక రవివర్మ రంభ, తార, మహాశ్వేతలను చూడండి: వీటిలో ప్రత్యేకత బొత్తుగా లేదు. భీముడి చేతులో విల్లు పెట్టితే రాము డైపోతాడు. రాముడి చేతులోని కోదండము తీసివేస్తే జబ్బకండలు 'భీముడా' అనిపిస్తాయి. వీటిలో సర్వసామాన్యత హెచ్చు.

రామారావు చిత్రములలో సర్వ సామాన్యత, కళాకారుని వ్యక్తిగుణమూ గంగాయమునలవలె సమ మిళితము లైనవి. అందలి మనుజులు వంగీయచిత్రముల లోనివారివలె అతిబలహీనులూ కారు; గ్రీకు సైనికుల వలె కండలుతేరినవారూ కారు. వీరు మానవులు మాత్రమే కారు. రామారావు మనోదర్పణములో ప్రతిఫలించిన మానవులు. రూపము, వాతావరణము, కథా సందర్భము మొదలైన స్థూలవిషయములలో వీరియందు సర్వసామాన్యతా, సౌకుమార్యమూ, వస్త్రాద్యలంకారములు మొదలగు సూక్ష్మవిషయములలో చిత్రకారుని వ్యక్తిగుణమూ కనబడుతూంటాయి. స్థూలవిషయములలో రామారావు ప్రబంధములలోని వర్ణనలను గ్రహించినాడు. స్త్రీలకు మొలనూలు, పావడ, అందెలు, ఉత్తరీయము, చనుకట్టు మొదలైనవి సంస్కృతకావ్యములలో నుదాహరించబడ్డాయి. కాని వీటికి విశిష్టరూపము నెవ్వరూ ఇవ్వలేదు. అందెలు మనవారు సామాన్యముగా పెట్టుకొనే ఎంకరకడియాలు కావు. మొలనూలు ఇప్పటి వడ్డాణము కాదు. వీటి కన్నిటికీ రామారావు ఒక విశిష్ట రూపమును ఇచ్చినాడు. ఇంక సూక్ష్మవిషయము లన్నీ అతనిస్వంతము. పాపట బందీలు, చంద్రవంక, జడముళ్లు మొదలైన ఆభరణాలు మనవారికి మోటయిపోయినవి. వాటివల్ల ముఖమునకు వచ్చే విచిత్రసామరస్యము నీతడు చూచి తన చిత్రములలో వానిని ప్రవేశపెట్టినాడు. చారిత్రిక, పౌరాణిక, సాంఘికవ్యక్తుల కాతని చిత్రములలో ప్రత్యేకత యున్నది. పురాణవ్యక్తులు దివ్యులు. వారి కన్ను లర్ధనిమీలితములు; ఆకర్ణాంతములు. వైశాల్యమునే గాక పరిమాణమును* కూడా చూపే యత్నము ముక్కును సూచించే రేఖ పైభాగమును కనుబొమతో కలుపుటనుబట్టి కనబడుతున్నది. ఈ సంగతి "శ్రీరామ వివాసము" న చూడవచ్చును. దీర్ఘములై యర్ధనిమీలితములైన కనులు అజంతాచిత్రములలోకూడా కనబడతాయి. కాని బొమలు విలుబద్దలవలె వంపులు గలిగి ఉంటాయి. రామారావుచిత్రములలో ఈ వంపులు తక్కువ. ఈతడు తన చారిత్రిక చిత్రములలో క్రింది రెప్పకు కొంత వైశాల్యము కల్పించుటతో మదిరాక్షులను మదిరాక్షులుగ చేసినాడు. వారి కన్నులు పౌరాణిక వ్యక్తులకన్నులవలె దీర్ఘములు కావు. మూడోకొలత

---

* పదార్థముల కన్నిటికీ సామాన్యముగా పొడవు, వెడల్పు, ఎత్తు అనే మూడుకొలతలుంటాయి. పాశ్చాత్యులు వెల్తురునీడలను వాడుకచేసి, మూడు కొలతలను తమచిత్రములలో చూపుతారు. అజంతాచిత్రములలో ఎత్తును చూపించుట కంతప్రయత్నము కనపడదు. ప్రాచ్యచిత్రములు రెండుకొలతలతోనే సాగినవి రామారావు బొంబాయిలో కరచినది పాశ్చాత్యపద్ధతులనే. కాని ప్రాచ్యపద్ధతినే చిత్రరచన చేసినాడు.

చూపించే ప్రయత్నమూ లేదు. పురాణవ్యక్తుల కున్న దివ్యత్వమూ, సౌకుమార్యమూ చారిత్రికవ్యక్తులకు లేవు. కాని కనురెప్పలు, ముక్కు ఏర్పాటుగా వ్రాయడము వల్ల మాధుర్యమును కొంత సమకూర్చినాడు. "సిద్ధార్థరాగో



"సిద్ధార్థ రాగోదయము"

దయము"లో ఈ విషయము స్పష్టము. ముఖములు సామాన్యముగా గుండ్రములు. గడ్డ మెక్కడో కాని ప్రత్యేకముగా కనబడదు. రామారావుచిత్రములలోని స్త్రీలకిది సామాన్యగుణ మనవచ్చును. దీనినిబట్టి "ఇవి రామారావు చిత్రములు; ఇవి కావు" అని చెప్పగలిగినంత ఏర్పాటుగా కనబడుతుంది, ఈ వంపు. సర్వసామాన్యత, రచయిత వ్యక్తిగుణము సత్కళ కుండవలసిన లక్షణాలు. ఈ రెండూ రామారావుచిత్రములలో కనబడుతున్నాయి. చిత్రములు వ్రాసేటప్పుడు ఇతడు ఒకవ్యక్తిని ముందు నిల్పుకొని వ్రాసేవాడట ముందు. అది చాలా మందికి రుచించలేదట. వ్యక్తిమూర్తిని ముందు పెట్టుకొని చిత్రములు వ్రాయడము సత్కళాకారుని లక్షణముకాదనీ, కేవల మూహాప్రయత్నము వల్లనే చిత్రములు రచించాలనీ పెక్కురి అభిప్రాయము. ఇది్ధ ఎలా గున్న దంటే, 'గణములవరుస ముందు పెట్టుకొని కవిత్వము చెప్పకూడదు. భావోద్రేకమున కనుగుణముగ వరుసనే ఏదో చెప్పవలెను. అదే కవిత్వ' మన్నట్లుంది. ఉదాత్త వ్యక్తులగు వాల్మీకి, శంకరభగవత్పాదులు, లీలాశుకుడు మొదలగువారికే అట్టివి సాధ్యము. సామాన్యు లట్టి పనులు చేస్తే అవి "పయల కర్ధమ్ము" కావు. వ్యక్తిగుణ మెక్కువై పోతుంది. మరొకసంగతి. చిత్రరచనలో పలువురువ్యక్తులున్నప్పుడు అందరూ ఒక్కరీతిగా గాని, ఒకేతీరుగా గానిఉండరు. కొందరటు, కొందరిటు చూస్తూంటారు. ఒకరటుపోతే, ఒక రిటు పోతారు ఈ గమనవేగమును నిరూపించవలెనంటే మూర్తి ముందుండాలి. ఎక్కడ ఏ గీత పెట్టితే గమనము సూచిస్తుందో, ఎక్కడ ఏ వంపుంచితే స్వాభావికముగా నుంటుందో తెలియవలె నంటే ముందు వ్యక్తి నిలవబడాలి. కొంతకాల మైనతర్వాత మరి అక్కరలేదు. ఒక నదిని, దానిపైన ఆకాశమును చిత్రించా లనుకోండి. నది నిశ్చల మైతే సమానాంతరమైన గీతలతో వ్రాయవచ్చును; కల్లోలిత మైతే గీతలకు వంపు లుండాలి. సూర్యుడైతే వర్తులము గీచి బండిచక్రపు కమానులవంటి కిరణపుగీతలు గీయవచ్చును. చంద్రుడైతే ఆకాశానికి సమానాంతరమైన రేఖలు వాడి ఒక వర్తులము మేరకు ఏమీ గీయరు. ఈ రీతిగా రేఖలకును రంగులకును గల విశిష్టప్రయోజనమును పూర్తిగా పౌరాణికాది చిత్రముల కడనుండి, ప్రకృతిచిత్రములు, ఊహాచిత్రములవరకు, వాడగలిగినంతవరకు— గ్రహించేవరకూ—మూర్తి ముందేనా ఉండాలి, లేదా, రచయిత మూడనేత్రా చూడాలి. ప్రకృతిచిత్రముల చూచి వ్రాయడము లేదూ? అది కళ కానడానికి వీలా? ప్రకృతిచిత్రములను వ్రాసి వ్రాసి, చివరకు పౌరాణిక, చారిత్రిక, సాంఘిక చిత్రములకు తగిన

వాతావరణము కల్పించడములో పై యనుభవమును వాడినట్లే, ఈ రకముగా చూచి వ్రాయగా వ్రాయగా ఏరకపు భావము, గమనము, ఉద్దేశ్యము నైనా సరే చిత్రించేశక్తి పూర్తిగా అలవడుతుంది. రామారావు తన చిత్రములను భావకులు పొగడితే విని ఇంటిలో "ఇంకా నాయాశయము పూర్తిగా నాకు స్వాధీన పడలే" దనే వాడట. కాలము ఇంక కొంతకాలము మన నిచ్చి యుంటే తెలుగు చిత్రములు దిగంతములకు వ్యాపించి యుండును.

కళ ఇంద్రియగోచరము కావలెను. అప్పుడే రసికులకు సత్యమైన ఆనందము కలుగుతుంది. ఇంద్రియములే కళను మనస్సునకు గొనిపోయే వాహకములు. "లలిత లవంగలతాపరిశీలన, కోమల మలయసమీరే" అన్నప్పుడు శరీరమూ, "గద్గద నదద్గోదావరీవారయః" అన్నప్పుడు చెవులూ తన్మయము లవడము మన కనుభవసిద్ధమే. ఇక నోరు మాటలతోనే ఊటలూరుతుంది. కళాకారుడు ప్రత్యేకముగా ఇంద్రియములను స్పృశించి కదపగల యంశములను గుర్తెరిగి వాడుతూండాలి.

రామారావు ప్రకృతిచిత్రములు చూడండి. వాటిలో చలనమూ, నిశ్చలత్వమూ బాగుగా నిరూపించబడినవి. నిశ్చలకాసారము. గట్టున గల చెట్లనీడ లన్నీ నీటిలో ప్రతిబింబిస్తున్నాయి. తామరాకులు అక్కడక్కడ. దీనిలో ఒక తొట్టి పడవమీద జాలరివాడు చేపలవేటకి బయలుదేరాడు. చలనము గెడవల్ల నీటిలో పుట్టిన తరంగాలలోనే. ఇంకొక చిత్రములో అచలములగు కనుములు ఒకదాని నొకటి పలకరించుకుంటున్నాయి, మూగభావతో. వీటి యచలత్వమును త్వరగా ప్రవహించే సెలయేఱు నిరూపించుతున్నది. చలనము, స్థిరత్వము పరస్పరసంబంధము గలవి. ఒకటి లేకపోతే రెండోది లేదు. అందుచేతనే రామారావు స్థిరత్వానికీ, చలనానికీ చిహ్నరూపములైన కొండను, సెలయేరును సృష్టించినాడు. ఇది ప్రకృతిచిత్రము, స్థూలదృష్టులకు. సూక్ష్మబుద్ధులకు ఊహాచిత్రము (creative painting). నేరొకచోట నిర్మలమగు గౌతమిలో నీడ చూచుకునే పొగ మబ్బులు. మధ్యన నదివెడల్పుమరిచిసాగే తెరచాప పడవ మూసుకొని వచ్చే చీకటిని మూగగబ్బిలము మోసుకు పోతూంటే, ఒకదాని నొకటి హెచ్చరించుకుంటూ గూడుచేరే సారసపక్షులు నిష్క్రమించే పగలుని వీడ్కొని వస్తున్నాయి. నిశ్శబ్దమూ, చలనమూ కూడా ఈ చిత్రములో ఉన్నాయి. వెలుగు చీకట్ల కౌగిలి ఈబొమ్మ. ఇంతకు ముందు వర్ణించిన "శ్రీరామవివాసము" చూడండి. ఇది మూగరంగము కాదు. ఏడిస్తే కొట్టేద నని చీపురుకట్ట పట్టుకు నిలబడిన తల్లిని చూచి నోరు మూసికొని లోపలికి ఏడ్చే పిల్లవానివలె, కైక భయమువల్ల చెలికత్తెలందరూ దుఃఖమును లోపలికే త్రిప్పితే, ఉబ్బిన రెప్పలు గల దశరథుడు నీరవదుఃఖమును మనకు వినిపించుచున్నాడు. కనుమాపు దాటు నామని బాయు కోయిలగొంతుల చిక్కన వసంతగీతినీ, విభు వీడి శుష్కించు విరహిణి సెలయేటి కడుపులో నడిగిన కడలిమ్రోతనీ వినగలిగేవా రీచిత్రములలోని గీతములు వినగలరు. తక్కినవారిముం దవి మూగనోము పట్టుతాయి.

మానసవ్యవస్థని చిత్రకళ తెల్పుతుంది. కాని ఈ తెల్పడానికి పరిమితి ఉంది. కంటిమాపుకి మానసిక వ్యవస్థ యెంతమట్టుకు వ్యక్తమౌతుందో చిత్రములో కూడ అంతమట్టుకే వ్యక్తము కావడానికి వీలు. "శ్రీరామవివాసము"లోని దశరథుని కళ్లు చూడండి. రెప్ప లెత్తుగా నున్నాయి. పుత్రవాత్సల్యమువల్ల పుట్టిన దుఃఖము కళ్లలోనుంచి పై కుబుక యత్నిస్తే అధర్మభీతి రెప్పలలో ప్రవేశించి దానిని నొక్కుతోంది. మానసికవ్యవస్థ చూపించే బొమ్మలలో రామారావు "కైకేయి దురాలోచనము" పేరెన్నిక గన్నది. మడత పెట్టిన చేతిపై గడ్డము నుంచి బొమలు ముందుకు వంచి కైకేయి శయ్యపై బోరగిలి పరుండి యున్నది. శయ్యపై దుప్పటి చెక్కు చెదరలేదు. కైకేయిభయముచేత చెలికత్తెలు పరచిన దుప్పట మది. హంసదీపముమీది వత్తి, కైకమనస్సులో జనాపవాదభీతి ఐశ్వర్యలోభముతో వలె, చీకటితో పెనగులాడుతోంది, కైకేయి కాళ్లకడ. ఆమె మానసిక వ్యవస్థ ధర్మమునకువలెనే వెలుగుకి కూడా దూరము.

కైకేయి ఆలోచన కొంత సాగినట్లు దీపపుకంబపు పెద్దనీడ తెలుపుతోంది. ఈచిత్రమునకు అసలైన రంగు పూసేది ఈ పెద్దనీడే. ప్రేక్షకుల కీచిత్రము చూడడము వల్ల అయోధ్యానగరానికి రాబోయే చీకటి గోచరించాలి. అందుకే ఈ పెద్దనీడ. చిన్నపిల్లలు దీపపు వెలుగున తమనీడను చూచుకొని ఝడుసుకొనునట్లు ఎవరైనా ఈనీడను చూచి నిర్విణ్ణులు కావలిసిందే. రామారావు చిత్రములలో చాల ఎన్నికగన్న దీ చిత్రము. మరియొక చిత్రము "ఊర్వశీ అర్జున." పుట్టుకతోనే అమ్మడు



"ఊర్వశీ అర్జున"

పోయిందీ బొమ్మ. స్థలమా, ప్రశాంతమగు నందనోపాంతము. తీర్థయాత్రాపరత్వమున బయలుదేరి, ఉలూచీ, చిత్రాంగదా, సుభద్రల వివాహమాడి ఇంటికి చేరిన ద్రౌపదీ మనోనాథు డర్జునుడు వనసౌందర్యమును తిలకించుతూ కూర్చున్నాడు. పురూరవుని మనస్సును చూరగొన్న యూర్వశి భోగ్యవస్తుయుతితో వచ్చి, తన్మయ నృత్యము చేస్తోంది. ఆమెకా, తన నాట్యఫలితమును గురించి కొంచెమైనా సందేహము లేదు. ఇంక విజయుడో, చలనములేని పర్వతమువలె నామెనాట్యమును

తిలకించుతున్నాడు. పొడవైన ముక్కు, చుక్కవంటి కన్ను భోగలాలసతను గాక కళాభిజ్ఞతను తెలుపుచున్నవి. ఈబొమ్మయొక్క శీర్షిక తెలియక పోయినా చెప్పవచ్చును, ఈత డీమెకు లొంగేరకముగా లేడని. ఊర్వశి తన్మయత్వము నామె యూర్ధ్వదృష్టి,వంపులున్న వ్రేళ్లూ చూపుతున్నాయి.

రామారావు రచించిన బొమ్మ లెన్నో లేవు. ముడిబొమ్మలు (sketches) మాత్రము వేలమీదనే లెక్క. బయటకు వచ్చినవి వంద యుండునేమో. వీటిని సూక్ష్మముగా పరిశీలించితే ఏ బొమ్మనీకూడ అజాగ్రత్తతో వ్రాసి వేయలేదని గ్రహించవచ్చును. 'సిద్ధార్థ రాగోదయ' మనే చిత్రము చూడండి. తోరణ మండితమైన మండపము మీద, ఉచితాసనము మీద సిద్ధార్థుడు కూర్చొని యున్నాడు. అతని కెదురుగా యశోధరా కుమారి ఉత్తరీయమును వక్షమున కదుముకొని కనులెత్తి రత్నహారము నొసంగు గౌతముని చూచుచున్నది. ఆమెవెనుక చెలికత్తెలు గాబోలున్నారు. వారి దృష్టులలో నౌత్సుక్యము లేదు. ఇదివర కెందరికి బహుమానము లిచ్చినాడో గౌతముడు. అందరిలోను తమ రాకుమారి ఒక్కతె. చిత్రములో చాలామంది స్త్రీలే. కాని గౌతముని కెడమవైపున ఇద్దరు వటువులు కూర్చున్నారు. వారిద్దరిలో ఒకని చూపు గౌతమునిపైన, రెండవవానిచూపు యశోధరమీద. సిద్ధార్థుని విస్మితదృష్టి, అతనిచేయియొక్క గమనౌత్సుక్యము రాగోదయమునకు బాహ్యచిహ్నములు కాగా, ఎర్ర

శాలువతో ప్రేక్షకుల నాకర్షించే మిత్రుడు గౌతముని వైపు చూచుచు బాహ్యచిహ్నములకు వ్యాఖ్యానము చేస్తూన్నాడు. "ద్రోణు" డనే చిత్ర మింకొకటి. ఒకడు



"ద్రోణుడు"

లక్ష్యభేదనము చేయ నుద్యుక్తుడు. ధనురాచార్యుడు బాణము సూటిని చూస్తూన్నాడు. మిగిలిన ఇద్దరు శిష్యులలోను ఒకడు గురువును చూచుచుండ, రెండవ వాడు బాణప్రయోగము చేసే సహాధ్యాయిని చూస్తున్నాడు. మొదటివాని మెడవంపు వాని యుత్సుకతనే గాక, ఈరంగముయొక్క సంపూర్ణతను చూపించుతున్నది. లేకుంటే విద్యాభ్యాసకుల విచిత్రఖేలనములో ఇది ఒక పార్శ్వము. ఈచిత్రమునకు సంపూర్ణతను విద్యార్థుల యుత్సుకత పోషించుతూన్నది అందరూ ధనుర్విద్యాభ్యాసకులే. అంతేనా? పక్కన చక్రము పడియున్నది. చాపాచార్యుని అధ్యాపకత్వములో నిది గౌణము కాబట్టి మూలకు జరిగినది. ఆతని శస్త్రవిద్యాపారంగతత్వమును తెల్పుటకు ఇది రంగములో ప్రవేశించినది. తక్కిన శస్త్రములు—గదమొదలైనవి ఎందుకు లేవు? మంది చేరితే మఠానికి చేటు: ఇత డప్పుడు ద్రోణుడవడు: కృపు డవుతాడు. ఇట్లే వ్రాసిన కొలదీ గ్రంథము పెరుగుతుంది.

వెలుగు వెలిగెను వైరితారక
ఏమి యెరుగును రాలి పడునని
కాల కర్మము లొకటి గూడగ
తప్ప శక్యమె తమ్ముడా.

# తరంగము

మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు

సత్యపి భేదాపగమే
నాథ, తవాహం, న మామకీన స్త్వం;
సాముద్రోహి తరంగః;
క్వచన సముద్రో న తారంగః—

* * *

..................నా ప్రాణనాథ,
నీదు కౌఁగిటిలోన నిలిచినవేళ
మఱచితి లోకంబు, మఱచితి నిన్ను,
నను నేనె మఱచితి, నాహృదయేశ;
నీదు కౌఁగిలి వీడి, నిను వీడిపోయి,
యేడనో తిరుగాడి, యేడనో నిలిచి,
పరుగెత్తి, యుప్పొంగి, పై కెగఁ బ్రాకి,
పెంపుఁ జెందితి నంచుఁ బ్రీతి మిన్నంది,
క్రిందు మీఁ దరయక కెరలుచునుంటి;

* * *

వెనుగాలి వీచెఁ; జయ్యన నేలఁ బడితి;
నురుగలు గ్రక్కితి; గిరగిర నైతిఁ;
బొరలితిఁ; దరలితి; మరలితి; అంత
మూర్ఛిల్లి తమమున మునిఁగిపోయితిని;
తెలివి వచ్చెను; జుట్టుఁ దేరి చూచితిని;
నీదు కౌఁగిటిలోన నిలిచి నే నుంటి;
నీతోడి లోకఁబె నీతోడి బ్రదుకె;
నీతోడి మనికియే నిఖిలమై తోఁచె;
నిను వీడితి నటంచు ననుకొంటిఁ గాని,
నను నీవు విడనాడి యునికియే లేదు;
ఎందు నేఁ బోయిన, నెందు నిల్చినను,
నను విడనాడక, నామ్రోల నిల్చి,
నీయంకమున నేను నిలుచు నందాక,
కనిపెట్టుకొని యుండి, ననుఁ బ్రోచుచుందు;
వేమనందును నీదు ప్రేమంపు మహిమ!

* * *

* * *

నీదు కౌఁగిటిలోన నే నిల్చువేళ
నీవె నే నయి, నేనె నీ వయి యుంటి;
నాకు నీతోడిదే లోక మై యుండె;
నిను వీడి, యెందెందొ చనుచుండు వేళ,
వెలుఁగునఁ జీఁకటు లలమికొంచుండు;
కలిమిని లేములు బలసి కన్పట్టు;
శాంతి నశాంతి యత్యంతంబు కలుగు;
నిను వీడు కోరిక జనియింపనీక,
నన్నుఁ గాపాడుము నా ప్రాణనాథ,
నీతోడ నిత్యంబు నెన రొందు నట్లు,
నీయంక మేవేళఁ బాయనియట్లు,
నీదుకౌఁగిట నెప్డు నిలిచియున్నట్లు
నీలోనఁ గరఁగి నే నినుఁ గూడునట్లు,
ప్రేమ చూపింపు మో ప్రేమస్వరూప,
నన్నుఁ గాపాడు మో నా ప్రాణనాథ!

# "కుమారస్వామి విగ్రహము"

## శ్రీ గో. వేం. రాఘవరావుగారి విమర్శనమునకు ప్రత్యుత్తరము

ఏప్రెలునెల భారతిసంచికయందు (పుట ౬౩౮) శ్రీ గొబ్బూరి వేంకటానందరాఘవరావుగారు నావ్యాసముపై విమర్శనము వ్రాసినందులకు మిగుల సంతోష మైనది. నావ్యాసమునందు ప్రమాదవశమున పడిన తప్పులను రెండింటిని నేనే సవరించుకొని వ్రాయదలచి యుంటిని. కాని నాకు ఇటీవల కలిగిన కొన్ని యనివార్యములయిన యిబ్బందులవలనను, మనస్స్వాస్థ్యములేమిచేతను నాసవరణ రచనము ఆలస్యమైనది. ఇంతలో శ్రీ రాఘవరావుగారు తమ విమర్శనమును వ్రాసిప్రకటించి పాఠకలోకమున కుపకారము చేసినారు.

౧

విమర్శింపబడిన విషయములలో మొదటిది శకవర్షములసంఖ్య, అందలి తిథియును. శా. శ. ౯౯౮-వ సంవత్సరము క్రీ. శ. ౧౦౪౨-౪౩ నకు సరిపోవును. కాని భారతియందు క్రీ. శ. ౧౦౪౨ అని యుండవలసినచోట క్రీ. శ. ౧౦౨౪ అని ముద్రితమైనది. ఇది అచ్చు తప్పు. నా వ్యాసము అచ్చులో నున్నపుడు ప్రూఫు చదువుటలో జరిగిన ప్రమాద మది. పాఠకులు మన్నింతురుగాక. ఆ తప్పును నేను సవరించుకొనుటకు వీలులేకుండ పోయినది. ఇక దానసమయము, తిథియు, మాసమును నేను తప్పుగా నూహించితిని. మూలమున సంస్కృతశ్లోకమునందు, "చైత్రం గతే భాస్కరే" యనియు తెలుగుభాగమున "విషువ సంక్రాతి నిమిత్యంబున" అనియు నున్నది. ఈ రెండును శాసనకాలమును సరిగా నిర్ధారణ చేయుటకు తోడ్పడుచున్నవి. చిత్రానక్షత్రమునందు సూర్యుడు ప్రవేశించిన తరువాత వచ్చు విషువత్పుణ్యకాలమున నీశాసనమం దుదాహరింపబడిన దాన మివ్వబడినది. చిత్తానక్షత్రములోని రెండుపాదములు కన్యారాశిలోనివి. మిగిలిన రెండు చరణములును తులారాశిలోనివి. సూర్యుడు చిత్రానక్షత్ర తృతీయచరణమునందు ప్రవేశించిన తరువాత వచ్చు విషువత్పుణ్యకాలము తులాసంక్రమణ సమయ మగుచున్నది. అదియే శ్రీ రాఘవరావుగారు వచించిన ఆటమ్నలు ఈక్వినాక్సు (Autumnal equinox); కాని అది శ్రీరాఘవరావుగారు చెప్పినటుల భాద్రపదమాసములో రాదు; ఆశ్వయుజమాసమందు వచ్చును. తులాసంక్రమణ పుణ్యకాలమే యీ శాసనము వేయబడిన తిథి యగుచున్నది. ఈ విషువత్పుణ్యకాలము, క్రీ. శ. ౧౦౪౨-వ సంవత్సరము సెప్టెంబరు ౨౩-వ తారీఖు ఆప్రాంతము అగుచున్నది. ఈ సంక్రాంతి పుణ్యకాలము శ్రీ విజయాదిత్య మహారాజుయొక్క పదునొకండవ విజయరాజ్య సంవత్సరమున వచ్చినది. అట్లయిన నా మహారాజు రాజ్యపాలనము, శా. శ. ౯౮౩ లో తులాసంక్రమణమునకు ముందు అనగా క్రీ. శ. ౧౦౬౧ సెప్టెంబరునెలకు బూర్వములో ప్రారంభమై యుండవలయును.

౨

శ్రీ రాఘవరావుగారికి మూడు సందేహములు కలిగినవి. అందు మొదటిది "ఈవిజయాదిత్యుడు క్రీ. శ. ౧౦౬౧ లో రాజ్యముచేయ నారంభించుట యెట్లు సాధ్యమయినది?" రెండవది, "రాజరాజు సవతితమ్మునకు విజయాదిత్యునకు-విష్ణువర్ధనుడనునామ మున్నట్లు నిదర్శనము లున్నవా?" మూడవది, "రాజరాజు పరిపాలనము క్రీ. శ. ౧౦౬౧ సంవత్సరమునందు అంతమయినట్లును, ఆతని సవతితమ్ముని -విజయాదిత్యుని పరిపాల

నము ఆసంవత్సరములోనే యారంభమైనట్లును చరిత్ర నిదర్శనము లున్నవా ?"

ఇటీవల నాపరిశోధనఫలితముగ దేలిన యంశము లను గొన్నింటిని ఈపత్రికయందు మున్నొకసారి "రాజ రాజు" అనువ్యాసమున ప్రకటించితిని. దానిని శ్రీ రాఘవ రావుగారు చూచెదరుగాక. ఇపుడు "కుమారస్వామి విగ్రహ" మను శీర్షికక్రింద కొన్ని నూతనాంశములను స్థూలముగా నిరూపించితిని. కాని శ్రీ రాఘవరావుగారి వంటి పాఠకు లాంధ్రదేశమునందు పెక్కండ్రు కలరు గావున, వారికెల్లరకు నిట్టిసందేహములు నివారింపబడ వలసిన వను ఊహతో, వారి ప్రశ్నలకు సమాధానములు వ్రాయుచున్నాను.

రాజరాజుసవతితమ్ముడగు విజయాదిత్యుని చరిత్ర కారులు సప్తమ విజయాదిత్యుడని వ్యవహరించుచు న్నారు. కాని యీరాజును అష్టమవిజయాదిత్యుడని పిలుచుట యొప్పును. పూర్వ చాళుక్యాన్వయములో పుట్టిన విజయాదిత్య నామాంకితులయిన మహారాజులలో నతడు ఏడవవాడగుటచే మొన మొన్నటివఱకు ఫ్లీటు మొదలయినవారు వ్రాసిన దానినిబట్టి ఈవిజయాదిత్యుని ఏడవవాడని చరిత్రకారులు వ్యవహరించుచువచ్చిరి. ఇటీవల లభించిన బాదపమహారాజు ఆరుంబాక తామ్రశాసనము వలన ఇమ్మడి అమ్మరాజునకు తరువాత విజయాదిత్య నామాంకితుడగు బాదప మహారాజు పరిపాలించెనని తెలియవచ్చినది. ఆమహారాజు బిరుదు గద్యయందు ఇట్లున్నది: "......వేంగిశో యుద్ధమల్లక్షితిపతితనయో బాదపాఖ్యాధిరాజః...... స సమస్త భువనాశ్రయ శ్రీ విజయాదిత్య మహారాజాధిరాజ పరమేశ్వరః పరమ భట్టారకః పరమమాహేశ్వరః పరమ బ్రహ్మణ్యో మాతాపితృపాదానుధ్యాయీ..." ఇట్లు బాదపమహా రాజు విజయాదిత్య నామాంకితుడగుటవలన, బాదపుని సప్తమ విజయాదిత్యుని క్రిందను, రాజరాజు సవతి తమ్ముడు విష్ణువర్ధన విజయాదిత్యుని అష్టమ విజయాది త్యునిక్రిందను మార్చి పరిగణింపవలసివచ్చినది.

ముందు రెండవప్రశ్నకు సమాధానము దెలుపు దును—

ఈఅష్టమ విజయాదిత్యుని తామ్రశాసనములు మూడు మన కింతవఱకు లభించియున్నవి. అందు మొద టిది "సప్తమవిజయాదిత్యుని పామలవాక తామ్రశాస నము" అను శీర్షికతో ఆంధ్ర-ఇతిహాస పరిశోధక మండలివారి జర్నలు రెండవసంపుటమున ప్రకటింపబడి నది. ఈశాసనమునందు విజయాదిత్యుడు తనసవతిఅన్న రాజ్యముచేయుచుండగా నాతని ధిక్కరించి యాతడు సింహాసనమెక్కిన పండ్రెండేండ్లకు దేశమునుండి తరిమి వైచి వేంగీమహీమహాసామ్రాజ్యమునకు పట్టముగట్టు కొన్నట్లు ఆశాసనమందు తెలుపబడియున్నది. అందు అష్టమవిజయాదిత్యుని పేర బిరుదు గద్యయం దిట్లున్నది:

"స సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధనమహా రాజో రాజాధిరాజః శ్రీ విజయాదిత్యదేవః"

ఈశాసనము ఇంచుమించుగా క్రీ. శ. ౧౦౩౮ నాటిదని చెప్పవచ్చును. మిగిలిన రెండు శాసనములును గోదావరి జిల్లా రాజవోలుతాలూకా ర్యాలిగ్రామమున దొరికెను. ఇవి విజయాదిత్యుడు రాజరాజు ననంతరము రాజ్యముచేయుచుండిన కాలమున క్రీ. శ. ౧౦౭౩-వ సంవత్సరమున నీయబడినవి. గవర్నమెంటు ఎపిగ్రాఫిస్టు తనరిపోర్టులో వీటిని ౧౯౨౮-౨౯ సంవత్సరపు ౮, ౯ సంఖ్యలతో (నెంబరులతో) గుర్తించియున్నాడు. ఈ రెండుశాసనములందునుగూడ విజయాదిత్యుడు "సర్వలో కాశ్రయ శ్రీవిష్ణువర్ధనమహారాజః" అని వ్యవహరింప బడినాడు. కావున విజయాదిత్యునకు విష్ణువర్ధన నామ ముండెనాయను సందేహ మక్కరలేదు. ఇంకొక క్రొత్త విషయము—

పూర్వచాళుక్యాన్వయమున బుట్టిన మహారాజు లందరును ఇంచుమించుగా విష్ణువర్ధన, విజయాదిత్య నా మాంకితులే. ఈరెండుపేరులును వారికి కులక్రమాగతము లయినవి. వాటిపై నావంశజులకు మిక్కిలి ప్రీతి. ఆ రెండింటిలో "విష్ణువర్ధన" నామముపై చాళుక్యులకు మరింతగౌరవము. దానికి కారణములు ఇక్కడ చర్చిం చుటకు తావు చాలదు. మొదటి శక్తివర్మ కాలమునుండి (క్రీ. శ. ౯౯౯-౧౦౧౧) వేంగిచాళుక్యరాజులు "విష్ణు

వర్ధన మహారాజః" యని వ్యావహారిక నామమును పట్టాభిషేకమయినది మొదలుగా వాడుకొనుచుండిరి. అందువలన ఇంచుమించుగా నప్పటినుండియు చాళుక్య రాజులందరు పట్టము గట్టుకొన్న తరువాత తమకు వేర్వేరు నామములున్నను "విష్ణువర్ధన మహారా"జను వ్యవహార నామమున బరగుచుండిరి. వరుసగా మొదటి శక్తివర్మమొదలుకొని, మొదటి కులోత్తుంగచోళదేవుని కుమారులలో వీరచోడునివఱకు (క్రీ.శ.౧౦౮౮-౧౦౯౨) పరిపాలించిన మహారాజు లెల్లరును విష్ణువర్ధన నామముతో బరగియుండిరి. తరువాత "సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజు" అనునది ప్రతిచాళుక్య వంశజునకును పరిపాటిగా ద్వితీయనామ మైపోయినది. రణస్థిపూండి శాసనమున విమలాదిత్యుడును, కోరుమిల్లి, నందమపూండిశాసనములందు రాజరాజును, పాములవాక, ర్యాలిశాసనములందు అష్టమవిజయాదిత్యుడును, నుమియనాడ శాసనమున ఇమ్మడిశక్తివర్మయును, ఏలూరి తామ్రశాసనమున కులోత్తుంగచోడుని రెండవకుమారుడు, రాజరాజనామాంకితుడు నగు ముమ్మడిచోడుడును (C. P. No. 3 of 1921-22.), తేకిశాసనమున కులోత్తుంగచోడుని జ్యేష్ఠకుమారుడును రాజరాజ నామాంకితుడునునగు చోడగంగుడును, పిఠాపురము, చెల్లూరిశాసనములందు వీరచోడుడును "సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజ" అని వ్యావహారిక నామముతో పేర్కొనబడిరి. కావున అష్టమవిజయాదిత్యునకు విష్ణువర్ధననామ ముండుట స్పష్టమగుచున్నది. ఇందులకు మనకిపుడు నూత్నముగా దొరకిన రాజమహేంద్రవర శిలాశాసనమే ప్రబల ప్రమాణము. విజయాదిత్యునికే గాదు, అతనియన్నకును, కుమారునికిని గూడ విష్ణువర్ధనుడని పేరున్నట్లు తెలియుచున్నది. మరియు నింకొక విశేషమున్నది. "సర్వలోకాశ్రయు"డన్న బిరుదముకూడ నందఱకును సామాన్యముగా నుండినట్లు గన్పట్టును. ఇమ్మడి అమ్మరాజుకాలమువఱకు (క్రీ. శ. ౯౪౫ మొదలు ౯౭౦ అంతమువఱకును) "సర్వలోకాశ్రయ", "సమస్తభువనాశ్రయ" అను బిరుదములను తండ్రి యొకటిధరించిన కొడుకొకటిధరించు చుండిరి. కాని యామహారాజు తనకు నారెండింటినిగూడ నుపయోగించుకొనెను. కాని మొదటి శక్తివర్మకాలమునాటినుండి సర్వలోకాశ్రయుడన్న బిరుదు సామాన్యముగా వేంగిచాళుక్యులును సమస్తభువనాశ్రయుడన్నది చోళులును, పశ్చిమచాళుక్యులును సామాన్యముగా ఉపయోగించుకొనుట ప్రారంభించిరి. చివరకు వేంగిచాళుక్యులకు 'సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజులు' అన్న బిరుదును, పేరును పరిపాటి యయ్యెను. అందువలన రాజరాజుకాలమునాటి కొన్ని శిలాశాసనములందును, అష్టమవిజయాదిత్యుని నాటి కొన్ని శిలా శాసనములందును విష్ణువర్ధన నామమేగాని యామహారాజుల నిజనామము గానరాదు. కులోత్తుంగచోడదేవుని తరువాత రాజ్యమేలిన చాళుక్యరాజుల శాసనములందు ఎక్కడనుగూడ రాజులపేర్లు గానరావు. ఏశాసనము జూచినను "సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజు" లనియే గానబడుచుండును.

అష్టమవిజయాదిత్యుని శిలాశాసనమొకటి గుంటూరిజిల్లా తెనాలితాలూకా జుత్తిగ్రామమున వాసుకిరావి సోమేశ్వరస్వామివారి యాలయమున దొరకినది. అది ఆరాజన్యుని విజయరాజ్యవరుషములు ౧౩ నాటిది. అనగా క్రీ. శ. ౧౦౭౪ నాటిది. అందు విజయాదిత్యుడు విష్ణువర్ధన-విజయాదిత్యుడని పేర్కొనబడినాడు. ఆ మహారాజు కరవాల భైరవుడను తన బిరుదు పేరిట కరవాల భైరవమంటపమని యొక శిలామంటపము వాసుకిరావిసోమేశ్వరస్వామివారి యాలయమున కట్టించె నని ఆశాసనమందు తెలుపబడినది.*

ఇక మొదటి ప్రశ్నకును, మూడవ ప్రశ్నకును ప్రత్యుత్తర మిత్తును.

రాజరాజుయొక్క కాలమునాటి కొన్ని శిలాశాసనములు దొరికియున్నవి. అందు ఆతని విజయరాజ్యవర్షములును శకవర్షములునుగూడ నీయబడినవి. కావున అవి ఆమహారాజుయొక్క రాజ్యపాలనారంభసంవత్సర

* A. R. No. 738 of 1920.

మును సూచింపగలవు. రాజరాజు నలుబదియొక్క సంవత్సరములు పాలించెనని యాతని తరువాతిరాజుల శాసనములు దెలుపుచున్నవి. వాటిలో మిక్కిలి ముఖ్యమైనది యాతని సవతితమ్ముని కుమారుడు రెండవ శక్తివర్మ నుమియవాడ తామ్రశాసనము.* అష్టమవిజయాదిత్యుని ర్యాలి తామ్రశాసనములందుగూడ నట్లే వక్కాణింపబడియున్నది. కోరుమిల్లి, నందమపూండి శాసనములందు రాజరాజుయొక్క పట్టాభిషేకకాలము తెలుపబడియుంటచేతను, దానికి సరియైన ఇంగ్లీషు తేది ౧౬-వ ఆగస్టు ౧౦౨౨ అని లెక్కింపబడియుండుట చేతను, ౧౦౨౨ కు నలువదియొక్క సంవత్సరములు కలిపి క్రీ. శ. ౧౦౬౩ జూలయి నెలలో రాజరాజు రాజ్యకాలము ముగిసెనని చరిత్రకారు లూహించి వ్రాసిరి. ఇందులకు భిన్నములయిన నూతనవిషయములు దెలుపు శాసనములు మనకు లభించినందువలన రాజరాజుయొక్క రాజ్యపాలనకాలమును ఇంచుక మార్చి వెనుకకు గొంపోవ వలసియున్నది.

గుంటూరుజిల్లా తెనాలితాలూకా నందివెలుగు గ్రామమున అగ్బేశ్వరస్వామివారి యాలయముననున్న రాజరాజు కాలమునాటి యొకశిలాశాసనమున విజయ రాజ్యవర్షములు ౩౭ అనియు, శకవర్షములు ౯౮౦ అనియు తెలుపబడియున్నది. శకము ౯౮౦ లోనే ౩౭-వ సంవత్సరము పూర్తియై ౩౮-వ విజయరాజ్యవర్షము ప్రారంభమయ్యెను. అందువలన రాజరాజు పరిపాలనను శకము ౯౪౨ లో ప్రారంభమైనట్లూహింపవలయును. రాజరాజు కాలమునాటి మరియొక శిలాశాసనము తెనాలితాలూకా వలివేరు గ్రామమున స్వయంభూదేవుని యాలయమున నున్నది. (నెం. ౬౭౨-౧౯౨౦) అది శకము ౯౮౩ ప్లవనామ సంవత్సరమునాటిది. అందు రాజరాజదేవనామాంకితుడగు సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజు యొక్క విజయరాజ్యవర్షము ౪౧ అని యివ్వబడినది. దీనినిబట్టిగూడ రాజరాజు పాలనము శకము ౯౪౨ లో ప్రారంభమయ్యెనని విదితమగుచున్నది. ఈరెండు శాసనములనుబట్టి వెనుకకు లెక్కవేసినయెడల రాజరాజు పట్టాభిషేకము చేసుకొన్నకాలమునకు బూర్వము రెండేండ్లనుండియు తండ్రిజీవించియుండగనే రాజ్యభారము పూనియుండెనన్నట్లు తెలుసుకొనవచ్చును. శ. ౯౪౨-వ సంవత్సరము రౌద్రినామసంవత్సరమునకు సరిపోవుచున్నది. ఆయేటి చాంద్రమాన చైత్ర శుద్ధ పాడ్యమి క్రీ. శ. ౧౦౨౦ సంవత్సరము మార్చి ౧౦-౧౧ తారీఖులకు ఇంచుమించుగా సరిపోవుచున్నది.

రాజరాజు, తండ్రి యాజ్ఞానుసారము శకము ౯౪౩-వ సంవత్సరము కొన్ని నెలలు గడచినతరువాత రాజ్యభారము బూనియుండిన ట్లూహించుకొనవచ్చును. ఆతని రాజ్యారంభము చాంద్రమాన శ్రావణమాసమునందో, భాద్రపదమందో జరిగియుండును. ఈ యూహ సరియైనదని యెంచినచో రాజరాజు పరిపాలనము క్రీ. శ. ౧౦౬౧-వ సంవత్సరము జూలయి నెలలో ముగిసి యుండవలయును. అది శకము ౯౮౩ శ్రావణమో, భాద్రపదమో అయియుండనోపు. అప్పటికే రాజరాజు పరిపాలనము ప్రారంభించి ౪౧ సంవత్సరములు గడచి యుండును. మరియు శకము ౯౮౩ సంవత్సరమున తులాసంక్రమణమునకు ముందే యాతని సవతి తమ్ముడు విజయాదిత్యుడు రాజ్యముసేయ నారంభించియుండునని యాతని కుమారుడు ఇమ్మడిశక్తివర్మశాసనములోని యీక్రిందివాక్యములు స్ఫురింపజేయుచున్నవి:

"విమలాదిత్యా చ్చోడాన్వయైకలక్ష్మ్యాశ్చ మేడవ మహాదేవ్యాః, అజని జయ శ్రీనిత్యో విజయాదిత్యో నరేశ్వరస్తుత్యః॥.

"పరోక్షే రాజరాజస్య భ్రాతు ర్ద్వైమాతురస్య యః। ప్రత్యగ్రహీ న్మహీరాజ్యశ్రియం వీర శ్రియా యుతః॥

విమలాదిత్యునికి చోడరాజకన్యయగు మేడవ మహాదేవికి జనించిన విజయాదిత్యుడు-రాజరాజు నలువదియొక్కసంవత్సరములు రాజ్యముచేసినపిమ్మట యని పై

* ఇది ఆంధ్రా హిస్టారికలు రిసర్చి సొసయిటీవారి జర్నలు అయిదవసంపుటములో ప్రకటింపబడినది.

నున్న శ్లోకభాగముతో నన్వయము. తన సవతియన్న పరోక్షమందు అనగా అతడు దేశమునందు లేని సమయమున రాజ్యమును బలాత్కారముగా నాక్రమించుకొనెనని యీ వాక్యములందలి తాత్పర్యము. దీనిని బట్టి రాజరాజు ప్రస్తుతము తెలియరాని కారణాంతరముల వలన దేశాంతరమం దుండినవేళ విజయాదిత్యుడు వేచియుండి రాజధానిపై బడి రాజ్య మాక్రమించుకొనెనని స్పష్ట మగుచున్నది. విజయాదిత్యు డంతటితో నూరకుండక తన కుమారుని రెండవ శక్తివర్మను రాజమహేంద్రవర సింహాసన మెక్కించెను. విజయాదిత్యుడు వేంగీ మహీరాజ్యము నాక్రమించుకొన్నది క్రీ. శ. ౧౦౬౧ సంవత్సరములో పూర్వార్ధమునందని స్థిరము చేసుకొనవచ్చును. విజయాదిత్యుడు రాజరాజుతరువాత పదునైదు సంవత్సరములు ఆంధ్రభూమిని పాలించినట్లు రాజరాజతనూభవుడైన మొదటి కులోత్తుంగ చోడదేవ చక్రవర్తియే చెప్పియున్నాడు. చూడుడు వీరచోడుని చెల్లూరి పిఠాపుర శాసనములందలి యీక్రింది వాక్యములు:—

"మయా వేంగీ మహీరాజ్యం చోడరాజ్యాభిలాషిణా, మత్పితృవ్యే పురా న్యస్తం విజయాదిత్య భూభుజి. స చ పంచదశాబ్దాని పంచాననపరాక్రమః, మహీం రక్ష న్మహీనాథో దివం దేవోపమో గతః."

ఈ వాక్యములే రాజరాజచోడగంగుని శ్రీకితేౘ్రమశాసనమునందుగూడ గలవు. కులోత్తుంగచోడుడు పినతండ్రికి ఎట్లు రాజ్యమిచ్చె నన్నకథ యిక్కడ చర్చించుటకు తావు చాలదు. అన్న దేశమున లేనివేళ విజయాదిత్యుడు రాజ్యమాక్రమించుకొనుట జూచి రాజు కొడుకు పినతండ్రిపై దాడివచ్చి యోడించి, కారణాంతరములచే చోడరాజ్యాభిలాషియై, మరల పినతండ్రితో సఖ్యము చేసుకొని వేంగీమహీరాజ్యము నాతనికి వశపఱచి దక్షిణమునకు బోయెను.

విజయాదిత్యుడు పదియేనుసంవత్సరములు ఆంధ్రదేశము నేలెననుట సత్యము. ఆతనితరువాత వేంగీ సామ్రాజ్యాభిషిక్తుడైనవాడు కులోత్తుంగుని రెండవ కుమారుడు రాజరాజ-ముమ్మడిచోడుడు. అతని పట్టాభిషేకము శకవర్షములు ౯౯౮ న కర్కాటకమాసమున (చాంద్రమాన ఆషాఢ) బహుళదశమీ బుధవారమున తులాలగ్నమున జరిగెను. ఇందులకు సరియైన యింగ్లీషు తేది జూలయి ౨౭, క్రీ. శ. ౧౦౭౬ అగుచున్నది.* దీనినిబట్టి చూచినను అష్టమవిజయాదిత్యుని రాజ్యకాలము క్రీ. శ. ౧౦౬౧ లో ప్రారంభమైన కాని క్రీ. శ. ౧౦౭౬ లోనికి పదియేనుసంవత్సరములు పూర్తికావు.

—భావరాజు వేంకట కృష్ణరావు.

---

* A. R. E. 1922, of 97-98.

# కొడైకెనాల్ చిత్రములు



౫. చెరువుగట్టున పడవల పాకలు



౬. చెరువు - దూరమునుండి

# నక్షత్రమండలము

## (జ్యేష్ఠమాసము)

గోబ్బూరు వేంకటానందరాఘవరావుగారు బి. ఏ.

ఈమాసము జ్యేష్ఠమాసము. ఈనెల పున్నమ నాడు చంద్రుడు జ్యేష్ఠా నక్షత్రము చెంత కనబడును. కనుక నీమాసమునకు జ్యేష్ఠమాస మని పేరు. ఈనెల రాత్రి తొలిజామున నగిపడునక్షత్రము లించు మించుగా క్రిందటినెలలో కనబడునట్టివే. క్రిందటినెల నక్షత్రపటములో తూర్పుదిశను విష్ణుమండల పరిసరము లను సరిగా చూపలేదు. ఆ విభాగములను బాగుగా సూచింపగల నక్షత్రపటము ప్రత్యేకము తయారు చేసి ఇందుతో నిచ్చినాడను.

ఈ జ్యేష్ఠమాసమునకు ప్రభువు త్రివిక్రమ దేవుడు. ఇతడు మూడడుగులతో విశ్వమును గొలచిన యంశము ఋగ్వేదమున వర్ణితమైనట్లు ఇదివఱకు వ్రాసి యున్నాను—

"ఇదం విష్ణు ర్విచక్రమే త్రేధా నిదధే పదమ్..."

"త్రీణి పదా విచక్రమే విష్ణు ర్గోపా అదాభ్యః..."

ఈ మూడడుగులను మనము ప్రొద్దుట, మధ్యా హ్నము, సాయంకాలము నని చెప్పు మూడుపూటలతో సంబంధముగల మనసూర్యగమనవిషయమని వేదవ్యాఖ్యా తలు అర్థము వ్రాసిరి. ఋగ్వేదకాలమునాటి హిందూ దేశమునుగూర్చి యుద్గ్రంథములను* వ్రాసిన అవినాశ చంద్రదాసుగారును శాయనాదివేదవ్యాఖ్యాతలయర్థము ననుసరించినారు. ద్వాదశాదిత్యులలో విష్ణుడనుసూర్య డొకడున్నట్లు ప్రమాణములు గలవు. కాని వేదశాస్త్ర పురాణ ప్రసిద్ధుడైన విశ్వరక్షకుడు డీ మనసూర్యుడేనని యన్వయించుట, మనమహర్షుల విజ్ఞానసంపదవిషయ మున నపచారము చేయుట యగునని నావిన్నపము.

## "Engonasis" The kneeling Man
### (మోకరిలిన మనుష్యుడు)

అనాదికాలమునుండియు నక్షత్రవేధ సల్పు చుండిన సమస్తదేశములవారును స్వాతీ, శ్రవణనక్షత్ర ములమధ్య నాకాశముమీద నొక విచిత్రతారాసముదయ మును గమనించిరి. ఆతారాసముదయము స్ఫురింప జేయు రూప మెట్టిదనగా:—దక్షిణశిరస్కుడై యుత్త రముపైపు కాళ్లూని, మోకరించి విస్తారితపాదముల మధ్య నడుగులతో విశ్వమును కొలువ నుద్యుక్తుడైన మనుజుని స్వరూపము. పాశ్చాత్య నక్షత్రపరిశోధకు లీరూపమును "మోకరిలిన మనుష్యుడు" అను నర్థ మిచ్చు "Engonasis" (ఎంగొనాసిస్) అని వ్యవహరించిరి. ఈ విగ్రహముయొక్క శిరస్సు, ఖగోళ మధ్యరేఖకు ౫° (అయిదంశల) లోపువరకు వ్యాపించి యున్నది. పాదములన్నో ఉత్తరమున ౫౦° (ఏబది యంశల) వరకు వ్యాపించి యున్నవి. పాదములమధ్య ఎడము-ఉత్తరాకాశమున గోచరించుప్రదేశము మూడడు గులతో కొల్చివేయుటకు సాధ్యమైనంతదూరము ఉన్నది. ఈ మూడడుగులను గూర్చి ఋగ్వేదమునం దీక్రింది ఋక్కులు గమనింపవలెను—

"ద్వే ఇదస్యక్రమణే స్వర్దృశో భిఖ్యాయ మర్త్యో భురణ్యతి | తృతీయ మస్య నకిరా దధర్షతి వయశ్చ న పతయంతః పతత్రిణః" —I-155-5

"యత్రా సుపర్ణా అమృతస్య భాగ మనిమేషం విదదాభిస్వరంతి ఇనో విశ్వస్య భువనస్యగోపా......" —I-164-24

* A C.Das, Rigvedic India and Rigvedic Culture.



6- 14 ౯ 3



౧. Hercules, ౨. కాకోనా, ౩. Serpens, ౪. Bootes, ౫. Ophiuchus, ౬. Aquila, ౭. Sagitta, ౮. Vulpecula, ౯. Lyra, ౧౦. డ్రేకో.

ఆ విష్ణుదేవుని మొదటి రెండడుగులును మహాశ్చర్యముతో మనుష్యులు గమనింప గలరు. మూడవది ఎవ్వరును సరిగా గమనింపలేరు; సమీపింప లేరు. అది పక్షుల ఊర్ధ్వమార్గమునకు పైనున్నది.

శాశ్వతజీవులైన ఆ పక్షులు (విశ్వనాటకమునందలి తమ) పాత్రభాగములను ఎక్కడ నిరంతరమును అభిస్వరము చేయుచున్నవో అక్కడనే ఈ విశ్వమునందలి సమస్తభువనములరక్షకుడును ఉన్నాడు.

ఇచట పక్షులనగా మనభూమిమీద నెగురు కాకులు, గ్రద్దలు నని వేద వ్యాఖ్యాతలు అర్థము చెప్పుచున్నారు. అది సరికాదని నా విన్నపము. ఈ పక్షులు విష్ణునకు వాహన మని వర్ణింపబడు గరుత్మంతుడును, బ్రహ్మకు వాహనమని వర్ణింపబడు హంసయు ననియు, ఇవి ఖగోళమునందు తారలరూపమున తేజరిల్లు దివ్య పక్షులుగాని, భూమిపై నెగురు క్షుద్రపక్షులు కావనియు నేను మనవి చేయుచున్నాను. ఈ పక్షిరూపములు విష్ణు డుదయించిన తరువాత చాలసేపటికిగాని ఉదయించవు. రెండడుగు లైనపిమ్మట ఇవి పూర్తిగా ఉదయించవు. కాబట్టి ఈ మూడవఅడుగు ఈ పక్షుల గమనవీథికి పైనున్న దని ఋగ్వేదము తెల్పుచున్నది.

## విష్ణునిగూర్చిన వేదగాథలు
## విష్ణుసర్వోత్తమత్వము

బ్రాహ్మణములలో విష్ణుసర్వోత్తమత్వము ముఖ్యముగా విశదీకరింపబడినది. ఐతరేయబ్రాహ్మణారంభమునందే ఇట్లున్నది: "అగ్నిర్వై దేవానామవమో విష్ణుఃపరమ" (శతపథబ్రాహ్మణము ౧౪-౧-౧) (దేవతలందరిలో అగ్ని కడపటివాడు. విష్ణువు సర్వోత్తముడు.)

ఒకప్పుడు దేవతలు ఆహార తేజోవైభవములను కోరి ఒక యజ్ఞము చేసిరి. ఆయజ్ఞములో ఎవరైతే తాముచేసిన కార్యములవలన ఇతరులకంటె ముందుగా యజ్ఞాంతమును చేరగలరో వారికి దేవతలందరిలో నగ్రస్థాన మియ్యబడు నని నిశ్చయింపబడెను. విష్ణుడే ఇతర దేవతలకంటె ముందుగా యజ్ఞాంతమును పొందగలిగెను. కాబట్టి దేవతలందరిలో విష్ణువునకే అగ్రస్థానము లభించెను.

### శతపథ బ్రాహ్మణము. ౧-౨-౫

వామనునిగాథ. యజ్ఞస్థలమునిమిత్తము దేవతలును, రాక్షసులును పోరాడు చుండిరి. పిమ్మట వారికి సఖ్యము కుదిరెను. దేవతలలో పొట్టివాడగు వామనునియంతప్రదేశము దేవతల కిచ్చుటకు రాక్షసులు ఒప్పుకొనిరి. తనయంతప్రదేశము కొలుచుకొనుటకు వచ్చి, వామనుడు, చూచుచుండగనే విస్తరించి విశ్వరూపమును ధరించి భూమినంతయు ఒక్కమాటు ఆక్రమించి, రాక్షసులను పారద్రోలి, భూమిని దేవతల వశము చేసెను.

### విష్ణువుయొక్క పరమపదము

"దివీవ చక్షు రాతతం సదా పశ్యంతి సూరయః, తద్విష్ణోః పరమంపదం" అని ఋగ్వేదము (I-౨౨-౨౦.)

ఆకాశమునందు ఒకకన్నువలె ప్రకాశించుచున్న విష్ణువుయొక్క పరమపదమును సూరిజనులు అనగా బుద్ధిమంతులు సదా చూతురు అని చెప్పబడినది. మనుష్యుని శరీరావయవము లన్నింటిలో కన్ను మిక్కిలి ముఖ్యమైనది. అలాగుననే ఖగోళమంతటిలో విష్ణువుయొక్క పరమపదము మిక్కిలి ముఖ్యమైన దగుటచేత బుద్ధిమంతులు దానిపై దృష్టిని నిలిపియున్నారు.

### కఠోపనిషత్తు. III-౯

మనుష్యుని ఆత్మయొక్క పురోగమనము ఒకానొక మార్గము వెంబడి ప్రయాణముతో నుపమింపబడినది. ఆ ప్రయాణముయొక్క అంతము విష్ణువుయొక్క పరమపద మని నిరూపింప బడినది.

### సప్తపది

నేటి వివాహ తంత్రములందు స్థాలీపాకమువేళ సప్తపది మంత్రములలో పెండ్లికుమారుడు పెండ్లికుమార్తెతో "ఈ యడుగులు వేయునపుడు విష్ణుభగ

వానుడు నీతో కూడ ఉండి నీకు మార్గదర్శకుడగు గాక" అను నర్థమిచ్చు మంత్రము చదువును. ఈమంత్రము ఆపస్తంబ, హిరణ్యకేశి, పారస్కర విరచితములగు గృహ్యసూత్రములలో కనబడు చున్నది.

## విష్ణువు, పరమపదము, నారాయణుడు

ఈవిష్ణువే తరువాతి వాఙ్మయములో నారాయణుడనియు, వాసుదేవుడనియు వర్ణింపబడినాడు. 'నారాయణ' శబ్దము నాదాయనశబ్దమువంటిదే యని వ్యాకరణవేత్తలు తెల్పుచున్నారు. పతంజలి (మహాభాష్యము, IV - ౧-౯౯ లో) దీనినిగూర్చి యిట్లు తెలిపినాడు: "నాదాయన మనగా పెక్కునాదములు ఒకచోట చేరుచోటు-కేంద్రస్థానము." ఇట్లే 'నార' లు చేరు కేంద్రస్థానము 'నారాయణ' అగును. మను I-౧౦ పై మేధాతిథివ్యాఖ్యకూడ జూడనగును. విశేషించి నారాయణీయఖండము XII-౩౪౧ లో కేశవుడు అర్జునునితో ప్రసంగించుచు "నేను నారాయణుడనబడుటకు కారణము ఏమనగా:—నరాణాం, అనగా నరులయొక్క గమ్యస్థానము, కేంద్రము, విశ్రాంతిస్థానము నేను. కనుక నారాయణుడ నైతిని" అని తెలిపెను. నృలేక నర శబ్దమునకు దేవతలనికూడ అర్థము కలదు. కాబట్టి నారాయణుడనగా దేవతలయొక్కయు, నరులయొక్కయు గమ్యస్థానము అని అర్థము చెప్పబడినది.

## నార లనగా జలములు. వానికి స్థానమైనవాడు నారాయణుడు

ఇది నారాయణశబ్దమునకు రెండవఅర్థము. ఈ యర్థముకూడ పై మను I-౧౦ ని గూర్చి మేధాతిథిచేసిన వ్యాఖ్యలో కలదు. ఈ యంశము మహాభారత పురాణాదులలో ప్రసిద్ధముగా వర్ణింప బడినది. నార లనగా జలములలోనే బ్రహ్మ మహావిష్ణువు యొక్క నాభీకమలమున నుద్భవ మయ్యెనను నంశము ఋగ్వేదమునందే విశ్వకర్తసూక్తమున చక్కగా వివరింప బడెను. చూ. ఋ. X. ౮౨. ౫, ౬.

"పరోదివా పరఏన పృథివ్యా పరో దేవేభిరసురైర్యదస్తి, కం స్విద్గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్ర దేవాః సమపశ్యంతి విశ్వే."

"తమిద్గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్ర దేవాః సమగచ్ఛంతి విశ్వే, అజస్య నాభా వధ్యేకమర్పితంయస్మి న్విశ్వాని భువనాని తస్థు విశ్వే."

బ్రహ్మ తనముఖమున సరస్వతి నుంచుకొనినట్లును, సమస్తవిద్యల కధిదేవత యగునీసరస్వతి వీణ చేపట్టి వాయించుచున్నట్లును పురాణప్రసిద్ధము. ఈదంపతులకు హంస వాహనమనికూడ సుప్రసిద్ధమే. వాణీహిరణ్యగర్భులను నీదంపతుల చిత్రమునందు, వాణీదేవిచేతిలోని వీణయే చూపరులదృష్టిని ముఖ్యముగా నాకర్షించుచుండును. దీనినే పాశ్చాత్యులు వీణామండలము (Lyra) అని యుదాహరించిరి. ఈదంపతుల వాహనమైన రాజహంస Cygnus అని చెప్పబడుచుండును.

## యాదవకులేశుడై యవతరించినహరియేవిష్ణువు. హరికులేశుడే పాశ్చాత్యుల హెర్క్యులీస్. Hercules మండలము

ఈ హెర్క్యులీస్ మండలమనునది భూతేశ (Bootes) మండలములోని, స్వాతికిని గరుడమండలము (Aquila) లోని శ్రవణమునకును మధ్య నున్నది. స్వాతి వాయుదైవత్యమైన నక్షత్రము. అది సప్తఋషులకు పైనను న్నది. విశ్వకర్త సప్తఋషులకుపైగా నున్నట్లు ఋగ్వేదమునందు స్పష్టముగా కలదు. చూ. X-౮౨-౨.—

"విశ్వకర్మా విమనా ఽ ఆద్విహాయా
ధాతా విధాతా పరమోత సందృక్
తేషా మిష్టాని సమిషా మదంతి
యత్రా సప్తఋషీ న్పర ఏక మాహుః."

విశ్వకర్మమహామహిమగల మనశ్శక్తులు గలవాడు. అతడే యీవిశ్వమును రచించి గతులు కల్పించినాడు. ఆ మహోన్నతమూర్తి సప్తఋషుల కావల నున్నాడు.

ఆశని నొక్కనిసే వారు ఇష్టముతో గౌరవించి రస వంతములైన పానీయాదు లిచ్చి పూజించుచున్నారు.

## వాయు విష్ణుపురాణములందలి ప్రమాణములు II. ౮.

ఊర్ధ్వోత్తరాం ఋషిభ్యస్తు
ధ్రువో యత్రాస్తి వై స్మృతః,
ఏత ద్విష్ణుపదం దివ్యం
తృతీయం వ్యోమ్ని భాస్వరమ్. ౯౯

ధర్మ ధ్రువాద్యా స్తిష్ఠంతి
యత్రవై లోకసాక్షిణః,
తత్సార్ష్టోత్పన్న యోచేద్ధా
స్తద్విష్ణోః పరమంపదమ్. ౧౦౧

యత్రోత మేత త్ప్రోతంచ
యద్భూతం సచరాచరమ్,
భావ్యంచ విశ్వం మైత్రేయ
తద్విష్ణోః పరమంపదమ్. ౧౦౨

దివీవ చక్షు రాతతం
వితతం యన్మహాత్మనామ్,
వివేకజ్ఞానదృష్టించ
తద్విష్ణోః పరమం పదమ్. ౧౦౩

యస్మిన్ ప్రతిష్ఠితో భాస్వాన్
మేఢీభూత స్స్వయంధ్రువః,
ధ్రువేచ సర్వజ్యోతీంషి
జ్యోతిష్వంభోముచో ద్విజ. ౧౦౪

ఏవ మేత త్పదం విష్ణో
స్తృతీయ మమలాత్మకమ్,
ఆధారభూతం లోకానాం
త్రయాణాం వృద్ధికారణమ్. ౧౦౫

తతః ప్రభవతి బ్రహ్మన్
సర్వపాపహరా సరిత్,
గంగా దేవాంగనాంగానా
మనులేపనపింజరా. ౧౦౬

## మహాభారతము, భీష్మపర్వము, జంబూఖండ వినిర్మాణ పర్వము

క్షీరోదస్య సముద్రస్య
తథై వోత్తరతః ప్రభుః,
హరి ర్వసతి వైకుణ్ఠః
శకటే కనకామయే.

అష్టచక్రం హి తద్యానం
భూత యుక్తం మనోజవమ్,
అగ్నివర్ణం మహావేగం
జాంబూనదవిభూషితమ్,
స ప్రభు స్సర్వభూతానాం
విభుశ్చ భరతర్షభ.

సంక్షేపో విస్తర శ్చైవ
కర్తా కారయితా తథా,
పృథి వ్యాప స్తథాకాశం
వాయు స్తేజశ్చ పార్థివ.

## పాలసముద్రము, శ్వేతద్వీపము, ఆకాశగంగ

ఆకాశమునందు ధవళధవళమై, వలయాకారమున ఖగోళముచుట్టును, తెల్ల మబ్బువలె వ్యాపించిన ట్లొక దృశ్యము కానవచ్చుచుండును. దానిని మనదేశములో గొల్లలు కొందరు 'పశువులపుంత' యని చెప్పుదురు. శ్రీకృష్ణుడు గోవుల నామార్గమువెంట తోలునని చూపుచుందురు. పాశ్చాత్యులు దీనిని మిల్కీవే (Milkyway)అందురు. Milk అనగా పాలు. Milky way అనగా పాలపుంత, లేక మార్గము అని అర్థము చెప్పవచ్చును. ఇందు కొంతభాగము పాలసముద్రము; మరి కొంత ఆకాశగంగ. దీనియొక్క యాకారమును సూచింపగల పటము లిందు రెండు చేర్చబడినవి.

ఈ పటములలో మొదటిదానిలో శేష, గరుడ, రాజహంసమండలముల సమీపమున నున్న ప్రదేశము శ్వేతద్వీపము, పాలసముద్రము నని చెప్పనొప్పును. ఈ శేషునిపైపవ్వళించి గరుడునిప్రక్క కాళ్లు చాచియున్న మహనీయస్వరూపమే శ్రీ మహావిష్ణు స్వరూపము.




పాలపుంత ౧




పాలపుంత ౨

కథాసరిత్సాగరమునందు శ్వేతద్వీపవాసియు, శేషశాయియు నైన శ్రీహరిని సందర్శించుటకు దేవసిద్ధి యనువాడు నరవాహనదత్తుని తీసుకొనివెళ్లెనని చెప్పబడినది. మోక్షార్హులైన యోగులు శ్వేతద్వీపనివాసియగు నారాయణుని దర్శింపబోదురని హరివంశమునందు చెప్పబడినది.

### ఈ పరమపదమునుగూర్చి పాశ్చాత్యసిద్ధాంతు లేమిచెప్పిరి?

చంద్రుడు భూమిచుట్టు తిరుగుచున్నాడు. భూమి సూర్యునిచుట్టు తిరుగుచున్నది. భూమి యొక్కటేగాక, బుధుడు, శుక్రుడు, అంగారకుడు, బృహస్పతి, శని, యురేనస్, నెప్ట్యూను, ప్లూటో మొదలగు గ్రహములు తమచుట్టు తిరుగు నుపగ్రహ-బలగముతో కూడ సూర్యునిచుట్టు తిరుగుచున్నవి. అయితే సూర్యుని మాట యేమి? అతడీకుటుంబముమధ్య కదలక నిల్చియున్నాడా? లేక మరెక్కడకైన పోవుచున్నాడా? ౧౮-వ శతాబ్దాంతమువఱకు ఇట్టి ప్రశ్న పుట్టుటకే అవకాశము లేకపోయినది. ఆ శతాబ్దమధ్యము నుండి సుమారు ఏబదిసంవత్సరము లతిదీక్షతో, ఏకధ్యానముతో నక్షత్రవేధ చేసి చేసి హెర్షెల్ దొరగారు

తుప కొక మహాద్విషయమును కనిపెట్ట గలిగిరి. అదేమనగా, మనసూర్యుడు సకుటుంబముగా, క్షణమునకు ౧౨ మైళ్ళ చొప్పున దక్షిణమునుండి ఉత్తరమునకు Hercules మండలములోని లాంబ్డా గుర్తుగల చుక్కవైపు అఖండత్వరతో పోవుచున్నాడు. ఆతడిట్లు చెప్పుటకు కారణ మేమనగా:—మన మొక రైలుబండి నెక్కి దక్షిణమునుండి యుత్తరదిశకు పోవుచున్నపుడు, మనము గడచివచ్చిన దక్షిణ ప్రదేశమంతయు క్రమముగా మూసుకొనిపోయి యదృశ్యమగుచుండును. కాని ముందు చేరవలసిన యుత్తరదిక్కునందలి ప్రదేశములు తెరలోనుండి బయల్పడినట్లు, విడి వికసితము లై విషయవిశేషములతో విలోకింప నగుచుండును. జాగ్రత్తగా ఖగోళమును పరిశీలించుచో దక్షిణాకాశమున తారామండలము మూసుకొని పోవుచున్నట్లును, ఉత్తరాకాశమున లాంబ్డా గుర్తు గల చుక్క ప్రాంతములందు హెర్క్యులీస్ మండలములోని చుక్కలు పువ్వు విడిపోవునట్లు విడి వికసితము లై కానవచ్చు చున్నవి. కావున మన సూర్యకుటుంబము ఆవంకకు బోవు చున్న దని యతడు నిశ్చయించి గణితరీత్యా లెక్కలు కట్టి చూడగా క్షణమునకు పండ్రెండుమైళ్ళచొప్పున పోవుచున్నట్లు తెలిసినది. చూచితిరా!-క్షణమునకు ౧౨ మైళ్లు, నిమిషమునకు ౧౨ × ౬౦=౭౨౦ మైళ్లు, గంటకు ౭౨౦ × ౬౦=౪౩౨౦౦ మైళ్ల చొప్పున మనము హెర్క్యులీస్ మండలములోనికి పోవు చున్నాము. హెర్షెల్ సిద్ధాంతి తరువాత పాశ్చాత్యనక్షత్రపరిశోధకులు అనేకులు ఈ విషయమై పెక్కువిధముల పరిశీలించి చూచుచున్నారు. ఈ గమనమార్గము Milky way-పాలపుంత యన బడు ధవళవాహినీమార్గము ననుసరించి యున్నదని పలువు రభిప్రాయపడుచున్నారు. Richard, Proctor, Dr.Whewell, Chalmers, Brewester, Wallace, Simon Newcomb ముఖ్యులగు జ్యోతిశ్శాస్త్రవేత్తలు ఈ విషయమై నిరంతర పరిశీలనలచేసి, నూట యేబదిసంవత్సరముల క్రిందట హెర్షెల్ సిద్ధాంతమును రవంత సవరించి, లాంబ్డా హెర్క్యులీస్ చుక్కకు సమీపమునందే ఉన్న వీణామండలములోని బ్రహ్మనక్షత్రమే మన సూర్యుని గమ్యస్థానమని నిర్ధారణ చేసినారు. హెర్షెల్ నాటి గమ్యస్థానము, నేటి గమ్యస్థానమును సూచించుపట మీప్రక్కనే కలదు. ఇందేది గమ్యస్థాన మైనను మనవారు చెప్పినదానికి భంగము లేదు.




[౧. లాంబ్డా హెర్క్యులీస్. దీనిచుట్టు నున్న చిన్నచిన్న వలయము గమనింపుడు. ౧౭౮౩ సం. లో హెర్షెల్ అను ఆంగ్ల సిద్ధాంతి మన సూర్యకుటుంబము, ఈ ప్రదేశములోనికి పోవుచున్నదని తెల్పెను.

౨. వలయము. ఇది బ్రహ్మనక్షత్రము చుట్టు నున్నది. ఇటీవల సిద్ధాంతు లందరు మన సూర్యకుటుంబము యొక్క గమ్యస్థాన మీవలయమైనట్లు సూచించినారు. విశాలాకాశముపై ఈ రెండును సమీపమందే ఉన్నవి.]

"యోఽసౌ సర్వగతో విష్ణుః" అని మన శ్రుతులు చెప్పుచున్నవి. సరిగా విష్ణువును చేరినను, మొదట బ్రహ్మను చేరి తద్ద్వారా విష్ణుని చేరినను తుదకు సర్వమును విష్ణువునే చేరుచున్నవి. హెర్షెల్ చెప్పువఱకు పాశ్చాత్యసిద్ధాంతు లీ మనసూర్యుని గమనవిధానము నెఱుగరుగాని ఋగ్వేదమునాటి మహర్షు లీయంశము నానాడే బాగుగా నెఱుగుదురు. విశ్వామిత్రుడు, దీర్ఘతమస్సు మొదలగు మహర్షు లీయంశము ఋగ్వేదమునందు తెల్పియే యున్నారు. ఇదివఱకు పైని ఎత్తివ్రాసిన ఋక్కు

లీయర్థమును స్థాపింప గలవు. అయినను మరి రెండంశ ములు వ్రాయు చున్నాను.

యముడు సూర్యపుత్రుడు. ఇతనికి దక్షిణదిశాధిపత్యమును, చచ్చినవారిపై అధికారమును ఇయ్యబడినవి. సూర్య కుటుంబము దక్షిణమునుండి యుత్తరమునకు పోవు చున్నది కదా! అనగా గతముతో —గతించి పోయినదానితో దక్షిణమునకు సంబంధ మేర్పడు చున్నది. గతము దక్షిణదిశావశ మగు చున్నది; మఱియు అందు చేరిపోవు చున్నది. తదధిపతి యముడు. దేవతలుత్తరమున నున్నారు. అటు పోవుచున్నాడు, సూర్యుడు. ఎక్కడికి? ఆయంశము నిర్ధారణ చేసి గాయత్రి రచింపక పూర్వము విశ్వామిత్రుడు చెప్పిన యొక ఋక్కు గమనింతము—

కో అద్ధా వేద క ఇహ ప్రవోచ
దేవా అచ్ఛా పథ్యా కా సమేతి ?
దదృశ్ర ఏషా మవమా సదాంసి
పరేషు యా గుహ్యేషు వ్రతేషు.
—III-54-5

దేవతలకడకు ఏమార్గము కొనిపోగలదు? దాని నిజమిదియని యెవ రెఱుగుదురు ? అది నిర్ధారణము చేసి చెప్పగలవా రెవరు? దిగువకు వచ్చినపుడు వారుండిన ప్రదేశములే కనపడుచున్నవి. కాని అసలు దేవత లెక్కడనో దూరముగా, రహస్యముగా నున్నారు.

విష్ణు ర్గోపాః పరమం పాతి పాథః
ప్రియా ధామా న్యమృతా దధానః,
అగ్నిష్టా విశ్వా భువనాని మహద్దే. —III-55-10

విశ్వరక్షకు డగు విష్ణుడు పరమస్థానమును కాపాడుచు తన భక్తుల నివాసస్థానముల కమృతత్వము ననుగ్రహించు చున్నాడు. విశ్వములందలి భువనముల నగ్ని యెఱుగును. ఆ మహాదేవుని విశ్వసామ్రాజ్యము అప్రతిహతము, అద్వితీయము నై యొప్పుచున్నది.

## గాయత్రి

పిమ్మట: ఋగ్వేదము III-౬౨-౧౦ లో విశ్వామిత్రుడు గాయత్రి మంత్రము రచించినాడు. ఈ మంత్రరాజము జగద్విఖ్యాతము గావున దాని నిచట నుదాహరింప బనిలేదు. ఆంగ్లవిద్యావిదుల ప్రయోజన నిమిత్తము Sir William Jones దొరగారు వ్రాసిన English translation ముందు వ్రాసి పిమ్మట దానికి తెనుగు వ్రాసెదను—

" Let us adore the supremacy of that Devine Sun, the God head-Who illuminates all,—from Whom all proceed-to Whom all must return, Whom we invoke to direct our understanding aright in our progress towards His Holy Seat. "

"ఎవ డీ విశ్వమును వెలిగించి తేజోమయము గావించుచున్నాడో, ఎవనివలన ఈవిశ్వము ప్రభవించు చున్నదో, ఎవనితో నీవిశ్వము లీనమగునో అటువంటి సవితృవరేణ్యునియొక్క మహామహిమను ధ్యానింతము. తనపవిత్రస్థానమును చేరుటకై మనము చేయుపురోగమన యత్నమున మనగ్రహణసామర్థ్యమును సరియైనమార్గమున నిలుపుమని మన మామహామహుని ప్రార్థింతము."

ఇట్టియర్థముగల గాయత్రిమంత్రము బహుశక్తివంతము. గాయత్రి ఛందోమయము. గరుడునకు ఛందములతోను, గాయత్రితోను సంబంధమును దూపెడి కథలు బ్రాహ్మణములలో ననేకము లున్నవి.

## విశ్వరూప సందర్శనము

౨౫ లక్షల మైళ్లు చుట్టుకొలత గల మన సూర్యుని సకుటుంబముగా, క్షణమునకు ౧౨ మైళ్లు - నిమిషమునకు ౭౨౦ మైళ్లు - గంటకు ౪౩౨౦౦ మైళ్ల చొప్పున తనలోని కీడ్చుకొనిపోవు చున్న దేవదేవుని మహాశక్తినిగుఱించి యాలోచించినపు డా యఖండశక్తి యొక్క తత్త్వము ఇట్టి దని నిర్ణయింపనేరక కనులు గిఱ్ఱున తిరుగ గలవు. మనసు నిలుకడవదలి వెఱ్ఱి యెత్తినట్లు చలించును. ఇట్లే తక్కిన తారాసముదయముల గమనవిధులు పరిశీలించినకొలది వాటి గమ్యస్థానము కూడ ఈ విష్ణుమండలమే అని నిశ్చయమై అర్జునుడు

విశ్వరూపమును సందర్శించినప్పటివలె మనమును భయాశ్చర్యానంద మనస్కులము కాగలము.

తనవారని పైవారని, భేదము కల్పించుకొని, తనవారనుకొనుచున్న భీష్మ, ద్రోణ, దుర్యోధనాదుల చంపజాలక వికలచిత్తుడై, రథముపై చతికిలబడిన అర్జునునికి శ్రీకృష్ణభగవానుడు యోగవిద్యనుపదేశించి విశ్వరూపమును చూపెను. "నీవు శోకింపతగనివారిని గూర్చి శోకించుచున్నావు; ప్రజ్ఞావాదములు పలుకుచున్నావు. జన్మము, బాల్యము, యౌవనము, జర, మృత్యువు - ఇవి క్రమముగా ఒకదాని వెనుక నొకటి చక్రపరివర్తనమువలె కలుగుచున్నవి. నీవు చంపేవాడవు కావు; చచ్చేవాడవు కావు; నిమిత్తమాత్రుడవు. నీపని నీవు చేసుకోవలసినదే" అని మహోపదేశము చేసి కృష్ణు డర్జునునికి విశ్వరూపము చూపెను.

"అందు బ్రహ్మ, ఈశ్వరుడు, ఋషులు, సర్పములు, అనేకబాహువులు, ఉదరములు, శిరములు, నేత్రములు, కిరీటములు, చక్రములు, సర్వతోదీప్తిమంతమైన తేజోరాశి, అందు ౧౧ రుద్రులు, ౧౨ ఆదిత్యులు, ౮ వసువులు, సాధ్యులు, విశ్వేదేవులు, అశ్వినులు, మరుద్గణములు, పితరులు, గంధర్వులు, యక్షులు- అందరు కనబడుచున్నారు. అనేకములగు నదీప్రవాహములు బహువేగముగా పారి వచ్చి సముద్రమున జొచ్చినట్లు భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, శిఖండి, ధృష్టద్యుమ్నాదులైన మహావీరులు భయంకరకరాళ దంష్ట్రలుగల నీముఖములో ప్రవేశించుచున్నారు." అని అర్జునుడు తెలుపుచున్నాడు. అనగా మన సూర్యకుటుంబమువలెనే తక్కిన తారాసముదయములు తుదకు, విశ్వభువనకర్తయు, భర్తయు, హర్తయు నగు విష్ణుభగవానునిలో లీన మగుచున్నట్లు దివ్యదృష్టితో చూచిన నగపడినది. విశేషించి, అర్జునుడు అనగా ఉత్తర ఫల్గున నక్షత్రము, తనకు ఎట్టయెదురు (Diametrically opposite) గా నున్న మీనరాశిని, ఆసమీపనక్షత్రములను హరింపజేసినట్లు అగపడుచున్నది. అంతే-అది భ్రమ. నిజముగా మీనము నశింపచేయబడలేదు. అది మన కనులకు అస్తమించినట్లు కనబడినను మరియొక దేశములో ఆవేళకే ఉదయించునట్లును, ఇంకొక దేశములో ఆకాశమధ్య మున్నట్లును, అనేక ప్రదేశములలో అనేకవిధముల కనబడు చున్నది. అందుచేత అర్జునుడు వానిం జంపుటయు, అవి చచ్చునట్లు తోచుటయు కేవలము భ్రమ. అర్జునుడు చంపువాడు కాడు. అవి అర్జునునిచేతిలో చచ్చునవి కావు. ఆ చక్ర మట్లు తిరుగుచుండవలసినదే. అర్జునుడు నిమిత్తమాత్రుడు.

ఇచట- మతము (Religion), తత్త్వము (Philosophy), ప్రకృతి శాస్త్రము (Nature and Science)-మూడును ఏకీభూతమగుచున్నవి. భగవంతుడు సగుణుడని నమ్మి అతని పూజించువారికి అతడు పాలసముద్రమునందు శేషునిపై పరుండియున్నాడని, అతనినాభికమలమునుండి బ్రహ్మ యుద్భవించినాడని, ఆమూర్తికిటునటు వాయుమూర్తియు, గరుడమూర్తియు గలరని అతడే విశ్వకర్త, భర్త, హర్త యని మతముచెప్పుచున్నది. విశేషించి బోధనైకాదశి, వైకుంఠైకాదశి, ఫాల్గునైకాదా,శి శయనైకాదశి (ఆషాడ శు ౧౧), పరివర్తనైకాదశి మొదలగునవి ఆతారాసముదయముయొక్క గమనము ననుసరించి యేర్పడినవని స్పష్టము కాగలదు.

ఇక నిర్గుణోపాసకులకు—

"ఎవ్వనిచేజనించు జగమెవ్వనిలోపలనుండు లీనమై
ఎవ్వనియందు డిందు పరమేశ్వరు డెవ్వడు మూలకారణం
బెవ్వ డనాదిమధ్యలయు డెవ్వడు సర్వము తానయైన వా
డెవ్వడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేడెదన్."

క. "ఒకపరి జగములు వెలి నిడి
ఒకపరి లోపలికి గొనుచు నుభయము దానై
సకలార్థసాక్షి యగు న
య్యకలంకుని నాత్మమూలు నర్థిం దలంతున్."

గీ. "స్త్రీ నపుంసక పురుష మూర్తియును గాక
తిర్యగమర నరాది మూర్తియును గాక
కర్మ గుణ భేద సదసత్ప్రకాశిగాక
వెనుక నన్నియు తానగు విభుం దలంతు."




## శ్యామదేశము

### శాంతియుతమగు నూతనవిప్లవము

### ( Blood-less revolution in Siam)

శ్యామదేశము (సయాం) భరతఖండమునకు ఆగ్నేయమున నుండు ద్వీపకల్పభాగము. ఈరాజ్యపు విస్తీర్ణము ౨ లక్షల చదరపుమైళ్ళు. జనసంఖ్య నాలుగున్నరకోట్లు. ప్రజలు బౌద్ధమతస్థులు. రాజునకు పేరు ప్రజాధిప. ఆరాజాన్వయమునకు ఏడవతరపువాడీప్రభువు. ౧౯౨౫ సం. మున పట్టమునకు వచ్చినది మొదలు రాజ్యాధికారమంతయు తనచేతియందే యుంచుకొని మంత్రుల సాహాయ్యముతో తానెరిగినంతవరకు ప్రజలను కొదువలేక పరిపాలించుచుండెను. ఇట్లున్నను ప్రజలున్నగన్నట్టు కడచిన ౧౯౩౨ జూన్ నెలతుదియందు తమప్రభువుపై తిరుగబడిరి; రాజ్యాధికారమంతయు తమదై యుండవలెనని పట్టుబట్టిరి; దేశపుసైన్యమునే లోబరచుకొని ప్రభువును నిర్బంధమందుంచిరి. మహారాజు తన యధికారము ప్రజల కొప్ప జెప్పుటకు సమ్మతించెను. ఈపరివర్తనమునకు ఆస్థానపురోహితుడు ౧౯౩౨ సం. డిసెంబరునెల ౧౦-వ తేది పగలు ౨ ఘంటల ౫౩ నిమిషములకు శుభలగ్నము నిర్ణయించెను. ఆసమయమునకు సరిగ ప్రజాధిపుడు కిరీటమును ధరించి సింహాసనమునెక్కి ప్రభుత్వాధికారము నంతయు జనులలో పెద్దలగువారికి ఒప్ప జెప్పినట్టుమ పత్రమునే వ్రాసి తనముద్ర నొత్తించెను. ఆపత్రమును ఒక చిన్న బంగారుపళ్లెరమునం దిడి, దానిని మరియొక గొప్ప బంగారు తట్టయందుంచిరి. పిమ్మట మహారాజు తన నగరు సౌధము నెక్కి యెత్తైన వాతాయనము (కిటికీ) నుండి కూడియున్న ప్రజలందరు వినునట్లు దానిని చూపి చదివి వినిపించెను. ఆతరుణమున నాకాశమున విమానముల విహరింపజేసిరి. ఇరువదియొక్కసారి ఫిరంగుల నెగిరించి అయ్యది రాజ్యమునకు శుభసమయమని ప్రకటించిరి బ్యాంకాక్ (Bangkok) అను రాజధానియందలి దేవాలయములోని ఘంటలన్నియు నొక్కుమ్మడిగ మ్రోగెను.

ఈ పరివర్తనపత్రము ఉన్నదున్నట్లు పుట్టినది కాదు. ప్రజాసభవారు కూడి రెండువారములు దీర్ఘముగ నాలోచించి రచియించినట్టిది. మహారాజు బౌద్ధుడుగ నుండవలెననుటయు, ప్రభుత్వమువారు బౌద్ధమతమునే పోషించవలయుననుటయు, ప్రజాధిపు డెప్పటివలె సింహాసనము నధిష్ఠించవలెననుటయు, ప్రభుత్వాధికారమంతయు ప్రజలదై యుండవలెననుటయు నీరచనయందలి చరిత్రాంశములు. ప్రజలు వేరుమతము నాచరించువారైనను, ప్రభుత్వము భేదములేక అన్ని జాతులవారిని, మతములవారిని ఒకటేవిధమున నాదరించవలెననుట యీ పత్రములోని మరియొక షరతు. ఇక ముందు సర్కారు జరుపు పెద్దల గుంపునకు 'స్టేట్ కౌన్సిల్' (State Council) అని పేరు. అనగా ప్రజాప్రతినిధుల సభయనుట. ఇది యెలెక్షన్ పద్ధతి ననుసరించి నిర్మింపబడవలెననుట వేరుగ చెప్పబనిలేదు.

ఈపరివర్తన పత్రము రచించి ప్రకటించిన పిమ్మట మహారాజు సింహాసనాధిష్ఠుడై కొలువు తీరెను. ప్రజలందరు గుమిగూడిరి. ఈ పరివర్తనమునకు కారకులైన ఏబదిముగ్గురు ప్రజాధికులు సభ నలంకరించిరి. వీరిలో పదునైదుమంది రాణువయం దధికారము గల

వారు. పదునాల్గురు దేశపు యుద్ధనావలకు కర్ణధారులు. ఇరువదినల్గురు పాలనాధికారులు. వీరందరు ప్రముఖులై సన్నిధిని నిల్చి మహారాజునకు స్వర్ణభాజనమున ధూపదీపపుష్పముల నర్పించి యీ పరివర్తనమును సమర్పించుటయందు తా మొనర్చిన యపరాధమును క్షమింప వేడుకొనిరి. ఈ సమయమున ప్రజాధిపుడు సెలవిచ్చిన ప్రత్యుత్తర మిది: "నేటి మీపరివర్తనము నాకు మిక్కిలి సంతోషదాయకము. ఇందుకు కారణము మీరు నాక్షమాపణ వేడినారనుటకు కాదు. మరియెందుకన, మీ యపరాధముల నంతకుముందే క్షమించినాడను. మీరు మీదేశాభివృద్ధిని మదినుంచి చేసినప్రయత్నమును ముందే గ్రహించినవాడను. ఈ పరిణామమునకు నాచేతనైనంతవరకు యత్నించి మీకు తోడుపడితిని. దేశమునే పెంపొందించి యీస్థితికి తెచ్చుటయందు నా యన్వయమువారును, నాకుటుంబమువారును చేసిన మేలును క్షమాపణ పత్రికయందు మీరు బహిరంగముగ పేర్కొనియుండుట నాకు పరమసంతోషము. ౧౯౩౭-వ సం. జూన్ ౨౮-వ తేది మీరు మాకు సమర్పించిన విన్నపమందు దేశాభ్యుదయమునకై మేమును, మావంశమువారును ఏవిధమైన ప్రయత్నమును చేయలేదని నిందించియుంటిరి. ఈనింద నాకును, నావారికిని మనస్సున నొప్పి కల్గించి యుండెను. ఇపుడు మీరర్పించిన క్షమాపణపత్రములో నా ప్రమాదముల సవరించి యుండుటచే మామనస్సు కొదువతీరినది. ఇదియు నా మందలింపు లేకనే మీయంతట మీరే ముందుకువచ్చి యిట్టి విన్నపము సమర్పించుటచే నాకు గల్గిన సంతోషము ద్విగుణమై యొప్పారినది. ఈపరివర్తనమందు మీ తప్పును మీరే గ్రహించి యీమహాసభయందు బహిరంగముగ ఒప్పుకొనుట సముదాయమున మీనడవడిక కే యార్జవమును సత్యనిరతియును సొమ్ములుగా నమరియుండుట మిక్కిలి యలంకారము."

(From 'London Times')

—టి. శివశంకరము

---

## అగ్నిపర్వత పరిశోధన

మీద కొండకోనను, నన్ను అంటిన సన్నని రాతినారదారమూ, క్రింద సలసల ఉడుకుతూన్న శిలాద్రవమూ (Lava) అలలవలె పైకి కమ్ముతూన్న ఆవిరిపొగలూ, నడుము దారంకొసను వేళ్లాడుతూ ఎనిమిది వందల అడుగుల లోతులో మండుతూన్న నిప్పుగుండంలోకి ఉరుకుతూన్న నేనూను.

బద్దలయి పడే రాతిచెక్కల దెబ్బలు తగలకుండా నెత్తిని ఉక్కుకుళ్లాయి ఉంది. దుస్తులూ, కాళ్ల చేతుల జోళ్లూ - అన్నీ రాతినారవి తొడుక్కున్నాను. లోపల ఊపిరి పీల్చడానికి ప్రాణవాయువు గొట్టాలు రెండు వీపున కట్టుకున్నాను.

నేను ఎన్నో నాళ్లనుంచీ అనుకుంటూండిన విజ్ఞానశాస్త్ర పరిశోధనసాహసం నాకు ప్రత్యక్షం అవుతూంది. మంటలు కక్కుతూ ఉన్న అగ్నిముఖ పరిశోధనం నేను చేయబోతూ ఉన్నా ననీ, భయంకరమయిన ఆగోతిలోకి నేను దిగుతాననీ, పొగలు కక్కుతూన్న ఆ బిలద్వార ప్రదేశాన్ని ఫోటో తీస్తాననీ, తరుచూ పేలుతూ, విపరీతంగా ఉత్పాతాలు కలిగిస్తూండే చోటికి పోతాననీ చెప్పడంతో నామిత్రు లందరూ నాకు వెర్రెత్తిం దనుకొన్నారు.

"ఇంతకు ముందు అగ్ని పర్వతాల పరిశోధన తలపెట్టిన వాళ్లెవళ్లూ మండుతూండే బిలంలోకి దిగడానికి సాహసించారు కారు. వెసూవియస్, ఎట్నా అగ్నిపర్వతాలు శాంతంగా ఉన్నప్పుడు వాటి ద్వారం దగ్గిరికి పోయి చూచి రావడంతో వాళ్లందరికీ తృప్తి కలిగింది. నాప్రయత్నం కడవెళ్లితే ఇదివరకూ ఎవ్వరూ చూడని కొత్త అద్భుత ప్రదేశాల్నూ, విషయాలనూ తెలుసుకొన్నవాణ్ణవుతాను. అధోలోకయాత్ర చేసి తిరిగి గట్టెక్కి సూర్యుడివెలుగులో పడ్డానంటే అక్కడి వింత వింతలయిన ఘన, వాయుపదార్థాలను మచ్చు తీసుకు రాగలుగుతాను" అని నేనీపరిశోధనకు పూనుకున్నాను.



సాహసికుడగు పరిశోధకుడు ఆర్పడుకిర్నరు కొండకొమ్మునుండి దారముకొసను వ్రేలాడుట.

‘సిసిలీ’ కి ఉత్తరంగా మధ్యధరాసముద్రం అనుకొని ఉన్న ‘స్ట్రాంబోలీ’ పర్వతంవద్ద నాపరిశోధన సాగింప నిశ్చయించాను. ఆకొండంతా అగ్నిగుండాలే. అవెప్పుడూ మంటలు కక్కుతూ ఉంటవి. మరెక్కడా అట్లా ఉండవు. నేననుకుందంతా అక్కడ చూడవచ్చునని నానమ్మకం. అందుకనే నాపరిశోధన అక్కడ చేయవలచాను. అక్కడ కొండ సముద్రం నీళ్లలోంచే నిట్రంగా నిలుచుని ఉండడం చేత కావలసిన సామగ్రంతా కొండపై కెక్కించడం చాల కష్టం అయింది.

కొండ లెక్కేవాళ్లు కట్టుకునే లాంటి పటకా నడుముకు కట్టుకున్నాను. రాతినారదారం దానికి గట్టిగా బిగించాను. దిగేచోటికి కొన్నిగజాలదూరాన కొండపైన బరువులు దింపే యంత్రం ఒకటీ, ఆకొండ అంచుకు కప్పీఒకటీ అమర్చించినాను. నానడుముకు కట్టిన రాతినారదారము కొండరాళ్లను రాచుకోకుండా ఉండేటందుకు కప్పీపైనుంచి యంత్రంద్వారా దింపే ఏర్పాటు చేశాను. నామిత్రులూ, వారికి సాయంగా తీసుకున్న ఆదీవివారు కొందరూ యంత్రాన్ని త్రిప్పే వారు. నేను లోపలినుంచి ఏదయినా సంజ్ఞ చేయడానికి ఒక ఎలెక్ట్రికుదీపంకూడ నాతో తీసుకున్నాను. అది వెలగడానికి విద్యుచ్ఛక్తిని పుట్టించే తీగెలు రాతి నారదారంతో కూర్పించాను.

నేను కొండమీదినుంచి జారడంతోటే నా నెత్తిమీది అపాయం నాకు తెలిసివచ్చింది. నేను తిరిగి ప్రాణాలతో బయట పడడం ఒక పెద్దసమస్య అనుకున్నాను. నాపరికరాలు చాలక పోవచ్చు; లోపలి వేడిని, దుర్వాయువులను నాహృదయం, ఊపిరితిత్తులూ సహింపక పోవచ్చు; అంతరాళంలో దిగబడుతూన్న నేను ఎక్కడికి ఎంతదూరం పోతున్నానో, ఎక్కడ అడుగు పెడతానో నాకు తెలీదు. దిగిం తర్వాత అక్కడ గట్టి బండే ఉందో, ఉడుకుతూ ఉన్న శిలాద్రవమే ఉందో, నిప్పులరాశే ఉందో తెలీదు. అదీ నాస్థితి.



దిగుటకు ముందు అగ్నిబిలములోతును కొసకు రాతిని కట్టిన దారముతో కొలుచుట.

నేను దిగుతూ కొండప్రక్కలను పరిశీలించాను. అవి నలుపు, ఎరుపు, పసుపు రంగులు కలవి.

వాటిలో గంధకం ఆవిర్లు వస్తూండేగోతులు ఉన్నవి. క్రింద పొగలు కక్కుతూ ఉన్న పెద్దగోతులు ఉన్నవి. అపుడు పైకి చూచాను. ఎంత లోతుకు పోయిందీ తెలుసుకున్నాను. 'దారం ఒరిపిడికి ఆగుతుందా! మళ్లీ నన్ను పైకి చేదుకుంటారా' అనుకున్నాను. ఉన్నట్టుండి కాలుతూ గట్టిగా ఉన్న చట్రాతిపైన అడుగు పడింది. అక్కడ లోతు, మీదినుండి ఎనిమిదివందల అడుగులు. వేడి కొన్నిచోట్ల ౨౧౨ (F) డిగ్రీలదాకా ఉంది. గాలివేడి ౧౫౦ డిగ్రీలు. స్థలం అంతా అపాయకరం అయిన గంధకవాసనతో నిండి ఉంది. ప్రాణవాయువు గొట్టాలుండబట్టి మంచిగాలి పీల్చగలిగాను. అక్కడ అంతటా పరిశీలింప మొదలుపెట్టాను. దారాన్ని ఆపల పెట్టాను.



పరిశోధకుడు ఆర్పడు కిర్నరు, అతని మిత్రుడు.

అసలు నిప్పు ఎక్కడ పుడుతుందో కనిపెట్టాలనుకొన్నాను. ఎక్కడ చూచినా పెద్దపెద్ద నిలువు గోతులు-౧౦ మొదలు కొని 30 అడుగులవరకు వ్యాసం గలవి ఉన్నవి. అప్పుడప్పుడూ భయంకరం అయిన ధ్వనితో పేలి ఉడుకుతూన్న శిలాద్రవం వాటిల్లోంచి పొంగి వస్తూ ఉంటుంది. ఆగోతులు ఏటవాలుగా ఉంటవి. అందుచేత పొంగే శిలాద్రవం ఒకవైపునే పారుతూ ఉంటుంది. అవి పేలకుండా ఉండేసమయం కనిపెట్టి, అపుడు వాటిద్వారందగ్గరికి వెళ్లి, నూతిలోవలె వాటిలోపలికి తొంగిచూచాను.

లోపల దట్టంగా చిమ్ముకొస్తూఉండే పొగకూ, దాన్నంటే ఉన్న వింతవింత రంగుల ఆవిర్లకూ క్రింద, అల్లకల్లోలంగా ఉడుకుతూ, కదులుతూ, మండుతూ ఉన్న శిలాద్రవం కనపడింది. చూస్తూ చూస్తూ ఉండగానే లోపలి ద్రవపదార్థం పొంగింది. లోనున్న అద్భుతశక్తియూలాన ఆద్రవం పొంగడం మొదలు పెట్టింది. నేను వెంటనే అక్కణ్ణుంచి పరువిడి ఆవలకు వచ్చానో లేదో, పేలడం, ద్రవం గోతినుండి వెలువడి వందలకొలది అడుగుల ఎత్తున కెగజిమ్ము కోవడం, మండుతూండే ఘనపదార్థాలు మళ్లా గోతులో పడడం ద్రవం అంతా 'చుంయి' అనే శబ్దంతో సముద్రంలోకి జారడం జరిగిపోయింది.

గోతు లెప్పు డెప్పుడు పేలుతవో తెలుసుకోవడానికీ, అక్కడి వాయువులనూ, ఘన పదార్థాలనూ సేకరించు కోవడానికీ, అక్కడి వింతవింత రంగాలను పరీక్షించడానికీ, వాటికి ఫోటోలు తీయడానికీ- ఈవిధం అయిన పరిశోధన మూడుగంటలకాలం అయింది. ఇంక నీరసించిపోతా నన్న భయం వేసింది. నన్ను పైకి లాగం డన్న గుర్తుగా నాచేతి దీపాన్ని వెలుగ చేశాను. నన్ను పైకి చేదుకోవడానికి ఎంతెంతో కష్టం అయింది. ఎంత బిగబట్టినా ఆగలేక పోయినాను. ప్రయత్నం వ్యర్థం అయింది. ప్రాణవాయువు అయిపోయింది. గంధకం ఆవిరిని పీల్చవలసి వచ్చింది. ఊపిరి తిత్తులు చెడిపోయినవి. పైకి చేదుకొని మంచిగాలిలో పడవేసేటప్పటికి రక్తస్రావం మొదలు పెట్టింది.

కొంతసేపు బాధపడి తెప్పిరిల్లాను. తర్వాత చాలా హాయిగా ఉణ్ణింది. ఇన్నికష్టాల పాలయినా, అందరూ అసాధ్యం అని తలచిన ఒక గొప్ప సాహస కార్యం చేయగలిగా నని ఎంతో సంతోషం అయింది.

(౧౯౩౬, మేనెల మాడరన్‌రివ్యూ నుండి)

---



శ్రీ సర్. సి. వి. రామనుదంపతులు

శ్రీ రామనుగారు బెంగుళూరు విజ్ఞానకళాశాలకు ప్రధానాచార్య పీఠము నధిష్ఠించిరి.

---

## పంచదార పరిశ్రమ

"మైసూరు ఎకనమిక్ జర్నలు" నందు కే. యస్. శ్రీకంఠనామకమహాశయులు ధాన్యపుధరలు చాల నీరసించి పోవుటచేత భూస్వాములు, రయితులు చాల మంది ఆయవ్యయములను సరిపెట్టుకొనలేక యిడుమల బడుచున్నారనియు, కాన సాగుబడికి లాయకు అయినపొలమున చెరుకు సాగు చేయవలెననియు, ఇండియాలో మున్ముందు పంచదారపరిశ్రమ అభివృద్ధి కాగలదనియు నొక వ్యాసము వ్రాసినారు. అందలి యీ క్రిందివాక్యములు రైతులకు ప్రోత్సాహమును గలిగించునవి. వీరిసూచనలనుపాటించి ప్రభుత్వ వ్యవసాయశాఖవారు పంచదారపరిశ్రమ పెరుగుటకు వలసిన సౌకర్యములను రైతులకు కలిగింప దగుదురు.

ఇండియాలో పొలముల మాదిగులను పరీక్షించుటయును, వర్తకమున కుపయోగించు పంటలను, వరిపంటకు మారుగా, వేరు పంటలను సూచించుటయును వ్యవసాయశాఖ వారికి కర్తవ్యము. ప్రభుత్వమువారి సంరక్షణను పురస్కరించుకొని రయితులు చెరకుపంట నధికము చేయుదురను నమ్మకము కలుగుచున్నది. ఇండియాలో చక్కెరకొరకు కోట్లకొలది ధనము విదేశములపాలగుచున్నది. ఇండియాలో తయారయిన చక్కెరనే కొనునట్లు ప్రచారము చేయ ఒక సంఘము ఏరుపడి చక్కెర పరిశ్రమకు ప్రోత్సాహమును గలిగింపవలెను. అరటి, బంగాళదుంప, టెంకాయ, ప్రత్తి, వేరుసెనగ వీని పంటయెడ కూడ వ్యవసాయశాఖవారు శ్రద్ధ వహింపవలెను.

కాబట్టి ఇతర-రైతులకును 'వరిపిచ్చ' శీఘ్రముగా తొలగ జేయవలెను.

ప్రకృతము చెరకుసాగుబడి ఎట్లును పసిగా లేదు. ఇండియాలో ౩౦,౦౦,౦౦౦ ఎకరముల విస్తీర్ణము గల పొలమున చెరకు సాగుబడి యగుచున్నది. ఈ విస్తీర్ణము ప్రపంచమంతట చెరకు సాగుచేయు విస్తీర్ణములో చక్క సగము. ఇట్లయ్యును విదేశముల పంచదారను మిక్కిలి ఎక్కువగా తెప్పించుకొను చున్నాము. ౧౯౯౫-౯౯ సంవత్సరముల మధ్యకాలములో మన దేశమున ప్రపంచమంతట తయారగు చక్కరలో రమారమి సగము తయారయ్యెను. ౧౯౧౪-౨౦ సం.ముల మధ్యకాలమున అయిదవవంతుకు తగ్గిపోయెను. చెరకు పెరగు పొలమంత యధికముగనుండియు మనము విదేశములనుండి పంచదారను తెప్పించుకొను చుండుట విషాదకర మని చెప్ప బనిలేదు. ఇండియాలో పంచదార ఒక ఎకరా విస్తీర్ణమున క్యూబాలోకంటె మూడవవంతు, జావా లోకంటె ఆరవవంతు, హోవాయిలోకంటె ఏడవవంతు తక్కువగా ఉత్పత్తి అగుచున్నది. మన దేశపుపంచదార ఇట్లు విదేశముల పోటీకి ఆగజాలక పోవు చున్నది. ఈ పోటీని నివారించుటకు చెరకుపంట అధికమగుట మాత్రము చాలదు. ఎక్కువ పంచదారను సులభముగా తయారు చేయుటకు మార్గములను కనుగొనవలెను. ప్రకృత మున్న పద్ధతుల వలన పంచదార ఎక్కువగా తయారగుట అసాధ్యము. సులభ మగు మార్గములను చెరకు సాగుచేయు రైతులకు నిరూపించిచూపు టావశ్యకము.

---

## భారతదేశమున జైళ్లు

విద్యాధికులయిన భారతీయు లనేకులు రాజకీయశిక్షలవలన బాధితు లయినారు. జైళ్లయందు వారికి లభించు నిత్యజీవన సౌకర్యములను రెండుమూరులు జైలునకు పోయిన ఒక 'వ్యక్తి' "ది థియాసఫిస్టు" అనుపత్రికలో ఇట్లు వర్ణించినాడు:

కైదీలగదులు సూర్యోదయముతో తెరువబడును. మరల సూర్యాస్తమయసమయమున నాగదులలో బంధింపబడువరకు కైదీలు జతలుజతలుగా సంచరించు చుండవలెను. ఒక కైదీలగుంపు తొలుత ఉదయ కాలకృత్యములు తీర్చుకొన బయలుదేర నను కొనుడు. అందలి కైదీలు దొడ్డిముందర జంటలుజంటలుగా వరుస దీరి కూరుచుండవలెను. అందు మొదటిజంట శౌచమునకు పోయిరాగానే ఇంకొకజంట పోవలెను. తక్కినవారు కదలక మెదలక కూర్చుండవలెను.

మొదటియిద్దరు తొలుత పలుదోముకొని వచ్చి వేరొకచో కూరుచుండవలెను. తరువాతి జంటలు అట్లే చేయవలెను. అందరికి అయినపిదప గుంపంతయు మరియొకకార్యమును చేయుటకు పోవలెను. భోజనమునకు కూడ ఇదే పద్ధతి. భోజనము కాగానే ఒక్కొకజంటయు తమ పళ్లెముల నెత్తుకొని చేతులు, పళ్లెములు కడుగుకొన పోవలెను. అందరికి అగువరకు కడుగుకొనినవా రొక్కచో వరుసగా కూరుచుండవలెను. తరువాత వా రక్కడనుండి కదలిపోవలెను. ఈపద్ధతి చాల మంచిదిగనే కాన్పించినను ఆచరణమున చాల వింతగను, అవమానకరముగను ఉండును.

జైలున, కైదీలజీవితము యంత్రమువలె నడుచు చుండును: శౌచము, స్నానము మొదలయిన ఎల్లపనులకు కొన్నికొన్ని నిమిషముల కాలము పరిమితి. ఒకింతయైన కైదీ లాపరిమితిని మించరాదు. మించినచో వార్డరుల తిట్లు, గ్రుద్దులు, తన్నులు సంప్రాప్తించును.

జైలునందలి యుద్యోగులు కైదీలను తిట్టుమాట చేర్పక పేరులతో పిలుచుట అరుదు. అది వారికి పరిపాటి. అట్లే వారికి చిన్నచిన్న విషయములకు గూడ గ్రుద్దులు, పటాకాదెబ్బలు తగులుచుండును. జైలు ఉద్యోగుల అనుమతి లేక మాట కాదు, సంజ్ఞయైనను పనికిరాదు. కైదీలను కనువెట్ట నియమింపబడిన పాత కైదీలుకూడ వారిని తిట్టుటయందు వార్డరుల కింతయు దీసిపోవరు. ఒకొకప్పుడు వారు కొట్టుటయును కలదు. జైలు అధికారులదృష్టిని కైదీలు మనుష్యులు కారు,



చైత్రము

శ్రీ యస్. కాశీనాథరావుగారి తంజాపుర చిత్రసంచయమునుండి.

మరియు భారతదేశమున మృగములకన్న నధమముగా పరిగణింపబడుదురు.

ఖైదీల కిడు భోజనము ప్రాణధారణమాత్ర మునకు జాలినది. సామాన్యముగా వంటకమునకు పనికిమాలిన సామగ్రి యొసగబడును. అది యెంత దరిద్రపు డయినను తిన నిచ్చగొననంత చెడ్డదిగా నుండును. బియ్యమున ఇసుక, రాళ్లు నిండియుండును. ఒక కబళమయిన నిసుక, రాయి లేక యుండదు. పుచ్చిన గోధుమలపిండి రొట్టెల కుపయోగింపబడును. వానిని నమలి మ్రింగుట చాల కష్టము. తోటకూర కాడలు మొదలగువానిని కట్టలుకట్టలుగా తెచ్చి, అట్లే ముక్కలుగా తరిగి వానిని కడుగకుండ నీరు, కొంచెము నూనె పోసి ఉడుకపెట్టి నీటివలె పలుచగా తయారుచేయుదురు. అందులో మురికి దుమ్ము కావలసినంతయుండును. ఇట్టిది రాజకీయశిక్షితుల కిడు తిండి. ఖైదీలు చాల శ్రమపడి కొంచెము మంచితిండి పెట్టుటకు కొన్నిచోట్ల నేరుపాటులు చేయించుకొనినను, కొన్నిచోటుల యథాపూర్వముగనే యున్నది. కొన్నియేండ్లకు పూర్వము ఖైదీలకు పెట్టుచున్నతిండికంటె నిప్పటితిండి చాలమెరుగని పేరు! జైలులోపల మనుజుని మనుజు డేమి చేయుచున్నాడో దైవమునకేయెరుక!! దీనితత్త్వ మేమన: జైలు ఉద్యోగులు, కంట్రాక్టరులు కలిసియే ఇట్టి వెట్టితిండిని ఖైదీలకు పెట్టించుచున్నారనుట. నియతకాలములయం దాహారపదార్థముల పరీక్షయు జరుగుచుండును. పరీక్షాకాలము జైలుఉద్యోగులకు బాగుగా తెలియును. కాన సూపరింటెండెంటుగారికి మామూలుపదార్థములకన్న మంచివగువానినే చూపించుచుందురు. జైళ్లయం దుత్తములగు నుద్యోగులును, వానియెడగల దృష్టి మారుట కవకాశములును సమకూడక ఈశాఖ యందు సంస్కరణమును గనుట సాధ్యము కాదు.

---

## (ప్రెసిడెంటు) రూజువెల్టు సతి

అమెరికా అధ్యక్షుడగు ఫ్రాంక్లిన్ డి లానో రూజువెల్టుగారి ధర్మపత్ని భర్తవోలె సచ్చిదానందురాలు. ఆమె ఎల్లప్పుడును నగు మోముతో అలరారుచుండును; భర్తకు సర్వవిధముల తోడ్పడుచుండును. ఆమె అత్యంతప్రతిభాశాలిని. అమెరికాదేశములో ఉన్నతాశయములు గల స్త్రీలపాలిటి కామెయే కల్పతరువు. ఉదారభావము లన్నియు ఆమెయందు మూర్తీభవించినవి. ఆమె భర్త, ఆల్బనీ గవర్నరుగ నున్నంతకాలము, ప్రతివారము రెండురోజులు ఆమె ఎక్కడ ఉన్నను సరే, న్యూయార్కున కేగి, అచట టాడ్ హంటర్ పాఠశాల పిల్లలకు దేశచరిత్రను, ఆంగ్లమును నేర్పుచుండును.




రూజువెల్టు సతి

ఆమె వాల్కిలు సామానుదుకాణమును సాగించుచున్నది. దానివలన ఆమెకు కొంత ఆదాయము లభించుచున్నది. చాలమందికి ఆమె ఈదుకాణములో జీవనోపాధిని కల్పించుచున్నది. తన దానధర్మముల నిమిత్తము ఈమె రేడియోలో ఉపన్యాసములను గావించి, ఎంతయో సొమ్మును ఇటీవల, కడచిన కొన్ని మాసములక్రిందట గడించెను. భోజనానంతరము ఉపన్యాసము లిచ్చుటలో ఈమె చాతుర్యమునకు అందరును మెచ్చుకొనుచున్నారు. అందరును ఆమెను ఆహ్వానించి ఇట్టియుపన్యాసముల నీయకోరెదరు. అపు

డపుడు భర్తకు మారుగ ఆమెయే ఉపన్యసించును. ఈమె యొక మాసపత్రికను నిర్వహించుచున్నది. ఎవరైన ఈమెసహాయము నపేక్షించిన తప్పక చేయును. ఎన్నడును అట్టి అవకాశమును వృథా పోనీయదు. అయిదు సంవత్సరములనుండి ఆమె న్యూయార్కు రాజ్యశాసనసభకు యువకులగు విద్యార్థులను గొని పోయి, ప్రజలకు వర్తించు శాసనము లెటుల చేయ బడుచున్నదియు వారికి తెలుపుచున్నది.

ఆమె ప్రతినిమిషము ఏదో ఒక పనిని చేయుచునే యుండును; రైళ్లలో పోవుచు వ్రాయుచుండును; ప్రక్కమీదకూడ చదువుచునే యుండును; ఉపన్యాసములను వినుచు అల్లుచుండును.

ఒక్కరోజుకూడ నేటివరకు ఆమె జబ్బుపడి ఎరుగదు. ఐదుగురు పిల్లలు. వారిని దృఢకాయులుగను, అందముగను పెంచెను.

రూజువెల్టుసతియాదరణ అపూర్వము. ఆమె అందరిని గౌరవించి, ప్రీతితో ఆదరించును; భర్తకు సర్వవిధముల ఉపచారము చేయుచుండును.

అమెరికాలో ప్రెసిడెంటు రూజువెల్టు తన సతి వలన బడయు సాహాయ్యమును అమెరికాలో మరి ఎవరును తమ సతులవలన పొంది ఎరుగరు. తనభర్త అమెరికాకు ప్రెసిడెంటు అగుటవలన ఆతనికి పనులు ఎక్కువగా నుండును గాన, ఆయన చూచుకొనవలసిన తపాలు, నడపవలసిన ఉత్తర ప్రత్యుత్తరములు విస్తారముగ నుండును గాన ఈపను లన్నిటియందును ఈమె తన భర్తకు కుడిభుజముగ నుండి తోడ్పడుచుండును. తాను అందరికిని ఉత్తరములను వ్రాసి, దేశముయొక్క పరిస్థితులను తననాథునకు తెలుపుచుండును. ఈ ఉద్దేశ్యముతో ప్రజలు తనకు ఉత్తరములను వ్రాయవలెననియు ఈమె కోరుచుండును. నిజముగ అమెరికా అధ్యక్షుపదవిలో రూజువెల్టుసతి భాగస్థురాలుగ నున్నది. అమెరికనుప్రభుత్వమున జోక్యము గలుగజేసికొన్న స్త్రీ ఇంతవరకు ఈమె ఒక్కర్తయె. ఈమె చాల శాంతస్వభావురాలు.

ఈమె హస్తమున పుస్తకములకట్ట లేనిదే ఎన్నడును ప్రయాణ మొనరించదు. ప్రపంచానుభవ మీమెకు మెండు. చదువు ఇష్టము లేని పిల్లలను నిర్బంధించి చదివించదు. సదా ఆమె మద్యపాననిషేధమునే బలపరుచును. పిల్లలకు ఎంత స్వాతంత్ర్యమునైనను ఇవ్వవలయు ననును. వయసు వచ్చిన పిదప వారికి బుద్ధిని గరపుటకంటె చిన్ననాటనే స్వతంత్రముగ ఆలోచించి లోకజ్ఞానమును గడించి జీవయాత్ర గడుపుటకు దారి చూపవలె ననును. అందరును స్వానుభవముచేతనే ఎల్లపనులను నేర్చుకొనవలె ననును. ఈమె, మనము చేసిన తప్పులను చేయకుండ మనపిల్లలను కనిపెట్టి చూచుట కష్టమే గాని వారిని మందలించినందువలన ప్రయోజనము లేదనును; వారి విశ్వాసమును మనము చూరగొనునటుల మనము ప్రయత్నించుట యావశ్యక మనును. తనపిల్లలను పెంచుటకును, ఆడించుటకును, పోషించుటకును రూజువెల్టుసతి ఇంట దాదులను నియమించి ఎరుగదు. చిన్నప్పటినుండియు పిల్లలు తమ ఇండ్లకు వచ్చు ప్రేక్షకులతో మాట్లాడ ప్రోత్సహించును. అమెరికాలో నున్న ధనికురాండ్రను, తీరికగల స్త్రీలును రూజువెల్టుసతి ధనార్జనమునకు గడంగుట బాగులే దనెడివారు. తనపతి ప్రభుత్వోద్యోగి అయి యుండగా ఆమె ధనార్జనమున కెల గడంగవలెనని వా రందురు. అట్టిది గౌరవభంగ మందురు. తన దానధర్మములకు అంతరాయము లేకుండుటకు ఆమె ధనము నార్జించుచుండెనట. కుటుంబాదాయమును విస్తరింపజేయుట కీమె ఈప్రకారముడబ్బును గడించుచున్నది. ప్రజ లనుకొన్నటుల రూజువెల్టు ధనికుడు గాడట. 'హూవరుతో' పోల్చి చూచితిమేని రూజువెల్టుగారు పేదయే. పిత్రార్జితము నూరువేల డాలరులు రూజువెల్టుకు వచ్చెనట. సవతి అన్నగారి ఆస్తి ఇదే మొత్తము ఆతనికి దఖలుపడెను. హైడ్ పార్కులో అందమగు జమీను రూజువెల్టు జననిది.

రూజువెల్టుసతిదుస్తులు సామాన్యస్త్రీ దుస్తులనే పోలియుండును. అధ్యక్షుని సతిని గదా యని డాబు లేదు. ఆమె కున్న నగ లన్నియు సాదా

ఉంగరము, పెండ్లినాడిచ్చిన పెండ్లి ఉంగరము, ఇం కొక బంగారు ఉంగరము మాత్రమే.

రాజువెల్లుదంపతులకు కుటుంబబంధుత్వము గలదని న్యూసుక్రానికలుపత్రికలో ఒకవిలేఖకుడువ్రాసెను.

—జరుగుమిల్లి సాంబశివరావు, బి. ఏ.

---



డా. మార్గరేటు స్పెయిగలు (జర్మనుయువతి) మహాత్ముని శిష్యురాలు

---

## జపాను కొక హెచ్చరిక

బెర్నార్డుషాగారు బొంబాయిలో భారతీయ పత్రికా విలేఖకులతో సంభాషించినట్లే, జపాను పత్రికా విలేఖకులతో సంభాషించారు. వారి సంభాషణలు హాస్యరసం పూతల్లో గాంభీర్యపు మెరుగులను చిమ్ముతూన్నవి. వాటిని 'ది జపాను వీక్లీక్రానికల్' పత్రిక ప్రకటించింది. వాటిలో కొన్నిటిని "మాడరన్‌రివ్యూ" (మే-౧౯33) ఉద్ధరించింది. అవి, ఐరిషువాళ్లు ఇంగ్లీషువాళ్లను బాధించినట్లు చైనావాళ్లు గెలుపుకొంటూ ఉన్న జపానువాళ్లను బాధిస్తే వాళ్లగతి ఏంకావాలి? అనే విషయాన్ని తెలుపుతవి.

### వాటి అనువాదం:

"మీారిదంతా ఆత్మ సంరక్షణాని కంటూ ఉన్నారు. ఆత్మసంరక్షణకోసమే పోరుతూ ఉన్నారు. జరిగిన యుద్ధాలన్నీ ఆత్మ సంరక్షణకోసమే!"

"మీారు యుద్ధప్రకటనం చేయ నంతవరకూ మీారు చేసే ప్రాణనష్టాన్నీ, హత్యలనూ, ఇతర దురంతాలనూ సాగనిస్తూ తూష్ణీంభావంతో మాట మాత్రానకున్న నానాజాతి సమితివల్ల ఏంప్రయోజనం?"

కాని నేను పరాయివాణ్ణయినా, నాకు నిజంగా దీని తత్త్వమేమిటోకూడ మీారు ఆలోచించకుండా ఉండడం చాలా ఆశ్చర్యంగా ఉంది.

నేను ఐరిషువాణ్ణి. ఐర్లండు ఒక దేశంతాలూకుచిన్న కాలేజి కూరమడిఅంత ఉంది. అక్కడ నాలుగు మిలియనుల జను లున్నారు. ఇంగ్లాండులో నలభయిమిలియనులున్నారు. అయినా ఇంగ్లాండు ఐరిషువారు తమ జాతీయతను స్థాపించుకోకుండ చేయ లేకపోయింది. ఐరిషువారిని అణచి వేయడానికి ఎన్నో దురంతాలు జర్గినవి. యథేచ్ఛగా రక్తం ప్రవహించింది. అనేకులు చెరసాలలపా లయ్యారు. పెక్కుమంది శతఘ్నుల వాత పడ్డారు. హత్య లపరిమితంగా జరిగినవి. ఐరిషు నాయకుడు మైకేలు కాలిన్సు "ధ్వంసము చేయబడిన

ఒక్కొక్క జున్నుదుకాణానికి రండేసి పెద్దబంగాళాలను తగలబెట్టి బూడిద చేస్తా" నన్నాడు. అది మీరు గమనించారా! మంచూరియాలో ౩౦ మిలియనుల చైనావా రున్నారుకదా. వాళ్లను మీరెట్లా ఊరుకో పెట్ట గలరు? పోలీసువాళ్ల సహాయంతో మీ రాపని చేయలేరు. పోలీసువా డెందుకూ పనికిరాడు. ప్రజ లనుమతిస్తేనేతప్ప పోలీసువాడు పూర్తిగా నిష్ప్రయోజకుడు. చైనావా ళ్లాపనిచేయరు. ఇంకోవంద యేండ్లయినాకూడా ఆబాధ మీరే పడవలసుంటుంది.

షాగారు తన వయస్సు డెబ్బయిఏండ్లనీ, తన బాల్యంలో ఇంగ్లాండులో గుఱ్ఱపుబండ్లు విస్తారంగా ఉండేవనీ, ఒక్కొక్కప్పుడు బండి గుఱ్ఱము రోడ్డుమీద కాలుజారి పడిపోతూ ఉండేదనీ చెప్పి ఇట్లా అన్నారు:

"అప్పుడేమయ్యేది? అందరూ దానితలపయిన కూర్చోడానికి పరుగిడి వచ్చేవారు. లేకుంటే, అది లేవ డానికి గింజుకొంటూ, ముస్టీబులో, ఏడికోలలలో తగు లుకొని పోతుంది."

"జాతీయత నణగద్రొక్కడం గుఱ్ఱంనెత్తిన కూర్చోడం వంటిది. ఇం కేపనీచేయడానికి సందుం డదు. ముప్పయిఏండ్లకాలం ఇంగ్లీషు పార్లమెంటుకు ఐరిషు వ్యవహారాన్ని చర్చించడానికి తప్ప ఇంక దేనికీ అవకాశం లేకుండా ఐరిషువారు చేశారు."

"ఇంక వందఏళ్లు గుఱ్ఱం నెత్తిన కూచుని కాలం గడపడం వస్తే మీ కేం వస్తుంది? తక్కినపని ఎవరు చేస్తారు? ఏపనీ చేయనే చేయరా? మీ పనులను జాతీయవాదులు దేశభక్తులు చేసిపెట్టరు. వ్వాళ్ల కాలం మాటలతోటే గడిచి పోతుంది."

తర్వాత షాగారు జాతీయ వాదాన్ని గూర్చి అప్రస్తుతంగా కొంచెం మాట్లాడారు.

"ఏ తెలివితక్కువవాడయినా జాతీయోపన్యాసా ల్గాయవచ్చు. ఏపిచ్చివాడయినా స్వాతంత్ర్యాన్ని గురించీ, చరిత్ర గొప్పతనాన్ని గురించీ మాట్లాడవచ్చు. జాతీయ వాదం చాల సులభమే కాని అది ఒక పెద్దతొందర. చివరకు మీకు జాతీయత లభించిందంటే, వెంటనే జాతీయవాదులనందర్నీ కాల్చి వేస్తే మే లనుకుంటారు. ఇంక వేరే ఏపనిసాగదు.

"మీ రిదంతా నిజంగా దీర్ఘదృష్టితోనే ఆలో చిస్తున్నారా? చైనాను వశపరుచుకోవడంలో జపాను కేగతి పడుతుందో, మీరు యోచించారా? తిరుగు బాట్లు, బెదరింపులు ఎడతెగకుండా జరుగుతూ ఉంటవి దాని మూలాన ఒక్కొక్క చైనావాడికి ఒక్కొక్క పోలీసువాడు లేక శాంతిని నెలకొలపడం మీకు సాధ్యం కాకపోతుంది."

---

## కొడైకెనాలు

మధురజిల్లాయందలి పళనికొండల వరుసయం దత్యున్నతమైన శిఖరముగల కొండ కొడైకెనాలు. ఈ కొండఎత్తు ౭౦౦౦ అడుగులకు మించియుండును. కొండపైన చాలచల్లగా నుండును. అరవభాషయందు కొడైకెనా లనగా: (కోడై = ఎండకాలము; కానల్ = కొండపైని అడవులు) ఎండకాలమందు చల్లదనము నిచ్చు రమణీయమగు ప్రదేశమని యర్థము. ఇక్కడ నుండి మధురకు షుమారు ౬౦ మైళ్లు దూర మున్నది. ఆకాశము నిర్మలముగ నున్నరాత్రులందు మధుర దేవా లయ గోపురములయందలి దీపము లిక్కడికి మిణుగురుల వలె కనబడునట. ఇచటనే ప్రభుత్వమువారి వాతా వరణస్థితి నిర్ణయయంత్రశాలయు, భౌతిక, భూశాస్త్రా లయములు ఉన్నవి. మీదు మిక్కిలి, యిది ఆరో గ్యాశ్రమ మగుటచే దేశములోని అన్నిభాగములనుండి యు జనులు ఆరోగ్యముకొరకిందు వచ్చి యుందురు. చెన్నపురిరాజధానిలోని ముఖ్యమగు ఆరోగ్యాశ్రమములలో నిది యొకటిగ బరిగణింపబడుచున్నది. కొండమీదను, లోయలయందును దర్శనీయములగు స్థలము లనేకములు గలవు. సమభూమి ఎక్కువగ లేనందువలన కొండ మీద సేద్యమునకు వసతిలేదు. గోధుమలు, వెల్లుల్లి, కాఫీ మొదలయినవి యిచ్చట విస్తారముగ పండు చున్నవి. ఇచ్చట పండునట్టి పండ్లు మంచివికావు. కొండక్రింద అరటితోట లనేకములు కలవు.

ప్రస్తుత మింతముఖ్యస్థానమయి యున్న కొడైకెనాలు పూర్వము విల్పట్టి మజరాలోని కుగ్రామమయి యుండినది. ౧౮౯౮-వ సంవత్సరమున కొడైకెనాలు నందు మునిసిపాలిటీ యేర్పడినది. యూరోపియనుల పిల్లలకొరకొక బడియు, క్రైస్తవుల ప్రార్థనాలయములు మూడును ఇందు గలవు.

ఇచటి శీతోష్ణస్థితి కొంచె మించుమించు ఉదకమండలమందువలెనే యుండును. కొండమీదను, ప్రక్కలను పచ్చికబయళ్లు, చిట్టడవులు అనేకములున్నవి. కొండ చరియలనుండి ఎల్లపుడును సెలయేళ్లు పాఱుచుండును.

కొండపైనున్న తోటలలో సొగసైన చెరువొకటి యున్నది. ఇచటి ఆకర్షక దృశ్యములలో ఈచెరువే ముఖ్యమైనది. చెరువుయొక్క విస్తీర్ణము షుమారు ౬౦ ఎకరము లుండును. చెరువు సర్పాకృతి గలిగియున్నది. దీని చుట్టుకొలత ౩౪ మైళ్లుండును. మధురజిల్లా కలెక్టరుగ నుండిన సర్ వియర్ లెవింజిగారు ఈచెరువున కొకప్రక్క కట్ట కట్టించిరి. ఇండ్లన్నియు ఈచెరువుచుట్టు కట్టబడి యున్నవి. చెరువుగట్టుననున్న పెద్దరస్తామీదనే సామాన్యముగ జనులు షికారు వెళ్లుచుందురు. కొండపైని రోడ్లన్నియు చక్కగ కంకరవేయబడియున్నవి. చెరువునందలి నీరెపుడును నిశ్చలముగ నుండుటచే ఆచుట్టుపట్ల చెట్లు, భవనములు ప్రతిబింబించుచుండును. ఈచెరువులో పడవపందెము లనేకపర్యాయములు జరుగుచున్నవి.

కొండదగ్గరనుండి రైలుస్టేషనునకు షుమారు ౫౦ మైళ్ల దూరమున్నది. స్టేషనునొద్దనుండియు రోడ్లున్నవి. కాని అవి మంచివికావు. ఇచట హోటేళ్లు చాలాయున్నవి. వ్యాయామసంఘములు సయిత మున్నవి. దీనినింకను అనేకవిధముల అభివృద్ధిచేయుటకు వీలున్నది. కాని కొండపైకిపోవుటకు మార్గములు సరిగలేనందున సదుపాయముల నమర్చుటకింకను ఆలస్యమగుచున్నది. కొడైకెనాలు చిత్రములు కొన్ని యీ సంచికయందు ముద్రితములయినవి.

---

## స్త్రీ పురుష స్వాతంత్ర్యము

'స్త్రీ ధర్మ' పత్రిక యిట్లు వ్రాయుచున్నది:

"మా హక్కులను మేము పొందగోరుచు "స్త్రీలు బానిసలుగ నున్నచోట పురుషు లెట్లు స్వతంత్రులుగ నుండ గలుగుదురు?" అని పలుమారులు ప్రశ్నించినాము. 'తెల్ల కాగితము' ను పరికించిన తరువాత 'పురుషులు బానిసలుగ నున్నచోట ఆచారసంప్రదాయ పాశముల వలన స్త్రీ లెట్లు విముక్తిని గాంచగలుగుదురు?' అని పై ప్రశ్నను తలక్రిందులుగ మార్చ మనస్సు పుట్టినది. టర్కీదేశపు ఆడువారిని గనుడు. వా రెంతలో పైకి వచ్చినారు? తమహక్కులను సంపాదించుకొన గలిగినారు! అంతఃపురవాసము, బహుపత్నీకత నియమముగా నుండిన యాదేశమున, స్త్రీ పురుష సమానత, స్త్రీలకు సంపూర్ణస్వాతంత్ర్యము సర్వసామాన్యముగా వ్యాప్తమయిపోయినది. మున్నొకకాలమున మిక్కిలి వెనుకకు బడియుండిన చీనాదేశపు స్త్రీలు సయితము స్వాతంత్ర్యమును గడించుకొనిరి; ఉత్తరాధికారము సంపాదించుకొనిరి; వివాహయోగ్యవయస్సును పొడవు చేయించుకొనిరి; బహుపత్నీకత శాసనముద్వారా నిషేధింపబడినది. ఏకకాలమున నిద్దరితో పెండ్లి దండనకు పాత్రమయినది. అంతఃపురవాసము ప్రాతబడిపోయినది. రక్షణ శాఖ (Police Department) యందును, సైన్యమునందును వారి కుద్యోగములుకూడ లభించుచున్నవి. జపానుదేశపు స్త్రీలుకూడ పౌరజనాధికారము లేకున్నను, యూరపుఖండమునందలి యితర స్వతంత్ర దేశములలోని స్త్రీలవలె స్వాతంత్ర్యమును పొందియున్నారు. కాబట్టి స్వాతంత్ర్యము, ఉత్తరవాదితమాత్రమే వ్యక్తి జాతిగతములగు ఉత్తమ గుణాదులను ప్రకటింప గల వనునమ్మకము కుదిరినది. కేవలము బాధ్యతకు, ప్రాతినిధ్యమునకు తావుగల భారతదేశ ప్రభుత్వము వలననే భారతదేశ స్త్రీ పురుషులయందు స్త్రీ పురుష శబ్దార్థాహ్వాత సంపూర్ణముగా నిండుకొన గలదు."

---



సారాయి దాసుడు

శ్రీ బి. కేసరిసింగు (బెంగుళూరు)గారి రచనము

---

## రేఖలు - అపరాధులు

పురుషులహస్తములందును, పాదములందును విచిత్రములగు రేఖలు కనబ:డును. అరచేతిలోని రేఖలు లావుగా నుండుటవలన చాలవరకు స్పష్టముగ నగపడును. వ్రేళ్లపై నుండు రేఖలు చాల సన్నముగ నుండును. ఈరేఖలను బట్టి జోస్యులు భవిష్యత్తును చెప్పుచున్నారు. ఈరేఖలు ప్రతి యొక్కరికిని భిన్నభిన్న ప్రకారముల నుండును. ఇందువలననే అందరిభాగ్యము ను ఒకేవిధముగ నుండదందురు.

హస్తరేఖలు వస్తువులను పట్టుకొనుటకును, పాదరేఖలు నడుచుటకును సాయపడుచున్నవని విజ్ఞానశాస్త్రమువలన తెలియుచున్నది. రేఖలే లేనియెడల వస్తువులను పట్టుకొనునపుడు అవి వదలిపోవునట! మనుష్యులు నడచునపుడు జారి పడుదురట! ఈరేఖలకు

స్పర్శవలన తెలిసికొను శక్తి యుండును. ఇందుచేతనే మనము దేనినైనను తాకి అది వేడిగా నున్నదో, చల్లగా నున్నదో, జిల్లుమనుచున్నదో గ్రహింపగలుగుచున్నాము.

మనుష్యులముఖములందును, రూపమునందును గట్టి పోలిక లుండినను, అసలే పోలిక లేకపోయినను, ఈరేఖలు ప్రతివ్యక్తియందును భిన్నభిన్న-ఆకారప్రకారములు కలిగి యుండు ననుట విదితము. ఈరేఖల నాధారము చేసికొని అపరాధులను గుర్తుపట్ట గల్గుచున్నారు. ఒక ధనాపహరణపు కేసులో నొక అపరాధపరిశోధకుడు (పత్తేదారు) ఈ రేఖల గుర్తుల సహాయముతోనే దొంగను పట్టి యిచ్చె ననుట నిజముగా జరిగిన సంగతి. అతడు రొక్కపుపెట్టెపై హస్తముద్రను చూచినాడు. చాల జాగ్రతతో నత డాముద్రకు నకలును తీసియుంచుకొని తనకు అనుమాన ముండిన ఎల్లవారి హస్తముద్రలను తీసుకొనెను. ఈ యన్నిటిని పోల్చి పరిశీలించిచూడగా రొక్కపుపెట్టెపైని గుర్తు పడిన ముద్రతో సరిపోయిన వ్రేలిముద్ర బయలుపడెను. వెంటనే పత్తేదారు డాదొంగను పట్టి అరెస్టు చేయించి శిక్షవేయించెను.

ప్రపంచ మంతటను న్యూ స్కాట్లండ్ యార్డ్ యొక్క సి. ఐ. డి. రహస్యశోధకులు అతిచతురులని పేరొంది యున్నారు. పారిపోయిన అపరాధులను, ఖయిదీలను పట్టుకొనుటకై వీరు క్రొత్త క్రొత్త ఉపాయములను పన్నుచున్నారు. మొగము పోలిక-రూపము - నించుమించు ఒకేమాదిరిగల ముగ్గురు అపరాధులను, ఈ సి. ఐ. డి. ఉద్యోగులు పట్టుకొని యుండిరి. ఈ అపరాధులలో నేయొక్కరిని గాని విడిగా చూచినవారికి వీరు వేరువేరు వ్యక్తులని తెలియుట కష్టసాధ్యము. కాని వీరి బొటనవ్రేళ్ల రేఖల గుర్తులు బొత్తుగా కలియవు. ఈ గుర్తులవలననే వీరు ముగ్వురును భిన్నులగు అపరాధులని తెలియగలిగెను.



చిత్రము ౧

ముగ్గురు అపరాధులయు, వారివ్రేళ్లముద్రలయు చిత్రములు

(వీరుముగ్గురు ఒక టేపోలిక నుందురు కాని వ్రేలిరేఖలు మాత్రము వేరువేరువిధముల నుండును. కావున వీరిని వేరువేరు మనుజులని తెలిసికొనవచ్చును.)

—:౦:—



చిత్రము ౨

అయిదుగురు అపరాధుల పదిచిత్రములు

(క్రిందిఫోటోకంటె పైఫోటో కొంచెము ముందు తీయబడినది.

ఒక్కొక అపరాధివి రెండేసి ఫోటోలు. కాని రెండు నొక్కనివేయని తెలిసికోజాలము.)

అపరాధులు పట్టుపడిన తరువాత వారి హస్తములయొక్కయు, పాదములయొక్కయు సంపూర్ణముగు గురుతులు తీసుకోబడును. ఎప్పుడైనను, ఎవడైనను ఖయిదీ కారాగారమునుండి పారిపోయినచో, ఈ రేఖల సాయముననే వానిని వెదకి గుర్తించి పట్టుకొందురు. అపరాధులు శిరోముండనము చేయించుకొని, గడ్డము పెంచుకొని, దుస్తులు బదలాయించి వేషము మార్చి వేసికొని తమ నిజరూపమును దాచిపుచ్చగలరు. కాని, హస్తరేఖలను ఏమి చేయగలరు? ఇవి మార్చివేయ లేరు కదా! రెండవచిత్రమున ఐదుగురు ఖైదీల తాలూకు పదిరూపములు ముద్రింపబడి యున్నవి. ఇవి చూడగా, పదిమంది బొమ్మలవలె నున్నవి కాని వాస్తవముగా ఒక్కొక అపరాధియొక్క చిత్రములు రెండేసి యున్నవి.

ఇపుడు పశ్చిమదేశములలో కుక్కలను దొంగిలించుట అధికముగ నున్నది. యజమానులు తమ కుక్కల ముక్కుల అచ్చును కాగితముపై తీసి యుంచుకొందురు. ఎవరైన ఈ కుక్కలను దొంగిలించికొని పోయినచో, ఈముక్కులపైని రేఖల ఆధారముతో ఆ పోయినకుక్కలను వెదకి తెచ్చుకొందురు.



చిత్రము 3

కుక్కముక్కుముద్ర.

ఏవిధముగా మనుష్యుల హస్తరేఖలు పరస్పరము పోలియుండవో, అట్లే కుక్కల ముక్కు గుర్తులును ఒకపోలిక నుండవు.

విద్యాప్రసాద శ్రీవాస్తవ, బి. యస్ సి.

(హిందీ 'మాధురీ' నుండి)

# కొడైకెనాల్ చిత్రములు



౯. సెంటు మేరీ చర్చి



శ్రీరాముని జన్మస్థానము, అయోధ్య

(వి. యస్. గోపాలదేశికాచారిగారి చిత్రము)




## శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజుగారు



విజయనగరస్థ భారతీతీర్థకులము శ్రీవారిని 'సాహిత్య సమ్రాట్' బిరుదము నొసగి సన్మానించినది.

---

# శ్రీ సూర్యదేవర భద్రయ్యగారు




గుంటూరుమండలమున చేబ్రోలు సూర్యదేవర భద్రయ్యగారి నివాసస్థలము. వీరు ౬౭౨ పౌనులు బరువుగల ౧౨ తూకపు ఇనుపగుండ్లను (రెండుపాదముల రెండు, బుజమునకు నాలుగులెక్కను రెండుబుజముల నెనిమిది, రెండుచేతులను రెండు.) మోయుచు పదుమూడుగజములు నడువగలిగిరి. ౮౯ పేట కొబ్బరి నారత్రాటిని తెంపగలిగిరి. మరికొన్ని యిట్టి యద్భుత బలప్రదర్శక కార్యములను చేసిరి. వీ రిట్టి శరీరబలమును స్వయంకృషిచేతనే సంపాదించుకొనినవారగుట విశేషము కావున ప్రశంసకు పాత్రులు. వీరివలెనే నేటి యాంధ్రయువకులు ముఖ్యముగ నస్థిపంజరములవలె కళాశాలానిష్క్రమణము కావించుచున్న యువకులు కొంతకు గొంతయైన శరీరబలమును సంపాదించుకొనుట శ్రేయము. దుర్బలశరీరులకు జీవితము దుర్భరము. వారిహపరములకు గానివా రగుదురు. మనుజునికి ఐహిక సంపదలలో మొదటిది శరీరబలము. కావున నూరుపనులనైన నుగ్గబెట్టి యనుదినము వ్యాయామము చేసి శరీరమునకు బలమును, ఆరోగ్యమును సమకూర్చుకొనుట పరమావశ్యకము.

---

# వైశాఖము

ఉభయభాషాప్రవీణ, కుమాండూరి లక్ష్మీనరసింహాచార్యులుగారు

వైశాఖ, దేవతాద్వయము నీయందుంట జంటఁ గోరుచునుంద్రు చానలెల్ల
మాధవ, నీరాక, మాధవుఁడేఁడని దలఁచుచుందురుగదా తరుణులెల్ల
రాధ, నీదినముల, రాధవాయంచు స్వరమణునిఁ బిలుతురు రమణులెల్ల
చైత్రునకంటెను జిత్రమౌ సౌఖ్యము నీవలననె కల్గు నింజూచియ
మాధవా, "ఋతూనాంకుసుమాకరోఽహ"మనుచుఁ జెప్పెను బరమాత్ముఁడచ్యుతుండు
వానిదయఁబోలు తొలకరివాన గురియు-నట్టి నినుఁబోలు మాస మీసృష్టి లేదు.

నడ బడలిక వాయ వడి నిమ్మనీటిని బానక మిడు ప్రపాపాలికలును
లేక పూవులు "రాత్రిలేదు మీ"కని ప్రియుల బెదరించుచున్న యువిదమిన్నలు
పిల్లలకూఁతల విని తమపొలఁతులవేయని భ్రమియించు కోయిలలును
సాయాహ్నముల నతి సౌఖ్యమ్ములను జనమానసంబుల కిచ్చు మారుతములు
జల్లుమనఁ బల్లవులగుండె లుల్లసిల్లుఁ..బల్లవించిన యుద్యానవల్లరులును
సతతసంతోష మిడఁగను సాగుచుండు-వేసవిని బోలు వేఱొక మాస మున్నె ?

గాకు వాగాని వా కది గాదు గాదె ? - వాకు గా వైన-చో నెట్లు వలనుబడును ?
వేసవిని లేని బిందువు వేసఁగనెదు-రూపమునయందు నన్నయరూపిత మిది.

అని యీరీతిగ నీరూ - పనిర్ణయంబుకొఱకుఁ బాటుపడుదు రీ
తెనుఁగున వైయాకరణులు-గని 'ప్రవాళ'మనుచోటకంటె గౌరవ ముంటన్.

ప్రకృతి పొదువు గీర్వాణ భాషయందు-వికృతి పొదువు చిత్రము వికృతియందు
మాసములలో విచిత్రము మాధవుఁడవు-ప్రకృతి ! వికృతి ! పరమాత్మ ! వందనంబు.

---




## నా తెలుఁగు చెల్లెలు :

కళోపాసిక,



శ్రీ కుం. తిరుమలరాజమ్మ.

ఈయమ్మ పరమానురక్తుఁడు, రసజ్ఞుఁడు నగు శ్రీమాన్ తిరుమల తాతాచార్యశర్మగారి * ఇల్లాలు; కళాలోలురగు అన్నలకుఁ † చెల్లెలు; కడుపుబండిన తల్లి. 3౭ సం. వయసు. వాసము బెంగుళూరు. నాదబ్రహ్మమున లీనమయిన వీణె శేషన్న (మైసూరు) గారి యంతేవాసిత్వము గన్న వారిలో మేల్తరపు పెన్నికగన్న వలఁతి.

పతిగట్టినతాళియుఁ, బసుపు - కుంకుమలును ఈ మానవతికి నిత్యమంగళాశాసనములు; బిడ్డలు గృహాలంకారములు; విభుఁడు నిజమనోరాజ్యాధిదేవత; సంగీత - సాహిత్యములు తోడఁబుట్టిన తోడవులు; కళోపాసనము గమ్యపదము. ఈవధూవరులు ప్రకృతి-పురుష సంబంధముఁ జాటుదురు.

గానము :

శ్రోతల యంతస్సులను అలౌకికపదవికి జవురుకొని పోవఁగలశక్తి ఈయమవీణానాదమునఁ గలదు. చేఁబట్టిన వీణను చెవులునులిమి, చైతన్యము వోసి, శ్రుతియుఁ, గతియుఁ దప్పనీకుండ మనోధర్మమువెంట, మధురవాణివెంటఁ బలికించుకౌశలము ఈయమ్మకుఁ బ్రకృతిదేవత ప్రసాదించినది.

ఈ విదుషివీణాగానమున నాజూకునగిషీపనులే గాని నౌబతుదండడు లుండవు; శ్రవణపేయమగు సంచారమేకాని సాంగతీత లుండవు; భావానురంజకవృత్తియేకాని పాండిత్యపుపేరి బయటికమ్మరి సుత్తెపెట్టు లుండవు; కమ్మనిసంగతులేకాని దొమ్మరిలాగు లుండవు; రక్తిప్రపంచమేకాని రణగుణధ్వను లుండవు; శాంతిప్రసన్నతయే కాని సన్నిపాతపు దెగనీల్గు లుండవు; తటితీపులేకాని తలయూఁపు లుండవు. చేత వీణ

---

* బెంగుళూరు 'విశ్వకర్ణాటక' పత్త్రికాసంపాదకుఁడు.

† కందాడై శామణ్ణ, బి. ఏ., యల్. యల్. బి; (వకీలు) - కందాడై కృష్ణయ్యంగారు, బి. ఏ. (దేశీయ విద్యాశాల టీచరు - బెంగుళూరు.)

యున్నంతసేపు చిత్రితప్రతిమ; సమాధిస్థితయోగిని. వినెడుకొలఁది తనివిసనదు. ప్రారంభమునుండి పరిసమాప్తివఱకు 'బాలపల్లవ గ్రాస కషాయ కంఠకల కంఠ వధూకలకాకలీధ్వను' లే.

ఈసతి గురుని మెప్పించినది; జగద్గురుని గాంధీ మహాత్ముని కొలువున, ఆత్మవిపంచీరవమున నతిలోక యోగముఁ బ్రయోగించి అగ్రతాంబూలము గొన్నది; ప్రాణప్రియుని హృదయముఁ జూఱగొన్నది; శీలమునకు ఉదాహరణ మయినది.

కవిత:

తనయింటి తెలుఁగుమీఁదికన్నఁ గన్నడమునిమీఁది వలపు మెండు. కన్నడమున నీయమ్మ రచించిన కథలు, ఖండకావ్యములు—గద్య-పద్యాత్మకములు గలవు.

కన్నతండ్రియగు వాల్మీకిచే విస్మృతమయిన ఆఁడుబిడ్డను, ఊర్మిళను, మఱుఁగుననుండిన మానవతినిఁ గటాక్షించి, కరుణించి తనకలమునీడకుఁ జేరఁదీసి, భర్తృవిరహమునఁ గుందు నామె నోదార్చినది, ఈబిడ్డలఁ గన్నతల్లి రాజమ్మ. ఈకథ రూపకముగా రచించి "తపస్వినీ" నామముం గూర్చినది; - ఆమెను జీవితేశ్వరునియక్కునఁ జేర్చినది; పెద్దల దీవనలకుఁ, బిన్నల మన్ననలకు భాజనమయినది; కవయిత్రి యనుట, కన్నకడుపు అనుట సార్థకపఱచుకొన్నది.

ఉక్త "తపస్వినీ" రూపకమునకై ఈరచయిత్రి సేకరించిన వస్తువు, కల్పించిన సన్నివేశము, చిత్రించిన పాత్రవృత్తియు, చిలికించిన రసము, కులికించిన కన్నడనుడికారము, తులకించిన వాదచాతుర్యము - సహృదయరంజకము.

సంగీత - సాహిత్యము లీయమ్మకు ఊర్పులు. క్రొత్తసంగతిస్ఫురించినవాఁడు, కోటినిష్కముల నోలలాడినవానికన్న నెక్కుడగు సంతుష్టి ఈ యమ్మకు. తనువు చిక్కుకొలఁది మనసు కళాప్రపంచమున కెక్కుచుండును. పతికిఁ జేదోడు వాదోడునై పత్రికను నిర్వహించుచున్నది.

ఈచెల్లెలికిని, ఈయమకుటుంబమునకును ఆయురారోగ్యభాగ్యములు ప్రకృతిజనని ప్రసాదించుగాత! ఈయమకళాప్రయోగముం భోగించు యోగము తెలుఁగుసీమ కబ్బుగాత!

'గుణాః పూజాస్థానమ్ గుణిషు న చ లిఙ్గమ్, న చ వయః'

—మున్నంగి...శర్మ.

---

### శ్రీమతి కళ్యాణసుందరి గారు




చెన్నపురి విశ్వవిద్యాలయపు పట్టపరీక్ష (బి. ఏ) లో, గానకళయందు విజయమునుగాంచి సర్వోత్తమ స్థానమును బడసెను.

---

శ్రీమతి ఇ. టి. చొక్కమ్మాళుగారు, బి. ఏ.




చెన్నపురమున గౌరవ న్యాయాధికారపదమున నియమింపబడిరి.

---

# బాలక్రీడలు

శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు

అయ్యా గోపించు మాయమ్మ గొట్టునటంచు దలకి బాలురమధ్య దాగిదాగి
తనుజూడ గోపిక ల్దరిమిపట్టెద రంచు నొగి సందుసందుల నొదిగియొదిగి
అల్లడుగో కృష్ణు డని యొక్కచెలి పల్క దత్తరింపుచు బరు గెత్తియెత్తి
రా రండు బాలులారా రండు రండని పలుమ రుత్సాహియై పిలిచిపిలిచి
చెలగి బృందావనాంతరసీమలందు - సంగడలను గుమిగూర్చి సంతసమున
కరము కరముల గీలించి పరమమైత్రి - మురిసి పల్కు యశోదమ్మముద్దుపట్టి.
ఈవనసీమ మాధవమహీపతికి గృహలక్ష్మివోలె శో
భావహమై సుపుష్పతరుభాసితమై చెలువొందె నీయెడ

జేవగ దాగుమూతలును జెంగనగంతులు కోతికొమ్మలుఙ
భావము లుల్లసిల్ల బహుభంగుల నాడగ రండు మెండుగన్.

నేన తల్లిని తల్లిని నే నటంచు - పట్టుపట్టుకొనుం డొరుల్ పంతమాడి
కడకు రాముని తల్లినిగా నొనర్చి - కన్నులు వసంతునకు మూయగా నమర్చి
దిక్కుదిక్కుల కొక్కరొక్కరును - తక్కుగలవారు పరువెత్తి దాగియుండ-

## దాగిలిమూతలు

తల్లి:—

బం టిదెవచ్చె దొంగలు భద్రమనుచు - తల్లిగా నున్న బాలుడు తత్క్షణంబ
పట్టుమని సైగచేయ నాబాలకుండు - నీవలావల బరువెత్తి యిందునందు
నణగి బాలురనవ్వాడి యరయుచుండ - కొమ్మపైనున్న కోకిల'కో'యటన్న
పరభృతధ్వని కలరి గోపాలు డపుడు - గూడ 'కో'యంచు గూయనా గురుతెఱింగి
దొంగగోపాలు డిల్లదె దొరకెదొరకె - పట్టు బలభద్రు డల్లదె పారిపోయె.

శ్రీదాముడు:—

కొంటెకృష్ణుడు నను ముట్టుకొనియె నిదిగొ - చిన్ని శ్రీదాముడే నీకు చిక్కిపోయె
కొంటెగోపాల కోకిలకూత కూసి - యెంత చేసితివోర కాసంతలోనఁ
పట్టెదను చూడు నిన్ను నే బల్మి నిపుడు - పట్టకుండిన నీకు నే బావగాను.

## కోతికొమ్మచ్చు

శ్రీకృష్ణుడు:—

ధాతకైనను మరి వానితాతకైన - జిక్కువాడనె నీచేత జిక్కితేని
ఔదుగద నీకు బావ నీయనుగుజెలియ - కాయిళాలలితాంగి కేమాదు నదియు
జెప్పకో చూత మావావిచెప్పితేని - చిక్కెద క్షణంబులోన నోచిన్నిబావ.

తనచేతిదండ మెంతయు నేర్పుకల్మిచే రహి నిక్కి చాలదూరమున విసరి
అదిగొని తనుబట్ట నరుగుబాలునికన్న కడు మునుమున్న వృక్షంబు నెక్కి
అకొమ్మ కీకొమ్మ కతిరయమ్మున బారి తగు ముట్టవచ్చు బాలుని గలంచి
కడువేగ ధిగివచ్చి వడి దండమును ముట్టి చాలగా పెల్లుబ్బి యీలవైచి
చప్పటులు గొట్టి గంతులు చాల వైచి - మీర లోడిరి గెల్చితి మేమటంచు
గ్రుచ్చి పలుకుచు కోతికొమ్మచ్చు లాటలాడు చున్నాడు గోపాలు డదుగొ నేడు.

---



మఱ్ఱిచెట్టు

(తైలవర్ణ ప్రకృతిచిత్రమునకు ప్రతికృతి)

—యల్. పెంట్లండు కన్య.

(చెన్నపురి లలితకళాప్రదర్శనమున లలితకళాసంఘమువారి ప్రథమ బహుమతిని పొందినది)



సాయంకాలపు వానజల్లు

(వర్ణప్రకృతిచిత్రమునకు ప్రతికృతి)

—ఎ. హెచ్. మాదీ.

# తంజావూరు చిత్రములు*

కంచి శివరామమూర్తిగారు బి. ఏ. (ఆనర్సు)

'సరసకవయః పార్శ్వయో ర్దాక్షిణాత్యాః' అని భర్తృహరి నుడివినయట్లు దాక్షిణాత్యులు పరమ రసికులు. తద్రసికత కవితారససర్వస్వాస్వాదనమున నేకాక యితర శిల్పములందును, లలితకళలందును వారికి మిక్కుటముగ కలదు. తద్గానకళాచాతురీప్రశంస చర్వితచర్వణము. నాట్యకళాకోవిదు లాదేశమున ననేకులు గలరు. నాట్యకళకు మూలగ్రంథమగు 'భరతనాట్య' మున గల నాట్యస్థానముద్రాదికముల లక్షణములకు లక్ష్యములుగ చిదంబర క్షేత్రమున నటరాజదేవాలయమునందు శిలోట్టంకితములయిన చిత్రరూపములు వీరి శిల్పచాతురికి నిదర్శనములు. వీరి చిత్రరచనా మాధుర్యనివేదనమునకు పల్లవ రాజధానియగు కాంచీనగరమునందలి కైలాసనాథాలయమున జీర్ణజీర్ణములయియున్న మధుర చిత్రకృతులు, పుదుక్కోటవద్ద 'సిత్తనవాశల్' (Sittanavasal) గుహాలలోని సుందరచిత్రములు, ఇటీవల తంజావూరునందలి బృహదీశ్వరాలయమున గనుగొనబడిన చోళుల నాటి చిత్తరువులు చాలును.

ఇట్టిస్థితిని దక్షిణదేశము చిత్రకళాశూన్యమని కొందర భిప్రాయపడుట యెంతసమంజసమో తెలియరాకున్నయది. ప్రాచీనశిల్పకళాకోవిదుల నాదరించిన పల్లవరాజుల ప్రాముఖ్యము క్షీణించినపిదప పాండ్య చోళాదిక్షితిపతుల యాదరమున శిల్పజ్ఞు లభివృద్ధి జెందుచుండిరి. ఆరవ, ఏడవ క్రైస్తవ శతాబ్దములనాటి యత్యుత్కృష్టశిల్పము కాంచీపురమునను, మహాబలిపురమునను, ఇంకను ననేకస్థలములయందును కానవచ్చును. తరువాత చోళులనాడు శిల్పము ప్రబలియుండుటచేతనే 'చోళశైలి' యని విమర్శకులు ప్రకటించుచున్న యొకచిత్రరచనావిధానము నెలకొనినది. వీరికి పిమ్మట చాళుక్యరాజ్యమున చాళుక్యశైలి మేలుకొన్నది. అంత్యమున విజయనగరసామ్రాజ్యమున కళాభివృద్ధి అధిక

* శ్రీయుతులు యస్. కాశీనాథరావుగారు భారతియందు ప్రకటనార్థము ఈ తంజావూరుచిత్రములను కొన్నిటి నొసగినారు. అవి చాంద్రమానమాసాధిదేవతలయు, తిథ్యధిదేవతలయు చిత్రములు. ఈ చిత్రములు శివాజీ మహారాజ సోదరుఁడు వెంకాజీకి మనుమ డగు తుళజేంద్రమహారాజు కాలమున చిత్రింపబడినవి. ఈ తుళజేంద్రుడు సకలకలాభిజ్ఞుడు. ఈయన క్రీ. శ. ౧౭౭౩ మొదలు ౧౭౭౬. వరకు తంజావూరును పాలించెను. తరువాత పదేండ్లకు రాజ్యమునకు వచ్చిన తత్సోదరుడు పదుమూడేండ్లు రాజ్యమునుపాలించి, రాజ్యమును కోలుపోయి మధ్యార్జునమున (తిరువడమరుదూరు) నివాస మేరుపరుచుకొనెను. అతనికి మనుమడగు ఏకోజిరాజునకు పత్నియగు శ్రీమతి భవానీబాయి అన్నకుమారు డీచిత్రముల నొసగిన కాశీనాథరావుగారు.

ఈచిత్రములయందు వర్ణలేపనము గాఢముగ నున్నది. లతాపుష్పాద్యలంకార (Decorative) చిత్రము ఇంచుక సున్నితముగ నున్నది. వ్యక్తిస్వరూపచిత్రణమునను అంగవిన్యాసమ భావప్రకటనమునను కౌశలముండదగినయంత కానరాదు. మృగపక్ష్యాదులచిత్రణము, తత్తన్మాసాను గుణప్రకృతిచిత్రణము, వాయువీజనమార్గ చిత్రణము నొకింత పేరెన్నదగియున్నవి. మాసతిథ్యధిదేవతల వర్ణనములకు సరియగు రూపకల్పనము వీని ప్రకటనమునకు గారణ మయినది. తద్వివరణ మాయాచిత్రమున మహారాష్ట్రభాషయందు గలదు. తదనువాదము ముందు సంచికయందు ప్రకటితము కాగలదు. ఈసంచికయందు చైత్రవైశాఖమాసాధిదేవతల చిత్రములు ప్రకటితములయినవి. క్రమముగ తక్కిన దేవతలచిత్రములు, తిథ్యధిదేవతల చిత్రములు భారతియందు ప్రకటితములు కాగలవు. ఈసంచయమును, ప్రకటనార్థ మొసగిన శ్రీ కాశీనాథరావుగారి కనేకవందనములు. వీనిచరిత్రమును శ్రీ రావుగారివలననే లభించినది.

—సంపాదకుడు, భారతి.

మయి విజయనగరపు శైలి జన్మించినది. విజయనగర సామంతులగు నాయకరాజుల కాలముననుు వేలూరు, జింజి, మధుర మొదలగు స్థలములయందు శిల్పకళకు ప్రోత్సాహము మెండుగ నుండెను.

ప్రత్యేకముగ తంజావూరునందు శివాజీసంతతి వారి యేలుబడిని వారి యాదరమున వృద్ధిజెందిన యొక విధమయిన చిత్రరీతి యిప్పటికిని కానవచ్చుచున్నది. ఈరీతిచిత్రములకు 'తంజావూరుచిత్రము' లని చిత్రకళాకోవిదులు పేరిడిరి. ఈరీతి చిత్రరచన, విజయనగర రాజుల పోషణము లేకపోయినపిదప నాయకులవద్ద వచ్చిచేరిన చిత్రలేఖకుల పద్ధతియో, దాని ననుసరించిన పద్ధతియో యగు నని కొందరనుచున్నారు.

ఈ చిత్రలేఖకులు తంజావూరులోను, మైసూరులోను అధికముగ జేరిరని సామాన్యమతము. దంతముతో చక్కని బల్లలు తయారుచేసి వానిపయి వర్ణసంస్కారాదులచే చిత్రరచనచేయుటయందు తంజావూరు శిల్పులు కుశలులు. ఇవి అందముగను, చాల చిన్నవిగను ఉండును. కావున వీటికి Miniatures (అల్పచిత్రములు)అనిపేరువచ్చినది. కఱ్ఱబల్లలమీద వ్రాయబడిన చిత్రము లనేకవిధములు. అవి చిన్నవియు, మిక్కిలి పెద్దవియు. మనుష్యప్రమాణ మించుమించుగ గల చిత్రములు కొన్ని గలవు. వానిలో ఉమామహేశ్వరాదిదేవల చిత్రములు మిక్కిలి సుందరములు.

చిత్రము లనేకవిధములు. సాధారణముగ పరిపూర్ణవిగ్రహము(Figure in Round)నకే చిత్రమని పేరు. పృష్ఠభాగము కానరాక పురఃపార్శ్వములుమాత్రము చూపు చిత్రము అర్ధచిత్ర మనబడును. సామాన్యముగా చిత్రము లనబడునవన్నియు చిత్రాభాసములు.

తంజావూరు చిత్రములను సాధారణముగా రెండు తెగలుగ విభజింపవచ్చును. కొన్ని పరిపూర్ణచిత్రాభాసములు. మరికొన్ని అర్ధచిత్రములవలెనే చిత్రఫలకాభోగముపయి వసనాభరణాదిస్థానములం దౌన్నత్యము నొందియుండును. కాని ముఖాదిశరీరాంగనిర్మాణములయం దీయౌన్నత్యము కానరాదు. ఇవి చిత్రాభాసములవంటివే.

ఈ చిత్రముల నిర్మాణక్రమము చాలవిచిత్రముగ నుండును. తొలుత ఫలకపయి పటము (వస్త్రము) నతికింతురు. దానిపయి తెల్లరంగును దట్టముగ పూయుదురు. వాంఛిత చిత్రమును ప్రత్యేక మొక కాగితము పయి రేఖలతో వ్రాసి యారేఖల పయి సూదితో రంధ్రములను వరుసగా పొడిచియుంతురు. దానిని తెల్లరంగును పూసిన పలుకపయి పరతురు. తరువాత సన్నని వలిపము ద్వారా మెత్తని బొగ్గుపొడిని ఆ కాగితముపై దులుపుదురు. అపు డాపొడి రేఖలపై నున్న సూచీరంధ్రములగుండా ఫలకముపై బడును. అటుపయి నాకాగితమును తీసివైచి పలకపై బొగ్గుపొడిచుక్కలవలన దృశ్యాదృశ్యముగ యేరుపడిన చిత్రరూపముపయి రేఖాలేఖన మాచరింతురు. అటుపిమ్మట వస్త్రాభరణాదిస్థానములయందు ఇటుక పొడిని పదనుచేసి మెత్తుదురు. దానిపయి నవరత్నఖచితసువర్ణ భ్రాంతిని కలిగించుటకయి చౌకరంగుల రాళ్లను, పలుచని కాకిబంగారపురేకును,బంగారపురేకును సైతము అతుకుదురు. బాగుగా ఎండినపిదప పందికొమ్ముతో దానిపయిగట్టిగా రుద్దుదురు. పిదప శరీరచ్ఛాయానుకారివర్ణములను పూసి కజ్జలరేఖలతో ప్రాంతోల్లేఖనము చేసి చిత్రరచనను ముగింతురు.

'ఈ చిత్రరచనావిధానము విజయనగర చిత్రకళాంకురము, రాజపుత్రచిత్రకళా పరవశము గు (Influence of Rajput art) మహారాష్ట్రచిత్రకళాసంభూతము' నను నిత్యాది జనిభేదఘోషములు కర్ణారుంతుదములు.

భారతదేశమునందలి చిత్రరచన సనాతనకాలమునుంచి ఒక్కశాస్త్రమునే అవలంబించినదగుటచే మార్పులు హెచ్చుగ కానరాకున్నను దేశకాలముల ననుసరించిన మార్పులు కొలదిగా గలవు. ఒక చిత్రరచనాశక్తి (Influence) మరొకచిత్రరచనావిధానమువలన ప్రబలియుండవచ్చును. తంజావూరు చిత్రములు ప్రత్యేకము దాక్షిణాత్య చిత్రకళాసంప్రదాయజన్యములే. మహారాష్ట్రవిజయనగరాది చిత్రరచనా విధానములుకూడ నక్కడక్కడ కానవచ్చుచున్నవి. ఏలయన: ఇతర చిత్రవిధానసాంకర్యతిరస్కృతియందు సర్వస్వాతం

త్త్యము సుదుర్లభము. ప్రస్తుతము తంజావూరుచిత్రములని వాడబడు బొమ్మలతెగ దాదాపు రెండుమూడువందల సంవత్సరములనుండి గలవని కొందరి యభిమతి. ఈచిత్రరచన తంజావూరురాజుల పోషణమున జరుగుచుండినది. తద్రాజ్యపతనానంతరము దానికి క్షీణదశ కలిగెను. ఉత్తరహిందూస్థానముననుండి చిత్రకారులు పలువురు శరభోజ మహారాజుకాలమున తంజావూరునకు వచ్చి వృద్ధినొంది కాలక్రమమున పదునెనిమిదికుటుంబములయి తుదకు క్షీణించిరని తెలియుచున్నది. వారు రచించిన తైలవర్ణచిత్రము లిప్పటికిని తంజావూరునను, పుదుక్కోటయందును మిక్కుటముగ గలవు.

రాజపోషణము లేకపోవుటచే నచటి చిత్రకారులకు వివిధవిధజీవనోపాయముల నారయవలసి వచ్చినది. వారు జీలుగుబెండుతో బొమ్మలను జేయుచు, అద్దములపై సౌందర్యవిహీనములయిన వివిధ దేవతాప్రతిరూపముల వ్రాయుచు జీవికను గడుపుకొనుచుండిరి. నేడు మన కట్టి అధమచిత్రములు కనుపించుటచేతను, మంచివి కానరాకపోవుటచేతను, దేశముపయిగల మత్సరభావముచేతను కొందరు తంజావూరు చిత్రములను నిందింతురు. అట్టివారు, తంజావూరునను, పుదుక్కోటయందును గల చిత్తరువులను, చెన్నపురి చిత్రకళాశాలలో హాడవేదొర (Mr. Hadaway) సేకరించియుంచిన చిత్రముల సంచయమును తిలకించి వాని సౌందర్యమును గ్రహింపవలయును. “నారాజకే జనపదే ప్రభూతనటనర్తకాః, ఉత్సవాశ్చ సమాజాశ్చ వర్ధంతే రాష్ట్రవర్ధనాః” అను వాల్మీకివచనానుసారము రాజపోషణము లేక మృతప్రాయమయిన యీ తంజావూరు చిత్రకళను కళాభిజ్ఞులగు నాగరికులు పునరుద్ధరణముచేయుదురుగాక.

ఈ భారతియందు ప్రకటింపబడిన వర్ణచిత్రములు తంజావూరుచిత్రరచన క్షీణదశకు వచ్చిన తరువాత ఎప్పుడో రచింపబడినవి గనుకనే ఉండవలసిన సౌందర్య మందు కనుపించుటలేదు. కాని యివి మాసాధిదేవతల లక్షణాదుల నిరూపించుటచే మిక్కిలి యుపయుక్తము లయినవి. ఆయామాసమున నేయేఋతువు జరుగుచుండునో, ఆయాఋతువువిశిష్టలక్షణము లెయ్యవియో, ఈ చిత్రములం దుపచిత్రములరూపమున తెలుపబడినది. వర్షాకాలమున హంసలు ఉత్తరదిక్కునకు పయనమగుట, చలికాలమున కుంపట్లు, కంబళ్లు మొదలయినవి, వేసగియందు తాళవృంతములు మొదలయినవి ఆయాకాలమును వెంటనే తెలుప గలవు. ఈ చిత్రములను చూచినంత విష్ణుధర్మోత్తరమునందలి ఋతుచిత్రణము స్ఫురణకు రాగలదు.

ఈ చిత్రములు మొత్తముపై అందముగ లేకున్నను అచ్చటచ్చట సౌందర్యాంశము లేక పోలేదు. మనుష్యరూపములకంటె పశుపక్షుల చిత్రములు చక్కగ చిత్రింపబడినవి. జ్యేష్ఠాషాఢచిత్రములలోని టర్కీకోడియు, పుష్య మాఘ ఫాల్గునచిత్రములలోని మాసపురుషవాహనపక్షులును చక్కగ నున్నవి. ఆశ్వయుజమాసపురుషుని వాహనము ఎలుగుబంటియు బాగుగనే యున్నది.

తక్కిన చిత్రములందలి స్త్రీలయందువలెగాక, వైశాఖచిత్రములోని స్త్రీయందు అప్రయత్నసిద్ధమైన యొకానొక సౌందర్య మమరినది. ఆషాఢ చిత్రమునందు వృక్షకంపనముచే సూచింపబడిన పవనము ఆ చిత్రమునకు చారుత్వమును గూర్చినది.

---



బూటియా కన్య

(వర్ణచిత్రమునుండి) —వి. డి. గోవిందరాజు.

(చెన్నపురి లలితకళాప్రదర్శనమున దీనికి భారతీయవర్ణచిత్రములలో మొదటి బహుమతి లభించినది)



తిరువనంతపురము కొండ

(వర్ణచిత్రమునుండి) —వి. డి. గోవిందరాజు.

(ఇటీవల చెన్నపురిలో జరిగిన లలితకళాప్రదర్శనమున దీనికి పాశ్చాత్యవర్ణచిత్రములందు మొదటిబహుమతి లభించినది)




## భక్త మందారము

త్రిపురాన సత్యానందరాయ విరచితము. క్రౌను సైజు ౯౦ పుటలు, వెల రు ౦-౧౨-౦

ఇది యొక నాలు గాశ్వాసముల ప్రబంధము. దత్త మనురాజ్యమున కధిపతి అర్యము డనువాడు సవర పల్లెలను జూచి మరలుచు ఒకచో అరణ్యమున విశ్రమించి యుండగా కళావతి యను నొక జవ్వని అతనిని గాంచి అతని గుణరూపములకు విభ్రమమంద తిలకించుచుండును. ఒక పాము అతనిశిరస్సుపై పడగ నెత్తి యాడుచుండును. అది అతనిని కరచునేమో యని యామెకు భయము. కాని పొడవదు. ఆమె మాత్రము మూర్ఛ పొందును. అతను మేలుకొని యామెపై నీటిని చల్లి తెలివి తెప్పించును. ఇరువురును ఒకరినొకరు తెలుసుకొని వివాహ మాడుదురు. పిమ్మట వారిరువురు పతంజలి యను మునీశ్వరుని యాశ్రమమునకు బోవుదురు. అతను వారికి ప్రేమను గూర్చియు, దాసపుత్ర మిత్ర మధుర భావయుక్తమైన భక్తిని గూర్చియు ఉపన్యసించును ప్రబంధపు పడికట్లన్నియు నిందు చేర్పబడియున్నవి. శైలి నిర్దుష్టము, లలితము.

గ. స.

---

## మైత్రేయి

క్రౌను సైజు, ౧౦౫ పుటలు.

పండిత సీతానాథతత్వభూషనుగారు ఆంగ్లములో వ్రాసిన వైదిక యుగము నాటి కథను శ్రీమతి జ్ఞానాంబగారు ఆంధ్రమునకు తర్జుమా చేసిరి. యాజ్ఞ్యవల్క్యుడు కాత్యాయనిని ఆమెకు తనపై నున్న ప్రేమకారణమున వివాహమాడుచు, మైత్రేయి వేదాంత జిజ్ఞాసతో తనపై చూపుచున్న గౌరవముకారణమున ఆమెనుకూడ వివాహమాడును. ఈ వివాహమువలన ఆ ముగ్గురిలో నెట్టి ఆధ్యాత్మిక పరిణామము కలిగెనో కథయందు చిత్రింపబడినది. గ్రంథాంతమున మరి కొన్ని వర్ణాంతర స్వయంవర వివాహములను వర్ణించి వైదికయుగమునాటి సంఘవ్యవస్థయొక్క చిత్రమును గ్రంథకర్త పూర్తి చేసినారు.

గ. స.

---

## కథాగుచ్ఛము

క్రౌను సైజు, ౨౩౦ పుటలు, వెల రు. ౧-౪-౦.

రవీంద్రనాథఠాకూరుగారు వ్రాసిన ౧౧ బంగాళీ కథల కాంధ్రానువాదము. విశ్వభారతి గ్రంథమాల మదరాసు ఏజన్సీకి అధిపతి కారుమూరు వైకుంఠరావుగారిచే ౮-౫ కుసుమముగా ప్రకటింపబడినది. ఒకటి నొకటి పోలని చిత్రవిచిత్రములగు స్త్రీపురుష సాంఘిక మానవప్రకృతు లతిరమ్యముగ చిత్రింపబడినవి. సులభ శైలి, ప్రతులు ప్రకాశకునివద్ద (౩౨౩, తిరువత్తూరు హైరోడ్డు) దొరకును.

గ. స.

---

## శ్రీరామచక్రవర్తి అనబడు కోసల సామ్రాజ్యము

క్రౌను సైజు, ౧౬౪ పుటలు, వెల రు ౦-౧౨-౦.

గ్రంథకర్త: బులుసు వెంకటసుబ్బరావుగారు, బి ఎ., బి. యల్., వకీలు, కాకినాడ.

భవభూతి ఉత్తరరామచరిత్రను, వేదము వేంకటరాయశాస్త్రిగారి యనువాదమును ఆధారము చేసుకొని యీ కథను గ్రంథకర్త వ్రాసినట్లు తెలుపుచున్నారు. కథాభాగ మదియే. శూర్పణఖ మోహమును మాయలును రావణమరణముతో తీరక యింకను పయి పయి విజృంభించుటయే సీతాపవాదము, వనవాసము, అశ్వమేధము, శంబూకవధ మొదలగు ఘటనలకు కారణమైనట్లు గ్రంథకర్త చక్కగ చిత్రించినారు. పాత్రపోషణమును, కథాపరిణామమును రమణీయముగ నున్నవి.

గ. స.

---

## మనస్స్వాతంత్ర్యము (రెండవ భాగము)

గ్రంథకర్త: వల్లూరి సూర్యనారాయణరావు గారు బి. ఏ., బి. యల్., యల్. టి.,

క్రౌను సైజు: ౧౪౬ పుటలు. వెల రు. ౦-౮-౦.

ఈగ్రంథపు ప్రథమభాగమునుగురించి వ్రాయబడిన విమర్శనల కీరెండవభాగము ప్రతివిమర్శనము. మొదటి భాగమునందు మనపురాణములు, మతములు మొదలగు వానినిగురించి వ్రాయబడినది. అందుపై బయల్వెడలిన విమర్శనను ప్రతిఘటించుటకు గ్రంథకర్తగారు మరికొంత గ్రంథశోధన గావించి మనస్స్వాతంత్ర్యావశ్యకతను గురించి ఈగ్రంథమును వ్రాసిరి. ఎపుడో, ఏసందర్భముల యందో ఏర్పడినశాస్త్రములు ఇప్పటిపరిస్థితులలో సరి పడకయుండవచ్చును. అట్టి సందర్భములలోగూడ పూర్వపుటాచారములనే పూనియుండ వలనుగాదనియు, అందువలన లాభము లేశమనియు, కాలానుగుణముగా పద్ధతుల మార్చుకొని సన్మార్గమును వదలక, స్వార్థమును వదలి, నిష్కల్మషహృదయము గలిగియుండవలయునను గ్రంథకర్తగారి యభిప్రాయము ఒప్పియున్నది.

‘ రాజు ’.

---

## తిరుమల తిరుపతి శాసననివేదిక

ఈ నివేదిక శ్రీ తిరుపతి మహంతువారి యనుమతిని సాధు సుబ్రహ్మణ్యశాస్త్రి (B. A.) గారిచే ప్రకటింపబడినది. ప్రొఫెసరు కే. ఏ. నీలకంఠ శాస్త్రి గారు దీనికి ప్రవేశిక వ్రాసినారు. ఇందలి పీఠికనుండి తిరుమల దేవస్థానములలో ౧౧౫౦ శాసనములు కనిపెట్టబడినవని తెలియుచున్నది. గ్రంథమంతయు రెండుభాగములుగా నున్నది. అందు మొదటిదానిలో తిరుపతి మున్నగు నాలయములలోని పూజోత్సవాదులనుగూర్చియు, నితర ధర్మసంస్థలనుగూర్చియు శాసనములనుండి తెలియు విశేషములు గలవు. ఉదా:— నిత్యదీపనిత్య నైవేద్యములు, బ్రహ్మోత్సవడోలోత్సవాద్యుత్సవములు, పండుగలు వీని నేయేసమయములలో, నేయేవిధముల జరపుటకేయేభక్తు లెట్టి దానములను జేసిరో యీ సందర్భమున జర్చింపబడినవి. ఆలయముల యభివృద్ధికై వాహనముల నిచ్చియు, పుష్పవాటికలను వేయించియు, తిరుమలకు మెట్లు గట్టించియు, రామానుజకూటములను, భోజనశాలలను నెలకొల్పియు, ఆలయములను బాగుచేయించియు, భక్తులు తోడ్పడిన విధములుగూడ నీ మొదటిభాగమున ప్రశంసింపబడినవి. మన దేశమునందు దేవాలయము నిరుపమమగు నొక సంస్థగ నుండినది. దాని చరిత్రమునకును దేశచరిత్రమునకును సన్నిహితమగు సంబంధము గలదు. జాతీయ జీవితమునకు మూలాధారముగ నుండి సాంఘిక, మత, నైతిక విషయములలో ధన ప్రభావమును జూపియుండిన దేవాలయము నొక సంస్థగ నెంచి, దాని పరిణామము నింతవరకు నెవ్వరును బరిశీలించ లేదు. ఈ శాసన నివేదికలోని మొదటిభాగము పరిశోధనకు మిక్కిలి తోడ్పడ గలదు. ఆంధ్రదేశమునందలి ద్రాక్షారామము, సింహాచలము, శ్రీకూర్మము మున్నగు

స్థలములందలి శాసనములను గూడ బరిశీలించి యీతీరుననే గ్రంథరూపమున బ్రకటించు టత్యవసరము.

నివేదికయందలి రెండవభాగము చరిత్రాత్మకము. ఇందు పల్లవ, చోళ, పాండ్య, యాదవరాయ, తెలుగుచోళ, తెలుగుపల్లవ, విజయనగర రాజవంశముల శాసనములపై చర్చ గలదు. ప్రకాశకులు తమ పీఠికలో "But the historical meterial furnished in these records ... prompted me to attempt an historical account of South Indian dynasties represented in them" అని వ్రాసిరి. మదరాసు శాసన పరిశోధక శాఖవారి నివేదికలనే శాస్త్రిగారు మాతృకగా బరిగ్రహించిన ట్లున్నది. కాని యింతటి చారిత్రక చర్చ శాసననివేదికలో ననవసరమని తోచుచున్నది. ఇందు మూలమున శాసనాంశము లేవియో, యితరాధారములనుండి గొనబడిన విషయము లేవియో సరిగ దెలియుట లేదు. ఉదా:— తెలుగు చోళరాజగు అల్లుత్తిను కొక్కశత్తిదేవునిని, ౪౩౦. నంబరు గల శాసన మొకటిమాత్రమే యీనివేదికలో నున్నది. దీనిపై చర్చ రెండుపుటలలో నున్నది (పు. ౧౨౪, ౧౨౫). నందలూరు, కాళహస్తి శాసనములలోని విషయములును, తిక్కన నిర్వచనోత్తర రామాయణమునందలి సంగతులు నందు చేర్కొనబడినవి. "నెం. ౪౩౦ T. T. శాసన మీరాజు ౫-వ రాజ్యసంవత్సరము నాటిది." అనునది మాత్ర మీశాసనాంశము. అదియునుగాక శాస్త్రిగారు క్రీ. శ. ౧౨౫౫ వరకు నీతిక్కరాజు రాజ్యమేలె నని వ్రాసినారు. ఇది సరియైన నిర్ణయము కాదు. క్రీ. శ. ౧౨౬౧ లో మరణించిన కాకతీయ గణపతిదేవుడు తిక్కన పుత్రు డగు మనుమసిద్ధికి సాహాయ్య మొనర్చి యతనిని నెల్లూరు రాజ్యమున బ్రతిష్ఠించెను. అట్టిచో మనుమసిద్ధిరాజ్యారంభము, దాయాదులచే దరుమబడుట, గణపతిచే దిరిగి ప్రతిష్ఠింపబడుటయు క్రీ. శ. ౧౨౫౫-౬౧ ల మధ్య జరుగవలెను.

ఈ చారిత్రికభాగమున విజయనగర రాజవంశములకు సంబంధించిన నూతనాంశము లెన్నియో తెలియనగుచున్నవి. ఇందు ముఖ్యములైనవి విజయనగరదండనాయకులయొక్కయు, వైష్ణవ మఠాచార్యులయొక్కయు చరిత్రములు. విజయనగరరాజులందరిశాసనములు నిందు గలవు. సుప్రసిద్ధ సంగీతవేత్తలు, కవులునగు తాళ్ళపాకవారియొక్క వంశచరిత్ర యిందు గలదు. ఈ వంశీయులు రచించిన వ్యాకరణ, లక్షణగ్రంథములును, శృంగారాధ్యాత్మ వైరాగ్య సంకీర్తనములును ౩౦౦౦ రాగిరేకులపై వ్రాయబడి తిరుపతిదేవస్థానములో నున్నవి.

ఈశాసననివేదిక చరిత్రజిజ్ఞాసువుల కెక్కుడుగ నుపకరింపగలదు. రెండవ భాగమునం దవసరములగు చర్చలు చేర్చుటచే గ్రంథము కొంచెము పెరిగి, తిరుపతి శాసనములలోని వాస్తవ విషయములు కొంతవరకును మరుగుపడినను, సంపాదకుల ప్రయత్న మెంతయు శ్లాఘ్యము. ఈగ్రంథములో నొకశాసనప్రతిబింబమును, తాళ్ళపాకవారి సంకీర్తనము లున్న రేకులలో రెండింటి ప్రతిబింబములును, తిరుపతిలోని తీర్థములయొక్కయు, దేవాలయములయొక్కయు ప్లానులును, ౫౬ ఫోటోలును గలవు. తిరుమల, తిరుపతి, తిరుచానూరులలోని దేవాలయములకు సంబంధించిన యీఫోటోలలో శ్రీ వేంకటేశ్వరస్వామి యాలయమందున్న విజయనగరరాజుల విగ్రహములకు సంబంధించినవి ముఖ్యమైనవి.

తాళ్ళపాకవారికృతులను ప్రకటనార్థమై సుప్రసిద్ధభాషాసేవకులగు శ్రీయుత మానవల్లి రామకృష్ణకవిగారు సిద్ధముచేయుచున్నారని యీ నివేదికలో వ్రాయబడినది. ఆప్రకటనము త్వరలో జరిగినచో, నీనివేదికలోని శాసనములు ఆంధ్రదేశచరిత్రకువలెనే, పైకృతులాంధ్రవాఙ్మయమున కమూల్యమగు నుపకారమును చేయగలవు.

మా. రా.

---

## కొందఱు నెల్లూరి గొప్పవారు

గ్రంథకర్త: వంగోలు వేంకటరంగయ్య పంతులుగారు.

క్రౌను సైజు ౧౨౮ పుటలు

యరగుడిపాటి వేంకటాచలంపంతులు, వేమగంటి బొజ్జెమ్మగారు, వెన్నెలగంటి సుబ్బరావుపంతులు, హాజీ మాలవి మహమ్మద్ రహమతుల్లాసాహెబు, ది ఆనరబిల్ రాజమంత్రప్రవీణ పల్లె చెంచల్‌రావు పంతులు సి. ఐ. ఇ. గార్ల జీవితసంగ్రహము లీగ్రంథమున గలవు. వీరందరు చాలగొప్పవారు, త్యాగశీలురు, లోకహితైషులు. వీరందరును గతశతాబ్దమున నుండినవారు. వీరి జీవితవృత్తములు దేశచరిత్రరచన కుపకరించునట్టివి. ప్రస్తుతము మనదేశమున నిట్టి గొప్పవారి జీవితముల నెరిగినవా రనేకులు లేరు. స్వరాజ్యము నపేక్షించుచుండు నీకాలమున ఈతరమునకు ముందుతరములలో నెంతయు గొప్పపనుల జేసి నిర్వహించినవారు మనదేశమున నుండిరని తెలిసి వారి జీవితముల నెరిగియుండుట వర్ధిష్ణువులగు యువజనుల కుత్సాహకరముగనుండి, వారియందు లీనమైయుండు ధీరత్వధురీణత్వముల ప్రజ్వలింపజేసి వారల మహోద్యమములకు పురికొల్పుట కాధారమై యుండగలదు. కావున గొప్పవారి జీవితచరిత్రముల వ్రాసియుంచుటావశ్యకము.

ఇట్టిపుస్తకముల పాఠశాలలయందు ప్రవేశపెట్టిన యెడల పిల్లలు మనదేశపు గొప్పవారిజీవితములను, వారి చర్యలను తెలుసుకొని వారివలెనే దేశౌన్నత్యము కొరకు పాటుపడగలరు. "ఆంధ్రభక్తు లింకను నిట్టి ధీరులచరిత్రముల గడించి యాంధ్రసేవ జేయదగుదురు."

'రాజు'

---

# గ్రంథ స్వీకారము

## కంఠమాల

కవి: జయంతి గంగన్నగారు, రాజమహేంద్రవరము. క్రౌను సైజు: ౩౫ పుటలు. వెల ౬ అ. ఎనిమిది ఖండకావ్యముల సంపుటము.

---

## మాధవాశ్రమము

ప్రథమభాగము, సాంఘికనవల. శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల, బళ్లారి—౭-వ పుష్పము. గ్రంథకర్త: గంటి సుబ్రహ్మణ్యశర్మగారు, క్రౌను సైజు, ౧౩౨ పుటలు, వెల ౭ అ.

---

## నవ్యసూక్తిముక్తావళి

రెండుభాగములు, రెండుసంపుటములుగా. 'విద్యామానవిద్వత్కవివరులచే విరచితము.' విద్యావినోదినీ గ్రంథమాల, చిత్తూరు. టెక్స్టుబుక్కు కమిటీవారు పాఠశాలలకై ఆమోదించినవి.

క్రౌను సైజు: ప్ర. భాగము ౧౮౬ పుటలు; ౧౦ అణాలు. ద్వి. భాగము: ౧౨౦ పుటలు; ౧౨ అణాలు.

---

## బందిగములున్నవే దేశభక్తులకును ?

"లార్డు బైరన్‌గారి 'ప్రిజనర్ ఆఫ్ చిలాను' నుండి అనువదింపబడినది." గ్రంథకర్త: జె. సుబ్బయ్యగారు, ప్రొద్దుటూరు, కడపజిల్లా. క్రౌను సైజు: ౨౫ పుటలు. (౨౬౭ గీతపాదములు). వెల ౮ అ.

---

## తర్కసంగ్రహము

'ఆయుర్వేదాచార్య, డాక్టరు ములుగు విశ్వేశ్వరశాస్త్రిగారిచే రచింపబడిన ఆంధ్రతాత్పర్యచరక



కోళ్ల పెంపకము

E. N. P.



రోముపట్టణము-(ప్రాతది, క్రొత్తది) E. N. P.



మధ్యాహ్నపు సముద్రము
(యస్. జి. కృష్ణస్వామయ్యరుగారి చిత్రము)



బాతుల నీరాటము (కె. గోపాల్‌గారి చిత్రము.)

మతదీపికాఖ్యాయుర్వేద మతవివరణసహితము'. ప్రకాశకులు: ఇండియన్ మెడికల్ స్టోర్సు, తెనాలి. ఫూల్ స్కేపుసైజు: ౯౬ పుటలు. వెల ౧ రు.

---

i యమున

డెమ్మీసైజు, ౨౨౦ పుటలు, వెల చందాదారులకు ౬ అ. ఇతరులకు ౧౦ అ.

గ్రంథకర్త: శ్రీ శ్రీరామచంద్ర శాస్త్రిగారు.

ii ప్రేమ

డెమ్మీసైజు, ౧౫౪ పుటలు, వెల తెలియదు. గ్రంథకర్త: శ్రీ నారాయణమూర్తిగారు.

ప్రకాశకులు:—అనువాదగ్రంథమండలి, పాలకొండ (విశాఖపట్టణము).

---

శ్రవుడు

మంగిపూడి శ్రీ రామచంద్రశాస్త్రికృతము

శ్రీ ఉమ్రా అలీషా కవిగారి 'రాధేయుడు' అను ఏకాంకరూపకముపై విమర్శనము—లలితనుండి.

విశాఖపట్టణముజిల్లా పాలకొండలోని అనువాద గ్రంథమండలి ప్రచురించినది.

---

భారత నీతులు

పద్యములు. గ్రంథకర్త్రి: శ్రీమతి వాజపేయయాజుల మహాలక్ష్మిగారు, స్నేహలతాకవితాసంఘము, కొల్లాపురము.

డెమ్మీసైజు: ౨౦ పుటలు, వెల ౪ అ.

---

భారతనీతులు

డెమ్మీసైజు, పుటలు ౨౬, వెల ౦-౪-౦

గ్రంథకర్త్రి: వాజపేయయాజుల మహాలక్ష్మి, స్నేహలతా కవితాసంఘము, కొల్లాపురము.

---

# పత్రికలు

ఆంధ్రభూమి

సచిత్ర మాసపత్రిక

సంపాదకులు, ప్రకాశకులు: ఆంధ్ర శేషగిరిరావుగారు, బి. ఏ. ఆంధ్రభూమి కార్యాలయము, వేపేరి, మదరాసు.

సంవత్సర చందా రు. 3-0-0.

---

## భాషాసంస్కరణము

ప్రపంచమున నూతనయుగము ప్రారంభమైనది. అది పరివర్తనయుగము; విశ్వకల్యాణసంధాయకయుగము.

వివిధమానవజాతులు సంస్కరణ పరాయణములై యున్నవి. సర్వత్ర సంస్కరణములు జరుగుచున్నవి. కొన్నిట సంపూర్ణ పరివర్తనము జరుగుచున్నది. అందువలన సంప్రాప్తములగు వికాసాభివృద్ధులు నిఖిలశ్రేయస్సంపాదకములు.

సంస్కరణకార్యము నేడు జరుగుచున్నది కాదు; సృష్టివెంట బుట్టినది. సృష్టియొక్క వైచిత్రపరిణామమే సంస్కరణ మూలకములగు వికాసాభివృద్ధులకు నిదర్శనము.

ప్రకృత మాంధ్రదేశమున దేశాభ్యుదయహేతువులగు సకలవిషయములను వికాసాభివృద్ధులు క్షీణించినవి. అవియెల్ల పునస్సంస్కరణాపేక్షము లయినవి. కొన్నిటికి సంపూర్ణ పరివర్తనము నావశ్యకమగుచున్నది. అనుకూలింపని దేశకాల ప్రవాహముల కెదురీదుకొనుచు కొందరు ధీమంతులు, ఉత్సాహవంతులు సంస్కరణ పరివర్తనముల యావశ్యకతను గుర్తించినారు; తత్సంచారమునకయి దారి బాగుచేయు చున్నారు. వికాస కారణమగు సంస్కరణమును వినాశకారణముగ తలంచు సంస్కరణ పరాఙ్ముఖులు కొందరు వారి దారిని పెనుబండలవలె నడ్డుదగులుచున్నారు. కతిపయవత్సరములకు పూర్వము తత్కాలదేశసౌకర్యముల నెంచి తత్కాలీనులగు ధీమంతులు కావించిన నియమములే పరమావధిగా భావించి, వాని నతిక్రమించుట మహాపాతకమని భీతిల్లుచు, ప్రపంచమంతయు వానియందే కలదని వాని యాథార్థ్యము నారయ దొరకొనక కూపస్థమండూకములవలె నుండుట వారి పనియయినది. అది కేవలము వారి దోషము వలన నయినది కాదు. విషయపరిశీలన తత్త్వనిర్ణయసమర్థమగు ధీశక్తిని ప్రసాదించు జ్ఞానము నార్జించుకొను నవకాశము వారికి లభింపకపోయినది. వారు బుద్ధికిని, శరీరమునకును ఇంచుకయేని శ్రమ నొసగజాలని-ఒల్లని-అలసభావమునకు స్థానములయి కూరుచున్నారు. తమవలన తాము పుట్టువుగనిన ప్రపంచమున కొకింతయైన ప్రయోజనము గలుగవలయునను తలంపున కీషన్మాత్రావకాశమునయిత మొసగజాలని యజ్ఞానము వారి మస్తిష్కముల నలమికొనిపోయినది. వారీవిధమున స్వపరప్రయోజనదూరు లయినారు. సంస్కరణమను పదము వారిచెవిని సోకినవెంటనే వాక్ శతఘ్నిముఖము 'ధిక్' శబ్దరూప తప్తాయఃపిండములను భయంకరధ్వానముతో వెడలగ్రక్కుచుండును. అన్ని విషయముల నీయుభయ

పక్షములవారికిని ఇట్లు ఘోరమగు పోరాటము జరుగుచున్నది. ఇట్టి విపరీతస్థితి మఱియు సిటీవల కొన్ని శతాబ్దులనుండియే సంప్రాప్తమయినది. దీనివలన దేశాభ్యుదయము స్తంభించినది. సరయముగ నేతన్నివారంపో పాయముల నరయనిచో నిక దేశ మధోగతికి రాక తప్పదు. ప్రతివిషయముయొక్క తత్త్వమును సహేతుకముగను, సోదాహరణముగను వివరించు సాహిత్య మీకార్యమున కొంతయు జాలినది. సంస్కరణాభిలాషు లట్టి సాహిత్యమును యథేష్టముగ సృష్టించి తద్ద్వారమున సంస్కరణావశ్యకతా జ్ఞానమును విపక్షులకు గలిగించి వారిని సుముఖులను గావించుకొనవలసియున్నారు.

సంస్కరణ సాహిత్య రచనమునకు భాష ప్రధానము. కావున తత్సంస్కరణము ప్రథమ కర్తవ్యము. అందును గ్రాంథిక వ్యావహారిక భేదముల రెండుచీలిక లేరుపడినవి. గ్రాంథిక భాషావాదులు 'నియమరహితమయి తలకొక తీరున తగులబడి స్వైరముగ విహరించుచున్న'దని వ్యావహారిక భాషను నిరసించుచున్నారు. 'నియమబహుళ బద్ధమయి నిర్జీవప్రాయముగ నున్న'దనియు, 'జనసామాన్యమునకు నిత్యజీవనోపయోగకరములగు విషయములను బోధించు సాహిత్యమును సృష్టించుట కుపకరింప'దనియు గ్రాంథికభాషను వ్యావహారిక భాషావాదులు తెగడుదురు. ఈవివాదము కొలదియేండ్లకాలమునుండి దేశమున ప్రబలియున్నది. ఈ యుభయవాదములయందును సత్యము కలదు. నిత్యవ్యవహారముననుండు భాష యనేకవిధముల నభివృద్ధిని చెందుచుండును. దాని నేనాడో యేరుపడిన నియమములతో బంధించియుంచుట తగనిపని. తలకొక్కతీరున పుట్టి, 'వచ్చాడు, వచ్చేడు, వచ్చీడు, వచ్చినడు, వచ్చిండు, పోయాడు పోయేడు, పోయీడు, పోయినడు, పోయిండు' మున్నగు వికృతాకృతులగు పదములతో స్వైరవిహారమును చేయుటయు తగదు. ఈ రెండుమార్గములును భాషాభివృద్ధికి భంగమును గలిగించునవియే.

ఆదిని పరస్పర భావావిష్కరణార్థ మేరుపడినధ్వనులు శబ్దముల రూపమును దాల్చినవి. తత్సముదాయమే వాఙ్మయ మనబడినది.

ఆంధ్రభాషకు తల్లియగు సంస్కృతము తొలుత కొన్ని దేశముల ప్రాకృతుల సంభాషణ రూపమున నుండినది. అదియే ప్రాకృతమనబడినది. అది యొకింత సంస్కారమును బడసి వైదికవాఙ్మయ రచనమున కుపయుక్తమయినది. అనంతర మావిర్భవించిన పురాణేతిహాసాదులు, కావ్యనాటకాదులు ఇంకను సంస్కారమునుగన్న పదములతో నిర్మితములయినవి.

ఉపర్యుక్త సంస్కరణ యుగములయందే శబ్దానుశాసనాదులుకూడ నుత్పత్తిల్లినవి. శబ్దములకు రూపాంతరములు, వానివిషయమున మతాంతర, పక్షాంతరములు నేరుపడినవి. సాహిత్యాంగములగు ఛందోలంకారాదు లవతరించినవి. ఛందములలో ననుష్టుప్ఛందము,

అలంకారములలో నుపమాలంకారము నాద్యములు. అవి యనేకములుగ పెరిగినవి. ఇతర శాస్త్రములును ఇంతలంతలయి తామరతంపరలయినవి. కాలక్రమమున వాఙ్మయ మీతీరున వికాసము గాంచినది. ఇట్లు సంస్కరణముల గాంచుటచేతనే యాభాష సంస్కృతమను పేర బరగినది.

ఆంధ్రభాషయును సంస్కరణ మూలకముగు నతిమాత్ర వికాసమును గాంచినది. నన్నయకు పూర్వము మొదలుకొని ఇంచుమించు రెండు శతాబ్దముల కాలమునకు పూర్వమువఱకు—వాఙ్మయాభివృద్ధి స్తంభించిననాటివఱకు—పుట్టిన సాహిత్యమును పరిశీలించిన యెడల సంస్కరణప్రాప్తమగు వికాస పరిణామములు విస్పష్టము కాగలవు. అసలు ప్రాకృత సంస్కృత ద్రావిడభాషలయందలి పదములనేకములు ఆంధ్రభాషానురూప సంస్కారమును జెంది ఆంధ్రమునకు పుష్టినిగలిగించినవి. తనకు పూర్వమున్న భాషను నన్నయ్య సంస్కరించి శాసించి వాగనుశాసను డనబరగినాడు. పదములకు రూపబాహుళ్యము ప్రాప్తించినది. నాటి యా నన్నయ్యమొదలుకొని మొన్నటి చిన్నయ్యవఱకు నెన్నియో వ్యాకరణములు పుట్టినవి. వానియందు మతాంతర పక్షాంతరములనేకములు బయలుదేరినవి. యతిప్రాసములయు, ఛందోవృత్తములయు సంఖ్యలు క్రమముగా పెరిగినవి. మహమ్మదీయుల సంబంధమువలన వారిభాషయందలి పదములు పెక్కులాంధ్రభాషయందు ప్రవేశించినవి. లాక్షణికుల సమ్మతిని బడసి యవి సాహిత్యమునకెక్కి ప్రామాణ్యములుగ బరిగణింపబడినవి. ఇదియంతయు నొక్కకాలమున జరిగినది కాదు; ఆయాకాలముల వాఙ్మయాభ్యుదయాకాంక్షులు, ధీమంతులు నగు పండితులు పలువురు ధైర్యముతో కావించిన సంస్కరణముల వలన కలిగినది. ఈ వికాసక్రమము దాదాపు రెండు శతాబ్దములనుండి యాగిపోయి ఇటీవల శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారి కాలమున తత్సంస్కరణప్రియత్వము కారణముగా మరల నొకింత తలయెత్తినది. కాని యదియు నల్పమాత్రముగ నిలిచిపోయినది. ప్రకృత మాంగ్లభాషాపఠన జనిత సంస్కారమువలన నాంధ్రమునకు వికాసము కలుగు నవకాశము లధికముగ కలవు. ఈయవకాశము వలన కొంతకొంతగా వాఙ్మయ సాహిత్యములయం దభివృద్ధి కనిపించుచున్నది. కాని వ్యావహారిక భాషావాదుల ప్రాపున సంప్రాప్తమయిన స్వైరవిహారము చెలరేగుచున్నది. సంస్కరణమయినను నియమములకు లోబడకయున్నచో నిలుకడ గనజాలకపోవును.

అనభిజ్ఞత, అశక్తత, ఔదాసీన్యము సంస్కరణములను సాగనీయవు. జీవద్భాషయైనను సంస్కరణవిహీనమగునేనివికసింపజాలకపోవుట యటుండ క్రమముగ నది వినాశోన్ముఖమును కాగలదు. కొన్ని భాషలు, జాతులు మొదలయినవి సంస్కరణ విహీనములయి నామమా

త్రావశేషము లయిపోవుటను ప్రపంచచరిత్ర మెరుకకు దెచ్చుచున్నది. కావున సంస్కరణ ములు పరమావశ్యకమగుట తప్పనిసరి.

పూర్వపూర్వ సంస్కర్తలవంటి సంస్కరణ ప్రియులు, సంస్కృతాంధ్రాంగ్లభాషా తత్త్వ కోవిదులు, విశాలహృదయులు నగువార లిం దుల కధికారులు. అట్టివారు తొలుదొలుత భాషాసంస్కరణమును సాగించుట కనుకూ లించు మార్గములను,సంస్కరణ విధానమును తత్స్వరూపమును వివరించుచు వ్యాసములను వ్రాసి ప్రజలకు భాషా సంస్కరణములవలన గలుగగల ప్రయోజనములను బోధపరచ వలెను. ఆవ్యాసములను దేశమున వ్యాపింప జేయ భారతి నిండిన కుతూహలముతో వేచి యున్నది. సంస్కరణాభిలాషులు భారతి కౌతూహలమును దీర్చుచు భాషావాఙ్మయాభి వృద్ధిని కావింతురుగాక!

---

## ఉచ్చారణసంజ్ఞలు

ఆంధ్రము లుచ్చారణసాధ్యములు కాని ఆంధ్రేతర భాషాపదములను సరిగా నుచ్చరించుటకయి అట్టి ప్రత్యేకోచ్చారణకు 'పొలిక ధ్వనులు గల అక్షరాలను రాసి వాటి ఉచ్చారణభేదాన్ని తెలుపడానికి ఆ అక్షరాలకిందో పైనో అడ్డగీటుకాని, నిలువుగీటుకాని... ఒక్కొక్క రొక్కొక్కమాదిరిగుర్తును వరుస తీరు లేక పెడుతున్నా' రనియు, 'అప్పటికీ ఆమాటలను తెలిసినవాళ్లు, ఇంగ్లీషువచ్చినవాళ్లు సరియైన ఉచ్చారణలతోనే ఉచ్చరిస్తున్నారు. కాని' తదితరులు సరిగా ఉచ్చరింపజాలకున్నా రనియు 'వుచ్చరించేటట్లా రాయలేకపోడం' అను 'లోటు' 'సవరించి ఉచ్చారణకు సరిపోయేటట్లానే రాయడం ఏర్పరుచుకోవచ్చు' ననియు శ్రీ. జే. కామేశ్వరరావుగారు 'అట్టి అక్షరాలపైన అడ్డుగా రెండుచుక్కలగుర్తు పెడదాం' అన్నారు. * ఈగుర్తుకూడ 'ఒక్కొక్క రొక్కొక్కమాదిరి'గా 'వరుస తీరులేక పెడుతున్న'గుర్తులసంఖ్యను అధికము చేయును గాని ఉద్దిష్టార్థలాభమున తత్పూర్వపుగుర్తుల కింతయు దీసిపోదు. ఒక భాషను చదువక, వినికిడి, అభ్యాసము నైన లేక ఆభాషయందలి పదములను సరిగా ఉచ్చరింప జాలుట కలలోనిమాట ఆంధ్రము సంస్కృతమయము. దానిని అక్షరాభ్యాసము నాటినుండియు పాఠశాలలయందును, తరువాత కళాశాలలయందును 'లెస్సగా' జదివిన బి. ఏ., యం.ఏ. పట్టములను గడించినవారు సయితము ఎందరోయందలి సంస్కృతపదములను సరిగా ఉచ్చరింప జాలకుందురు. వారు 'భాగవతము' ను 'బాహావతము, బాఘవతము, బాగవతము' అనియు, 'బ్రాహ్మణుడు' ను 'భ్రామ్మను, బ్రామ్మడు' అనియు, 'ఉచ్చారణ'ను 'ఉచ్చారణ' అనియు, 'బీభత్సము' ను 'భీభచ్చము, బీబచ్చము' అనియు, 'షడ్జమును' 'షడ్ఝము' అనియు, 'భుజము'ను 'బుఝము,బుజము'అనియు, 'అర్థము'ను 'అర్ధము' అనియు, ఇట్లే ఇంకను ఎన్నింటినో వెఱ్ఱిమొఱ్ఱిగా ఉచ్చరించుచున్నారు. ఉచ్చారణకు సరిపోవు సంజ్ఞలు - అక్షరములు - లేకయా వా రిట్లుచ్చరించుచున్నారు? వినికిడి లేదందురా? ఉగ్గుబాలతో పెట్టినఆంధ్రమంతయు సంస్కృతమయముకదా! అయిననేల సరిగా ఉచ్చరింపరు? అభ్యాసము లేక, నోటికి శ్రమనీయ నిష్టమును లేక! లెస్సగా చదివినవారినోటనే యిట్లు మాతృభాషయందలిపదములు వెలువడుచుండ, చదువురాని, లేక, తెనుగు మాత్రమే చదివినవారినోట నెట్లు విదేశభాషాపదములు వెలువడునో యూహించుట చాల సులభము. కావున నిట్టిప్రయత్నములవలన ఫలము గలుగు ననుకొనుటకు వలనుపడదు. అట్టిప్రత్యేకోచ్చారణగల విదేశభాషా పదములకు పఠనలేశసాధ్యములగు సమానపదముల నాంధ్రమున నేరుపరుచుకొనుట యుక్తము. ఇంగ్లీషు

---

*వైశాఖమాస భారతిసంచికయందలి 'ఉచ్చారణ-విభేదపుగుర్తులు' అను వ్యాసమున.

మొదలగుభాషల పదము లెన్నియో యాంధ్రమున కుదురుకొనిపోయినవి. క్రమముగా క్రొత్తవియు (ఇక ముందుగూడ) చేరి కుదురుకొనగలవు.

తరువాత వ్యాసకర్త Bank, Mail మొదలగుపదములలోని a, ai మొదలగుఅచ్చులవలనపుట్టుధ్వని'అచ్చు' కాదనియు,'హల్లు' అనియు, ఆధ్వని ఆయచ్చుకు పూర్వమున్న b, m మొదలగు హల్లులతో కూడినపుడు దానిని 'దవడలసహాయంతో'ఉచ్చరింతురుకావున దానికి-అనగా ఆయాయచ్చుతోగూడిన ఆయాహల్లులధ్వనికి—'తాలువసహాయహల్లు' లని పేరిడవచ్చుననియు ననిరి. ఆపద్ధతిమీదనే 'వర్ణసమామ్నాయము' నకు మార్పులుచేసి క్రొత్తగా తయారుచేసిరి. Bank, Mail పదములయందలి a, ai అచ్చులఉచ్చారణములే కదా ఆంధ్రలిపిని వ్రాయ సాధ్యము కాకుండునవి! అచ్చులయుచ్చారణములుహల్లులయుచ్చారణము లెట్లు కాగలవు? ఒకభాషలోని అచ్చు లింకొకభాషయందు హల్లు లగునని యేభాషాతత్త్వవేత్తయు, ఏశబ్దానుశాసకుడును పేర్కొనినట్లు కానరాదు. 'అచ్చుమీద మళ్లా అచ్చు క్కలియడం' 'అసందర్భం' అని ఏ ఐ ఓ ఔ ల ఉచ్చారణతత్త్వమును తెలిసినవా రన సాహసింపరు.

Furlong, Pharmacy మొ. పదములయందలి మొదటి వర్ణములయుచ్చారణమును దెలుపుటకు వక్రింద నొకచుక్క పెట్టవలయు నన్నారు.

వచ్చాము, నవ్వారు, కావాలా, తాటాకు, విడాకులు మొదలగు పదములలోని చ్చా-వ్వా-వా-టా-డా మొదలగు వర్ణముల నంటియున్న అచ్చును వ్యావహారికముగా నుచ్చరించునపుడగు ధ్వనిని దెలుపుటకును వానిమీద రెండుచుక్క లుంచవలయు ననిరి. అసలీపదముల యుచ్చారణమే యొకతీరున లేదు. వచ్చేము, వచ్చీము- నవ్వేరు, నవ్వీరు- కావాలె, కావాలి-తాటేకు, విడేకులు అని ఊరి కొకదినుసుగా నున్నది. ఎన్నిగుర్తులుంచినను వానియుచ్చారణ మొక్కతీరున నిలువదు. 'మామ, ఏమి, రామమ్మ'ల విషయము నింతయే.

తెలుగున అచ్చుఅక్షరములు (Types) తొమ్మిదివందలవరకున్నవి. ఈ క్రొత్తఅక్షరములు మరిరెండు మూడువందలు కాగలవు. ఇపు డున్నవానిని తగ్గించి అచ్చుకూర్పును సుకరము చేయవలసియుండ ఇంకను వానిని ఎక్కువచేయదలచుట సంస్కరణముకాదు.

సంస్కరణము లభ్యుదయహేతువులు. కాని తాము సంస్కరింపబూనిన విషయముతత్త్వమును చక్కగా దెలిసి, సంస్కరణమువలని సాధకబాధకములను లెస్సగా విచారించి, సంస్కరణ ప్రయోజనములను నిశ్చయించి సంస్కర్తలు సంస్కరణమును జేయవలసియుందురు. సంస్కరణములపట్ల కేవలము నభిలాష, ఉత్సాహము నెవ్వరికిని సంస్కరణార్హతను గలిగింపజాలవు.

---

## మాలవ్యాగారి దోషారోపణము-ప్రభుత్వఖండనము

కాంగ్రెసునాయకులు కొందరు ఏప్రియల్ మొదటితేదీన కలకత్తాయందు జాతీయసభను జరపిరి. ఈ మహాసభ సమావేశమయినపుడు బెంగాలుపోలీసువారు ప్రతినిధులను నిర్దాక్షిణ్యముగా కొట్టిరని మాళవ్యాగారు బెంగాలు పోలీసువారిమీద ఆరోపణ గావించిరి; ప్రభుత్వమువారిని ఈ విషయమై విచారణ సల్పవలసినదిగా కోరిరి.

ఇండియాప్రభుత్వమువారి కోరికపై బెంగాలు ప్రభుత్వమువారు ఈ విషయమై ఒకనివేదికను ప్రచురించిరి. ఈ నివేదిక మాలవ్యాగారి ఆరోపణలు వట్టి అబద్ధములపుట్టయని తెల్పుచున్నది. కాని నివేదికయందలి వాదములు అసందర్భములనియు, సత్యదూరములనియు తెల్పుటకు నివేదికయందలి కొద్దిభాగమును ఇచ్చట పొందుపరచిన చాలును.

“ఏప్రియల్ మొదటి తారీఖున కాంగ్రెసు మహాసభను జరుప ప్రయత్నించినపుడు పలువురు ప్రతినిధులు పోలీసు సార్జెంటులచే మర్దింపబడిరని ఆరోపింపబడినది. తీర్మానములను ప్రతిపా

దించుటకు వేదకపై నిలిచిన ప్రతినిధులను సార్జెంటులు తమ శక్తికొలది లాఠీలతో కొట్టి అంతటితో తృప్తినొందక తన్నులుకూడ తన్నిరనియు కూడ ఆరోపణలయందు కలదు. ఇది సత్యముకాదు. కారణము: కాంగ్రెసుసభ పెద్దబయలునందు జరిగినది. కలకత్తాయందు ఎప్పుడును జనసమ్మర్దముగల రోడ్లకూడలియొద్ద ఈ బయలు కలదు. పోలీసుచేయుపనులన్నియు జనులకు బాగుగా అగపడును. ఆసమయమున పత్రికాప్రతినిధులందరు వచ్చిరి. అతివాద పత్రికలుకూడ తమ ప్రతినిధులను పంపినవి. ఈ పత్రికలయందు ఒకదానియందుకూడ లాఠీచార్జి జరిగినట్లు లేదు. రెండవతారీఖు లిబర్టిపత్రికమాత్రము లాఠీచార్జి వలన ౧౨ గురు గాయపడి మెడికల్ కాలేజీ ఆసుపత్రి నుండి విడుదలచేయబడి రని వ్రాసినది. ఈ ఆరోపణలు చాల దినములు జరిగినపిమ్మట కలకత్తాయందుగాక కాశీయం దున్నవారిచేతను, సభ యందున్నవారిచేతను మిగిలినవారిచేతను చేయబడినవి."

పైని పేర్కొనిన కారణములవలన మాలవ్యాగారి ఆరోపణలు అబద్ధములని నివేదిక నిరూపింప సమకట్టినది. ప్రస్తుతము భారతీయులు చట్టములతో బిగింపబడిరి. వా రెటు కదలుటకు వీలు లేదు. పత్రికలకు కూడ వాగ్బంధము కలిగినది. ప్రభుత్వమునకు అమర్యాదను తెచ్చువార్తలు ఏవియు ప్రచురించుటకు వీలు లేదు. అట్టివార్తలు ప్రచురించిన పత్రికలు మరునాటికి ధరావతు కట్టవలసినదే. అట్లుచేయని యెడల పత్రిక ప్రచురణమును విరమింపక తప్పదు. ఇందువలన నే "అతివాద పత్రికలు" కాంగ్రెసు విషయకమైన వార్తలను మాత్రము ప్రచురింప సాహసింపలేదు.

నేరములమోపినవారిసంగతి: ఈమహాసభకు పండితమాలవ్యాగారిని అధ్యక్షునిగా ఎన్నుకొనిరి. వారిని కలకత్తాకు రానీయకపోవుట వల్ల, పోలీసు "అత్యాచారములు" కన్నులార వీక్షించు భాగ్యము కలుగలేదు. కాని వారికి చెప్పినవారు దెబ్బలతినినవారే. వారికి తగిలినగాయములు ఆయనకు కనబడకుండునా? సర్ సామ్యూలుహోరుగారు పార్లమెంటునందు ఈ ఆరోపణలు అబద్ధములని నుడివిరి. ఆయన స్వయముగ చూచినాడా? ఇండియాప్రభుత్వమువారు పంపిన సమాచారము మీదనే గదా ఆయన ఆధారపడినది? అదియునుగాక లిబర్టి పత్రిక పండ్రెండుగురికి గాయములు తగిలిన వని వ్రాసినవిషయము వీరే ఒప్పుకొనుచుండిరిగదా? తమ అతిథి జగ్గరాజుగారి గాయములు చూచినపుడు మాలవ్యాగారికి మనస్సు కరగినదట. కాబట్టి ఆరోపణలు చేయుటకు మాలవ్యాగారు అచ్చటనుండ నవసరము లేదు. దెబ్బలుతినుటకూడా అవసరము లేదు.

---

## షిమోగా హిందూ మహమ్మదీయుల కొట్లాట

బెంగుళూరు మే ౯.

"షిమోగాయందు ఆదివారమురాత్రి మతవైషమ్యములకు సంబంధించినకొట్లాట జరిగెను. కొందరు దుండగీండ్రు లాఠీలు, ఎలెక్ట్రిక్కుదీపాలు, పెట్రోలు తెచ్చి హిందువుల యిండ్లను తగులబెట్టిరి. మొహరం ఉత్సవమున హిందువులు అశ్రద్ధవహించి తగినంత సహాయము చేయలే దను అనుమానముపై యింత పుట్టినని తెలియుచున్నది.

కొట్లాటను పోలీసువారు వచ్చి ఆపిరి. మహమ్మదీయులందు ఒకడు చనిపోయి ఇద్దరు గాయపడిరి. ఒక పోలీసువాడు 5 గురు హిందువులు ఆసుపత్రికి గొంపోబడిరి. సుమారు లక్షరూపాయలు నష్టము. చాల మంది అరెస్టుచేయబడిరి." (అ. ప్రె.)

హిందువులకు మహమ్మదీయులకు అనాదినుండియు స్నేహభావము తక్కువ. హిందూదేశమును పరిపాలించిన మహమ్మదీయ చక్రవర్తులు అనేకులు హిందూమతమును సంపూర్ణముగనే నిర్మూలింప కంకణము కట్టుకొని యుండిరి. ఈ ఉభయమతములకు గల పరస్పరవైషమ్యమే ఉభయమతములవారికిని తరచు గలిగెడు సంఘర్షణములకు కారణము. అందువలననే హిందువులుమహమ్మదీయులపండుగలందుగాని, మహమ్మదీయులు హిందువులపండుగలందుగాని సహజముగా పాల్గొనరు. ఈ కొట్లాటవలన మహమ్మదీయుల మన స్సంస్కారముయొక్క పరిమితి వెల్లడియగుచున్నది.

# కీ. శే. దొంతముసెట్టి నాగేశ్వరరావు

పాపము! దొంతముసెట్టి నాగేశ్వరరావును ఉన్నటులుండి మొన్న మృత్యువు తనవాత బెట్టుకొనినది. జీవకోటికి మరణము తప్పనిదే యయ్యును, నాగేశ్వరరా వల్పాయుషుడగుట, నాతనియకాలమరణము చాల విచారమును గలిగించుచున్నది. ఇతడు చాల ఉత్సాహము, కార్యదీక్ష గలవాడు; చిన్ననాటినుండి స్వయంసాహాయ్యమువలననే అభివృద్ధికి వచ్చినవాడు. కృష్ణామండలమునందలి గ్రామమున పుట్టి, చెన్నపట్టణమును చేరుకొని స్థిరనివాస మచటనే సమకూర్చుకోగలిగినాడు. ఔషధవ్యాపారమును సాగించినాడు. వ్యాపారవిషయములయందు నీతనికి నేరుపు గలదు. తన పోషణము వలననే ప్రయోజకతను బడయుచున్న తమ్ములతో గలిసి సాటివారిలో పేరు ప్రతిష్ఠల సంపాదింప ఉవ్విళ్లూరుచుండినవాడు అసలు తానే లేకపోయినాడు. అతని ఆశలన్నియు గాలిమేడ లయిపోయినవి.

వయస్సు ముప్పదిని దాటియుండును. ముగ్గురు పసికూనలు. ఆలు ముద్దరాలు. వయసుచెల్లిన తలిదండ్రులకు తానే మొదటిసంతానము. అతనినే నమ్మియుండిన ఇంత కుటుంబము సంతాపము మితిలేనిది.



నాగేశ్వరరావు కొన్నాళ్లు స్వజాతి-అభివృద్ధి కొరకు 'దేవాంగజ్యోతి' అను పత్రికను నడిపినాడు. తొలుత నితనికి 'ఆంధ్రపత్రిక'లో ప్రవేశము కలిగినది. తరువాత 'భారతి' ప్రారంభముతో తత్సంపాదకశాఖకు జేరి ఆరేడేండ్లు 'భారతి' సేవ చేసినాడు. గ్రంథప్రకటనమును కావించినాడు. ఇటీవల, నామమాత్రావశిష్టమయిపోయిన ఆంధ్రప్రకాశికను మరల ప్రకటింపబూని, వ్యర్థవ్యయమునకు పాలయినాడు.

ఇతడు స్వాభిమాని. తదనురూపప్రవర్తనమే యాతనిది. పలువురు ప్రముఖులతో పరిచయమును సంపాదించుకొనినాడు. స్వాభివృద్ధిమార్గముల నిరంతరము నాలోచించుచు భావిసుఖమయ జీవితస్వప్నముల గనుచుండినాడు. ఈతని ప్రయత్నము లవశ్యఫలపములు కావలసినవి.

పరిమితమగు నితని సాహిత్యపరిశ్రమ మపరిమిత ప్రయోజనము నాకాంక్షించుచుండినది. ఇట్లు అభ్యుదయకరము లగు లక్షణము లన్నియు నీతనియం దమరియుండినవి. ఎన్నియున్న నేమి? ఆయువు అంతరించినది. దానితోపాటు అన్నియు నంతరించినవి. ఇక మిగిలినది అశ్రుతర్పణము.



# ధర్మసంస్కారము

గాంధిమహాత్ముని యుపవాసదీక్ష ప్రపంచమునం దంతటను తాత్కాలికముగ నైనను ధర్మసంచలనమును, ధర్మనిరీక్షణమును, ధర్మసంస్కారమును గలుగ జేయుటకు వినియోగపడుచున్నది. ఆచారావృతమైన ప్రపంచమునందు ధర్మసంస్కార మనవరతము ధర్మసంచలనమును, ధర్మవికాసమును గలుగజేయుచున్నది. ప్రపంచప్రవృత్తియందు పశుప్రవృత్తి మానవప్రవృత్తిగను, మానవప్రవృత్తి దైవప్రవృత్తిగను పరిణమించుటకుగలిగిన సంస్కారపరంపరల సంరంభము పరమవిషాదమును గలుగజేయును. కుటుంబాభిమానము, కులాభిమానము, దేశాభిమానము, జాత్యభిమానము, ధనాభిమానము, విద్యాభిమానము, మతాభిమానము మున్నగు అభిమానదేవతలు యథేచ్ఛగను విహరించుచు గలుగజేసినట్టియు, గలుగజేయుచున్నట్టియు ఘోరసమరములు, పురుషార్థసిద్ధికి సాధనములైన పవిత్రచరిత్రములుగను పరిగణింపబడుచు ధర్మస్వరూపమును, స్వభావమును సంకుచితము లైనవి. ప్రపంచేతిహాసములందు మమకారాహంకారపూరితములైన సామ్రాజ్యములు, మతములు, వృత్తులు, సారస్వతములు, కళలు, వ్యాపారములు, సంపదలు, ధర్మశాస్త్రములు, వేదములు ధర్మసంస్కారమునకు సాధనములు గాక ప్రతిబంధకము లైనవి. సంహారదక్షు లైన మహారథులు, కుబేరులు, శాస్త్రజ్ఞులు, ప్రవక్తలు జాతీయదేవతలై పూజాపాత్రులుగ నున్నారు. ప్రపంచసంస్కారము ధర్మపరమైన సుఖప్రాప్తికిని దుఃఖనివృత్తికిని వినియోగపడక యధర్మపరమైన సుఖనివృత్తికిని, దుఃఖాభివృద్ధికిని వినియోగపడుచున్నది.

ప్రపంచప్రవృత్తియందు శ్రీరామ రావణులు, శ్రీకృష్ణ కంసులు, విజయకర్ణులు, ధర్మజ దుర్యోధనులు, గౌతమబుద్ధ చార్వాకులు, హరిశ్చంద్ర చాణక్యులు, సుదామనందనాదులు ధర్మాధర్మ సంస్కారరూపమునను గలుగజేసిన ధర్మసంస్కారపరివర్తనము నేటికిని దురారాధ్యముగ నున్నది. శ్రీకృష్ణుడు విజ

యున కుపదేశించిన భగవద్గీతార్థమె ప్రపంచప్రవృత్తియం దనుక్షణమును గోచరం బగుచున్నది. ఆత్మజ్ఞులైన భాగవతభక్తులు ధర్మసంస్కారపరమైన విశ్వగీతామృతము ననుభవింపగలిగినను సామాన్యులకు దురారాధ్యమై దుస్తరముగ నున్నది. ప్రపంచప్రవృత్తియందు విషాదపరిస్థితులందు ధర్మాత్ములైన మహాత్ములాత్మసాక్షాత్కారమును జేయుచు ధర్మసంస్కారము నుద్ధరించుచుందురు. ప్రపంచసంస్కారమునందు ధర్మావతారఘట్టము లనవరతమును సంభవించెడి విధమును ప్రపంచేతిహాసము లనంతముఖములను బోధించుచున్నవి. జీవయాత్రయందు జీవజాలములకు ధర్మనిర్వహణము పురుషార్థమునకు సాధనముగనున్న విధమును పురాణేతిహాసములు, ధర్మశాస్త్రములు, వేదవేదాంతములు బోధించుచున్నను ధర్మపరిజ్ఞానము దుర్లభమై ధర్మారాధనము దురారాధ్యముగ నున్నది.

"కర్మజన్యోఽభ్యుదయ నిశ్శ్రేయసహేతు రపూర్వాఖ్య ఆత్మగుణో ధర్మః"

అని గౌతములు ధర్మనిర్వచనము చేసిరి. ఈ పరమార్థమునె గీతాశాస్త్రము సర్వత్ర బోధించుచున్నది.

శ్లో. "యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్."

ధర్మసంస్థాపనమున కాత్మసాక్షాత్కారము సాధనభూతమైనవిధమును ధర్మసంస్థాపకులైన మహాత్ముల పవిత్రచరిత్రము లనంతముఖములను బోధించుచున్నవి. గాంధిమహాత్ముని నిరశనవ్రతమును వర్తమానసమయమునందు విషాదావస్థయందు మునిగియున్న ప్రపంచమున కాత్మ ధర్మోద్ధరణావశ్యకతను బోధించుచున్నది.

* * * *

## ధర్మాధర్మ సంరంభము

ప్రపంచప్రవృత్తియం దనవరతము ధర్మాధర్మములకు సంరంభము గలుగుచు ధర్మాభ్యుదయము గలుగుచున్నది. ప్రపంచాభ్యుదయపరంపరలకు మూలమైన ధర్మాభ్యుదయము బాహ్యసాధనముల మూలమునను గాక నాత్మసాధనమూలముననె సాధ్యముగాగలవిధమును ప్రపంచేతిహాసములం దాత్మధర్మఘట్టములైన మహాత్ముల పవిత్రచరిత్రములు వేయినోళ్లను చాటుచున్నవి. ప్రపంచవ్యాప్తములైన వివిధమతములును మతస్థాపకుల ధర్మచరిత్రములును ఆత్మధర్మప్రతిష్ఠాపనమునకు నిదర్శనములు. ఆదికాలమునందు ధర్మాధర్మసంరంభమునందు శ్రీరాములు రావణాదిరాక్షస సంహారమును జేసి ధర్మసంస్థాపనమును జేసిన ఆత్మధర్మేతిహాసము ధర్మసంస్కారేతిహాసమునందు మనోహరాధ్యాయము. ఆత్మధర్మారాధనమునకు విషయాధారములైన కాంచనకనకముల విజయము మూలస్కంధము. పశుబలమును ధర్మబలము సులభముగను జయించుచున్నది. దశకంఠుని పశుబలమును నరుడైనను శ్రీరాముని ధర్మబలము జయించినది. రామాయణేతిహాసము సంసారప్రవృత్తియందు దేహాత్ముల ధర్మసంరంభమును రామరావణ సమరరూపమునను,

సీతా రాముల శృంగారప్రేమరూపమునను, దశరథపుత్రుల సోదరానురాగరూపమునను, హనుమంతుని నిశ్చలభక్తిరూపమునను, వీర శృంగార భక్తిరసానందపూర్వకముగను సువ్యక్తముచేయుచున్నది. ప్రాకృతిపురుషుడైన శ్రీరామున కాత్మధర్మారాధనమునకు పరాక్రమము, రాజ్యము, గృహస్థాశ్రమము, సైన్యములు, సంగ్రామమమున్న గుప్రకృతివిలాసము లవసరములైనవి. అధ్యాత్మరామాయణము సకలమానవులకుసాధ్యమగుటకు ధర్మసంస్కారాభ్యుదయ మవసరమైనది. పశుబలము మనోబలముగను, మనోబలము బుద్ధిబలముగను, బుద్ధిబల మాత్మబలముగను, పరివర్తనమును బొందుటకు ధర్మసంస్కారము పరివర్తనమును బొందిన విధమును మహానుభావుల ధర్మ జీవయాత్రలు విశదముచేయుచున్నవి. సకలధర్మములును పూర్ణమైన ఆత్మధర్మమునం దంతర్గతములైయున్నను ధర్మపరంపర లన్యోన్యాశ్రయములై ధర్మసంస్కారము వికసించుచున్నది.

*        *        *        *

## దేహ మనోబలములు

పశుబలమును మనోబలము జయించగల విధమును నిత్యవ్యవహారములు బాలురకును విశదముచేయుచున్నవి. మత్తమాతంగమును మావటివాడు వశపరచుకొనినటులు మనస్సు కర్మేంద్రియ జ్ఞానేంద్రియముల నిగ్రహించి వశపరచుకొను చున్నది. సంసారప్రవృత్తియందు దేహేంద్రియవికాసమువలెను మనోవికాసమును ధర్మసంస్కారమునకు మూలముగ నున్నది. సకలకర్మలకును ప్రయోజనము జ్ఞానము. జ్ఞానమునకు ప్రయోజనము ధర్మసంస్కారము. భాగవతపురాణము శ్రీకృష్ణావతారరూపమున నీ పరమార్థమును హృద్యముగను విశదముచేయుచున్నది. శ్రీకృష్ణావతారము ప్రవృత్తియందు సకల సందర్భములందును ఆత్మయజ్ఞమును చేయగలవిధమును విశదము చేయుచున్నది. వీర భయ శృంగారాది రసానందానుభవ భేదము దశాభేదముగాని రసభేదము గాదు. ఉద్యోగపర్వమునకు ధర్మము హృదయము. ధర్మస్వరూపుడైన శ్రీకృష్ణపరమాత్ముని రాయబారము లేని యుద్యోగపర్వము మృతకళేబరము.

ఉ. సారపు ధర్మముఁ విమల
      సత్యముఁ బాపముచేత బొంకుచేఁ
   బారముఁ బొందలేక చెడఁ
      బాటిన దైనయవస్థ దక్షు లె
   వ్వార లుపేక్ష సేసి రది
      వారలచే టగుఁ గాని ధర్మని
   స్తారక మయ్యు సత్యశుభ
      దాయక మయ్యును దైవ ముండెడున్.

భారతసంగ్రామము రాజస తామస సంగ్రామముగాని ఆత్మసంగ్రామము గాదు. ధర్మసంస్కారము, ధర్మవిజయము సమకూర్చి స్వర్గారోహణమును జేయగలవిధమును స్వర్గారోహణపర్వము విశదము చేయుచున్నది. మానసిక ధర్మారాధనము భౌతికవిజయమును సమకూర్చినను, ఆత్మవిజయమున కపారమైన

ధర్మసంస్కార మవసరమైనవిధమును ఘోర మైన ప్రపంచేతిహాసములు విశదము చేయు చున్నవి. భారతయుద్ధము గడిచి అయిదు వేలేండ్లయినను ప్రపంచప్రవృత్తియందు జీవ యాత్రయం దాత్మోపలబ్ధికి ఆత్మధర్మ సంస్కా రము దుర్లభముగ నున్నది. భారత యుద్ధా నంతరము తాత్కాలికముగను బుద్ధియోగ సాధ్యమైన శాంతిపర్వము సాధ్యమైనను ఆత్మ యోగసాధ్యమైన శాంతిపర్వము సాధ్యము గాకున్నది.

* * * *

బుద్ధిధర్మసంస్కారము

పశుబలమువలెను మనోబలమును ధర్మ సంస్కారమునకును, శాంతిపర్వ స్థాపనమున కును నిరుపయోగముగ నున్నది. బుద్ధదేవుడు బుద్ధిధర్మయోగాధారమునను ధర్మసంస్కార మునుజేయుటకు బూనికొనిన ధర్మారాధనము ప్రపంచమునందు మహాధర్మపరివర్తనమును గలుగజేసినది. బాహ్య కర్మారాధన లక్ష్య మాత్మధర్మారాధన లక్ష్యముగను బరిణమించి నది. ఆత్మధర్మారాధనము బుద్ధియోగము నందు లక్ష్యమును బొందినది. కర్మయోగము నకును, ధర్మయోగమునకును బుద్ధియోగము నందు సమన్వయము గలిగినది. బుద్ధియోగా తీతమైన ఆత్మ ధర్మసంస్కారమును స్థాపించు టకు ధర్మపరిపక్వము గావలసియున్నది.

తన్నుఁ దాను బాలించుకొనవలెను. ఇతరులు తనకుఁ బ్రభువులు గారు. అహంకారము నడఁచు
కొని జీవితముఁ గడపువానినిఁ బ్రభువులే వచ్చి ప్రార్థించెదరు. (ధమ్మపదము)

సుజ్ఞాతమైన బుద్ధియోగమునకును, అజ్ఞా తమైన ఆత్మ ధర్మయోగమునకును జనసామా న్యమునందు ధర్మయోగసమన్వయము దుర్లభ మైనది. వైదికకర్మయోగము, ప్రాపంచిక కర్మ ధర్మయోగములు, బౌద్ధబుద్ధియోగము ప్రజా సామాన్యమునందు దురారాధ్యములైనపుడు విషాదయోగము సంప్రాప్తమైనది. జీవ యాత్రను ప్రజాసామాన్యమునందురసవంతము చేయుటకు భక్తియోగము శరణ్యమైనది. కర్మ యోగమును, ధర్మయోగమును, జ్ఞానయోగ మును భక్తియోగమునందు సమన్వయమును బొందజేయుటకు క్రైస్తవమతము, మహమ్మ దీయమతము, శైవ రామానుజాదిమతములు తలపెట్టిన ప్రయత్నములు వర్తమానకాలము నందు వ్యాప్తమైన ధర్మసంస్కారమున కాధా రములుగ నున్నవి. ఏసుక్రీస్తు పర్వతము మీదను ధర్మోపదేశమును, మహమ్మదు చేసిన ధర్మోపదేశములును, దయానంద రామకృష్ణ వివేకానందాదులు చేసినబోధలును వర్తమాన కాలమునం దుద్యోగపర్వమునకు వినియోగపడి నటులు శాంతిపర్వమునకును స్వర్గారోహణ పర్వమునకును వినియోగపడకున్నవి. ఐరోపా మహాసంగ్రామము గలుగజేసిన మహాదుఃఖాను భవమునయితము శాంతిపర్వస్థాపనమునకు నిరర్థకమైనది. సంగ్రామమునందు గెలిచిన రాజ్యములును, ఓడినరాజ్యములును దుఃఖ వేదన ననుభవించుచున్నను తిరిగి మహోద్యోగ

పర్వము నుపక్రమించినవి. శాంతిపర్వస్థాపనము మహాసంగ్రామదుఃఖానుభవములేక నసంభవమైనను ధర్మపరాయణము లైన శ్రీకృష్ణ రాయబారములు సర్వకాలములందును నవ సరము లగుచున్నవి. శాంతిధర్మోపదేశమునకు భీష్ముడు అంపశయ్యనుండి శాంతిపర్వ సందేశమును ప్రకటించినటులు గాంధిమహాత్ముడు నిరశనవ్రత శయ్యనుండి శాంతిపర్వ సందేశమును పంపి ప్రపంచమునకు- ముఖ్యముగ భరతఖండమునకు ధర్మసంస్కారావసరమును ప్రత్యక్షము చేసినాడు.

*        *        *        *

## నిరశనవ్రతము - ఆత్మధర్మసంస్కారము

నిరశనవ్రతము ధర్మప్రవృత్తియగు దాత్మధర్మసంస్కారమునకు వినియోగపడగల విధమును మహానుభావుల తపఃప్రభావము లోకమునకు సువ్యక్తముచేయుచున్నది. దేహధర్మము, ఇంద్రియధర్మము, మనోధర్మము, బుద్ధిధర్మము మొదలగు ధర్మసంస్కారములు అనన్యమైన ఆత్మధర్మమునందు సమన్వయమును పొందించుటకు నిరశనవ్రతదీక్ష సాధనముగ నున్నది. ఆత్మధర్మసంస్కారమునకు నిరశన వ్రతము సాధనమైనవిధమును మహాత్ముని యుపవాసవ్రతము విశదము చేయుచున్నది.

శ్లో. విషయా వినివర్తంతే నిరాహారస్యదేహినః,
రసవర్జం రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే.

ఉపవాస వ్రతము విషయవాసనలను నంతరింపజేయుటకు సాధనంబైనను పరానుభవమునకు సాధనముగాజాలదు. ఉపవాస వ్రతము దైవసందర్శనమునకును, ఆత్మధర్మ సందర్శనమునకును వినియోగపడుటకు భాగవతభక్తి పరమసాధనముగ నున్నది. ఉపవాస కాలమునందు గాంధిమహాత్ము డనవరతము నభ్యసించిన భక్తియోగము వ్యక్తులందువలెను జాతులందును ధర్మవిజయమునకు పరమార్థ సాధనమును బోధించుచున్నది. ధర్మపరిణామమునందు బాహ్యధర్మారాధన మాత్మధర్మారాధనరూపమును దాల్చుటకు ప్రపంచము చేసిన ఘోరమైన తపస్సును ప్రపంచేతిహాసము లనంతముఖములను బోధించుచున్నను ఆత్మధర్మసంస్కారము దుర్లభముగ నున్నది. గాంధిమహాత్ముని యుపవాసము వర్తమానసందిగ్ధసమయమునందు భాగ్యభోగ పరాయణంబై బాహ్యధర్మ పరాయణంబైన ప్రపంచమున కాత్మధర్మప్రతిష్ఠను అనుభవైకవేద్యము చేసినది. ఆ సనాతనానుభవమును స్వాయముగ సేవించుటయును, లోకమునకుపదేశించుటయును హిందూమతమునకు పరమార్థము.

*        *        *        *        *

## హిందూధర్మ పరమార్థము

హిందూమతమహార్ణవమునందు సత్యస్వరూపమును గ్రహించుట పండితులకును, పామరులకును దుర్లభముగ నున్నది. చైతన్యరహితమైన ప్రజాహృదయమునందు మత ప్రయోజనములుధర్మసంరక్షణమునకును, ధర్మ

ప్రతిష్ఠయును నిరర్థకము లైనవి. ఆచారదేవతకు గల ప్రతిష్ఠ ధర్మదేవతకు గలుగకున్నది. వైదిక మత పరమార్థమును వేదములందు సమన్వయము చేసిన వ్యాస వసిష్ఠ శంకర రామానుజ వివేకానందాదుల బోధలు బధిరశంఖారావములుగ నున్నవి. నిరర్థకమైన సనాతనధర్మ ఘోషము హిందూమతపరమార్థమును నిర్వీర్యము చేసినది. పరమధర్మములైన అహింసాధర్మము, సత్యధర్మము, ఆత్మధర్మము నిందాపాత్రములుగ నున్నవి. సామాన్యధర్మములైన హింసాధర్మము, వ్యావహారికధర్మము, దేహేంద్రియమనోధర్మములు స్తోత్రపాత్రములుగ నున్నవి. సర్వాత్మతత్త్వమును లోకకల్యాణమునకై యుద్ధరింపవలసిన పరమావసరము లోకమునకు గలిగినది. భౌతికధర్మములు గలుగజేయుచున్న దుఃఖమును ఫాసిస్టుమతము, హిట్లరుమతము, సోవీటుమతము, విప్లవమతము, సామ్రాజ్యాభిమానము, స్వార్థము మొదలగు మతపరంపరలు విశదము చేయుచున్నవి. భౌతికధర్మము నాత్మధర్మము ప్రతిఘటింపగల విధమును గాంధి మహాత్ముని ఉపవాసవిజయము విస్పష్టము చేసినది. "అహం బ్రహ్మాస్మి"యను సనాతన ధర్మారాధన సంస్కారము ఆత్మధర్మ సంస్కారమూలమునని గలుగ గలదు. ఘోరమైన ఉపవాసదీక్షాసాధనమును ప్రపంచమునకు — ముఖ్యముగను నిద్రావస్థయందు మునిగియున్న భరతవర్షమునకును ఉత్తమమైన ఆత్మధర్మమును శ్రవణమనన ధ్యాన సంకీర్తన సందర్శనములను జేయుట కవకాశములను గలుగజేసిన గాంధిమహాత్ముడు సకలవిధములను వంద్యుడు, లోకారాధ్యుడు. సనాతనులును, సంస్కారులును సంకుచితములైన ధర్మసంస్కారావరణముల నతిక్రమించి విశాలమైన ఆత్మధర్మసంస్కారావరణమును జేరుట కాత్మస్వరూపులైన హరిజనులందును, నితరులందును ఆత్మధర్మసందర్శనము గలుగుటకు గాంధిమహాత్ముని దీర్ఘప్రచండోపవాసము వినియోగపడుటకు భగవదనుగ్రహము గలుగుగాత!

---

Printed and Published by C. Seshagiri Rao, B. A., at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras
Editor: G. Subbaramayya.